శ్రీ

మహాకవి కాళిదాసకృతమ్

# విక్రమోర్వశీయమ్

ఆంధ్ర 'శరదీపికా' వ్యాఖ్యాసహితమ్

వ్యాఖ్యాత :

డాక్టర్ పాటిబండ మాధవశర్మ

రీడర్, ఆంధ్రశాఖ,

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.





ప్రకాశకులు :

శ్రీ పరమేశ్వర పబ్లికేషన్సు

చిక్కడపల్లి : : హైదరాబాదు-20

శ్రీః

మహాకవి కాళిదాసకృతమ్

# విక్రమోర్వశీయమ్

ఆంధ్ర 'కరదీపికా' వ్యాఖ్యాసహితమ్



వ్యాఖ్యాత:
డాక్టర్ పాటిబండ మాధవశర్మ
రీడర్, ఆంధ్ర శాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

ప్రకాశకులు:
శ్రీ పరమేశ్వర పబ్లికేషన్సు
చిక్కడపల్లి :: హైదరాబాదు-20.

# విన్నపము

సంస్కృత భాషా సాహిత్యముల యధ్యయనము యొక్క విలువను, అవశ్యకమును ప్రజలు, ప్రభుత్వము, విద్యాధికారులు, విద్యార్థులు ఇప్పుడిప్పుడు గుర్తించుచున్నారు. ఆ భాష యందలి కావ్యములను, నాటకములను చదివి యానందింపవలెనని పలువురు ఉత్సాహ పడుచున్నారు. అయినను సంస్కృత కావ్య నాటకములు స్వయముగా చదువుకొని యర్థము చేసికొని యానందించుటకు తగినంత భాషాజ్ఞానమును సంపాదించుటకు పలువురకు అవకాశము లభింపదు. అట్టివారికి ఉత్తమ సంస్కృత కావ్య నాటకములను ఆంధ్ర లిపిలో, ఆంధ్రానువాద, వ్యాఖ్యానములతో అచ్చువేసి అందజేయుట ఉచితము, అవసరము అని తోచి మేము ఆ కార్యమునకు పూనుకొంటిమి.

తొలి ప్రయత్నముగా మహాకవి కాళిదాసుని విక్రమోర్వశీయ నాటకమును "కర దీపికా" వ్యాఖ్యతో ప్రచురించుచున్నాము. ఇట్లే క్రమముగా పెక్కు గద్య పద్య కావ్యములను, నాటకములను ప్రచురింపవలెనని కుతూహల పడుచున్నాము.

విశ్వ విద్యాలయములు నిర్వహించు పరీక్షలకు చదువుకొను విద్యార్థుల ప్రయోజనములను గూడ దృష్టి యందుంచుకొని ఈ ప్రచురణములు సిద్ధము చేయబడుచున్నవి. వీనిని విద్యార్థులు, అధ్యాపకులు, సంస్కృత భాషా సాహిత్యాభిమానులైన యాంధ్ర రసజ్ఞులు ఆదరింతురనియు, మా యుద్యమమును ప్రోత్సహింతురనియు ఆశించుచున్నాము

మా ప్రయత్నము యొక్క సాఫల్యమునకు ఆంధ్ర రసజ్ఞులే ప్రమాణము.

ప్రకాశకులు.

# కాళిదాసు ప్రశస్తి

"పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా
అద్యాపి తత్తుల్య కవేరభావాత్ అనామికా సార్థవతీ బభూవ.'

"కవయః కాళిదాసాద్యాః కవయో వయమప్యమీ
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం ప్రతిష్ఠితం"

"కాళిదాస కవితా నవం వయః మాహిషం దధి సశర్కరం పయః
ఏణమాంస మబలా చ కోమలా సంభవంతు మమ జన్మ జన్మని."

"సాకూత మధుర కోమల విలాసినీ కంఠకూజిత ప్రాయే
శిక్షా సమయేఽపి ముదే రతలీలా కాళిదాసోక్తిః"

"కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ
చతుర్ముఖోఽథవా సాక్షాత్ విదుర్నాన్యేతు మాదృశః

"తస్మా దాలోచితాశేష లోకశాస్త్రేణ ధీమతా
కర్తవ్యం కాళిదాసాదేః కావ్యానాం పరిశీలనం."



# ప్రవేశిక

శ్రీ కాళిదాస మహాకవి కృతులకు అనువాదములు ప్రపంచమందలి యన్ని భాషలయందును వెలసినవి. కొన్నింట వ్యాఖ్యానములును గలవు. సంస్కృతాంగ్లభాషల యందలి వ్యాఖ్యానములకు లెక్కలేదు.

ఆంధ్ర భాషయం దామహాకవి కృతులకు అనువాదములు పుష్కలముగా నున్నవి. వ్యాఖ్యానములు మిక్కిలి తక్కువ. పెక్కు కృతులకు ఆంధ్రమున వ్యాఖ్యలే పుట్టలేదు. కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిలవారు మేఘసందేశమునకు చక్కని ఆంధ్రవ్యాఖ్య ప్రకటించిరి. ఇటీవల శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు అభిజ్ఞానశాకుంతలమునకు ప్రశస్తమైన ఆంధ్ర వ్యాఖ్యానము ప్రచురించిరి. తక్కిన కాళిదాస కృతులకు ఆంధ్ర వ్యాఖ్యానములు పుట్టిన జాడ కానరాదు. ఎంద ఱెన్నితీరుల వ్యాఖ్యానించినను తరుగనంత సౌందర్య సంపదగలవి కాళిదాసుని కృతులు. అట్టివానికి ఆంధ్రమున చక్కని వ్యాఖ్యానము వెలయించుటకు పండితులు, ప్రకాశకులు ఇంతవఱకును ఉద్యమింపకుండుట శోచనీయము.

ఆంధ్రానువాదముతో, ఆంధ్ర వ్యాఖ్యానముతో సంస్కృత కావ్యనాటకములను ఆంధ్ర లిపిలో ముద్రించవలసిన యవసరము ఇప్పుడు ఏర్పడియున్నది. ఆ యవసరమును కొంతవఱకైనను తీర్పగలదన్న యాశయముతో విక్రమోర్వశీయ నాటకము ఈ రూపమున ప్రకటింపబడుచున్నది. ఈ గ్రంథము ప్రధానముగా విశ్వవిద్యాలయ పరీక్షలకు కృషిచేయు విద్యార్థులను ఉద్దేశించి వ్రాయబడుచున్నది. అయినను కాళిదాసుని నాటక రచనాశిల్పమును ఆవిష్కరించుటకు చేయబడిన ప్రయత్నమగుటచేత నాటక రసికులకు గూడ ఇది కొంత వెలుగుచూపగలదు.

## కాళిదాసుని కాలము

కాళిదాసమహాకవి కాలము వివాదగ్రస్తమై యున్నది. కాళిదాసు భోజమహారాజు ఆస్థానమున నుండినట్లు జనశ్రుతి కలదు. భోజుడు క్రీ. శ. 1005-54 నడుమ పాలించెను కనుక కాళిదాసు అప్పటివాడు కావలెను. కాని క్రీ. శ. 634 నాటి ఐహోల్ శాసనమున కాళిదాసు పేరు కనబడుచున్నది కనుక ఆయన క్రీ. శ. 634 కి పూర్వమే ఉండియుండవలెను. భోజుని ఆస్థానమున నున్న కాళిదాసు పరిమళ కాళిదాసు కాని మహాకవి కాళిదాసు కాదని తేలినది. క్రీ. శ. 610 నాటి బాణ మహాకవి—

"నిర్గతాసు న వా కస్య కాళిదాసస్య సూక్తిషు
ప్రీతిః మధురసార్ద్రాసు మంజరీష్వివ జాయతే"

అని హర్షచరిత్రమున స్తుతించి యుండుటచేత కాళిదాసు క్రీ. శ. 610 కి పూర్వమే యుండెనని తేలుచున్నది.

కాళిదాసు విక్రమార్క చక్రవర్తి యాస్థానమున నుండెననియు జనశ్రుతి కలదు. తన ప్రభువుపట్ల గల అభిమానమువల్లనే పురూరవుని విక్రముడన్న పేర వ్యవహరించెననియు నందురు. ఈ విక్రమార్కుడు గుప్తవంశమునకు చెందిన చంద్రగుప్త విక్రమాదిత్యుడని కొందరి యూహ. ఈతడు క్రీ. శ. 418 నాటివాడు కనుక కాళిదాసును అప్పటివాడే కావలెను. ఈ గుప్తవంశపు రాజులపట్ల గల యభిమానమును ప్రకటించుటకే కాళిదాసు కుమారగుప్తుని స్మరింపజేయుచు కుమారసంభవము వ్రాసెననియు, స్కందగుప్తుని స్మరింపజేయుటకు స్కందశబ్దమును తరచు వాడెననియు అందురు.

అశ్వఘోష మహాకవి క్రీ. శ. 78 నాటివాడు. కాళిదాసు ఈయన గ్రంథమును కొంత యనుకరించెనన్న యభిప్రాయముతో కాళిదాసు క్రీ. శ. 78 కి తరువాతనే యుండెనని పలువురు తలంపు. కాని అశ్వఘోషుడే కాళిదాసును అనుకరించెనని తలంచువారును గలరు. వారి యభిప్రాయమున కాళిదాసుని ప్రభువైన విక్రమార్కుడు విక్రమార్క శక కర్త. విక్రమార్క శకము క్రీ. పూ. 57 తో ప్రారంభించును. కనుక కాళిదాసు క్రీ. పూ.

మొదటి శతాబ్దియందు జీవించెననియు, ఉజ్జయిని యందుండెననియు వీరు నిర్ణయింతురు.

"ధన్వంతరి క్షపణకామరసింహ శంకు
వేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య"

అన్న శ్లోకమున పేర్కొనబడిన వారందరును సమకాలికులు కారని పరిశోధకులు నిర్ణయించిరి. కాళిదాసుని మాళవికాగ్నిమిత్రనాటక నాయకుడైన అగ్నిమిత్రుడు క్రీ పూ. రెండవ శతాబ్దియందుండెను. నవీనుడైన ఆయన కథను నాటకము చేయుటచేతనే కాళిదాసు 'న చాపి కావ్యం నవ మిత్య వద్యం' అని చెప్పెనందురు. కనుక కాళిదాసు మాలవదేశ ప్రభువైన విక్రమార్కుని యాస్థానమున క్రీ॰ పూ. మొదటి శతాబ్దియందు జీవించి యుండెనని పలువురు నిర్ణయించిరి.

కాళిదాసు కాశ్మీరదేశపు బ్రాహ్మణుడని కొందఱు తలంచుట సమంజసముగా కనబడదు. ఆయన విదర్భదేశస్థుడు, కవిగా కొంత పేరు సంపాదించిన పిదప మాళవరాజ్యమున ఉజ్జయినియందు విక్రమార్కుని యాస్థానకవి యయ్యెను. ఆయనశైలి వైదర్భి. వైదర్భనైషధ్యము ఆ నన కిష్టము. మాలవికాగ్ని మిత్రనాటక కథ విదర్భ - మాళవరాజ్యములకు సంబంధించినదే. ఆయన తన జన్మస్థానమునుండియే మేఘమును బయలుదేరదీసెను. ఉజ్జయిని మీదుగా యాత్ర చేయించెను.

## కాళిదాసుని గ్రంథములు

ఋతు సంహారము, మేఘసందేశము అను లఘుకావ్యములు, కుమారసంభవము, రఘువంశము అను మహాకావ్యములు, మాలవికాగ్ని మిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞాన శాకుంతలము అను నాటకములు కాళిదాసుని కృతులని యెల్లరు నంగీకరించిరి.

శ్రుతబోధము అను ఛందో గ్రంథమును, జ్యోతిర్విదాభరణము, నళోదయము, కాలామృతము, రోలంబరాజీయము, ఆత్మబోధము,

మున్నగు పెక్కు గ్రంథములు కాళిదాసు రచించినట్లు వినవచ్చుచున్నది. కాని ఆ గ్రంథములు రచించినవారు కాళిదాస నామధారులే యైనను విక్రమోర్వశీయ కర్తయైన కాళిదాసుకంటె భిన్నులు.

## కాళిదాసుని ప్రతిభ

కాళిదాసు తొలుత ఒక పామరవ్యక్తి యనియు, కాళికాదేవి వర ప్రసాదమున కవితాశక్తిని పొందెననియు జెప్పుదురు. ఇది నిజమైనను కాకున్నను ఆయన ప్రతిభ లోకోత్తరమైనదనుట నిస్సందేహము. ఆయన పెక్కు శాస్త్రములకు సంబంధించిన గ్రంథములు వ్రాసెనన్నమాట యెట్లున్నను ఆయన బహుశాస్త్రజ్ఞుడనుట సత్యము. వేదాది సర్వశాస్త్రములు ఆయనకు సుపరిచితములు. ఆయన లోకజ్ఞతయు సంపన్నమైనది. ఋతు సంహారముతో ఆరంభమైన ఆయన కవితా వ్యాసంగము అభిజ్ఞాన శాకుంతల ముతో ముగియునాటికి క్రమముగా పరిణతమై పరిపక్వమైనది. శైలి, భావన, వర్ణన, పాత్రచిత్రణ, వస్తునిర్మాణము, రస పోషణము క్రమముగా పుష్టిపొంది ఆయన కవితా వ్యాసంగము నాటకాంతమై "తత్రరమ్యా శకుంతలా" అన్న స్తుతికి పాత్రమై, సాహిత్యదర్శన సిద్ధాంతమునకు పరమ మైన దృష్టాంతమైనది.

ఆయన నాటక రచనాక్రమము మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వ శీయము, అభిజ్ఞానశాకుంతలము అని విజ్ఞులు చక్కగా నిర్ణయించియున్నారు.

## విక్రమోర్వశీయ కథ

ఉర్వశీ పురూరవుల కథకు బీజము ఋగ్వేద - దశమమండ లము - తొంబదియైదవ సూక్తమందే యున్నది. మత్స్యపురాణమునందది కొంచెము విస్తరింపబడినది. భాగవతమున, విష్ణుపురాణమున మరింత ప్రపం చింపబడినది. కథా సరిత్సాగరమునందును ఈ కథ వర్ణింపబడినది. కాళిదాస మహాకవి యీ గ్రంథములందలి వృత్తాంతములనుండి కొన్ని కొన్ని యంశ ములను గ్రహించి, కొన్ని యంశములను కల్పించి రసభావబంధురమైన యితివృత్తమును నిర్మించుకొనెను.

1. ఋగ్వేదమున పురూరవుడు ఉర్వశిని మరల తనతో కలిసి యుండుమని కోరుట మాత్రమే కలదు.

2. విష్ణు పురాణము ననుసరించి: మిత్రావరుణుల శాపమువల్ల ఉర్వశి భూలోకమునకు వచ్చి పురూరవుని కామించి ఆయనతో సుఖించు చుండును. గంధర్వ లోకనాటి రాత్రి ఆమె గొఱ్ఱెల జంటను అపహరింపగా పురూరవుడు నగ్న శరీరముతోడనే వారివెంట పరువెత్తును. మెఱుపు వెలుగుతో ఉర్వశి ఆయన నగ్నరూపము చూచి ఆయనను విడిచిపోవును. తరువాత పురూరవుడు యాగముచేసి ఉర్వశిని శాశ్వతముగా భార్యగా సంపాదించును.

3. కథా సరిత్సాగరము ననుసరించి: పురూరవుడు విష్ణు భక్తుడు. ఉర్వశి యతనిని చూచి కామించును. రాజును ఆమెను కామించును. ఇది యెఱిగి విష్ణువు నారదుని పంపి యింద్రునకు చెప్పించి ఉర్వశిని పురూరవునకు ఇప్పించును. మాయాధరుడను రాక్షసుని జయించుటలో పురూరవు డింద్రునకు తోడ్పడును. ఆ సందర్భమున స్వర్గములో సంగీత నాట్యప్రదర్శనలు జరుగును. అప్పుడు రంభ నాట్యమున పొరపాటు చేయగా పురూరవుడు ఆక్షేపించును. ఆమె గురువైన తుంబురుడు కోపించి నీవు ఉర్వశీ వియుక్తుడవగుదువని పురూరవుని శపించును. పురూరవుడు విష్ణువునుగూర్చి తపస్సుచేసి యుర్వశిని శాశ్వతముగా సంపాదించుకొనును

4. మత్స్యపురాణము ననుసరించి: పురూరవుడు ప్రతిదినము ఇంద్రుని వద్దకు పోయి వచ్చుచుండును. ఒకనాడు ఉర్వశి, చిత్రలేఖ కేశి యను రాక్షసునిచే అపహరింపబడుదురు. పురూరవుడు వారిని రక్షించి యింద్రునకు అప్పగించును. ఒకనాడు స్వర్గమున లక్ష్మీ స్వయంవరమనెడు నాటకము ప్రదర్శింపబడును. లక్ష్మీవేషము ధరించిన ఉర్వశి పురుషోత్తము డనబోయి పురూరవుడు అనుటచే నాట్య గురువైన భరతుడు ఆమెను శపించును. ఆ శాపమువల్ల ఉర్వశి ఒక తీగయైపోవును, పురూరవుడు ఒక పిశాచమై దానివద్దనే యుండును. శాపావసానమున ఉర్వశి పురూరవుని భార్య యగును.

కాళిదాసుని నాటకమందలి కథకు మత్స్యపురాణ కథకు ఎక్కువ పోలిక కలదు. కాని కాళిదాసు మత్స్యపురాణ కథలో గూడ పెక్కు మార్పులు చేసినట్లు స్పష్టమే. కథా సరిత్సాగర కథ యందలి నారదుడు నాటకమున ప్రవేశించినాడు. ఔశీనరి, విదూషకుడు, చిత్రరథుడు, తాపసి మున్నగు కొన్ని పాత్రములు సృష్టింపబడినవి. శిఖాబంధన విద్య కల్పింపబడి నది. ఉర్వశి లతగా మారుటకు ప్రణయకలహము కారణముగా చెప్పబడినది. ప్రణయలేఖ, రాణి మాన క్రోధము, వ్రతము, సంగమనీయమణి మున్నగు పెక్కు వివరములు కల్పింపబడినవి. పురూరవుడు ప్రతి దినము స్వర్గమున కేగు ప్రసంగము తొలగింపబడినది. ఇంద్రుని పాత్రము ప్రవేశింపకున్నను కథా గమనమునకు, పర్యవసానమునకు ఆయన యొక్క ప్రాధాన్యము నిరూపింపబడినది. ఉర్వశి లతగా మారునన్న భరతుని శాపమును కాళిదాసు వేరు విధముగా ఉపయోగించుకొని చతుర్థాంకమున పురూరవుని చిత్తవృత్తిని రమణీయముగా చిత్రించెను. గంధమాదనమున రాజు విద్యాధరబాలికను చూచుట, గ్రద్ద సంగమనీయమణిని ఎత్తికొనిపోవుట, ఆయువు దానిని బాణ ముతో కొట్టుట మున్నగు సందర్భములు కాళిదాసుచే కల్పింపబడినవి. ఇవి నాటకేతివృత్తమునకు ఎంతో చమత్కృతిని కలిగించినవి.

## ఉపసంహారము

పాత్రముల గుణశీలములు వ్యాఖ్యానమున అందందు ఉల్లేఖింపబడి నవి కనుక ప్రత్యేకముగా వ్రాయబడుటలేదు. విద్యార్థులకు, అధ్యాపకులకు, సహృదయులకు ఈ 'కరదీపిక' కొంత వెలుగు చూపగలదని యాశింతును. ప్రథమ ప్రయత్నమగుటచేతను, అల్పవ్యవధిలో సిద్ధము చేయవలసివచ్చుట చేతను అనువాద వ్యాఖ్యానములందు ఏవేని దోషములు దొరలియుండ వచ్చును. వీనిని సమగ్రములు, నిర్దుష్టములు, ఉపయోగకరములు కావించుటకు తోడ్పడు సూచనలు కృతజ్ఞతతో స్వీకరింపబడును. అట్టి సూచనల ననుసరించి ద్వితీయ ముద్రణము సిద్ధము చేయబడును.

మాధవశర్మ

# నాటకమందలి పాత్రములు

## పురుషులు

| | | | |
|---|---|---|---|
| 1. | పురూరవుడు | : | నాయకుడు |
| 2. | నారదుడు | : | దేవర్షి |
| 3. | మాణవకుడు | : | విదూషకుడు |
| 4. | లాతవ్యుడు | : | అంతః పురోద్యోగి – కంచుకి |
| 5. | గాలవుడు | : | భరత శిష్యుడు |
| 6. | పల్లవుడు | : | ,, ,, |
| 7. | చిత్రరథుడు | : | గంధర్వ రాజు |
| 8. | ఆయువు | : | యువరాజు |
| 9. | సూత్ర ధారుడు | : | ప్రస్తావనా ప్రవర్తకుడు |
| 10. | పారి పార్శ్వకుడు | : | సూత్రధార సహాయకుడు |

## స్త్రీలు

| | | | |
|---|---|---|---|
| 1. | ఔశీనరి | : | పట్టపురాణి |
| 2. | ఉర్వశి | : | కథానాయిక |
| 3. | చిత్రలేఖ | : | ఉర్వశి ప్రియసఖి |
| 4. | రంభ | : | అప్సరస |
| 5. | మేనక | : | ,, |
| 6. | సహజన్య | : | ,, |
| 7. | నిపుణిక | : | రాణి పరిచారిక |
| 8. | సత్యవతి | : | తాపసి |
| 9. | యవని | : | చాప గ్రాహిణి |
| 10. | పరిజనము | : | పరిచారికా సమూహము |

# సవరణలు

## మూల గ్రంథమందలి ముద్రణదోషముల సవరింపు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 9 | మస్సరసాం | మప్సరసాం |
| 7 | 9 | హారి కేతన | హారిణ కేతన |
| 28 | 8 | ఇత తో | ఇత ఇతో |
| 43 | 2 | కాముజిష్య | కాముజ్ఝిష్య |
| 46 | 4 | ఘూర్జర | ఘూర్జ |
| 51 | 11 | ఉథాయ | ఉత్థాయ |
| 56 | 6 | తథాకామం | యథాకామం |
| 60 | 7 | అరోహః | అరోహః |
| 77 | 5 | పరిభోగినీం | పురోభాగినీం |
| 78 | 5 | సర్గే | స్వర్గే |
| 86 | 6 | ప్రియవిర | ప్రియావిర |
| 88 | 9 | సంజ్ఞా | సంజ్ఞాం |
| 89 | 8 | ముసైవ | ముధైవ |
| 90 | 3 | వల్లవ | పల్లవ |
| 96 | 3 | కిఞ్చిద్వవిత్వా | కిఞ్చిద్వలిత్వా |
| 97 | 1 | మఞ్జ | మఞ్జు |
| 98 | 10 | ముత్సృజ్య | ముత్సృజ |
| 102 | 2 | త్వయావృత | త్వమావృత |
| 104 | 4 | కులికా | కుటిలికా |
| 108 | 9 | భ్రూభఙ్గి | భ్రూభఙ్గా |
| 109 | 3 | క్షుభితకరుణ | క్షుభితాకరుణ |
| 110 | 2 | మయి | మమ |
| 111 | 11 | మాయస్త్రీ | మాయాస్త్రీ |
| 112 | 12 | రియమ్ | రయమ్ |
| 114 | 8 | కచ్చిన్మృగ | కశ్చిన్మృగ |
| 133 | 1 | దేవః | దేవి |

శ్రీః

# విక్రమోర్వశీయమ్

## ప్రథమోఽఙ్కః

వేదాన్తేషు యమాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్య విషయః శబ్దో యథార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షుభి ర్నియమితప్రాణాదిభి ర్మృగ్యతే
స స్థాణుః స్థిరభక్తియోగసులభో నిఃశ్రేయసాయాస్తు వః!

[నాంద్యంతే]

---

శ్రీః

# విక్రమోర్వశీయము

## ప్రథమాంకము

### నాంది

*ఎవ్వనిని భూమ్యాకాశముల యంతరాళమంతయు వ్యాపించి యున్న అద్వితీయ బ్రహ్మము అని వేదాంతములందుఁ జెప్పుదురో, ఎవ్వని యందు ఇతరుల కెవ్వరికిని జెల్లని ఈశ్వరుడు అన్న శబ్దము అత్యంతము సార్థకమో, ఎవ్వఁడు నియమిత పంచప్రాణులైన మోక్షార్థులచేత హృదంతరాళమున అన్వేషింపఁబడునో, నిశ్చలమైన భక్తిచేతను, యోగముచేతను సులభుఁడైన ఆ శివుఁడు మీయొక్క కళ్యాణముకొఱకు అగుఁగాక.

(నాందియొక్క అవసానమున)

సూత్రధారః : అలమతివిస్తరేణ (నేపథ్యాభిముఖ మవలోక్య)
మారిష ఇతస్తావత్.

పారిపార్శ్వకః : (ప్రవిశ్య) భావ అయమస్మి.

సూత్రధారః : మారిష, బహుశస్తు పరిషదా పూర్వేషాం కవీనాం దృష్టాః ప్రయోగబంధాః. సోఽహమద్య విక్రమోర్వశీయం నామ నాటక మపూర్వం ప్రయోక్ష్యే. తదుచ్యతాం పాత్రవర్గః స్వేషు పాఠేష్వసంమూఢై ర్భవితవ్యమితి.

పారిపార్శ్వకః : యథాజ్ఞాపయతి భావః (ఇతి నిష్క్రాంతః).

సూత్రధారః: యావదిదానీమార్యమిశ్రాన్విజ్ఞాపయామి. (ప్రణిపత్య)
ప్రణయిషు వా దాక్షిణ్యా దథవా సద్వస్తుపురుషబహుమానాత్
శృణుత మనోభిరవహితైః క్రియామిమాం కాలిదాసస్య. 2

[నేపథ్యే]

---

సూత్రధారుఁడు : అతి విస్తరము అక్కఱలేదు. (నేపథ్యము దిక్కు చూచి)
మారిషా ! ఇటు రమ్ము.

పారిపార్శ్వకుడు : (ప్రవేశించి) బావా ! ఇదిగో వచ్చితిని.

సూత్ర : మారిషా ! సభవారిచేత పూర్వకవుల నాటకములు పెక్కు దర్శింపఁబడియుండును. ఆ (విషయము తెలిసిన) నేను విక్రమోర్వశీయము అను అపూర్వమైన నాటకమును ఇప్పుడు ప్రయోగింపఁబోవుచున్నాను. కనుక తమ తమ పాఠములయందు సావధానులై యుండవలయునని పాత్రధారులకుఁ జెప్పుము.

పారి : బావ ఆజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును.)

సూత్ర : ఇంతలో పూజ్యులైన పెద్దలకు విన్నవించుకొందును.

(ప్రణమిల్లి)

* ఆదరపాత్రులమైన మాయందలి దయవల్లఁగాని, ఉత్తమ కథానాయకునియందలి గౌరవమువల్లఁగాని కాళిదాసునియొక్క ఈ కృతిని సావధాన చిత్తములతో విందురుగాక !

(తెరలో)

పరిత్రాయతాం పరిత్రాయతాం యః సురపక్షపాతీ
యస్య వాఽమ్బరతలే గతిరస్తి.

సూత్రధారః: (కర్ణం దత్వా) అయే కింను ఖలు మద్విజ్ఞాపనానంతరం
కురరీణామివాకాశే శబ్దః శ్రూయతే (విచింత్య) భవతు
జ్ఞాతమ్.

ఊరూద్భవా నరసఖస్య మునేః సురస్త్రీ
కైలాసనాథ ముపస్పృత్య నివర్తమానా
బందీకృతా విబుధశత్రుభి రర్ధమార్గే
క్రందత్యతః శరణ మప్సరసాం గణోయమ్. 3

[ఇతి నిష్క్రాంతః]

ప్రస్తావనా

---

ఎవ్వడు సురపక్షపాతియో, ఎవ్వనికి ఆకాశగమనశక్తి కలదో
అట్టివాడు రక్షించవలె, రక్షించవలె.

సూత్ర: (చెవియొగ్గి) అహో! నా విజ్ఞాపనము అయిన వెంటనే ఆకాశమున
గొఱ్ఱెల అరపువలె వినవచ్చుచున్నది. ఇది యేమైయుండునో కదా!
(ఆలోచించి) సరి, తెలిసినది.

* నరసఖుఁడైన నారాయణుఁడను మునియొక్క ఊరువు నుండి
పుట్టిన దేవతాస్త్రీ కుబేరుని సేవించి తిరిగి వచ్చుచు మధ్యే
మార్గమున సురవైరులచేత బందీకృతయైనది. అందుచేత ఈ
యప్సరస్సమూహము ఆక్రందించుచున్నది.

(అని నిష్క్రమించును)

ఇది ప్రస్తావన

[తతః ప్రవిశన్త్యప్సరసః]

అప్సరసః : పరిత్రాయతాం పరిత్రాయతాం యః సురపక్షపాతీ యస్య వాఽమ్బరతలే గతిరస్తి

(తతః ప్రవిశత్యపటీక్షేపేణ రాజా పురూరవా రథేన సూతశ్చ)

రాజా : అలమాక్రందితేన ! సూర్యోపస్థానాత్ ప్రతినివృత్తం పురూరవసం మాముపేత్య కథ్యతాం కుతో భవత్యః పరిత్రాతవ్యా ఇతి

రమ్భా : అసురావలేపాత్ !

రాజా : కిం పునరసురావలేపేన భవతీనా మపరాద్ధమ్ ?

రమ్భా : శృణోతు మహారాజః. యా తపోవిశేషపరిశఙ్కితస్య

---

(అంతట అప్సరసలు ప్రవేశింతురు)

అప్సరసలు : ఎవ్వఁడు సురపక్షపాతియో, ఎవ్వనికి ఆకాశగమన శక్తికలదో అట్టివాఁడు రక్షించవలె, రక్షించవలె.

( అంతట తెర తొలగించుకొని రథస్థులైన రాజు, సారథి ప్రవేశింతురు)

రాజు : ఆక్రందనము వలదు. సూర్యోపాసన మొనర్చి మరలి వచ్చుచున్న ఈపురూరవుని సమీపించి మిమ్ము దేనినుండి రక్షింపవలెనో చెప్పుడు.

రంభ : దైత్యుల యౌద్ధత్యమునుండి.

రాజు : దైత్యుల యౌద్ధత్యమువల్ల మీకు జరిగిన అపరాధమేమి ?

రంభ : మహారాజా వినవలెను. ఎవ్వతె తపోవిశేషభీతుడైన మహేంద్రునకు

సుకుమారం ప్రహరణం మహేంద్రస్య, ప్రత్యాదేశో రూప గర్వితాయాః శ్రియః, అలఙ్కారః స్వర్గస్య సా నః ప్రియ సఖ్యుర్వశీ కుబేరభవనా త్ప్రతినివర్తమానా సమాపత్తి దృష్టేన హిరణ్యపురవాసినా కేశినా దానవేన చిత్రలేఖా ద్వితీయా అర్ధపథ ఏవ బందిగ్రాహం గృహీతా

రాజా : అపి జ్ఞాయతే కతమేన దిగ్విభాగేన గతః స జాల్మ ఇతి ?

సహజన్యా : పూర్వోత్తరేణ.

రాజా : తేన హి ముచ్యతాం విషాదః. యతిష్యే వః సఖీ ప్రత్యా నయనాయ.

సర్వాః : సదృశం ఖలు సోమాదేకాంతరస్య.

రాజా : క్వ పునర్మాం భవత్యః ప్రతిపాలయిష్యన్తి ?

---

సుకుమారమైన యాయుధమో, రూపగర్వితయైన లక్ష్మికి తిరస్కారమో, స్వర్గమునకు అలంకారమో మా ప్రియసఖయైన ఆ ఉర్వశి కుబేర భవనమునుండి తిరిగి వచ్చుచున్నదై ఆకస్మికముగా నెదురైన హిరణ్యపురవాసియగు కేశియను దానవునిచేత మార్గమధ్యము నందే చిత్రలేఖా సహితముగా చెఱగొని పోబడినది.

రాజు : మరి ఆ జాల్ముడు ఏ దిక్కున బోయెనో తెలియునా ?

సహజన్య : ఈశాన్య దిక్కున.

రాజు : ఇంక విషాదము విడువుడు. మీ సఖని తిరిగి తెచ్చుటకు యత్నింపగలను.

అందఱు : చంద్రుని మనుమనికి దగినమాట.

రాజు : మరి నన్ను మీరెచ్చట ప్రతీక్షించు చుందురు ?

అప్సరసః : ఏ తస్మిన్ హేమకూటశిఖరే.

రాజా : సూత, ఐశానీం దిశం ప్రతి నోదయాశ్వా నాశుగమనాయ.

సూతః : యదాజ్ఞాపయత్యాయుష్మాన్ (ఇతి యథోక్తం కరోతి).

రాజా : (రథవేగం నిరూపయన్) సాధు సాధు ! అనేన రథవేగేన పూర్వప్రస్థితం వైనతేయమ ప్యాసాదయేయం కిం పునస్త మపకారిణం మఘోనః ! తథాహి.

అగ్రే యాంతి రథస్య రేణువదమీ చూర్ణీభవన్తో ఘనా
శ్చక్ర భ్రాంతి రరాంతరేషు జనయ త్యన్యామివారావలీమ్
చిత్రన్యస్తమివాచలం హయ శిరస్యాయామవచ్చామరం
యష్ట్యగ్రే చ సమం స్థితో ధ్వజపటః ప్రాంతేచ వేగానిలాత్. 4

(నిష్క్రాంతా రథేన రాజా సూతశ్చ)

---

అప్సరసలు : ఈ హేమకూట శిఖరమునందే

రాజు : సూతుఁడా ! అశ్వములను త్వరగా ఈశాన్య దిశకు తోలుము.

సూతుఁడు : ఆయుష్మంతుఁడు ఆజ్ఞాపించినట్లే.

( అని చెప్పినట్లు చేయును )

రాజు : (రథ వేగమును నిరూపించుచు) మేలు మేలు ! ఈ రథ వేగము చేత ముందే బయలుదేరిన గరుత్మంతునైన చేర గలనన్నచో నింక ఇంద్రాపకారి లెక్కయేమి ? అవును అట్లే.

* పొడి పొడి యగుచున్న మేఘములు రథము ముందు ధూళి వలె ఎగిరిపోవుచున్నవి. చక్రముల భ్రమణ వేగము ఆకుల సందులలో మరియొక ఆకులపంక్తిని కల్పించుచున్నది. అశ్వశిరోన్యస్తమైనవిశాల చామరము చిత్రపటమున లిఖంపబడినట్లు నిశ్చలముగానున్నది. వేగమైనవాయువువల్ల ధ్వజ వస్త్రము దండాగ్రమునను, పార్శ్వము లందును ఏక కాలమందే ఉన్నట్లు తోచుచున్నది.

(రథముతో రాజును సూతుడును నిష్క్రమింతురు)

రమ్భా: హలా గతో రాజర్షిః. తద్వయమపి యథాసందిష్టం ప్రదేశం సంక్రమామహే.

శేషాః: తథా (ఇతి సర్వాః శైలావతరణం రూపయిత్వా స్థితాః).

రమ్భా: అపినామ స రాజర్షి రుద్ధరేన్నో హృదయశల్యమ్ ?

మేనకా: హలా మాతే సంశయో భవతు. ఉపస్థిత సంపరాయో మహేంద్రోఽపి మధ్యమలోకా త్సబహుమాన మానాయ్య తమేవ విజయసేనాముఖే నియుంక్తే.

రమ్భా: సర్వథేహ విజయయీభవతు. (క్షణమాత్రం స్థిత్వా) హలా సమాస్వసితు శమాశ్వసితు. ఏష ఉచ్చలితహరికేతన స్తస్య రాజర్షేః సోమదత్తో రథో దృశ్యతే. నఖలు ఏషోఽకృతార్థో నివర్తిష్యతే.

---

రంభ: చెలీ! రాజు వెళ్లినాఁడు. కనుక మనముకూడ సంకేతితమైన ప్రదేశమును చేరుకొందము.

మిగిలినవారు: అట్లే (అని యందఱును పర్వతము దిగుట నభినయించి నిలుతురు)

రంభ: ఆ రాజర్షి మన హృదయశల్యమును పెరికి వేయునా?

మేనక: చెలీ! నీకాసందేహము కలుగరాదు. యుద్ధావసరము కలిగినప్పుడు మహేంద్రుడుకూడ మధ్యమ లోకమునుండి సబహుమానముగ రప్పించి ఆయననే విజయసేనా ముఖమున నియోగించును.

రంభ: సర్వ విధముల ఇందు విజయి యగుగాక! (క్షణమాత్రము నిలిచి) సఖులారా! ఊరడిల్లుడు ఊరడిల్లుడు. ఇదిగో కంపమాన హరిణధ్వజమైన ఆ రాజర్షి యొక్క సోమదత్తమైన రథము కనవచ్చుచున్నది. ఈయన అకృతార్థుడై మరలి రాడుగదా.

(సర్వా ఉచ్చక్షుషో విలోకయన్తి)

(తతః ప్రవిశతి రథారూఢో రాజా సూతశ్చ చిత్రలేఖావలమ్బితా భయనిమీలితాక్షీ చోర్వశీ)

చిత్రలేఖా : సమాశ్వసితు సమాశ్వసితు ప్రియసఖీ.

రాజా : సుందరి ! సమాశ్వసిహి సమాశ్వసిహి.

గతం భయం భీరు సురారిసంభవమ్
త్రిలోకరక్షీ మహిమా హి వజ్రిణః
తదేత దున్మీలయ చక్షురాయతం
మహోత్పలం ప్రత్యుషసీవ పద్మినీ. 5

చిత్రలేఖా : అహో కథ ముచ్ఛ్వసితమాత్రసంభావితజీవితా అద్యాపి సంజ్ఞాం న ప్రతిపద్యతే.

---

(అందఱును కన్నులు పైకెత్తి చూతురు)

(అంతట రథారూఢుడై రాజును, సూతుఁడును, చిత్రలేఖపై వ్రాలి భయనిమీలితాక్షియైయున్న ఉర్వశియు ప్రవేశింతురు)

చిత్రలేఖ : ప్రియసఖ ఊరడిల్లవలె, ఊరడిల్లవలె!

రాజు : సుందరీ ! ఊరడిల్లుము ఊరడిల్లుము.

* భీరురాలా ! దైత్యునివల్ల గలిగిన భయము పోయినది. ఇంద్రుని యొక్క మహిమ మూడులోకములను రక్షించునది గదా. కనుక పద్మలత ప్రాతఃకాలమున పద్మమును విప్పార్చినట్లు విశాలమైన నీ కంటిని తెఱువుము.

చిత్రలేఖ : అయ్యో ! ఉచ్ఛ్వాస మాత్రము చేత ఊహింపదగిన ప్రాణము గలదై ఈమె ఇప్పటికిని చైతన్యమును పొందకున్న దేలనో !

రాజా: బలవ దత్రభవతీ పరిత్రస్తా. తథా హి.

ముఞ్చతి న తావదస్యాః కమ్పం కుసుమసమబంధనం హృదయమ్
పశ్య హరిచందనేన స్తన మధ్యోచ్ఛ్వాసినా కథితమ్ 6

చిత్రలేఖా: సఖి ఉర్వశి! పర్యవస్థాపయాత్మానమ్. అనప్సరేవ ప్రతిభాసి మే.

(ఉర్వశీ ప్రత్యాగచ్ఛతి)

రాజా: (సహర్షమ్) అయి ప్రకృతి మాపద్యతే తే ప్రియసఖీ పశ్య.

ఆవిర్భూతే శశిని తమసా ముచ్యమానేవ రాత్రిః
నైశస్యార్చి ర్హుతభుజ ఇవ చ్ఛిన్న భూయిష్ఠధూమా
మోహేనాంతర్వరతను రియం లక్ష్యతే ముక్తకల్పా
గఙ్గా రోధః పతనకలుషా గృహ్ణతీవ ప్రసాదమ్ ॥ 7

---

రాజు: ఈమె మిక్కిలి భీతిల్లినది. ఏల యన-

* కుసుమ సుకుమారమైన ఈమె హృదయము ఇప్పటికిని కంపమును వీడకున్నది. స్తనములమధ్య నించుక చలించుచున్న హరి చందనము చేత వ్యక్తమగుచున్నది చూడుము.

చిత్రలేఖ: చెలీ ఉర్వశీ! హృదయమును దిటవుపఱచుకొనుము. అనప్సరవలె (మర్త్య స్త్రీవలె) తోచుచున్నావు సుమా.

(ఉర్వశి తెలివొందును)

రాజు: (సహర్షముగా) ఓహో! నీ ప్రియసఖి స్వాస్థ్యమును పొందుచున్నది చూడు.

* చంద్రుడు ఉదయింపగా చీకటిచేత విడువబడుచున్న రాత్రి వలె, రాత్రి సంబంధమైన అగ్ని యొక్క నశించిన గొప్ప ధూమము గల శిఖవలె, ఒడ్డు విరిగిపడుటచే మురికియయ్యు తేరుకొనుచున్న గంగవలె ఈ సుందరి హృదయమందలి మూర్ఛనుండి యించుమించుగా విడువబడినట్లు కనబడుచున్నది.

చిత్రలేఖా : సఖి విస్రబ్ధా భవ. పరాభూతాః ఖలు త్రిదశపరిపన్థినో హతాశాః.

ఉర్వశీ : (అక్షిణీ ఉన్మీల్య) కిం ప్రభావదర్శినా మహేంద్రేణ ?

చిత్రలేఖా : న మహేంద్రేణ. మహేంద్ర సదృశానుభావేనానేన రాజర్షిణా పురూరవసా.

ఉర్వశీ : (రాజాన మవలోక్య, ఆత్మగతమ్) ఉపకృతం ఖలు దానవైః.

రాజా : (ప్రకృతిస్థా మూర్వశీం నిర్వర్ణ్య, ఆత్మగతమ్) స్థానే ఖలు నారాయణ మృషిం విలోభయన్త్య స్తదూరు సంభవామిమాం దృష్ట్వా వ్రీడితాః సర్వా అప్సరస ఇతి. అథవా నేయం తపస్వినః సృష్టిగ్భవితు మర్హతి.

అస్యాః సర్గవిధౌ ప్రజాపతి రభూ చ్చన్ద్రో ను కాంతప్రభః
శృఙ్గారైకరసః స్వయం ను మదనో మాసోను పుష్పాకరః

---

చిత్రలేఖ : చెలీ విస్రబ్ధవుకమ్ము. త్రిదశ శత్రువులు హతాశులు పరాభూతులు అయినారు కదా.

ఉర్వశి · (కన్నులు తెఱచి) ప్రభావమును ప్రదర్శించిన మహేంద్రునిచేతనా ?

చిత్రలేఖ : మహేంద్రునిచేత కాదు. మహేంద్ర సదృశమహిమగల ఈ రాజర్షి పురూరవుని చేత.

ఉర్వశి : (రాజును చూచి తనలో) దానవులచేత ఉపకారమే చేయబడినది గదా.

రాజు : (స్వాస్థ్యముపొందిన ఉర్వశిని ఉపలక్షించి తనలో) నారాయణ మహర్షిని ప్రలోభపెట్టవచ్చిన అప్సరసలందఱు ఆయన యూరువు నుండి పుట్టిన ఈమెను చూచి లజ్జపడిరనుట ఉచితమే. లేదా ఈమె తపస్వియొక్క సృష్టియనుటయు అసంబద్ధమే.

* ఈమెను సృష్టించుటయందు మనోహరదీధితియైన చంద్రుడే సృష్టికర్తయయ్యెనేమో! లేక శృంగారైకరసమూర్తియైన మన్మ

వేదాభ్యాసజడః కథంను విషయవ్యావృత్తకౌతూహలో
నిర్మాతుం ప్రభవేన్మనోహర మిదం రూపం పురాణోమునిః. 8

ఉర్వశీ : హలా న సఖీజనః కుత్ర ఖల్విదానీం భవేత్.

చిత్రలేఖా : అభయదాయీ మహారాజో జానాతి.

రాజా : (ఉర్వశీ మవలోక్య) మహతి విషాదే వర్తతే. పశ్యతు భవతీ.

యదృచ్ఛయా త్వం సకృదప్యవన్ధ్యయోః
పథి స్థితా సుందరి యస్య నేత్రయోః
త్వయా వినా సోఽపి సముత్సుకో భవేత్
సఖీజనస్తే కిముతార్ద్రసౌహృదః! 9

ఉర్వశీ : (అపవార్య) అభిజాతం ఖల్వస్య వచనమ్. అథవా చంద్రా

---

ధుడో? లేక చైత్రమాసమో? వేదాభ్యాసజడుడు, విషయ సుఖ విముఖమైన యుత్సాహముగలవాడు అయిన ఆ పురాణ ముని (నారాయణుడు) ఈ మనోహరమైన రూపమును నిర్మించుట కెట్లు సమర్థుడగును?

ఉర్వశి : చెలీ! ఆ సఖీజన మిప్పుడెచ్చట నున్నదో కదా!

చిత్ర : అభయదాతయైన మహారాజునకు దెలిసియుండును.

రాజు : (ఉర్వశిని జూచుచు) గొప్ప దుఃఖావస్థయందున్నది. చూడు–

* సుందరీ! ఆకస్మికముగా నీవు కేవలమొక్క పర్యాయము ఎవ్వని యొక్క చరితార్థమైన దృష్టిపథమున పడితివో అట్టివాడు కూడ నీవు కనబడనిచో సముత్సుకుడగునన్నచో ప్రేమార్ద్రచిత్తలైన నీ చెలికత్తెలమాట యింక చెప్పనేల?

ఉర్వశి : (అపవారించి) హృదయంగమముకదా ఈయన వచనము. కాకున్న చంద్రునినుండి అమృతము అన్నట్లు ఇందాశ్చర్య మేమున్నది?

దమృత మితి కి మత్రాశ్చర్యమ్. (ప్రకాశమ్) అత ఏవైనం ప్రేక్షితుం త్వరతే మే హృదయమ్.

రాజా : (హస్తేన దర్శయన్)

ఏతాః సుతను ముఖం తే సఖ్యః పశ్యంతి హేమకూట గతాః
ప్రత్యాగత ప్రసాదం చంద్రమివో పప్లవాన్ముక్తమ్. 10

చిత్రలేఖా : సఖి పశ్య.

ఉర్వశీ : (రాజానం సస్పృహం పశ్యన్తీ) సమదుఃఖః పిబతీవ మాం నయనాభ్యామ్.

చిత్రలేఖా : (సాకూతమ్) అయి కః ?

ఉర్వశీ : నను సఖీజనః.

రమ్భా : (సహర్షమ్) ఏష చిత్రలేఖాద్వితీయాం ప్రియసఖీ మూర్వశీం

---

(ప్రకాశముగా) అందువల్లనే వీరిని చూడవలెనని నా హృదయము ఆరాటపడుచున్నది.

రాజు : (చేతితోఁ జూపుచు)

* సుందరాంగీ ! హేమకూటమునందున్న ఈ నీ చెలికత్తెలు గ్రహణ పీడాముక్తుఁడై ప్రసన్నుఁడైన చంద్రునివలె నీ ముఖమును చూచుచున్నారు.

చిత్ర : చెలీ ! చూడు.

ఉర్వశి : (రాజును సస్పృహముగా చూచుచు) సానుభూతి గలిగి కన్నులతో నన్ను త్రాగుచున్నట్లున్నది !

చిత్ర : చెలీ ! ఎవరు ?

ఉర్వశి : సఖీ జనమే.

రంభ : (సహర్షముగా) చిత్రలేఖా సహితయైన ప్రియసఖి ఉర్వశిని దీపికావి

గృహీత్వా విశాఖాసమీపగత ఇవ భగవాన్ శ్చంద్ర ఉపస్థితో రాజర్షిః.

మేనకా : (నిర్వర్ణ్య) ద్వే అపి నః ప్రియే ఉపనతే. *ఇయం ప్రత్యానీతా ప్రియసఖీ అయం చాపరిక్షత శరీరో రాజర్షిః.

సహజన్యా ; సఖి సుష్ఠు భణసి. దుర్జయాః ఖలు దానవాః.

రాజా : సూత, ఇదం తచ్ఛైలశిఖరమ్. అవతార్యతాం రథః.

సూతః : యదాజ్ఞాపయ త్యాయుష్మాన్. (ఇతి తథాకరోతి)

రాజా : (చక్రోద్ఘాతం రూపయిత్వా, ఆత్మగతమ్) హంత! దత్తఫలో మే విషమావతారః.

యదయం రథసంక్షోభా దంసేనాంసో రథోపమశ్రోణ్యాః
స్పృష్టః సరోమవిక్రియ ముఙ్కురితం మనసిజేనేవ. 11

ఉర్వశీ : (సవ్రీడమ్) సఖి, కిమపి పరతోఽపసర.

---

విశాఖాసమీపగతుడైన చంద్రుడువలె ఈ రాజర్షి చేరవచ్చినాడు.

మేనక : (ఉపలక్షించి) మనకు ప్రియమైన రెండును సిద్ధించినవి. ఈ ప్రియసఖి తిరిగి కొనితేబడినది. ఈ రాజర్షియు అపరిక్షత శరీరుఁడు.

సహజన్య : చెలీ! చక్కగా చెప్పినావు. దానవులు దుర్జయులు గదా!

రాజు : సూతుఁడా! ఇదే ఆ పర్వతశిఖరము. రథమును దిగనిమ్ము.

సూతుడు : ఆయుష్మంతు డాజ్ఞాపించినట్లే. (అని అట్లేచేయును.)

రాజు : (రథముయొక్క కుదుపు నిరూపించి తనలో) ఆహా! ఈ విషమముగా దిగుట నాకు ఫలప్రదమే యైనది.

* రథ సదృశమైన నితంబముగల ఈమె యొక్క భుజాగ్రముచేత నా యీ భుజాగ్రము మనసిజాంకురితమో యనదగిన రోమాంచము కలుగునట్లుగా స్పృశింపఁబడినది.

ఉర్వశి : (సిగ్గుతో) చెలీ! కొంచెము ప్రక్కకు జరుగు.

చిత్రలేఖా : నాహం శక్తా.

రమ్భా : సఖ్యః ఏత ప్రియకారిణం సంభావయామో రాజర్షిమ్.

రాజా : సూత, స్థాపయ తావద్రథమ్.

యావత్పునరియం సుభ్రూ రుత్సుకాభిః సముత్సుకా
సఖీభిర్యాతి సంపర్కం లతాభిః శ్రీరివార్తవీ. 12

అప్సరసః : దిష్ట్యా మహారాజో విజయేన వర్ధతే.

రాజా : భవత్యశ్చ సఖీసమాగమేన.

ఉర్వశీ : (చిత్రలేఖాదత్తహస్తా రథాదవతీర్య) సఖ్యః ఏత పీడితాం మాం పరిష్వజధ్వమ్. న ఖలు మమాసీదాశా భూయోఽపి సఖీజనం ద్రక్ష్యామీతి.

(సఖ్యస్త్వరితాః పరిష్వజన్తే)

---

చిత్ర : నా చేత కాదు.

రంభ : చెలులారా! రండి. ప్రియ కారియైన రాజర్షిని సత్కరింతము. (అందఱును సమీపింతురు)

రాజు : సూతుడా! రథము నింతట నిలుపుము.

* ఇంతలో సముత్సుకయైన ఈ సుందరి వసంతలక్ష్మి లతలతో వలె ఉత్సుకలైన చెలికత్తెలతో పునఃసమాగమము పొందగలదు.

(సూతుఁడు అట్లే చేయును)

అప్సరసలు : అదృష్టవశమున మహారాజు విజయముచేత వర్థిల్లుచున్నాడు.

రాజు : సఖీ సమాగమముచేత మీరును.

ఉర్వశి : (చిత్రలేఖ చేయూత యీయగా రథమునుండి దిగి) చెలులారా! రండు. పీడితురాలనైన నన్ను కౌగిలించుకొనుడు. తిరిగి సఖీ జనమును చూతునన్న ఆశయే నాకు లేకపోయెనుగదా!

(చెలికత్తెలు త్వరగా కౌగిలించుకొందురు.)

రమ్భా : సర్వథా మహారాజః కల్పశతాని పృథివీం పాలయన్నవతు.

సూతః : ఆయుష్మన్ పూర్వస్యాం దిశి మహతా రథవేగేనోప దర్శితః శబ్దః.

అయంచ గగనాత్కోఽపి తప్తచామీకరాఙ్గదః
అవరోహతి శైలాగ్రం తడిత్వానివ తోయదః. 18

(పశ్యన్త్యప్సరసః)

సర్వాః : అహో చిత్రరథః. (తతః ప్రవిశతి చిత్రరథః).

చిత్రరథః : (రాజానం దృష్ట్వా, స బహుమానమ్) దిష్ట్యా మహేంద్రోపకార పర్యాప్తేన విక్రమ మహిమ్నా వర్ధతే భవాన్.

రాజా : అయే గంధర్వ రాజః (రథాదవతీర్య) స్వాగతం ప్రియ సుహృదే.

---

రంభా : తప్పక మహారాజు నూరుకల్పములు భూమిని పాలించుచు ఉండవలెను.

సూతుఁడు : ఆయుష్మంతుఁడా తూర్పుదిక్కున గొప్ప రథ వేగ ధ్వని విన వచ్చుచున్నది.

* ఆకాశమునుండి ఈతడెవ్వడో తప్తకాంచన భుజాలంకారుడు శంపావలయితుడైన మేఘుడువలె శైలాగ్రమున దిగుచున్నాడు.

(అప్సరసలు తిలకింతురు)

అందఱు : ఓహో! చిత్రరథుఁడు (అంతట చిత్రరథుడు ప్రవేశించును)

చిత్రరథుఁడు : (రాజును చూచి సగౌరవముగా) అదృష్టవశమున మహేంద్రునకు ఉపకారము చేయ సమర్థమైన పరాక్రమ మహిమచే పూజ్యుడవైన నీవు వర్ధిల్లుచున్నావు.

రాజు : ఓహో! గంధర్వరాజా? (రథమునుండి దిగి) ప్రియమిత్రునకు స్వాగతము.

(పరస్పరం హస్తౌ స్పృశతః)

చిత్రరథః : వయస్య కేశినా హృతా ముర్వశీం నారదాదుపశ్రుత్య ప్రత్యాహరణార్థమస్యాః శతక్రతునా గంధర్వసేనా సమాదిష్టా. తతో వయమన్తరా చారణేభ్యస్త్వదీయం జయోదాహరణం శ్రుత్వా త్వా మిహాస్థముపాగతాః. స భవా నిమాం పురస్కృత్య సహాస్మాభిర్మఘవన్తం ద్రష్టుమర్హతి. మహత్ఖలు తత్రభవతో మఘోనః ప్రియ మనుష్ఠితం భవతా. పశ్య

పురా నారాయణేనేయ మతిసృష్టా మరుత్వతే
దైత్య హస్తాదపాచ్ఛిద్య సుహృదా సంప్రతిత్వయా. 14

రాజా : మామైవమ్.

నను వజ్రిణ ఏవ వీర్యమేతత్
విజయంతో ద్విషదో యదస్య పక్ష్యాః

---

(పరస్పరము కరస్పర్శ కావింతురు)

చిత్రరథుఁడు : మిత్రమా ! ఉర్వశి కేశిచేత అపహరింపఁబడినదని నారదుని వల్ల విని ఆమెను తిరిగికొని తెచ్చుటకై యింద్రునిచే గంధర్వసేన యాదేశింపఁబడినది. అంతట మేము మార్గమధ్యమున నే చారణుల వలన నీ విజయగీతములను విని ఇచ్చటనున్న నిన్ను చేరవచ్చితిమి. నీవు ఈమెను పురస్కరించుకొని మాతోగలసి దేవేంద్రుని దర్శింప వలయును. పూజ్యుడైన మఘవంతునకు నీచేత గొప్ప ప్రియము ఆచరింపబడినది. చూడు.

* పూర్వము నారాయణుని చేతను, ఇప్పుడు రాక్షస హస్తముల నుండి తప్పించి మిత్రుడవైన నీ చేతను ఈమె దేవేంద్రునకు అర్పింపబడినది.

రాజు : అట్లనకుము.

* ఇంద్రుని పక్షమువారు శత్రువులను జయించుచున్నారన్నచో అది ఆయన వీర్యమే కదా. సింహముయొక్క పర్వతకంద

వసుధాధర కందరాద్విసర్పీ
ప్రతిశబ్దోఽపి హరే ర్భినత్తి నాగాన్. 15.

చిత్రరథః : యుక్తమేతత్. అనుత్సేకః ఖలు విక్రమాలంకారః.

రాజా : సఖే, నాయ మవసరో మమ శతక్రతుం ద్రష్టుమ్. అత స్త్వమేవాత్రభవతీం ప్రభోర న్తికం ప్రాపయ.

చిత్రరథః : యథా భవాన్ మన్యతే. ఇత ఇతో భవత్యః.

(అప్సరసః ప్రస్థితాః)

ఉర్వశీ : (జనాంతికమ్) సఖి చిత్రలేఖే! ఉపకారిణమపి రాజర్షిం న శక్నో మ్యామంత్రయితుమ్. తత్త్వం మే ముఖం భవ.

చిత్రలేఖా : (రాజాన ముపేత్య) మహారాజ, ఉర్వశీ విజ్ఞాపయతి మహారాజేనాభ్యను జ్ఞాతేచ్ఛామి ప్రియసఖీమివ మహారాజస్య కీర్తిం సురలోకం నేతుమితి.

---

రము నుండి నిర్గతమైన ప్రతిశబ్దముకూడ ఏనుంగులను విదారించును గదా.

చిత్రరథుడు. ఇది యుక్తమే. వినయమే కదా విక్రమాలంకారము.

రాజు. మిత్రమా! దేవేంద్రుని దర్శించుటకు నాకిది సమయముకాదు. అందువల్ల నీవే యీమెను ప్రభువు సన్నిధిని చేర్పుము.

చిత్రరథుఁడు : నీవు తలంచినట్లే. ఇటుఇటు మీరందఱు. (అప్సరసలు బయలు దేరుదురు)

ఉర్వశి : (జనాంతికముగా) చెలీ చిత్రలేఖా! ఉపకార మొనర్చిన రాజర్షిని గూడ శెలవు అడుగజాలకున్నాను. కనుక నాకు మారుగా నీవు మాటాడుము.

చిత్రలేఖ : (రాజును సమీపించి) మహారాజా! మహారాజు చేత అనుజ్ఞాతనై మహారాజు కీర్తిని ప్రియసఖిని వలె సురలోకమునకు గొనిపోగోరుచున్నాను అని ఉర్వశి విజ్ఞాపించుచున్నది.

రాజా : గమ్యతాం పునర్దర్శనాయ.

(సర్వాః సగంధర్వా ఆకాశోత్పతనం రూపయంతి)

ఉర్వశీ : (ఉత్పతన భఙ్గం రూపయిత్వా) అహో లతావిటప ఏకావలీ వైజయంతికా మే లగ్నా (సవ్యాజం పరివృత్య రాజానం పశ్యంతీ) చిత్రలేఖే, మోచయ తావదేనామ్.

చిత్రలేఖా : (సస్మితమ్) దృఢం ఖలు లగ్నా. దుర్మోచనీయేవ మమ ప్రతిభాతి. భవతు, యతిష్యే తావత్.

ఉర్వశీ : (స్మితం కృత్వా) సఖి, స్మర తావదేతదాత్మనో వచనమ్.

చిత్రలేఖా : (మోచనం నాటయతి)

రాజా : (స్వగతమ్.)

ప్రియమాచరితం లతే త్వయా మే
గమనేఽస్యాః క్షణ విఘ్న మాచరన్త్యా

---

రాజు : మంచిది. పునర్దర్శనమగునుగాక.

(అందఱును సగంధర్వులై ఆకాశమున కెగురుటను అభినయింతురు)

ఉర్వశి : (ఉత్పతన భంగము నభినయించి) అయ్యో ! ఆపాదలంబినియైన నా ముత్యాలదండ యీ లతాశాఖయందు తగుల్కొన్నది. (సవ్యాజముగా వెనుదిరిగి, రాజును చూచుచున్నదై) చిత్రలేఖా ! కొంచెము దీనిని విడిపింపుమా.

చిత్రలేఖ : (చిరునవ్వుతో) గట్టిగా తగుల్కొన్నది గదా. విడిపింప సాధ్యము గానిదిగా నాకు దోచుచున్నది. కానిమ్ము కొంచెము ప్రయత్నింతును.

ఉరశ్వి : (చిఱునవ్వు నవ్వి) చెలీ ! ఈ నీ మాటను జ్ఞాపకముంచుకో.

చిత్రలేఖ : (విడిపించుట నభినయించును)

రాజు : (తనలో)

* ఓసి లతా ! ఈమె గమనమునకు క్షణము విఘ్నమాచరించిన నీచేత నాకు ప్రియమే అచరింపబడినది. ఈ వాలుగంటి మరల

యదియం పునరప్యపాఙ్గనేత్రా
పరివృత్తార్ధముఖీ మయాద్య దృష్టా. 16

సూతః : ఆయుష్మన్
అదః సురేంద్రస్య కృతాపరాధాన్
ప్రక్షిప్య దైత్యాం ల్లవణాంబురాశౌ
వాయవ్య మస్త్రం శరధిం పునస్తే
మహోరగః శ్వభ్రమివ ప్రవిష్టమ్. 17

రాజా : తేన హ్యుపశ్లేషయ రథం యావదారోహామి.
(సూతస్తథేతి రథముపశ్లేషయతి. రాజా నాట్యేన రథమారోహతి. ఉర్వశీ సనిఃశ్వాసం రాజాన మవలోకయన్తీ సహ సఖీభిః నిష్క్రాన్తా చిత్రరథశ్చ)

రాజా : ( ఉర్వశీ మార్గోన్ముఖః ) అహో ను ఖలు దుర్లభాభినివేశీ మదనః.

---

సగము మోమును వెనుకకు మరలించి యిప్పుడు నా కన్నులఁబడినది గదా.

సూతుఁడు : ఆయుష్మంతుఁడా !
* సురేంద్రునకు అపరాధము గావించిన దైత్యులను లవణ సముద్రమునఁ ద్రోసి నీ వాయవ్యాస్త్రము మహోరగము పుట్టలో వలె మరల నీ యమ్ములపొదిలో ప్రవేశించినది.

రాజు : అందుచేత రథమును సమీపమునకు కొనిరమ్ము. అధిరోహింతును.
(సూతుఁడు అట్లే యని రథమును సమీపమునకుఁ దెచ్చును. రాజు నాట్యముతో రథ మధిరోహించును సనిశ్వాసముగా రాజును జూచుచున్నదై చెలికత్తెలతోఁ గలిసి ఉర్వశియు, చిత్రరథుఁడును నిష్క్రమింతురు )

రాజు : (ఉర్వశి వెళ్లిన దిక్కున మొగమెత్తి) అహా ! మదనుడు దుర్లభవిషయములందును ఆసక్తి పుట్టించును గదా !

ఏషా మనో మే ప్రసభం శరీరాత్పితుఃపదం మధ్యమ ముత్పతంతీ
సురాఙ్గనా కర్షతి ఖండితాగ్రా త్సూత్రం మృణాలాదివ రాజహంసీ 18

(ఇతి నిష్క్రాంతాస్సర్వే)

ఇతి ప్రథమోఽఙ్కః

---

* తండ్రియైన నారాయణుని మధ్యమపాదమైన ఆకాశమునకు ఎగిరిపోవుచున్న ఈ సురాంగన ఖండితాగ్రమైన మృణాళము నుండి రాజహంసి సూత్రమును లాగినట్లు నా శరీరమునుండి మనస్సును బలవంతముగా లాగుచున్నది గదా !

(అని అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము



# ద్వితీయోఽఙ్కః

(తతః ప్రవిశతి విదూషకః)

విదూషకః : హీ హీ భోః నిమన్త్రణికః పరమాన్నేనేవ స్ఫుటన్న శక్నోమ్యాకీర్ణ ఆత్మనో జిహ్వాం రక్షితుమ్. తద్యావత్తత్ర భవాన్ వయస్యః కార్యాసనా దుత్తిష్ఠతి తావదేతస్మిన్ విరలజన సంపాతే విమాన పరిచ్ఛంద పరిసరే స్థాస్యామి. (పరిక్రమ్య తత్ర స్థితః)

(తత ప్రవిశతి చేటీ)

చేటీ : ఆజ్ఞప్తాస్మి దేవ్యా కాశీరాజపుత్ర్యా యథా - హాజ్జే నిపుణికే యతః ప్రభృతి భగవతః సూర్యోపస్థానం కృత్వా ప్రతి

---

# ద్వితీయాంకము

(అంతట విదూషకుడు ప్రవేశించును)

విదూషకుడు : హీ హీ ! నిమంత్రితుడు పరమాన్నముచేతవలె నేను రాజ రహస్యముచేత పొట్ట బ్రద్దలగుచున్నవాడనై జనాకీర్ణమైన యిచ్చట నా జిహ్వను కట్టియుంచుకోఁజాలకున్నాను. కనుక పూజ్యుడైన వయస్యుడు కార్యాసమునుండి లేచువఱకు జనసమ్మర్దములేని ఈ విమానపరిచ్ఛంద పరిసరమునఁ గూర్చుండెదను. (ముందుకు నడచి యచ్చట కూర్చుండును.)

(అంతట చేటి ప్రవేశించును)

చేటి . దేవి కాశీరాజ పుత్రిచే ఆజ్ఞాపింపబడితిని - "ఓసి నిపుణికా ! భగవంతుడైన సూర్యుని ఆరాధించి తిరిగి వచ్చినది మొదలుకొని ఆర్య

నివృత్త ఆర్యపుత్ర స్తత ఆరభ్య శూన్యహృదయ ఇవ
లక్ష్యతే. తత్తస్య ప్రియ వయస్యా దార్యమాణవకాజ్జా
నీహి తావదస్యోత్కంఠాకారణమితి. తత్కథం ఖలు మయా
సబ్రహ్మబంధు రతిసంధేయః. అథవా విరల తృణాగ్రలగ్న
మివావశ్యాయ సలిలం చిరం న తస్మిన్రాజరహస్యం తిష్ఠతి.
యావదేన మన్విష్యామి. (పరిక్రమ్యావలోక్య చ) ఏష ఖల్వా
లిఖితో వానర ఇవ కిమపి తూష్ణీంభూత ఆర్య మాణవక
స్తిష్ఠతి యావదేన ముపసర్పామి. (ఉపసృత్య) ఆర్య వన్దే.

విదూషకః: స్వస్తి భవత్యై (ఆత్మగతమ్) ఇమాం దుష్టచేటికాం
దృష్ట్వా తద్రాజరహస్యం హృదయం భిత్త్వా నిష్క్రామతీవ.
(ప్రకాశమ్) నిపుణికే సంగీతవ్యాపారముత్సృజ్య క్వప్రస్థితాసి.

నిపుణికా: దేవ్యా వచనేనార్యమేవ ద్రష్టుమ్.

---

పుత్రుడు శూన్య హృదయునివలె కనబడుచున్నాడు. కనుక ఆయన
ప్రియవయస్యుడైన ఆర్యమాణవకుని వలన ఆర్యపుత్రుని ఉత్కంఠకు
గారణమేమో తెలిసికొనిరమ్ము" అని. అందువల్ల ఆ బ్రాహ్మణా
ధముని వంచించుటయెట్లో కదా. ఒకవేళ సన్నని గడ్డిపోచ చివర
దగుల్కొన్న మంచు నీటిబొట్టువలె రాజ రహస్యము వానియందు
చిరకాలముచినిలిచి యున్నగదా. ఇంతలో వీనిని వెదకుదును.
(ముందుకు నడచూచి) ఇదిగో, ఆర్యమాణవకుడు చిత్రింపబడిన
వానరమువలె ఏలనో మౌనముగా కూర్చుండి యున్నాడు. ఇక
నీతనిని సమీపింతును. (సమీపించి) ఆర్యా! నమస్కరించుచున్నాను.

విదూ: నీకు స్వస్తి. (తనలో) ఈ దుష్టచేటికను జూచినంతనే ఆ రాజ రహ
స్యము హృదయమును భేదించుకొని బయలు పడునట్లున్నది.
(ప్రకాశముగా) నిపుణికా సంగీతాభ్యాసమును విడిచిపెట్టి ఎచ్చటికి
బయలుదేరినావు?

నిపుణిక: దేవిగారి మాటపై ఆర్యుని (నిన్ను) చూచుటకే.

విదూషకః : కిం తత్రభవ త్యా జ్ఞాపయతి ?

నిపుణికా : దేవీ భణతి సదాప్యార్యో మయి పక్షపాతీ. న మామను
చిత వేదనాదుఃఖితా ముపేక్షత ఇతి.

విదూషకః : (సవితర్కమ్) కింవా ప్రియవయస్యేన తత్రభవత్యాః
ప్రతికూల మాచరితమ్?

నిపుణికా : ఆర్య యన్నిమిత్తం భర్తోత్కంఠిత స్తస్యాః స్త్రియా
నామధేయేన భర్త్రా దేవ్యాలపితా.

విదూషకః : (స్వగతమ్) కథం స్వయమేవ తత్రభవతా రహస్యభేదః
కృతః? కిమిదానీమహం జిహ్వాయంత్రణేన దుఃఖ మనుభ
వామి. (ప్రకాశమ్) కిమామంత్రితా తత్రభవత్యుర్వశీతి?
తస్యా అప్సరసో దర్శనేనోన్మాదిత స్తత్రభవాన్న కేవలం
తత్రభవతీం మామపి వినోదవిముఖో దృఢం పీడయతి.

---

విదూ : ఆ పూజ్యురాలు ఏమి ఆజ్ఞాపించినది ?

నిపుణిక : ఆర్య మాణవకుడు సదా నాయందు పక్షపాతముగలవాడు అను
చితముగా నేను దుఃఖితనైనచో చూచి యూరకుండడు అన్నది.

విదూ : (వితర్కించుచు) ప్రియ వయస్యునిచేత దేవికి ఏమి అనిష్టమాచరింప
బడినదో !

నిపు . ఆర్య ! ఎవతె నిమిత్తమున భర్త (ప్రభువు) ఉత్కంఠితుడయ్యెనో
ఆ స్త్రీయొక్క నామముతో దేవి భర్తచే సంబోధింపబడినది.

విదూ : (స్వగతము) ఏమి స్వయముగానే పూజ్యునిచేత రహస్య భేదనము
చేయబడినదా ? ఇంక నిప్పుడు ఈ నాలుకను కట్టుకొని నేనేల బాధ
పడవలెను ? (ప్రకాశముగా) పూజ్యురాలు (రాణి) 'ఉర్వశీ' యని
సంబోధింపబడినదా యేమి ? ఆ యప్సరసదర్శనముచేత ఉన్మత్తుడైన
పూజ్యుడు కేవలము దేవినే కాదు నన్నుగూడ వినోదవిముఖుడై
గాఢముగా పీడించుచున్నాడు.

నిపుణికా : (ఆత్మగతమ్) కృతం మయా భేదనం భర్తూ రహస్య దుర్గస్య. (ప్రకాశమ్) ఆర్య కిం తావద్దేవ్యై నివేదయామి?

విదూషకః : నిపుణికే, విజ్ఞాపయ తత్రభవతీమ్. యతే తావ న్మృగతృష్ణికాయా నివర్తయితుం వయస్యమ్. తతో దేవ్యా ముఖం ద్రక్ష్యామీతి.

నిపుణికా : యదార్య ఆజ్ఞాపయతి (ఇతి నిష్క్రాంతా).

(నేపథ్యే వైతాలికః)

జయతు జయతు దేవః.

ఆలోకాంతాత్ప్రతిహతతమోవృత్తి రాసాం ప్రజానాం
తుల్యోద్యోగ స్తవ దినకృతశ్చాధికారో మతో నః.
తిష్ఠత్యేష క్షణ మధిపతిర్జ్యోతిషాం వ్యోమమధ్యే
షష్ఠేభాగే త్వమపి దివసస్యాత్మన శ్ఛందవర్తీ. 1

---

చేటి : (ఆత్మగతము) నాచేత భర్తృరహస్య దుర్గ భేదనము చేయబడినది. (ప్రకాశముగా) ఆర్య ! మఱి దేవికి ఏమని మనవి చేయుదును?

విదూ : నిపుణికా! పూజ్యురాలికి విన్నవింపుము- "వయస్యుని అమృగతృష్ణిక నుండి మరల్ప యత్నింతును. ఆపైననే దేవి ముఖము చూడగలను" అని

నిపు : ఆర్యు డాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును.)

(నేపథ్యమున వైతాలికుడు)

దేవా : జయము, జయము.

* ఆలోకాంతము ఈ ప్రజల తమోవృత్తిని ధ్వంసము చేయుచున్న నీ యొక్కయు, దినకరుని యొక్కయు అధికారము తుల్యమైన వ్యాపారము గలది యని మా యభిప్రాయము. ఈ గ్రహరాజు ఆ గగనమధ్యమున క్షణము విశ్రమించియున్నాడు. నీవును దినము యొక్క ఆఱవభాగమున స్వచ్ఛందవర్తివి కమ్ము.

విదూషకః : (కర్ణం దత్వా) ఏష కార్యాసనా దుత్థిత ఇత ఏవా
గచ్ఛతి వయస్యః. యావదస్య పార్శ్వవర్తీ భవామి.

(ఇతి నిష్క్రాంతః)

[ప్రవేశకః]

(తతః ప్రవిశత్యుత్కంఠితో రాజా విదూషకశ్చ)

రాజా :

ఆదర్శనాత్ప్రవిష్టా సా మే రసులోకసుందరీ హృదయమ్ 2
బాణేన మకరకేతోః కృతమార్గమవన్ధ్య పాతేన.

విదూషకః : (ఆత్మగతమ్) సంపీడితా ఖలు తావత్తపస్వినీ కాశీరాజ
పుత్రీ.

రాజా : అపి రక్ష్యతే రహస్యనిక్షేపః.

విదూషకః : (సవిషాదమ్. ఆత్మగతమ్) హాధిక్ హాధిక్ అభిసంహి

---

విదూ : (చెవియొగ్గి) ఇదుగో కార్యాసనమునుండి లేచి వయస్యుడిల్లే వచ్చు
చున్నాడు. ఇంక నీతని పార్శ్వవర్తి నగుదును. (నిష్క్రమించును)

(ఇది ప్రవేశకము)

(అంతట ఉత్కంఠితుడగు రాజు, విదూషకుడు ప్రవేశింతురు)

రాజు :

* అవంధ్య పాతమైన మకరకేతనుని బాణముచేత మార్గ మేర్పడు
పబడిన నా హృదయమును ఆ సురలోక సుందరి దర్శన మాత్రము
చేతనే ప్రవేశించినది.

విదూ : (ఆత్మగతము) పాపము కాశిరాజు పుత్రి యత్యంతము దుఃఖిత
యైనది కదా.

రాజు : రహస్య నిక్షేపము భద్రముగా నున్నదా ?

విధూ : (విషాదముతో తనలో) అయ్యో అయ్యో ! దుష్ట దాసిచేత వంచి

తోఽస్మి దుష్టదాస్యా. అన్యథా నఖలు వయస్య ఏవం పృచ్ఛేత్.

రాజా : (సాశఙ్కమ్) కిం భవాంస్తూష్ణీమాస్తే ?

విదూషకః : ఏవం మయా నియంత్రితా జిహ్వా యద్భవతోఽపి సహసా ప్రతివచనం న దదామి.

రాజా : యుక్తమ్. అథ క్వేదానీ మాత్మానం వినోదయేయమ్.

విదూషకః : మహానసం గచ్ఛావః.

రాజా : కిం తత్ర.

విదూషకః : తత్ర పంచవిధ స్యాభ్యవహార స్యోపనతసంభారస్య యోజనాం ప్రేక్షమాణాభ్యాం శక్యముత్కంఠా వినోదయితుమ్.

---

తుడనైతిని గదా. లేనిచో వయస్యుడు ఈ విధముగా ప్రశ్నింపడు గదా.

రాజు : (సంశయముతో) ఏమి మాటాడకున్నావు ?

విదూ : నీకుగూడ వెంటనే ప్రతి వచనమీయజాలనంతగా ఈ నాలుకను కట్టివైచుకొంటిని.

రాజు : మంచిదే, ఇంక నిప్పుడు మనస్సును దేనియందు వినోదింపజేయుదుము ?

విదూ : వంటయింటికి పోవుదము.

రాజు : అచ్చట ఏమున్నది ?

విదూ : అచ్చట సమకూర్చబడిన సంభారములుగల పంచవిధములయిన భోజన పదార్థముల సంయోజనము నవలోకించుచు మన మిరువురము ఉత్కంఠ నపనయించుకోవచ్చును.

రాజు : (చిఱునవ్వుతో) అచ్చట ఈ ప్సితవస్తు సన్నిధానముచే నీవు వినోదిం

రాజా : (సస్మితమ్) తత్రేప్సితసన్నిధానాద్భవాన్ రంస్యతే. మయా ఖలు దుర్లభప్రార్థనః కథమాత్మా వినోదయితవ్యః.

విదూషకః : నను భవాం స్తత్రభవత్యా ఉర్వశ్యా దర్శనపథం గతః.

రాజా : తతః కిమ్.

విదూషకః : నఖలుసా దుర్లభేతి సమర్థయే.

రాజా : పక్షపాతో౽యమవధార్యతామ్.

విదూషకః : పతావన్మంత్రయమాణేన భవతావర్ధితంమమ కౌతూహలమ్. కిం తత్ర భవత్యుర్వశ్యహామివ విరూపతయా౽ద్వితీయా రూపేణ.

రాజా : మాణవక, ప్రత్యవయవ మశక్యవర్ణనాం తామవేహి. సమాసతః శ్రూయతామ్.

విదూషకః : అవహితో౽స్మి.

---

తువు. కాని దుర్లభమైన కోరికగల నా హృదయమును నేనెట్లు వినోదపెట్టగలను ?

విదూ : నీవు పూజ్యురాలయిన ఉర్వశియొక్క దృష్టి పథమున బడిలివిగదా?

రాజు : అయిన నేమి ?

విదూ : ఆమె నీకు దుర్లభయని నేను అనుకోను.

రాజు : ఇది కేవలము పక్షపాతమని తెలిసికొనుము.

విదూ : ఇంతగా చెప్పుచున్న నీవు నా కౌతూహలమును వృద్ధిచేయుచున్నావు. వికృతరూపముచే నేనువలె రూప వైశిష్ట్యముచేత ఉర్వశి అద్వితీయయా యేమి !

రాజు : మాణవక ! ఆమె యంగములను ప్రత్యేకించి వర్ణించుట అశక్యమని తెలిసికొనుము. కనుక సంక్షేపముగా వర్ణింతును వినుము.

విదూ : అవహితుడనై యున్నాను.

రాజా :

అభరణస్యాభరణం ప్రసాధనవిధేః ప్రసాధన విశేషః
ఉపమానస్యాపి సఖే ప్రత్యుపమానం వపుస్తస్యాః. 3

విదూషకః : అతః ఖలు భవతా దివ్యరసాభిలాషిణా చాతకవ్రతం గృహీతమ్.

రాజా : వివిక్తాదృతే నాన్య దుత్సుకస్య శరణమస్తి. తద్భవాన్ప్రమదవన మార్గ మాదేశయతు.

విదూషకః : (ఆత్మగతమ్) కా గతిః (ప్రకాశమ్) ఇత ఇతో భవాన్. (పరిక్రమ్య) ఏతేన ప్రమదవననోదితేనేవ ప్రత్యుద్గతో భవా నాగంతుకో దక్షిణమారుతేన.

రాజా : (విలోక్య) ఉపపన్న మిదం విశేషణమస్యవాయోః. అయంహి-
నిషిఞ్చన్మాధవీమేతాం లతాం కౌందించ నర్తయన్
స్నేహదాక్షిణ్యయోర్యోగా త్కామీవ ప్రతిభాతి మే. 4

---

రాజు :

సఖుడా ! ఆమె శరీరము ఆభరణమునకు ఆభరణము; అలంకరణ విధికి అలంకరణ విశేషము, ఉపమానమునకు ప్రత్యుపమానము."

విదూ : కనుకనే దివ్యాంగనా ప్రణయాభిలాషివైన నీచేత చాతక వ్రతము అవలంబింపబడినది.

రాజు : ఉత్కంఠితునకు ఏకాంతముకంటె అన్యము శరణ్యము లేదు. కావున ప్రమదవన మార్గమును చూపుదువుగాక.

విదూ : (తనలో) ఏమి గతి ? (ప్రకాశముగా) ఇటు ఇటు (ముందుకునడచి) అతిథివైన నీకు ప్రమదవనమున ఉదయించిన ఈ దక్షిణ మారుతము ఎదుర్కోలు చేయుచున్నది.

రాజు : (చూచి) ఈ వాయువున కీవిశేషణము యుక్తముగానే యున్నది. ఈ వాయువు -

ఈ మాధవీలతను నిషేకించుచు, ఈ కౌందీ లతను నర్తింపజేయుచు

విదూషకః : ఈదృశ ఏవ తవాభినివేశోభవతు. (పరిక్రామితకేన) ఏతత్ప్రమదవనద్వారమ్. ప్రవిశతు భవాన్.

రాజా : ప్రవిశాగ్రతః.

(ఉభౌ ప్రవిశతః)

రాజా : (అగ్రతో విలోక్య) వయస్య నమయా సాధుసమర్థిత మాప త్ప్రతీకారః కిల ప్రమదవనోద్యాన ప్రవేశ ఇతి.

వివిక్షుర్యదహం తూర్ణ ముద్యానం తాపశాంతయే
స్రోతసేవోహ్యమానస్య ప్రతీపతరణం హితత్. 5

విదూషకః : కథమివ.

రాజా :

ఇదమసులభవస్తు ప్రార్థనాదుర్నివారం
ప్రథమమపి మనోమే పఞ్చబాణః క్షిణోతి

---

స్నేహ దాక్షిణ్యముల కూడికచేత కాముకునివలె నాకు తోచు చున్నాడు.

విదూ : నీయభినివేశమును ఇట్టిదే యగుగాక ! (కొంచెము ముందుకు నడచి) ఇదే ప్రమదవన ద్వారము. ప్రవేశింపుము.

రాజు : నీవు ముందు ప్రవేశింపుము.

(ఇరువురును ప్రవేశింతురు)

రాజు : (ముందునకు చూచి) వయస్యా! ప్రమదవన ప్రవేశము కష్టమును తొలగించునదని నేను భావించినది సరికాదుసుమా.

* తాప శాంతికొఱకు త్వరపడి నేను ఉద్యానమును ప్రవేశింపగోరుట ప్రవాహమున దేలిపోవువానికి ఎదురీతవంటిదై నదిగదా.

విదూ : ఎట్లో ?

రాజు :

* దుర్లభవస్తు వాంఛనుండి మరలింప శక్యముగాని యీ నాహృదయ

కిముత మలయవాతోన్మూలితాపాణ్డుప త్రై
రుపవనసహాకారై ర్దర్శితేష్వఙ్కురేషు- 6

విదూషకః: అలం పరిదేవితేన. అచిరేణ తవేష్టసంపాదయితాఽనఙ్గ
ఏవ సుఖదో భవిష్యతి.

రాజా: ప్రతి గృహీతం బ్రాహ్మణ వచనమ్.

(పరిక్రామతః)

విదూషకః: పశ్యతుభవాన్ వసంతావతారసూచక మభిరామ త్వం
ప్రమదవనస్య.

రాజా: నను ప్రతిపదమేవావలోకయామి. అత్రహి—
అగ్రే స్త్రీనఖపాటలం కురవకం శ్యామం ద్వయోర్భాగయో
ర్బాలాశోక ముపోఢరాగ సుభగం భేదోన్ముఖం తిష్ఠతి
ఈషద్బద్ధరజః కణాగ్రకపిశా చూతే నవా మఞ్జరీ
ముగ్ధత్వస్యచ యౌవనస్యచ సఖే మధ్యే మధుశ్రీః స్థితా. 7

---

ముందు పంచబాణుడు మున్నే తపింప జేయుచున్నాడు. మలయమారుతముచే ఉన్మూలింపబడిన జీర్ణపత్రములుగల యీ యుపవన సహాకారములు అంకురములను జూపుచుండగా ఇక చెప్పెడిదేమి?

విదూ: విలాపము చాలును. త్వరలోనే నీ యభీష్టమును సమకూర్చు అనంగుడే నీకు సుఖప్రదుడు కాగలడు.

రాజు: బ్రాహ్మణుని యాశీర్వచనమును ప్రతిగ్రహించితిని.

(ముందుకు నడతురు)

విదూ: వసంతోదయ సూచకమైన ప్రమదవనము యొక్క సౌందర్యమును చూడుము.

రాజు: అడుగడుగునను చూచుచునేయుంటినిగదా. ఇచ్చట -

* ఈ కురవక పుష్పము ఇరుప్రక్కల శ్యామలము, అగ్రమున స్త్రీనఖపాటలమునై యున్నది. ఈ బాలాశోక పుష్పము ఉపచితరక్త వర్ణముచేరమణీయమై వికసించుటకు సిద్ధముగానున్నది. ఈ చూతవృక్ష

విదూషకః : ఏష మణిశిలాపట్టక సనాథోఽతిముక్తలతామణ్డపో భ్రమర సంఘట్టపతితైః కుసుమైః స్వయ మివ కృతోపచారో భవంతం ప్రతీచ్ఛతి. తదనుగృహ్యాతాం తావదేషః.

రాజా : యథా రోచతే భవతే.

(పరిక్రమ్యోపవిష్టౌ)

విదూషకః : ఇహ సుఖాసీనో భవాన్ లలితలతావిలోభమాన నయన ఉర్వశీగతా ముత్కణ్ఠాం వినోదయతు.

రాజా : (నిఃశ్వస్య)
మమ కుసుమితాస్వపి సఖే నోపవనలతాసు నమ్రవిటపాసు
చక్షుర్బధ్నాతి ధృతిం తద్రూపాలోక దుర్లలితమ్. 8

---

మందలి క్రొత్త పూగుత్తి ఇంచుక గట్టిబడిన పరాగకణములచే అగ్రమున కపిశవర్ణమై యున్నది. సఖుడా! ఈ వసంతలక్ష్మి ముగ్ధత్వమునకు యౌవనమునకు నడిమిదశలో నున్నది.

విదూ : మణి శిలా ఫలకములోఁగూడియున్న ఈ అతిముక్తలతా మండపము తుమ్మెదల త్రొక్కిడిచే రాలిన పువ్వులతో ఉపచారము చేయుచు తానై నీకొఱకెదురు చూచుచున్నది. కావున దీనివి కొంచెము అనుగ్రహింపుము.

రాజు : నీ కిష్టమైనట్లే.

(ముందుకునడచి ఉపవిష్టు లగుదురు)

విదూ : ఇచ్చట సుఖాసీనుడవై సుకుమారములైన లతలచేత ఆకర్షింపబడు చున్న చూపులు గలవాడవై ఉర్వశీ గతమైన యుత్కంఠ నవనయించు కొనుము.

రాజు :- (నిట్టూర్చి)
* సఖుడా! ఆమె సౌందర్యమును దర్శించుటయందే గాఢమైన యభి లాషగల నా చూపు వంగిన కొమ్మలు గలిగి పుష్పించియున్న యీ యుపవనలతలయందు గూడ ప్రీతిని నిలుపకున్నది.

తదుపాయ శ్చింత్యతాం యథా సఫలప్రార్థనోఽభవేయమ్

విదూషకః : (విహస్య) అహల్యా కాముకస్య మహేంద్రస్య వైద్య ఉర్వశీపర్యుత్సుకస్య భవతోఽహావపి ద్వావత్రోన్మత్తౌ.

రాజా : మామైవమ్. అతిస్నేహః ఖలు కార్యదర్శీ.

విదూషకః : ఏష చింతయామి. మాపునస్త్వం పరిదేవితేన మమ సమాధిం భింధి. (ఇతి చింతాం నాటయతి)

రాజా : (నిమిత్తం సూచయిత్వా. ఆత్మగతమ్)

న సులభా సకలేందుముఖీ చ సా
కిమపిచేద మనఙ్గ విచేష్టితమ్
అభిముఖీష్వివ కాంక్షితసిద్ధిషు
వ్రజతి నిర్వృతి మేకపదే మనః. 9

(జాతాశ స్తిష్ఠతి)

---

కనుక నేను సఫలమనోరథుడనగునట్టి యుపాయమాలో చింపవలెను.

విదూ : (నవ్వి) ఓహో అహల్యా కాముకుడైన ఇంద్రునకు అశ్వినీ కుమారుడు, ఉర్వశీ పర్యుత్సుకుడవైన నీకు నేను-ఇరువురము ఇచ్చట వెఱ్ఱివారము.

రాజు : అట్లుకాదు. అతిస్నేహము గదా కర్తవ్యమును ఉపదేశించునది.

విదూ : ఇదిగో ఆలోచించుచున్నాను. మరల విలపించి నీవు నా సమాధిని భంజింపకుము (అని యాలోచించుట నభినయించును)

రాజు : (నిమిత్తము సూచించి తనలో)

* ఆ పూర్ణ చంద్రాస్య సులభకాదు. ఐనను ఇదియేమి యీ యనంగ వికారము ! మనోరథసిద్ధులు అభిముఖములైనవన్నట్లు మనస్సు వెంటనే ఆనందమునందుచున్నది.

(మొలకెత్తిన ఆశకలవాడై కూర్చుండును)

(తతః ప్రవిశత్యాకాశయానేనోర్వశీ చిత్రలేఖా చ)

చిత్రలేఖా : హలా, క్వానిర్దిష్టకారణం గమ్యతే ?

ఉర్వశీ : సఖి తదా హేమకూటశిఖరే లతావిటపేన క్షణవిఘ్నితా

కాశగమనాం మాముపహస్య కి మిదానీం పృచ్ఛసి.

చిత్రలేఖా : కిం తస్య రాజర్షేః పురూరవసః సకాశం ప్రస్థితాఽసి.

ఉర్వశీ : అయం మమాపహాస్తితలజ్జో వ్యవసాయః.

చిత్రలేఖా : కః పునః సఖ్యా పురతః ప్రేషితః ?

ఉర్వశీ : హృదయమ్.

చిత్రలేఖా : స్వయమేవ సాధు సంప్రధార్యతాం తావత్.

ఉర్వశీ : మదనః ఖలు మాం నియోజయతి. కి మత్ర సంప్రధార్యతే.

చిత్రలేఖా : అతఃపరం నాస్తి మమోత్తరమ్.

---

(అంతట ఆకాశగమనమున ఉర్వశి, చిత్రలేఖ ప్రవేశింతురు)

చిత్రలేఖ : చెలీ ! కారణము చెప్పకుండ ఎచ్చటికి పోవుచున్నావు ?

ఉర్వశి : సఖి ! అప్పుడు హేమకూట శిఖరమున లతా శాఖచే ముహూర్తము

ఆకాశ గమన విఘ్నము పొందిన నన్ను పరిహసించి యిప్పు డడిగెద

వేల ?

చిత్ర : ఆ రాజర్షి యైన పురూరవుని దగ్గరకు బయలుదేరితివా ?

ఉర్వశి : లజ్జ విడిచిన నా ప్రయత్న మదియే.

చిత్ర : మరి సఖచేత ముందుగా ఎవ్వరు పంపబడినారు ?

ఉర్వశి : హృదయము,

చిత్ర : నీవే కొంచెము చక్కగా ఆలోచింపవలెను.

ఉర్వశి : మదనుడే గదా నన్ను ప్రేరేచినది ఇందాలోచింపవలసిన దేమున్నది.

చిత్ర : ఆ పైన నేను చెప్పవలసిన దేమియు లేదు.

ఉర్వశీ : తేన హ్యాదేశయ మార్గం యేన గచ్ఛన్త్యా అంతరాయో న భవేత్.

చిత్రలేఖా : సఖి విస్రబ్ధాభవ. నను భగవతా దేవగురుణా అపరాజితాం నామ శిఖాబంధన విద్యా ముపదిశతా త్రిదశప్రతిపక్షస్యా లఙ్ఘనీయే కృతే స్వః.

ఉర్వశీ : అహో ! విస్మృతం మమ హృదయమ్.

(సిద్ధమార్గ మవగాహ్య)

చిత్రలేఖా : సఖి, ఏతద్భగవత్యా భాగీరథ్యా యమునాసఙ్గమ విశేషపావనేషు సలిలేష్వవలోకయత ఇవ ఆత్మానం ప్రతిష్ఠానస్య శిఖాభరణభూతం రాజర్షే ర్భవన ముపగతే స్వః.

ఉర్వశీ : (విలోక్య) నను వక్తవ్యం స్థానాన్తరగతః స్వర్గ ఇతి. (విచార్య) హలా క్వనుఖలు స ఆపన్నానుకమ్పీ భవేత్.

---

ఉర్వశి : కనుకనే ఏ మార్గమున నడచిన అంతరాయములు కలుగవో అట్టి దానిని ఆదేశింపుము.

చిత్ర : సఖి ! భయపడకుము. భగవంతుడైన బృహస్పతిచేత అపరాజితయను శిఖాబంధన విద్య యుపదేశింపబడిన వారమై మన మిరువురము త్రిదశ శత్రువులకు అప్రధృష్యుల మైతిమిగాదా ?

ఉర్వశి : ఓహో ! మరచినది నా మనస్సు !

(సిద్ధ మార్గమును ప్రవేశించి)

చిత్ర : సఖి ! యమునా సంగమముచే విశేష పావనములైన పూజ్య గంగా జలములందు తన్నుదాను చూచుకొనుచున్నదాయన్నట్లున్న ప్రతిష్ఠాన పురము యొక్క శిఖాభరణమువలె నున్న రాజర్షి భవనము ఇదిగో సమీపించితిమి.

ఉర్వశి : (చూచి) స్థానాంతరమందున్న స్వర్గము అని చెప్పదగినది కాదా ? (ఆలోచించి) చెలీ ! ఆ యాపన్నదయాళు డెచ్చట నుండునో కదా !

చిత్రలేఖా : ఏతస్మి న్నందన వనై కదేశ ఇవ ప్రమదవనేఽవతీర్య జ్ఞాస్యావః.

(ఉభే అవతరతః)

చిత్రలేఖా : (రాజానం దృష్ట్వా, సహర్షమ్) సఖి ఏష ఖలు ప్రథమోదిత ఇవ భగవాంశ్చంద్రః కౌముదీమివ త్వాం ప్రతీచ్ఛతి.

ఉర్వశీ : (విలోక్య) సఖి, ఇదానీం ప్రథమదర్శనా త్సవిశేషం ప్రియదర్శనో మహారాజః ప్రతిభాతి.

చిత్రలేఖా : యుజ్యతే. తదేహి. ఉపసర్పావః.

ఉర్వశీ : తిరస్కరిణీ ప్రతిచ్ఛన్నా పార్శ్వగతాఽస్య భూత్వా శ్రోష్యామి తావత్. పార్శ్వ పరివర్తనా వయస్యేన సహ విజనే కిమపి మంత్రయమాణ స్తిష్ఠతి.

చిత్రలేఖా : యథా తే రోచతే. (యథోక్త మనుతిష్ఠతః).

---

చిత్ర : నందన వనమందలి యొకభాగమువలె నున్న ఈ యుపవనమునందు దిగి తెలిసికొందము.

(ఇరువురును దిగుదురు)

చిత్ర : (రాజునుచూచి) సఖి! ఇదుగో ఈయన అప్పుడే యుదయించిన చంద్రుడు వెన్నెలకోసమువలె నీకోసము ఎదురు చూచుచున్నాడు.

ఉర్వశి : (విలోకించి) సఖి! ప్రథమ దర్శనమునందు కంటె ఇప్పుడు మహారాజు మరింత ప్రియదర్శనుడుగా భాసించుచున్నాడు.

చిత్ర : అవును. కనుక రమ్ము సమీపింతము.

ఉర్వశి : తిరస్కరిణిచే అంతర్హితనై ఈయన పార్శ్వమున నిల్చియుండి కొంచెము ఆలకింతును. పార్శ్వవర్తియైన మిత్రునితో కలిసి ఏకాంతమునం దేదో మంతనము లాడుచున్నాడు.

చిత్ర : నీ కిష్టమైనట్లే

(అనుకొనిన విధముగా చేయుదురు)

విదూషకః: భోః చింతితో మయా దుర్లభప్రణయినీ సమాగ మోపాయః.

రాజా: (తూష్ణీమాస్తే)

ఉర్వశీ: కా ను ఖల్వేషా స్త్రీ అనేన ప్రార్థ్యమానాఽఽత్మానం వికత్థతే.

చిత్రలేఖా: కిం పునర్మానుష్యం విడమ్బ్యతే.

ఉర్వశీ: బిభేమి సహసా ప్రభావా ద్విజ్ఞాతుమ్.

విదూషకః: నను భణామి చింతిత ఉపాయ ఇతి.

రాజా: తేన హి కథ్యతామ్.

విదూషకః: స్వప్న సమాగమకారిణీం నిద్రాం సేవతాం భవాన్. అథవా తత్రభవత్యా ఉర్వశ్యాః ప్రతికృతి మాలిఖ్యావ లోకయం స్తిష్ఠతు.

---

విదూ: ఓయి! దుర్లభయైన ప్రియురాలితోడి సమాగమునకు ఉపాయ మాలోచించితిని.

రాజు: (మౌనముగా నుండును)

ఉర్వశి: ఈయనచే కోరబడియు దర్పము చూపుచున్న ఆ స్త్రీ యెవ్వతెహో కదా.

చిత్ర: మనుష్య భావమును అనుకరించుచున్నావేమి?

ఉర్వశి: ప్రభావమువల్ల వెంటనే తెలిసికొనుటకు భయపడుచున్నాను.

విదూ: ఉపాయ మాలోచించితినని చెప్పుటలేదా?

రాజు: అయితే చెప్పుము.

విదూ: స్వప్నమున సమాగమము కూర్చు నిద్రను సేవింపుము లేదా పూజ్యురాలైన యుర్వశియొక్క ప్రతికృతిని చిత్రించి చూచుకొను చుండుము,

ఉర్వశీ : (సహర్షమ్) హీనసత్త్వ! హృదయ! సమాశ్వసిహి, సమాశ్వసిహి.

రాజా : ఉభయ మప్యనుపపన్నమ్.

హృదయ మిషుభిః కామస్యాంతః సశల్యమిదం సదా
కథ ముపలభే నిద్రాం స్వప్నే సమాగమకారిణీమ్?
నచ సువదనా మాలేఖ్యేఽపి ప్రియా మసమాప్య తాం
మమ నయనయో రుద్బాష్పత్వం సఖే న భవిష్యతి.

చిత్రలేఖా : సఖి శ్రుతం త్వయా?

ఉర్వశీ : శ్రుతమ్. న పునః పర్యాప్తం హృదయస్య.

విదూషకః : ఏతావాన్మమ మతివిభవః.

రాజా : (సనిఃశ్వాసమ్)

నితాంతకఠినాం రుజం మమ న వేద సా మానసీం
ప్రభావ విదితానురాగ మవమన్యతే వాఽపి మామ్

---

ఉర్వశి : అనుదారమైన చిత్తమా! ఊరడిల్లు మూరడిల్లుము.

రాజు : రెండును పనికి మాలినవే.

* సఖుడా! ఈ నా హృదయము నిరంతరము కాముని బాణములు గ్రుచ్చుకొని పుండ్లు పడియున్నది. స్వప్నమున సమాగమము సమకూర్చు నిద్రను ఎట్లు పొందగలను? మరి చిత్రపటమున సువదనయైన ప్రియురాలి ప్రతికృతిని పూర్తి చేయకముందే నా కన్నులలో బాష్పములు పొంగిరాకుండ ఉండునా?

చిత్ర : సఖి! వింటివా?

ఉర్వశి : వింటిని కాని హృదయమున కింకను తృప్తిలేదు.

విదూ : ఇంతే నా బుద్ధిబలము.

రాజు :- (నిట్టూర్పుతో)

* అతి కఠోరమైన నా మానసిక వ్యథను ఆమె యెఱుగదో, తన ప్రభావముచే నా ప్రేమను ఎఱిగియు నన్ను తిరస్కరించుచున్నదో

అలబ్ధ ఫల నీరసాన్మమ విధాయ తస్మిన్జనే
సమాగమ మనోరథాన్ భవతు పఞ్చబాణః కృతీ. 11

చిత్రలేఖా : శ్రుతం త్వయా.

ఉర్వశీ : హాధిక్ హాధిక్. మామేవ మవగచ్ఛతి. అసమర్థాస్మి గ్రతో భూత్వాఽస్య ప్రతివచనస్య. ప్రభావ నిర్మితేన భూర్జ పత్రేణ సంపాదితోత్తరా భవితు మిచ్ఛామి.

చిత్రలేఖా : అనుమతం మమ.

ఉర్వశీ : (ససంభ్రమం గృహీత్వా యథోక్తం కరోతి)

విదూషకః : (దృష్ట్వా) అవిహా అవిహా. భోః కిం నుఖల్వేతత్ భుజఙ్గ నిర్మోక ఇవ సంముఖేఽస్మాకం నిపతితమ్.

రాజా : భూర్జపత్రగతోఽయ మక్షర విన్యాసః.

విదూషకః : నఖల్వదృష్టయా తత్రభవత్యోర్వశ్యా భవతః పరి

---

ఆమెను గూర్చిన నా మనోరథములను విఫలములను నీరసములను గావించి పంచబాణుడు కృతకృత్యుడగుగాక.

చిత్ర :- వింటివా !

ఉర్వశి :- ఛీ ఛీ. నన్నిట్లుగా భావించుచున్నాడు. ఎదుట నిల్చి దీనికి సమాధానము చెప్పుటకు జాలకున్నాను. దివ్యశక్తిచే గల్పింపబడిన బూర్జ పత్రముచేత ప్రత్యుత్తర మీయగోరుచున్నాను.

చిత్ర :- నాకును ఇష్టమే.

ఉర్వశి :- (తొట్రుపాటుతో ఆకును పట్టుకొని అనినట్లే చేయును)

విదూ :- అమ్మో ! అమ్మో ! పాము కుబుసమువలె మన ఎదురుగా వచ్చి పడినది ఇదియేమో కదా !

రాజు :- (పరిశీలించి) ఇది భూర్జపత్ర గతమైన లేఖనము.

విదూ :- నీ పరిదేవనమును విని అదృశ్యయైయున్న యుర్వశి పంపిన

దేవితం శ్రుత్వా సమానానురాగ సూచకాన్యక్షరాణి విసృష్టాని స్యుః.

రాజా : నా స్త్యగతిర్మనోరథానాం. (గృహీత్వానువాచ్యసహర్షమ్) సఖే ప్రసన్న స్తే తర్కః.

విదూషకః : భవానిదానీం ప్రసీదతు. అత్ర లిఖితం శ్రోతు మిచ్ఛామి.

ఉర్వశీ : సాధు ఆర్య నాగరికోఽసి.

రాజా : శ్రూయతాం. (వాచయతి)

స్వామిన్ సంభావితా యథాహం త్వయాఽజ్ఞాతా
తథానురక్తస్య యది నామ తవోపరి. 12

నను మమ లులితపారిజాత శయనీయే భవంతి
నందనవన వాతా అప్యత్యుష్ణకాః శరీరకే. 13

ఉర్వశీ : కింను ఖలు సాంప్రతం భణిష్యతి.

---

తుల్యానురాగ సూచకములైన మాటలు కావుగదా!

రాజు :- మనోరథములకు అగమ్యమన్నది లేదుగదా! (తీసికొని, చదివి, హర్షముతో) సఖుడా! నీ యూహ యథార్థమైయైనది.

విదూ :- ఇక నిప్పుడు ఉపశాంతుడవుకమ్ము. ఇందేమి వ్రాయబడినదో విన గోరుచున్నాను.

ఉర్వశి :- ఆర్యా! మేలు. నాగరకుడవైతివి.

రాజు :- వినుము. (చదువును)

6 స్వామీ! అనురక్తుడవైన నీ పట్ల నీవనుకొనుచున్నట్లు నేను ఉదాసీను రాలనే అయినచో—

* పారిజాత పూల శయ్యపై బొరలుచున్న నా శరీరమునకు నందనవన మారుతములుగూడ తాపజనకములు కావుగదా.

ఉర్వశి :- ఇప్పుడేమి పలుకునోకదా.

చిత్రలేఖా : నను భణితమేవ కమలనాలాయమానై ర్గైః.

విదూషకః : దిష్ట్యా మయేవ బుభుక్షితేన స్వస్తివాచనక ముపలబ్ధం భవతా సమాశ్వాసనమ్.

రాజా : సమాశ్వాసనమితి కిముచ్యతే.

తుల్యానురాగ పిశునం లలితార్థబంధం
పత్రే నివేశిత ముదాహరణం ప్రియాయాః
ఉత్పక్ష్మణా మమ సఖే మదిరేక్షణాయా
స్తస్యాః సమాగతమి వానన మాననేన.

ఉర్వశీ : అత్రావయోః సమవిభాగా ప్రీతిః.

రాజా : వయస్య, అఙ్గుళీస్వేదేన దూష్యేర న్నక్షరాణి. ధార్యతా మయం ప్రియాయాః స్వహస్తః.

విదూషకః ; (గృహీత్వా) కిమిదానీం తత్రభవత్యుర్వశీ భవతో

---

చిత్ర : తామరతూడులవలె అగుచున్న అంగములచేత చెప్పినట్లే యైనదిగదా.

విదూ : బుభుక్షితుడైన నాకు అదృష్టవశమున ఉపాయనము లభించినట్లు నీకు ఈ సమాశ్వాసనము లభించినది.

రాజు : సమాశ్వాసనమని ఏల పల్కెదవు ?

* సఖుడా ! తుల్యానురాగ సూచకము, సుకుమారార్థ యుక్తములై పత్రమున లిఖింపబడిన ప్రియురాలి ప్రణయగీతము విప్పారిన కన్నులుగల నా ముఖముతో చేరవచ్చిన ఆ మదిరేక్షణ ముఖమా యన్నట్లున్నది.

ఉర్వశీ : ఇప్పుడిరువురము ప్రేమను సమముగా పంచుకొంటిమి.

రాజు : వయస్య ! అంగుళీ స్వేదముచేత ఈయక్షరములు చెరిగిపోవునేమో. ప్రియురాలి లేఖను భద్రముగా నుంచుము.

విదూ : (తీసికొని) పూజ్యురాలైన ఉర్వశి యిప్పుడు నీ మనోరథములను కుసు

మనోరథానాం కుసుమం దర్శయిత్వా ఫలే విసంవదతి.

ఉర్వశీ : హలా యావదుపగమనకాతరం హృదయం పర్యవస్థాపయామి తావత్త్వ మస్యాత్మానం దర్శయిత్వా యన్మమ తమం తద్భణ.

చిత్రలేఖా : (తథేతి తిరస్కరిణీ మపనీయ రాజానముపేత్య) జయతు జయతు మహారాజః.

రాజా : స్వాగతం భవత్యై. భద్రే.

నతథా నందయసి మాం సఖ్యా విరహితా తయా
సంగమే పూర్వదృష్టేవ యమునా గఙ్గయా వినా. 15

చిత్రలేఖా : నను ప్రథమం మేఘరాజిర్దృశ్యతే పశ్చాద్విద్యుల్లతా.

విదూషకః : (అపవార్య) కథం నైషోర్వశీ. తస్యాస్తత్ర భవత్యా అభిమతా సహచరీ.

---

మింపజేసి ఫలమునం దన్యథా చేయునా ?

ఉర్వశి : చెలీ! సమీపించుటకు తడబడుచున్న నా హృదయమును కుదుట బరచుకొను లోపల నీవు ఈయనకు నీ స్వరూపమును జూపి నాకు దగిన తీరున మాట్లాడుము.

చిత్ర : (అట్లేయని తిరస్కరిణిని తొలగించి రాజును సమీపించి) మహారాజునకు జయము జయము.

రాజు : (హర్షముతో) పూజ్యురాలైన నీకు స్వాగతము. పుణ్యురాలా !

* గంగా సహితయై పూర్వము కనబడి పిదప ఒంటరిగా గనబడిన యమునవలె సఖి విరహితవైన నీవు నన్ను అంతగా సంతోష పెట్టలేకున్నావు.

చిత్ర : మొదట మేఘరాజి కనబడును, తరువాత గదా విద్యుల్లత.

విదూ : (అపవారించి) ఏమి యీమె ఉర్వశికాదా ? ఆ పూజ్యురాలి ప్రియ సహచరియా ?

చిత్రలేఖా : ఉర్వశీ మహారాజం శిరసా ప్రణమ్య విజ్ఞాపయతి.

రాజా : కిమాజ్ఞాపయతి.

చిత్రలేఖా : మమ సురారిసంభవే దుర్జాతే మహారాజ ఏవ శరణ మాసీత్. సాహం తవ దర్శన సముత్థేన మదనేన బలవద్బాధ్య మానా భూయోఽపి మహారాజే సానుకంపనీయేతి.

రాజా : భద్రముఖి,

పర్యుత్సుకాం కథయసి ప్రియదర్శనాం తా
మార్తిం న పశ్యసి పురూరవసం తదర్థే
సాధారణోఽయ ముభయోః ప్రణయః స్మరస్య
తప్తేన తప్తమయసా ఘటనాయ యోగ్యమ్. ॥ 16

చిత్రలేఖా : (ఉర్వశీ ముపేత్య) సఖి ఏహి. త్వత్తోఽపి నిర్దయతరం మదనం దృష్ట్వా ప్రియతమస్య తే దూత్యస్మి సంవృత్తా.

---

చిత్ర : మహారాజునకు శిరసా ప్రణమిల్లి ఉర్వశి విజ్ఞాపన చేయుచున్నది.

రాజు : ఏమని యాజ్ఞాపించుచున్నది ?

చిత్ర : "రాక్షస సంభూతమైన వ్యసనమునందు మహారాజే నాకు శరణ మయ్యెను. అట్టి నేను నీ దర్శనమువల్ల జనియించిన మదనునిచే మిక్కిలి పీడింపబడుచు మరియొకసారి . మహారాజుచేత అనుగ్రహింప బడదగినదాన నగుచున్నాను"- అని.

రాజు : సుముఖి !

* ప్రియదర్శనయైన యామెనుగూర్చి పర్యుత్సుకయని చెప్పుచున్నావు. కాని ఆమెకొఱకై యార్తుడై యున్న పురూరవుని చూడకున్నావు. కామకృతమైన యీ యనురాగము మా యిరువురయందును ఏక రూపమే. తప్తమైన లోహము తప్తమైన లోహముతో సంఘటించుట యోగ్యము గదా.

చిత్ర : (ఉర్వశిని సమీపించి) సఖి ! రమ్ము. నీ యందుకంటెను నిర్దయుడగు

ఉర్వశీ : (తిరస్కరిణీమపనీయ) అహో లఘు త్వయో జితాస్మి

చిత్రలేఖా : ఇతో ముహూర్తాజ్జాస్యామి కా కాము జిష్యతీతి. ఆచారం తావత్ప్రతి పద్యస్వ.

ఉర్వశీ : (రాజానముపేత్య, సవ్రీడమ్) జయతు జయతు మహారాజః.

రాజా : సుందరి

మయానామ జితం యస్య త్వయాయం సముదీర్యతే
జయశబ్దః సహస్రాక్షా దగతః పురుషాన్తరమ్.
(హస్తే గృహీత్వైనా ముపవేశయతి)

విదూషకః : భవతి, రాజ్ఞః ప్రియవయస్యో బ్రాహ్మణః కిం నవన్ద్యతే?

ఉర్వశీ : (సస్మితం ప్రణమతి)

---

నిర్దయతరుడై యుండుట చూచి నీ ప్రియతమునకు దూతినై వచ్చితిని.

ఉర్వశి : (తిరస్కరిణిని అపనయించి) అహో! శీఘ్రముగా నీ చేత పరిత్యక్తనైతిని గదా.

చిత్ర : ఎవతె యెవ్వతెను పరిత్యజించునో ఇంక నొక క్షణములో తెలిసి కొందును గదా. కొంచెము మర్యాదను పాటింపుము,

ఉర్వశి : (రాజును సమీపించి సిగ్గుతో) మహారాజునకు జయము జయము.

రాజు : సుందరి !

* సహస్రాక్షునికంటె అన్యపురుషునికి చెందని జయ శబ్దమును నీవు ఎవనికై పలికితివో అట్టి నాకు తప్పక జయము కలుగును.

(చేతితో పట్టుకొని ఆమెను కూర్చుండబెట్టును)

విదూ : పూజ్యురాలా! రాజుగారి ప్రియవయస్యుడైన బ్రాహ్మణునకు నమస్కరింప వేల ?

ఉర్వశి : (చిరునవ్వుతో ప్రణమిల్లును)

విదూషకః : స్వస్తి భవత్యై.

(నేపథ్యే)

దేవదూతః : చిత్రలేఖే త్వరయోర్వశీమ్.

మునినా భరతేన యః ప్రయోగో
భవతీష్వష్టరసాశ్రయో నియుక్తః
లలితాభినయం తమద్య భర్తా
మరుతాం ద్రష్టుమనాః సలోకపాలః. 18

(సర్వే కర్ణం దదతి. ఉర్వశీ విషాదం నాటయతి)

చిత్రలేఖా : శ్రుతం ప్రియసఖ్యా దేవదూతస్య వచనమ్. అనుమాన్యతాం మహారాజః

ఉర్వశీ : నాస్తి మే వాక్.

చిత్రలేఖా : మహారాజ! పరవశోఽయం జనః. తన్మహారాజేన అభ్యనుజ్ఞాతేచ్ఛతి దేవేష్వనపరాద్ధమాత్మానం కర్తుమ్.

---

విదూ : పూజ్యురాలికి మేలగు గాక !

(నేపథ్యమున)

దేవదూత : చిత్రలేఖా ! ఉర్వశిని తొందరపెట్టుము.

* భరతముని మీకు నేర్పిన అష్టరసాశ్రయమైన లలితాభినయ ప్రయోగమును లోకపాల సహితుడైన దేవేంద్రుడిప్పుడు తిలకింపగోరుచున్నాడు.

(అందఱును చెవి యొగ్గుదురు. ఉర్వశి విషాదము అభినయించును)

చిత్ర : దేవదూత వాక్యము ప్రియసఖికి వినబడినదా ? మహారాజును అనుమతింప వేడుకొనుము.

ఉర్వశి : నేను మాటాడలేను.

చిత్ర : మహారాజా ! ఈమె పరాధీనురాలు. కనుక మహారాజుచే అనుజ్ఞాతయై దేవతలపట్ల తన్ను అనపరాధను కావించుకొన గోరుచున్నది

రాజా : (కథంచి ద్వాచం వ్యవస్థాప్య) నాస్మి భవత్యో రీశ్వరనియోగ ప్రత్యర్థీ. స్మర్తవ్య స్త్వయం జనః.

ఉర్వశీ : (వియోగదుఃఖం రూపయన్తీ సహసఖ్యా నిష్క్రాంతా)

రాజా : (సనిఃశ్వాసమ్) సఖే వైయర్థ్యమివ చక్షుషః సంప్రతి.

విదూషకః : (పత్రం దర్శయితుకామః) న న్వేతత్ (ఇత్యర్ధోక్తే. ఆత్మగతమ్) హీ ధిక్ హీ ధిక్. ఉర్వశీ దర్శన విస్మితేన మయా తద్భూర్జపత్రం ప్రభ్రష్టమపి హస్తాత్ప్రమాదేన న విజ్ఞాతమ్.

రాజా : భద్ర, కిమపి వక్తుకామ ఇవ.

విదూషకః : మా భవానఙ్గాని ముఞ్చతు. దృఢంఖలు త్వయి బద్ధభావోర్వశీ. న సేతోగత మనురాగం శిథిలయతి.

రాజా : మమాప్యేత దాశంసి మనః. తయాఖలు ప్రస్థానే—

---

రాజు : (ఎట్లో మాట పెగుల్చుకొని) మీ యిరువుర ప్రభు సేవకు అంతరాయము కలిగింపను. ఈతనిని మాత్రము గుర్తుంచుకొనుడు.

ఉర్వశి : (వియోగ దుఃఖమును ప్రకటించుచు సఖితో నిష్క్రమించును)

రాజు : (నిట్టూర్పుతో) సఖుడా! ఇప్పుడు కన్నులకు ప్రయోజనము లేదన్నట్లున్నది.

విదూ : (పత్రమును జూపగోరువాడై) ఇది యేమో (అని యర్ధోక్తిలో తనలో) అయ్యో! అయ్యో! ఉర్వశీ దర్శన విస్మితుడనైన నాకు ఆ భూర్జపత్రము ప్రమాదవశమున చేతినుండి జారి పడిపోవుటకూడ ఎఱుకపడలేదు.

రాజు : భద్రుడా! ఏమో చెప్పదలచినట్లున్నావు?

విదూ : నీవు నీరసపడవద్దు. ఉర్వశి నీయందు దృఢముగా బద్ధానురాగయై యున్నది గదా. ఆమె నీ పట్లగల యనురాగమును సడలనీయదు.

రాజు : నా మనస్సుకూడ ఇదియే చెప్పుచున్నది. నిజముగా ఆమె బయలు దేరునప్పుడు—

అనీశయా శరీరస్య హృదయం స్వవశం మయి
స్తనకమ్ప క్రియాలక్ష్యై ర్న్యస్తం నిఃశ్వసితై రివ.. 19

విదూషకః : (ఆత్మగతమ్) వేపతే మే హృదయ మిమాం వేలాం తత్ర భవతాతస్య భూర్జపత్రస్య నామ గ్రహీతవ్యం భవిష్యతీతి.

రాజా : కేనేదానీం దృష్టిం వినోదయామి. (స్మృత్వా) అ. ఉపనయతు భవాన్ భూర్జపత్రమ్.

విదూషకః : (విషాదం నాటయతి) హా న్తన దృశ్యతే. గత మూర్వశ్యా మార్గేణ.

రాజా : సర్వత్ర ప్రమాదీ వైధేయః. నను విచినోతు భవాన్.

విదూషకః : (ఉత్థాయ) నన్వితో భవేదితో భవేత్ (ఇతి విచేతవ్యం నాటయతి).

(తతః ప్రవిశతి సపరివారా దేవీ కాశీరాజపుత్రీ)

---

* శరీరము తన యధీనము కానందుచేత స్తనకంపన క్రియచే దెలియవచ్చు విశ్వాసములచేత స్వవశమైన హృదయమును నాయందు అర్పించినదా యన్నట్లుండెను.

విదూ :- (తనలో) ఈ పూజ్యుడు ఎప్పుడైన భూర్జ పత్రము మాట యెత్తునేమో యని నా హృదయ మీ సమయమున కంపించుచున్నది.

రాజు :- దేనితో నిప్పుడు నా దృష్టిని వినోదపరచుకొందును? (స్మరించి) ఆ. ఆ భూర్జపత్రము నిటు తెమ్ము.

విదూ :- (విషాద మభినయించును) అయ్యో కనబడుటలేదు. ఉర్వశి పోయిన దారినే పోయినది కాబోలు.

రాజు :- మూర్ఖుడవు, అన్నింటను అనవధానుడవే. వెదుకుము దానిని.

విదూ :- (లేచి) ఇక్కడ ఉండవచ్చు ఇక్కడ ఉండవచ్చు. (వెదకుట నభినయించును)

(అంతట సపరివారయై దేవి కాశీ రాజపుత్రి ప్రవేశించును)

దేవీ : హఞ్జే నిపుణికే సత్యం త్వయా భణిత మిదం లతాగేహం ప్రవిశ న్నార్యమాణవక సహాయ ఆర్యపుత్రో దృష్ట ఇతి.

నిపుణికా : కిమన్యథా భట్టినీ మయా విజ్ఞాపితపూర్వా?

దేవీ : తేనహి లతాంతరితా శ్రోష్యామి తావదస్య విస్రబ్ధ మంత్రితాని.

నిపుణికా : యద్భట్టిన్యై రోచతే.

దేవీ : (పరిక్రమ్య) హఞ్జే నిపుణికే. కిమేత జ్జీర్ణచీవరమివ ఇతో ముఖం దక్షిణమారుతే నానీయతే.

నిపుణికా : (విభావ్య) భట్టిని పరివర్తన విభావితాక్షరం భూర్జపత్రం ఖల్వేతత్. హన్త భట్టిన్యా ఏవ నూపురకోట్యా లగ్నమ్. (గృహీత్వా) కథం. వాచ్యతామ్.

దేవీ : అనువాచయ తావదేతత్. యద్యవిరుద్ధం తతః శ్రోష్యామి.

---

దేవి :- చెలీ ! నిపుణికా ! ఆర్య మాణవకునితో గలిసి యార్యపుత్రుడు లతా గేహమును ప్రవేశించుచు నగపడెనని నీవు చెప్పినమాట సత్యమే.

నిపు :- నే నెన్నడైన మహారాణికి అసత్యము చెప్పియుంటినా ?

దేవి :- అందుకే లతల మాటున దాగియుండి యాతని రహస్య భాషణములను కొంచెము విందును.

నిపు :- మహారాణికి ఇష్ట మైనట్లే.

దేవి :- (ముందుకునడచి) ఓసి నిపుణికా ! దక్షిణమారుతము చేత ఈ దిక్కునకు గొట్టుకొని వచ్చుచు ప్రాత గుడ్డపేలికవలె నున్న దిది యేమిటే.

నిపు :- (పరీక్షించి) మహారాణి! త్రిప్పిచూడగా అక్షరములు కనబడుచున్న భూర్జపత్రము సుమా యిది. అయ్యో ! మహారాణి నూపురాగ్రము నందే తగుల్కొన్నదిగదా ! (తీసికొని) ఏమి చదువవచ్చునా ?

దేవి :- నాకు తరువాత వినిపింతువుగాని. అవిరుద్ధ మైనచో, అప్పుడు వినగలను.

నిపుణికా : (తథా కృత్వా) ఝట్టిని తదేవ కౌలీనమివ ప్రతిభాతి. భర్తారముద్దిశ్యోర్వశ్యాః కావ్యబంధ ఇతి తర్కయామి. ఆర్య మాణవక ప్రమాదే నావయోర్హస్తంగత ఇతి.

దేవీ : తేన హ్యాస్య గృహీతార్థా భవామి.

నిపుణికా : (రాజ్ఞా పూర్వవాచితం వాచయతి)

దేవీ : అత్రానేనైవోపాయనేనాప్సరః కాముకం ప్రేక్షే.

(ఇతి పరిజనసహితా లతాగృహం పరిక్రామతి)

విదూషకః : భో వయస్య కిమేతత్పవనవశగామి ప్రమదవన సమీప గత క్రీడాపర్వత పర్యన్తే దృశ్యతే.

రాజా : (ఉత్థాయ) భగవన్ వసంతప్రియ! దక్షిణవాయో!

వాసార్థం హర సంభృతం సురభిణా పౌష్పం రజో వీరుధాం
కిం మిథ్యా భవతో హృతేన దయితాస్నేహస్వహస్తేన మే

---

నిపు : (అట్లే చేసి) మహారాణి ! అదే యపవాదమువలె కనబడుచున్నది. ప్రభువు నుద్దేశించిన యుర్వశి పద్య లేఖయని యూహించుచున్నాను. అర్య మాణవకుని ప్రమత్తత వల్ల మన చేతులలో జిక్కినదని యను కొందును.

దేవి : కనుక నే దీని యభిప్రాయము గ్రహింతును.

నిపు : (వెనుక రాజు చదివిన శ్లోకములను చదువును)

దేవి : ఇచ్చట ఈ కానుకతోడనే ఆ యప్సరః కాముకుని దర్శింతును.

(అని పరిజన సహితయై లతా గృహముదిక్కు నడచును)

విదూ : ఓయి మిత్రమా ! ప్రమదవన సమీపమందున్న క్రీడా పర్వతము చేరువగా వాయువశమున నెగురుచు గనబడుచున్నది అదియేమిటి ?

రాజు : (లేచినిల్చి) భగవన్ ! వసంతమిత్ర ! దక్షిణపవన !

* మధుమాసముచే సంపాదింపబడిన లతా కుసుమధూళిని సుగంధము కొఱకు హరింపుము. కాని నా ప్రియురాలి స్వహస్త లిఖిత ప్రేమ

జానీతే హి మనోవినోదనఫలై రేవంవిధై ర్థారితం
కామా ర్తం జన మఙ్గనాం ప్రతి భవానాలక్షిత ప్రార్థనః.30

నిపుణికా : భట్టిని ఏతస్యైవాన్వేషణా వర్తతే.

దేవీ : పశ్యామి.

విదూషకః : భో ప్లాయమాన కేసరచ్ఛవినా మయూరపిఞ్ఛేన విప్రలబ్ధోఽస్మి.

రాజా : సర్వథా హతోఽస్మి.

దేవీ : (ఉపేత్య) ఆర్యపుత్ర ! అలమావేగేన. ఏతద్భూర్జపత్రమ్.

రాజా : (ససంభ్రమమ్) అయే దేవీ ? స్వాగతం దేవ్యై.

విదూషకః : (అపవార్య) దురాగత మిదానీం సంవృత్తమ్.

రాజా : (జనాంతికమ్) సఖే కి మత్ర ప్రతివిధేయమ్ ?

---

లేఖను వృధగా హరించినందువల్ల నీ కేమి ప్రయోజనము ? కామార్తమైన జనము మనోవినోదనము ఫలముగా గల యిట్టి వాని చేతనే ప్రాణములు నిలుపుకొనునని నీ వెఱుగుదువుగదా ! అంజనా దేవి పట్ల నీవును అభిలాషను ప్రకటించినవాడవే కదా.

నిపు : మహారాణి ! దీని యన్వేషణయే జరుగుచున్నది.

దేవి : చూచుచున్నాను.

విదూ : ఓయి ! వాడిపోవుచున్న కేసర పుష్పము కాంతివంటి కాంతిగల నెమలి యీకవల్ల నేను మోసపోయినాను.

రాజా : పూర్తిగా హతుడనైతిని.

దేవి : (సమీపించి) ఆర్యపుత్ర ! ఆవేగపడ నక్కఱలేదు. ఇదిగో ఆ భూర్జ పత్రము.

రాజు : (తొట్రుపాటుతో) ఓహో దేవియా ? దేవికి స్వాగతము.

విదూ : (అపవారించి) ఇప్పుడు దురాగతమే యైనది.

రాజు : (జనాంతికముగ) సఖుడా ! ఇప్పుడు విరుగుడేమిటి ?

విదూషకః : లోప్త్రేణ గృహీతస్య కుంభీరకస్యాస్తి వా ప్రతివచనమ్.

రాజా : (అపవార్య) మూఢ! నాయం పరిహాసకాలః (ప్రకాశమ్) దేవి నేదం మయా మృగ్యతే. స ఖలు పరసమన్వేషణార్థ మారంభోఽయమ్.

దేవీ : యుజ్యత ఆత్మనః సౌభాగ్యం ప్రచ్ఛాదయితుమ్.

విదూషకః : భవతి త్వరయాస్య భోజనం యత్పిత్తోపశమన సమర్థం భవతి.

దేవీ : నిపుణికే శోభనం ఖలు బ్రాహ్మణేనాశ్వాసితో వయస్యః.

విదూషకః : భవతి నను పశ్యాశ్వాసితః పిశాచోఽపి భోజనేన.

రాజా : మూర్ఖ బలాదపరాధినం మాం ప్రతిపాదయసి.

దేవీ : నాస్తి భవతోఽపరాధః. అహమేవాత్రాపరాద్ధా యా ప్రతి

---

విదూ : దొంగిలిన సొమ్ముతో పట్టుబడిన దొంగకు ఇంక చెప్పుట కేముండును?

రాజు : (అపవారించి) మూఢుడా! ఇది పరిహాసమునకు సమయముకాదు. (ప్రకాశముగా) దేవి! నేను దీనిని వెదకుటలేదు. ఇది వేఱు వస్తువు నన్వేషించు ప్రయత్నము.

దేవి : స్వీయ సౌభాగ్యమును దాచిపెట్టుకొనుట యుక్తమగునా?

విదూ : దేవి! పిత్తోపశమన సమర్థమైన భోజనమును ఈయనకు త్వరగా సిద్ధము చేయవలయును.

దేవి : నిపుణికా! ఈ బ్రాహ్మణుడు తన వయస్యునకు ఎంతచక్కని ఉపశాంతి కలిగించుచున్నాడో.

విదూ : పూజ్యురాలా! చూడరాదా, భోజనముచేత పిశాచము కూడ ఉపశాంత మగును.

రాజు : మూర్ఖుడా! బలవంతముగా నన్ను అపరాధిగా నిరూపించుచున్నావు.

దేవి : తమ యపరాధ మేమియు లేదు. అనిష్టదర్శననై తమ యెదుట నిల్చి

కూల దర్శనా భూత్వా గ్రస
ష్యామి. (ఇతి కోపం నాటయి

రాజా :

అపరాధీనామాహం ప్రసీద
సేవ్యో జనశ్చ కుపితః కథం:
(ఇతి పాదయోః

దేవీ : (ఆత్మగతమ్) మాఖలు లఘుహ్
మన్యే. కిం త్వ దాక్షిణ్యాకృతా
(రాజాన మపహాయ సపరివా

విదూషకః : ప్రావృణ్ణదీ వాప్రసన్నా గ
రాజా : (ఉత్థాయ) వయస్య నేద మను

---

యున్న నేనే అపరాధినిని. ఇటనుండి
కోపము నటించి బయలుదేరును.)

రాజు :

* నేనే యపరాధిని. రంభోరు! ప్ర
చాలింపుము. సేవ్యజనము కుపిత మై
యెట్లగును?

(అని పాదములపై బడ

దేవి : (తనలో) నేను లఘుహృదయనై యీ
లేదు. కాని నిర్దయత్వమువల్ల కలుగబో
పడుచున్నాను.

(రాజును విడిచిపెట్టి సపరివారముగా నిష్క్ర

విదూ : వర్షాకాల నదివలె అప్రసన్నయై దేవి వెడలిపో
తెమ్ము.

రాజు : (లేచి నిలిచి) వయస్య! ఇది యనుపపన్నముకా

యోషితాం
రసాదృతే
తద్విదాం
యోషితః. 22

భవత ఏతత్. నఖల్వపి దుఃఖతోఽఖి

మనసోఽపి మే నపున దేవ్యాం బహు
లబ్ధ్వా దహామస్యాం ధైర్యం అవ

తో ధీరతా. బుభుక్షితస్య బ్రాహ్మ
ణాం భవాన్. సమయః ఖలు స్నాన

---

మణి యది తెలిసినవారి హృదయమును
ములతో గూడినదైనను అనురాగ రహిత
యము స్త్రీల హృదయమును ప్రవేశింప

నేత్రరోగి కంటియెదుటి దీప శిఖను చూడ

త చిత్తుడనైనను నాకు దేవియందు అదే
నిపాతమును దిరస్కరించినది గనుక నీమెయం
ర గలను.

యట్లుండనిమ్ము. ఆకలిగొనియున్న బ్రాహ్మణుని
ందు నిలబెట్టుము. స్నాన భోజనములు సేవించు
ది సుమా.

రాజా : (ఊర్ధ్వమవలోక్య) గతమర్ధం దివసస్య.

ఉష్ణాలుః శిశిరే నిషీదతి తరోర్మూలాలవాలే శిఖీ
నిర్భిద్యోపరి కర్ణికారముకులాన్యాలీయతే షట్పదః
తప్తం వారి విహాయ తీరనలినీం కారణ్డవః సేవతే
క్రీడావేశ్మని చైష పఞ్జరశుకః క్లాంతో జలం యాచతే. 23

(ఇతి నిష్క్రాంతాః సర్వే)

ఇతి ద్వితీయోఽఙ్కః.

---

రాజు : (పైకి చూచి) పగటిలో సగము గడచిపోయినది.

* తాపము సహింపజాలనిదై మయూరము చల్లనైన వృక్షము యొక్క యాలవాలమున కూర్చున్నది. కర్ణికార ముకుళములను అగ్రము లందు భేదించి షట్పదము వానిలో దాగికొనుచున్నది. వేడి యెక్కిన నీటిని విడిచి కారండవపక్షి యొడ్డునందున్న పద్మము నాశ్రయించుచున్నది. క్రీడా మందిరమందలి పంజరమందుండియు ఈ కీరము వడగొట్టి నీటికై యాచించుచున్నది.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము



## తృతీయోఽఙ్కః

( తతః ప్రవిశతో భరతశిష్యౌ )

ప్రథమః : సఖే పల్లవ! మహేంద్ర సదనం గచ్ఛతోపాధ్యాయేన త్వమాసనం ప్రతిగ్రాహితః. అగ్నిశరణ సంరక్షణాయ స్థాపితోఽహమ్. అతఃఖలు పృచ్ఛామి. అపిగురోః ప్రయోగేణ దివ్యా పరిషదారాధితా ?

ద్వితీయః : గాలవ! నజానే ఆరాధితా నవేతి. తస్మిన్ పునః సరస్వతీ కృతకావ్య బన్ధే లక్ష్మీస్వయంవరే తేషుతేషు రసాన్తరేషు తన్మయ్యాసీత్. కింతు-

ప్రథమః : సదోషావకాశ ఇవతే వాక్యశేషః.

---

## తృతీయాంకము

( అంతట భరత శిష్యు లిద్దరు ప్రవేశింతురు )

ప్రథముఁడు : సఖుఁడా! పల్లవ! మహేంద్ర లోకమునకుఁ జనుచుండిన యుపాధ్యాయులవారిచే నీవు ఆసనము పట్టించి వెంటఁగొని పోఁబడితివి. నేను అగ్నిశాలా రక్షణార్థము ఇచ్చటనే నిలుపఁబడితిని. అందుచేతనే అడుగుచున్నాను. గురువుగారి ప్రయోగముచేత దేవసభ తృప్తి పఱుపఁబడినదా ?

ద్వితీయుఁడు : గాలవ! తృప్తి పఱుపఁబడినదో లేదో నే నెఱుగను. సరస్వతీ కృతమైన లక్ష్మీస్వయంవరమనెడు కావ్యబంధమున ఆ యారసము లందు మాత్రము పరవశమైనది. కాని-

ప్రథ : దోషమున కవకాశ మొసఁగునదిగాఁ దోఁచుచున్నది నీ వాక్యశేషము.

ద్వితీయః : ఆమ. తస్మిన్నుర్వశ్యా వచనం ప్రమాదస్ఖలితమాసీత్.

ప్రథమః : కథమివ.

ద్వితీయః : లక్ష్మీభూమికాయాం వర్తమానోర్వశీ వారుణీ భూమికాయాం వర్తమానయా మేనకయా పృష్టా-సఖి సమాగతా ఏతే త్రైలోక్య సుపురుషాః సకేశవాశ్చ లోకపాలాః. కతమస్మింస్తే భావాభినివేశ- ఇతి.

ప్రథమః : తతస్తతః.

ద్వితీయః : తతస్తయా పురుషోత్తమ ఇతి భణితవ్యే పురూరవసీతి నిర్గతా వాణీ.

ప్రథమః : భవితవ్యతానువిధాయీనీంద్రియాణి. నఖలు తామభిక్రుద్ధో గురుః.

ద్వితీయః : సాఖలు శప్తోపాధ్యాయేన. మహేన్ద్రేణపునరనుగృహీతా

---

ద్వితీ : అవును అందు ఊర్వశి వచనము ప్రమాదవశమున నన్యథా పలుకఁబడినది.

ప్రథ : ఎట్లో ?

ద్వితీ : లక్ష్మి వేషమందున్న ఉర్వశి వారుణీ వేషమందున్న మేనకచే ప్రశ్నింపఁబడినది. చెలీ ! మూడులోకములందుఁగల మహాపురుషులును, కేశవ సహితులైన లోకపాలురుమ వీరే సమావిష్టులై యున్నారు. వీరిలో నీకు ఎవ్వనియందభిలాష కలదు ? అని.

ప్రథ : తరువాత తరువాత.

ద్వితీ : తరువాత ఆమె 'పురుషోత్తమునియందు' అని చెప్పవలసి యుండఁగా, 'పురూరవుని యందు' అని మాట జారినది.

ప్రథ : ఇంద్రియములు భవితవ్యము ననువర్తించునవి. గురువుగా రామెపైఁ గోపపడలేదుగదా ?

ద్వితీ : ఉపాధ్యాయుల వారిచే ఆమె శాపమే పొందినది - కాని తిరిగి

ప్రథమః : కథమివ.

ద్వితీయః : యేన మమోపదేశస్త్వయా లఙ్ఘితస్తేన న తే దివ్యం స్థానం భవిష్యతీత్యుపాధ్యాయస్య శాపః. మహేన్ద్రేణపునః ప్రేక్షణావసానే లజ్జావనతముఖీ భణితా యస్మిన్ బద్ధభావాసి తస్య మే రణసహాయస్య రాజర్షేః ప్రియమత్ర కరణీయమ్. సా త్వం తథాకామం పురూరవస ముపతిష్ఠస్వ యావత్స త్వయి దృష్టసంతానో భవేదితి.

ప్రథమ : సదృశం పురుషాంతర విదో మహేన్ద్రస్య.

ద్వితీయః : (సూర్యమవలోక్య) కథా ప్రసఙ్గేనాస్మాభిరపరాద్ధా అభిషేక వేలా ఖలూపాధ్యాయస్య. తదేహి. అస్యపార్శ్వ పరివర్తినౌ భవావః.

(ఇతి నిష్క్రాన్తౌ)

విష్కంభకః.

---

మహేంద్రునిచే ననుగ్రహింపఁబడినది.

ప్రథ : ఎట్లో ?

ద్వితీ : నాయుపదేశమును ఉల్లంఘించితివి కనుక నీకు స్వర్గలోకమున స్థానము లేకుండుగాక- అని యుపాధ్యాయులవారి శాపము. కాని మహేంద్రుని చేత ప్రదర్శనానంతరము సిగ్గుచేఁ దలవంచుకొన్నదై యిట్లు చెప్పబడినది- ఎవ్వనియందు నీవు బద్ధానురాగవై యుంటివో, మాకు రణ సహాయుఁడైన ఆరాజర్షికి మేము ప్రియము చేయవలసి యున్నది. కనుక నీయందాయన సంతానమును గాంచునంతవఱకును నీవు యథేష్టముగా పురూరవునితోఁ గలిసియుండుము.

ప్రథ : పరేంగితజ్ఞుఁడైన దేవేంద్రునకిది యుచితముగా నున్నది.

ద్వితీ : (సూర్యునివైపు చూచి) సంభాషణమున మనము ఉపాధ్యాయులవారి స్నాన వేళను మఱచితిమి. కనుక రమ్ము. ఆయన సన్నిధికిఁ బోవుదము.

( ఇరువురు నిష్క్రమింతురు )

విష్కంభకము

(తతః ప్రవిశతి కఞ్చుకీ)

కఞ్చుకీ

సర్వః కల్యేవయసి యతతే లబ్ధుమర్థాన్ కుటుమ్బీ
పశ్చాత్పుత్రైరపహృతభరః కల్పతే విశ్రమాయ
అస్మాకంతు ప్రతిదిన మియం సాదయన్తీ శరీరం
సేవా కారాపరిణతి రహో స్త్రీషు కష్టోఽధికారః.

(పరిక్రమ్య) ఆదిష్టోఽస్మి సనియమయా కాశీరాజపుత్ర్యా యథా వ్రతసంపాదనాయ మయా మానముత్సృజ్య నిపుణికా ముఖేన పూర్వం యాచితో మహారాజః, తదేవ మద్వచనా ద్విజ్ఞాపయేతి. యావదిదానీ మవసిత సన్ధ్యాజాప్యం మహారాజం పశ్యామి (పరిక్రమ్యావలోక్యచ) రమణీయః ఖలు దివసావసాన వృత్తాంతో రాజవేశ్మని. ఇహాహి—

---

( అంతట కంచుకి ప్రవేశించును )

* కుటుంబియైన వాఁడెల్ల యౌవనమునందే అర్థము లార్జింప యత్నించును. అనంతరము పుత్త్రులచే స్వీకరింపఁబడిన భారముగలవాఁడై విశ్రాంతికి యోగ్యుఁడగు చున్నాఁడు. మాకన్ననో, ప్రతిదినము శరీరమును కృశింపఁజేయుచున్న ఈ సేవ కారాగార రూపమున పరిణమించు చున్నది. అకటా! స్త్రీలను గాపాడు నుద్యోగము క్లేశకరమైనది గదా.

(ముందుకు నడచి) నియమవతియైన కాశీరాజ పుత్త్రిచే నిట్లాదేశింపఁబడితిని— వ్రతసంపాదనార్థము అభిమానము విడిచి నిపుణికా ముఖమున మహారాజుగారిని ఇదివఱకే యాచించి యుంటిని. అదే నా మాటగా విన్నవింపుము— అని. కనుక నిప్పుడు సంధ్యాకార్యము ముగించియున్న మహారాజును దర్శింతును. ( ముందుకు నడచి చూచి ) దివసావసానమున రాజమందిర మందలి దృశ్యము రమణీయముగా నున్నదిగదా! ఇక్కడ—

ఉత్కీర్ణా ఇవ వాసయష్టిషు నిశానిద్రాలసా బర్హిణో
ధూపైర్జాల వినిఃసృతై ర్వలభయః సందిగ్ధపారావతాః
ఆచార ప్రయతః సపుష్పబలిషు స్థానేషు చార్చిష్మతీః
సన్ధ్యా మఙ్గలదీపికా విభజతే శుద్ధాంత వృద్ధాజనః. 2

(నేపథ్యాభిముఖం దృష్ట్వా) అయే ఇతఏవ ప్రస్థితో దేవః.
పరిజనవనితా కరార్పితాభిః పరివృత ఏవ విభాతి దీపికాభిః
గిరిరివ గతిమానపక్షలోపా దనుతట పుష్పితకర్ణికారయష్టిః. 3

(తతః ప్రవిశతి యథా నిర్దిష్టో రాజా విదూషకశ్చ)

రాజా (ఆత్మగతమ్)
కార్యాంతరితోత్కణ్ఠం దినం మయానీత మనతి కృచ్ఛ్రేణ
అవినోద దీర్ఘయామా కథంను రాత్రిర్గమయితవ్యా. 4

---

* రాత్రి నిద్రచే అలసములైన యీ మయూరములు వాసయష్టులందు (గూటములందు) మలచబడిన బొమ్మలా యన్నట్లున్నవి. గవాక్ష రంధ్రములనుండి బయలు వెడలు ధూపములచేత మంజూరులందు పారావతములు సందేహావిషయము లగుచున్నవి. ఆచారశుద్ధమైన శుద్ధాంత వృద్ధ నారీజనము పువ్వులు బలులు ఉంచఁబడిన ప్రదేశము లందు వెలుగుచున్న సంధ్యామంగళ దీపికలను వేరు వేరుగా నుంచు చున్నది.

(తెరవైపు చూచి) ఓహో! ప్రభువు ఇటే వచ్చుచున్నాఁడు.

* పరిచారికల కరములందున్న దీపికలచే పరివేష్టితుఁడైన ఈయన తటములందు పుష్పించిన కర్ణికార వృక్షములు గలిగి, పక్షములు లోపించినందువల్ల గమనముగల గిరివలె భాసించుచున్నాడు
ఇంతలో యీయన దృష్టి పథమున నిల్చి యెదురు చూచుచుండును.

(అంతట నిర్దేశింపబడిన విధమున రాజు, విదూషకుడును ప్రవేశింతురు.)

రాజు: (తనలో)

* కార్యభారముచే ఉత్సుకతను మఱుగుపఱచిన యీ దినము స్వల్ప

కఞ్చుకీ : (ఉపగమ్య) జయతు జయతు దేవః. దేవ, దేవీ విజ్ఞాపయతి— మణిహర్మ్యపృష్ఠే సుదర్శనశ్చన్ద్రః. తత్ర సన్నిహితేన దేవేన ప్రతిపాలయితు మిచ్ఛామి యావత్ రోహిణీ సంయోగ ఇతి.

రాజా : ఆర్య లాతవ్య. విజ్ఞాప్యతాం దేవీ యథా తే ఛంద ఇతి.

కఞ్చుకీ : యదాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రాంతః)

రాజా : వయస్య! కిం పరమార్థత ఏవ దేవ్యా వ్రతనిమిత్తోఽయ మారమ్భః స్యాత్ ?

విదూషకః : భోః తర్కయామి జాతపశ్చాత్తాపా తత్రభవతీ వ్రతాపదేశేన భవతః ప్రణిపాతలంఘనం ప్రమార్ష్టుకామేతి.

రాజా : ఉపపన్నం భవానాహ. తథాహి.

---

కష్టముతో నాచే గడిపివేయఁబడినది. వినోదము లేమిచే దీర్ఘములగు యామములుగల రాత్రి ఎట్లు గడుపవలెనో ?

కంచుకి : (సమీపించి) దేవరకు జయము జయము. దేవా! దేవి విన్నవించుచున్నది—మణిహార్మ్యముమీద చంద్రుడు చక్కగా నగపడును. మహారాజుతోఁ గలిసి యచ్చట రోహిణీ సంయోగము వఱకు వేచియుండఁ గోరుచున్నాను-అని.

రాజు : ఆర్యలాతవ్య! 'నీ యిష్టము' అని దేవికి విన్నవింపుము.

కంచుకి. దేవర ఆజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును)

రాజు : వయస్య! ఈ ప్రయత్నము నిజముగా దేవి వ్రతము నిమిత్తమే కావచ్చునా ?

విదూ : పశ్చాత్తాపము పుట్టినదై యా పూజ్యురాలు వ్రతమను నెపమున పాదపతన తిరస్కార దోషమును బరిహరించు కొనఁ గోరుచున్నదని యూహించుచున్నాను.

రాజు : యుక్తమే చెప్పితివి నీవు. అట్లేకదా.

* ప్రణిపాతములను తిరస్కరించి తరువాత మనస్సులందు పశ్చాత్తాపము

అవధూత ప్రణిపాతాః పశ్చాత్సంతప్యమాన మనసోఽపి
నిభృతైర్వ్యగ్ర పత్రపత్తే దయితానునయైర్మనస్విన్యః 5

తదాదేశయ మణిహర్మ్యపృష్ఠ మార్గమ్.

విదూషకః : ఇత ఇతో భవాన్ అనేన గంగాతరంగ సశ్రీకేణ స్ఫటిక మణిసోపానేనారోహతు భవాన్ ప్రదోషావసర రమణీయం మణిహర్మ్యమ్.

రాజా : అరోహాగ్రతః! (సర్వే సోపానారోహణం నాటయన్తి)

విదూషకః : (నిరూప్య) భోః ప్రత్యాసన్నేన చంద్రోదయేన భవితవ్యమ్. యథా తిమిరరిచ్యమానం పూర్వదిశాముఖ మాలోకసుభగం దృశ్యతే.

రాజా : సమ్యగాహ భవాన్.

ఉదయగూఢ శశాఙ్క మరీచిభి
స్తమసి దూర మితః ప్రతిసారితే

---

నొందుచుండియు మానవతులు ప్రియులయొక్క గుప్తములైన యమన యములచేత లజ్జితలగుదురు.

కనుక మణిహర్మ్యము మీదికి దారితీయుము.

విదూ : ఇటు ఇటు. గంగాతరంగ సదృశమైన స్ఫటికశిలా సోపాన మార్గమున తాము సంధ్యా సమయావసాన రమణీయమైన ఈ మణిహర్మ్యమును ఆరోహింపవలెను.

రాజు : ముందు నీ వారోహింపుము.

(అందరును సోపానారోహణము నటింతురు)

విదూ : (నిరూపించి) ఓహో! చంద్రోదయము కావచ్చినట్లున్నది. చీకట్లు తొలగి పోవుచున్న పూర్వదిశాముఖము లోచన రమణీయముగా నగపడుచున్నది.

రాజు : చక్కగా చెప్పినావు నీవు.

* ఉదయాచలము మాటునయున్న చంద్రుని కాంతులచేత ఇటునుండి

అలకసంయమనాదివ లోచనే
హరతి మే హరివాహనదిఙ్ముఖమ్. 6

విదూషకః : హీహీ భోః ! ఏష ఖండ మోదకసశ్రీక ఉదితో రాజా ద్విజాతీనామ్.

రాజా : (సస్మితమ్) సర్వత్రౌదరిక స్యాభ్యవహార్యమేవ విషయః. (ప్రాఞ్జలిః ప్రణమ్య) భగవన్ క్షపానాథ !

రవిమావసతే సతాం క్రియాయై
సుధయా తర్పయతే సురాన్పితౄంశ్చ
తమసాం నిశి మూర్ఛతాం నిహన్త్రే
హరచూడానిహితాత్మనే నమస్తే. 7

(ఇత్యుపతిష్ఠతే)

విదూషకః : భో బ్రాహ్మణ సంక్రామితాక్షరేణ తే పితామహేనాభ్య

---

చీకటి దూరముగా తొలగింపఁబడినది కాఁగా, ముంగురులను దొలంగించినప్పుడువలె, పూర్వదిశా ముఖము నా నేత్రములను హరించుచున్నది.

విదూ : హీహీ ! ఓయి ! ఖండ మోదక సదృశుఁడైన చంద్రుఁడు ఇదుగో ఉదయించుచున్నాఁడు.

రాజు : తిండిపోతున కెల్లయెడల పిండివంటయే విషయము. (ప్రాంజలియై ప్రణమిల్లి) దేవా ! నిశాపతీ !

* సజ్జనుల ఇష్టికర్మ కొఱకు సూర్యునితో సంగతుఁడవు, దేవతలను పితృదేవతలను అమృతముచే తృప్తిపఱచువాఁడవు, నిశలందు వ్యాపించు చీకట్లను సంహరించువాఁడవు, శివుని చూడమునందుంచఁ బడిన స్వరూపము గలవాఁడవు అయిన నీకు నమస్కారము.

(అని ఆరాధించును)

విదూ : ఓయీ ! ఈ బ్రాహ్మణుని ముఖమున పలుకుచున్న నీ పితామహుని

నుజ్ఞాత ఆసనస్థితోభవ యావదహమపి సుఖాసీనో భవామి.

రాజా : (విదూషకవచనం పరిగృహ్యోపవిష్టః, పరిజనం విలోక్య) అభివ్యక్తాయాం చంద్రికాయాం కిం దీపికా పౌనరుక్త్యేన. తద్విశ్రామ్యంతు భవత్యః.

పరిజనః : యద్దేవ ఆజ్ఞాపయతి (ఇతి నిష్క్రాంతః)

రాజా : (చంద్రమసమవలోక్య) వయస్య పరం ముహూర్తా దాగమనం దేవ్యాః. తద్వివిక్తే కథయామి స్వా మవస్థామ్.

విదూషకః : నను దృశ్యత ఏవ సా. కింతు తాదృశమనురాగం ప్రేక్ష్య శక్యం ఖల్వాశాబంధేనాత్మానం ధారయితుమ్.

రాజా : ఏవమేతత్. బలవాన్ పునర్మమ మనసోఽభితాపః.

నద్యా ఇవ ప్రవాహో
విషమశిలాసంకట స్ఖలిత వేగః

---

చేత అనుజ్ఞాతుఁడ వైతివి కనుక ఈ యాసనమునఁ గూర్చుండుము. ఇంక నేనుగూడ సుఖముగాఁ గూర్చుండుదును.

రాజు : (విదూషక వచనము నంగీకరించి కూర్చుండి పరిజనము నవలోకించి) వెన్నెల విశదముగా ప్రకాశించుచుండగా ఈ దీపికా పునరుక్తి యేటికి ? కనుక మీరు విశ్రమింపవచ్చును.

పరిజనము : దేవర ఆజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును).

రాజు : (చంద్రునివంక చూచి) ఇంకొక్క ముహూర్తము గడచిన తరువాత దేవి వచ్చును. కనుక ఈ యేకాంతమున నా యవస్థ కొంచెము నీకు వినిపింతును.

విదూ : కనఁబడుచునే యున్నదిగదా. కాని ఆ విధమైన యనురాగమును జూచి యాశాబంధముచేత జీవితమును నిలుపుకొనవచ్చును.

రాజు : ఇది నిజమే. కాని నా మనస్తాపము మాత్రము తీవ్రముగనే యున్నది.

* విషమశిలా ప్రతిహత వేగమయిన నదీ ప్రవాహమువలె విరుద్ధ సమాగమ సుఖమైన కామము శతగుణము అగును.

విఘ్నిత సమాగమసుఖో
మనసిశయః శతగుణో భవతి. 8

విదూషకః : యథా పరిహీయమాణై రఙ్గై రధికం శోభసే తథాఽ
దూరే ప్రియాసమాగమం తే ప్రేక్షే.

రాజా : (నిమిత్తం సూచయిత్వా) వయస్య.

వచోభి రాశాజననై ర్భవానివ గురువ్యథమ్
అయం మాం స్పందితై ర్బాహురాశ్వాసయతి దక్షిణః. 9

విదూషకః : నఖల్వన్యథా బ్రాహ్మణస్య వచనమ్.

రాజా : (సప్రత్యాశ స్తిష్ఠతి)

(తతః ప్రవిశత్యాకాశయానే నాభిసారికావేషోర్వశీ చిత్రలేఖాచ)

ఉర్వశీ : (ఆత్మానం విలోక్య) హలా చిత్రలేఖే, అపిరోచతే తేఽయం

---

విదూ : కృశించుచున్న యంగములచే నీవు శోభిల్లుచుండుటను బట్టి నీకు ప్రియాసమాగమము అనతి దూరమందే కలదని యూహించుచున్నాను.

రాజు : (నిమిత్తమును సూచించుచు) వయస్య !

* అతి సంతప్తుడనైన నన్ను ఆశాజనకములైన వాక్కులచేత నీవు ఆశ్వాసించినట్లే స్పందితములచేత ఈ దక్షిణ బాహువు కూడ ఆశ్వాసించుచున్నది.

విదూ : బ్రాహ్మణుని వాక్కు అన్యథా కాదుసుమా !

రాజు : (ప్రత్యాశ గలవాఁడై యుండును.)

(అంతట అభిసారికా వేషయైన ఉర్వశియు, చిత్రలేఖయు ఆకాశయానమున ప్రవేశింతురు.)

ఉర్వశి : (తన్ను జూచుకొని) చెలీ చిత్రలేఖా ! అల్పములయిన యాభరణ

మేఽల్పాభరణ భూషితో నీలాంశుక పరిగ్రహోఽభిసారికా వేషః.

చిత్రలేఖా : నాస్తి మే వాగ్విభవః ప్రశంసితుమ్. ఇదంతు చింత యామి అపినామాహం పురూరవా భవేయమితి.

ఉర్వశీ : సఖి మదనః ఖలు త్వ మాజ్ఞాపయతి - శీఘ్రం నయ మాం తస్య సుభగస్య వసతిమ్.

చిత్రలేఖా : నన్వేతత్పరివర్తిత మివ కైలాస శిఖరం ప్రియతమస్య తే భవనముపగతే స్వః.

ఉర్వశీ : తేనహి ప్రభావాజ్ఞానీహి తావత్క్వ స మమ హృదయ చోరః కిం వానుతిష్ఠతీతి.

చిత్రలేఖా : (ధ్యాత్వా, ఆత్మగతమ్) భవతు క్రీడిష్యామి తావ దేతయా. (ప్రకాశమ్) హలా ఏష మనోరథలబ్ధ ప్రియా సమాగమ సుఖ మనుభవ న్నుపభోగక్షమేఽవకాశే తిష్ఠతి.

---

ములు దాల్చి, నీలాంశుకము ధరించిన నా యీ యభిసారికా వేషము నీకు రుచించుచున్నదా ?

చిత్ర : ప్రశంసించుటకు నాకు వాక్సంపద లేదు. నే నే పురూరవుడ నైతినా యని మాత్ర మనిపించుచున్నది.

ఉర్వశి : సఖి ! కాముఁడే యాజ్ఞాపించుచున్నాఁ డనుకో. నన్ను ఆ సుందరుని మందిరమునకు శీఘ్రమే తీసికొనిపో.

చిత్ర : రూపాంతరము పొందిన కైలాస శిఖరమా యన్నట్లున్న నీప్రియతముని భవనమును ఇదిగో చేరవచ్చితిమిగదా.

ఉర్వశి : అందుకే నా హృదయచోరుఁడు ఎక్కడ మన్నాడో, ఏమి చేయు చున్నాడో నీ ప్రభావమువల్ల తెలిసికో.

చిత్ర : (ధ్యానించి, తనలో) కానిమ్ము. కొంచె మీమెతో పరిహాసమాడుదును. (పైకి) చెలీ ! ఈయన సంకల్ప మాత్ర లబ్ధయైన ప్రియురాలితోడి

ఉర్వశీ : (విషాదం నాటయతి)

చిత్రలేఖా : ముగ్ధే కా పునరన్యా చింతా ప్రియాసమాగమస్య,

ఉర్వశీ : (సోచ్ఛ్వాసమ్) అదక్షిణం సందిగ్ధే మే హృదయమ్.

చిత్రలేఖా : (విలోక్య) ఏష మణిహర్మ్యగతో వయస్యమాత్ర సహాయో రాజర్షిః. తదేహి. ఉపసర్పావ ఏనమ్.

(ఉభే అవతరతః)

రాజా : వయస్య రజన్యాసహ విజృమ్భతే మదనబాధా.

ఉర్వశీ : అనిర్భిన్నార్థేనానేన వచనేనాకమ్పితం మమ హృదయమ్. అంతరితే ఏవ శృణువోఽస్య స్వైరాలాపం యావదావయోః సంశయచ్ఛేదో భవతి.

---

సమాగమ సుఖము ననుభవించుచు సంభోగ యోగ్యమైన స్థానమునందున్నాఁడు.

ఉర్వశి : (విషాదము నభినయించును)

చిత్ర : బేలా ! ప్రియాసమాగమ చింత అన్యమింకేమున్నది ?

ఉర్వశి : (నిట్టూర్చి) సంధిగ్ధమైన విషయమున నా హృదయము అనుదారమైనది.

చిత్ర: (చూచి) వయస్యమాత్రసహాయుడై యిదుగో రాజర్షి ఈ మణిమందిరమునందున్నాడు. కనుక ఈయనను సమీపింతము రమ్ము.

(ఇరువురును క్రిందికి దిగుచున్నారు.)

రాజు : వయస్య ! రాత్రితోపాటు ఈ మదనబాధయు విజృంభించుచున్నది.

ఉర్వశి : అస్పష్టార్థమైన ఈ మాటచేత నా హృదయము మిక్కిలి కంపించుచున్నది. మన సంశయము విచ్ఛిన్న మగునంత వఱకును అదృశ్యలమై యుండియే ఈయన స్వచ్ఛంద భాషణములను విందము.

చిత్రలేఖా : యత్తే రోచతే.

విదూషకః : నన్వేతేఽమృతగర్భాః సేవ్యన్తాం చంద్రపాదాః.

రాజా : వయస్య ఏవమాదిభిరనుపక్రమ్యోఽయమాతంకః. పశ్య—

కుసుమశయనం న ప్రత్యగ్రం న చంద్రమరీచయో
నచ మలయజం సర్వాఙ్గీణం నవా మణియష్టయః
మనసిజరుజం సావా దివ్యా మమాలమపోహితుమ్-

ఉర్వశీ : కావాపరా?

రాజా :

రహసి లఘయేదారబ్ధా వా తదాశ్రయిణీ కథా. 10

ఉర్వశీ : హృదయ, ఇదానీం మామ్ముజ్ఝిత్వైతః సంక్రాంతేన త్వయా ఫలముపలబ్ధమ్.

విదూషకః : ఆమ. అహమపి యదా శిఖరిణీం రసాలంచ నలభే

---

చిత్ర : నీ కిష్టమైనట్లే.

విదూ : అమృత గర్భములైన యీ చంద్రకిరణములను సేవింపరాదా?

రాజు : వయస్య! ఇట్టి వానిచేత కుదురునదికాదు ఈ వ్యాధి. చూడు—

* ప్రత్యగ్ర కుసుమ శయనము కాదు, చంద్ర కిరణములు కావు, సర్వాంగీణమైన చందన చర్చ కాదు, మణిహారములును కావు. నా మదన జ్వరమును ఆ దివ్యాంగన మాన్పగలదు. లేదా—

ఉర్వశి : లేదా మఱి యింకెవ్వతె?

రాజు :

* ఏకాంతమందలి తత్సంబంధియైన కథాప్రసంగము కొంత తగ్గించ గలదు.

ఉర్వశి : హృదయమా! నన్ను విడిచి యీయనయందు లగ్నమైన నీకు ఇప్పుడు తగిన ఫలము లభించినది.

విదూ : అవును. నేనుగూడ శిఖరిణి, రసాలము లభింపనప్పుడు వానినే

తదైతత్ప్రార్థయమానః సంకీర్తయ న్నాశ్వసిమి.

రాజా : సంపద్యత ఇదం భవతః.

విదూషకః : భవానపి తామచిరేణ ప్రాప్స్యతి.

రాజా : సఖే, ఏవం మన్యే—

చిత్రలేఖా : శృణు అసంతుష్టే శృణు.

విదూషకః : కథమివ

రాజా :

అయం తస్యా రథక్షోభా దంసేనాంసో నిపీడితః
ఏకః కృతీ శరీరేఽస్మిన్ శేషమఙ్గం భువో భరః. 11

చిత్రలేఖా : సఖి కిమిదానీం విలమ్బ్యతే.

ఉర్వశీ : (సహసోపసృత్య) హలా అగ్రతోఽపి మమ గతాయా ఉదాసీన ఇవ మహారాజః.

---

స్మరించుకొనుచు ఊరట పొందుచుందును.

రాజు : ఇది నీకు తీరునది.

విదూ : నీవుకూడ ఆమెను త్వరలోనే పొందఁగల్గవు

రాజు : సఖుఁడా ! ఇట్లను కొందును-

చిత్ర : విను అసంతుష్టురాలా ! విను.

విదూ : ఎట్లో ?

రాజు :

* రథము కుదుపువల్ల ఆమె భుజముతో ఒరసికొన్న యీ భుజమొక్కటే ఈ శరీరమున చరితార్థమైనది. మిగిలిన శరీరమంతయు భూమికి కేవలము భారమైనది.

చిత్ర : సఖి ! ఇంక నిప్పుడు విలంబన మేల ?

ఉర్వశి : (వెంటనే సమీపించి) చెలీ ! ఎదుట బడినప్పటికిని నాయందు మహారాజు ఉదాసీనుడుగా నున్నాడు.

చిత్రలేఖా : (సస్మితమ్) అతి త్వరితే అనుతిష్ఠ త్తిరస్కరిణీకాసి
(నేపథ్యే) ఇతో ఇతో భర్త్రీ).
(సర్వే కర్ణందదతి. ఉర్వశీ సహసఖ్యా విషణ్ణా)
విదూషకః : అవిహా అవిహా ఉపస్థితాదేవీ. తద్వాచంయమోభవ
రాజా : భవానపి సంవృతాకారమాస్తామ్.
ఉర్వశీ : హలా కిమత్ర కరణీయమ్.
చిత్రలేఖా : అలమావేగేన అంతర్హితే ఆవామ్. ఉపవాస నియమ వేషా రాజర్షిమహిషీ దృశ్యతే. తన్నైషా చిరంస్థాస్యతి.
(తతః ప్రవిశతి ఔపహారికహస్తపరిజనా దేవీ)
దేవీ : (చంద్రమస మవలోక్య) హాఞ్జే నిపుణికే ఏష రోహిణీ

---

చిత్ర : (చిఱునవ్వుతో) అతి త్వరలో తిరస్కరిణిని తొలగింప వైతివిగదా.
(తెరలో)
ఇటు ఇటు మహారాణీ !

(అందఱును చెవి యొగ్గుదురు. ఉర్వశి చెలికత్తెతోపాటు విషణ్ణయగును)

విదూ ; అయ్యో అయ్యో ! దేవి ఆసన్నయైనది. కనుక మౌనము వహింపుము.

రాజు : నీవుకూడ బయటఁ బడఁగూడదు.

ఉర్వశి : చెలీ ! ఇప్పుడు కర్తవ్య మేమిటి ?

చిత్ర : భయ మక్కఱలేదు. మనము అంతర్హితలమే. రాజర్షి పట్టపురాణి ఉపవాస నియమవేషగా కనఁబడుచున్నది. కనుక ఈమె ఎక్కువసేపిచ్చట నుండఁబోదు.

(అంత ఉపహార ద్రవ్యములను చేతఁ దాల్చిన పరిజనముతోఁ గూడినదై మహారాణి ప్రవేశించును.)

దేవి : (చంద్రుని వంకఁ జూచి) ఓసి నిపుణికా ! భగవంతుఁడైన ఈ మృగ

సంయోగేనాధికం శోభతే భగవాన్మృగలాఞ్ఛనః.

చేటీ : నను దేవీసహితో భర్తా విశేష రమణీయః. (ఇతిపరిక్రామతః)

విదూషకః : (దృష్ట్వా) భో న జానామి స్వస్తివాచనం మే దదా తీతి. అథవా భవతో వ్రతవ్యపదేశేన ముక్తరోషా ప్రణి పాతలఙ్ఘనం ప్రమార్ష్టుకామేతి. అద్య మమాక్ష్ణోః శుభ దర్శనా దేవీ.

రాజా : (సస్మితమ్) ఉభయమపి ఘటతే. తథాపి భవతా యత్పశ్చా దభిహితం తన్మాం ప్రతిభాతి. యదత్రభవతీ-

సితాంశుకా మఙ్గలమాత్రభూషణా
పవిత్ర దూర్వాఙ్కుర లాఞ్ఛితాలకా
వ్రతాపదేశోజ్ఝిత గర్వవృత్తినా
మయి ప్రసన్నా వపుషేవ లక్ష్యతే. 12

---

లాంఛనుఁడు రోహిణీ సంయోగముచే అధికముగా శోభిల్లుచున్నాఁడు.

నిపుణిక : దేవీ సహితుఁడైన ప్రభువు విశేషరమణీయుడు కాఁడా ! (అని ముందుకు నడతురు)

విదూ : ఓయి ! నాకు స్వస్తివాచన మొసంగుననియో, లేక మఱి వ్రతమున్న మిషచేత కోపము విడిచినదై నీ ప్రణిపాత తిరస్కారమును పరిహ రించుకొనఁ గోరుచున్నదనియో నేనెఱుఁగను గాని మహారాణి నా కన్నుల కిప్పుడు చూడముచ్చటగా నున్నది.

రాజు : (చిఱునవ్వుతో) రెండును కావచ్చును. ఐనను నాకు మాత్రము నీవు తరువాత చెప్పినదే తోఁచుచున్నది. ఏలన ఈమె-

* తెల్లని వస్త్రము దాల్చి, మాంగల్య సూచకములైన యలంకరణ ములను మాత్రమే ధరించి, పవిత్రమైన దూర్వాంకురమును ముంగురులం దలంకరించుకొని, వ్రతమనెడు నెపమున విడిచిపెట్టఁ బడిన గర్వవృత్తి గల ఆకారముతో నాయందు ప్రసన్నురా లయినదా యన్నట్లు కనఁబడుచున్నది.

దేవీ : (ఉపగమ్య) జయతు జయత్వార్యపుత్రః.

పరిజనః ; జయతు జయతు భర్తా.

విదూషకః : స్వస్తి భవత్యై

రాజా : స్వాగతం దేవ్యై. (తాం హస్తేన గృహీత్వోపవేశయతి)

ఉర్వశీ : హాలా స్థానే ఖల్వియం దేవీశబ్దేనోపచర్యతే. న కిమపి పరిహీయతే శచ్యా ఓజస్వితయా.

చిత్రలేఖా : సాధు అసూయా పరాఙ్ముఖం మంత్రితమ్.

దేవీ : ఆర్యపుత్రం పురస్కృత్య కోఽపి వ్రతవిశేషో మయా సంపాదనీయః. తన్ముహూర్త ముపరోధః సహ్యతామ్

రాజా : మామైవమ్. అనుగ్రహః ఖలు నోపరోధః.

విదూషకః : ఈదృశః స్వస్తివాచనవానుపరోధో బహుశో భవతు.

---

దేవి : ఆర్య పుత్రునకు జయము జయము.

పరిజనము : మహారాజునకు జయము జయము.

విదూ : పూజ్యురాలవైన నీకు స్వస్తి.

రాజు : దేవికి స్వాగతము.

(ఆమెను చేతితో పట్టుకొని కూర్చుండఁబెట్టును)

ఉర్వశి : చెలీ! ఈమె దేవీశబ్దముచే సమ్మానింపఁబడుట యుక్తమే. తేజస్విత చేత ఈమె శచీదేవి కెంతమాత్రమును తీసిపోదు.

చిత్ర : మేలు. అసూయపడకుండ పలికితివి.

దేవి : ఆర్యపుత్రుని పురస్కరించుకొని నేనొక వ్రతము ననుష్ఠింపవలసి యున్నది. కనుక ఒక క్షణము ఈ ప్రతిబంధమును సహింపవలెను.

రాజు : అట్లు కాదు. ఇది నిజముగా అనుగ్రహమే, ప్రతిబంధము కాదు.

విదూ : ఇటువంటి స్వస్తి వాచన వంతమైన ప్రతిబంధము పెక్కు పర్యాయములు జరుగుఁగాక !

రాజా : కిం నామధేయ మేతద్దేవ్యా వ్రతమ్.

దేవీ : (నిపుణికా మవేక్షతే)

నిపుణికా : భర్తః, ప్రియాను ప్రసాదనం నామ.

రాజా : (దేవీం విలోక్య) యద్యేవమ్.

అనేన కళ్యాణి మృణాలకోమలం
వ్రతేన గాత్రం గ్లపయస్యకారణమ్
ప్రసాద మాకాంక్షతి య స్త్వదుత్సుకః
స కిం త్వయా దాసజనః ప్రసాద్యతే. 18

ఉర్వశీ : మహోన్నత్వస్యైతస్యాం బహుమానః.

చిత్రలేఖా : అయి ముగ్ధే అన్యసంక్రాంత ప్రేమాణో నాగరికా అధికం దక్షిణా భవన్తి.

దేవీ : (సస్మితమ్) నన్వేతస్య వ్రతపరిగ్రహస్యాయం ప్రభావో యదే

---

రాజు : దేవి యొక్క ఈ వ్రతము పేరేమి ?

దేవి : (నిపుణికవంక చూచును.)

నిపు : మహారాజా! ప్రియాను ప్రసాదనము అని.

రాజు : (మహారాణిని చూచి) అట్లయినచో-

* ఓ కల్యాణి! మృణాలకోమలమైన నీ శరీరమును ఈ వ్రతముచేత నిష్కారణముగా శ్రమ పెట్టుచున్నావు. ఉత్కంఠితుఁడై యెవ్వఁడు నీ ప్రసాదమును కాంక్షించు చున్నాడో ఆ దాసుని నీవు ప్రసన్నుని గావించుకోవలెనా ?

ఉర్వశి : ఈమె యందీయన యాదర మెంతో గొప్పదిగదా !

చిత్ర : ఓసిబేలా ! అన్యస్త్రీల యందనురక్తులైన నాగరికులు ఎంతో దయ గల వారుగా నుందురు.

దేవి : (చిఱునవ్వుతో) అర్యపుత్రుకు తీ మాత్రము పలుకుట యీ వ్రతాచరణ

తావన్మంత్రిత ఆర్యపుత్రః.

విదూషకః : విరమతు భవాన్. నయుక్తం సుభాషితం ప్రత్యాచరితుమ్.

దేవీ : ధారికా ఉపనయ తౌపహారికం యావన్మణిహర్మ్య గతాన్ చంద్రపాదా నర్చామి.

పరిజనః : యద్దేవ్యాజ్ఞాపయతి. ఏష గంధ కుసుమాద్యుపహారః.

దేవీ : (నాట్యేన గంధపుష్పాదిభిశ్చంద్రపాదా నభ్యర్చ్య) హంజ్జే, ఏతానౌపహారిక మోదకా నార్యమాణవకం లమ్భయ.

పరిజనః; యద్దేవ్యాజ్ఞాపయతి. ఆర్యమాణవక ఏతత్తావత్తే.

విదూషకః : (మోదకశరావం గృహీత్వా) స్వస్తి భవత్యై. బహుఫలస్తవోపవాసో భవతు.

దేవీ : ఆర్యపుత్ర ఇతస్తావత్.

---

మునకు ఫలమేకదా !

విదూ. నీ వూరకుండుము. సుభాషితమును ప్రత్యాఖ్యానించుట యుక్తము కాదు.

దేవి : కన్నెలారా ! పూజాసామగ్రిని ఇటుతెండు, మణిమందిరము మీఁది చంద్రకిరణములను అర్చింతును.

పరిజనము : దేవి యాజ్ఞాపించినట్లే. ఇదిగో గంధకుసుమాది పూజాసామగ్రి.

దేవి ; (నాట్యముతో గంధపుష్పాదులచే చంద్రకిరణముల నర్చించి) ఓసి ! ఈ నైవేద్య మోదకములను ఆర్యమాణవకున కిండు.

పరిజనము : దేవి యాజ్ఞాపించినట్లే. ఆర్యమాణవక ! ఇఁక నిది నీది.

విదూ : (మోదక పాత్రమును గ్రహించి) పూజ్యురాలవైన నీకు స్వస్తి. నీ యుపవాసము బహుఫలమగుఁగాక !

దేవి : ఆర్యపుత్ర ! కొంచెమిటు.

రాజా : అయమస్మి.

దేవీ : (రాజ్ఞః పూజా మభినీయ ప్రాఞ్జలిః ప్రణిపత్య) ఏషాహం దేవతామిథునం రోహిణీమృగలాఞ్ఛనం సాక్షీకృత్య ఆర్య పుత్రమనుప్రసాదయామి. అద్యప్రభృతి యాంస్త్రియమార్య పుత్రః ప్రార్థయతే యాచార్యపుత్రస్య సమాగమప్రణయినీ తయాసహ మయా ప్రీతిబన్ధేన వర్తితవ్యమితి.

ఉర్వశీ : అహో న జానే కిం పర మస్యా వచనమితి. మమపునర్విశ్వాస విశదం హృదయం సంవృత్తమ్.

చిత్రలేఖా : సఖి మహానుభావయా పతివ్రతయాఽభ్యనుజ్ఞాతో అనం తరాయస్తే ప్రియసమాగమో భవిష్యతి.

విదూషకః : (అపవార్య) ఛిన్నహస్తో మత్స్యే పలాయితే నిర్విణ్ణో ధీవరో భణతి ధర్మో మే భవిష్యతీతి. (ప్రకాశమ్) భవతి కిం తాదృశః ప్రియస్తత్రభవాన్.

---

రాజు : ఇదిగో వచ్చితిని

దేవి : (రాజును పూజించుట నభినయించి అంజలించి నమస్కరించి) ఇదే నేను దేవతాదంపతులైన రోహిణీ మృగలాంఛనులను సాక్షీకరించి ఆర్య పుత్రుని ప్రసన్నుని గావించు కొనుచున్నాను-"ఇది మొదలు ఏస్త్రీని ఆర్యపుత్రుఁ డభిలషించునో, ఏ స్త్రీ ఆర్యపుత్రుని యొక్క పొందు కోరునో ఆమెతో నేను బద్ధస్నేహముతో ప్రవర్తింతును"- అని.

ఉర్వశి : అహో ! ఈమె వాక్యము దేని నుద్దేశించినదో తెలియఁజాలకున్నాను. నా హృదయము మాత్రము విశ్వాసముచే తేరుకొన్నది.

చిత్ర : సఖి ! మహానుభావురాలైన యీ పతివ్రత చేత అంగీకృతమైన నీ ప్రియసమాగమము నిరంతరాయము కాఁగలదు.

విదూ : (అపవారించి) చేప తప్పించుకొనిపోగా హతాశుఁడైన చేపలవాఁడు 'నాకు పుణ్యము కలుగుమలె' మ్మని పలుకును (పైకి) పూజ్యు రాలా ! మహారాజు నీకు అంత యిష్టుఁడా యేమి ?

దేవీ : మూఢ అహం ఖల్వాత్మనః సుఖావసానే నార్యపుత్రం నిర్వృత శరీరం కర్తుమిచ్ఛామి. ఏతావతా చింఽయ తావత్ప్రియో నవేతి.

రాజా :

దాతుం వా ప్రభవసి మామన్యస్యై హర్తుమేవ వా దాసమ్
నాహం పునస్తథా త్వం యథాహి మాం శఙ్కసే భీరు. 14

దేవీ : భవవా మా వా. యథానిర్దిష్టం సంపాదితం ప్రియాను ప్రసాదనం వ్రతమ్. దారికా ఏత గచ్ఛామః (ఇతి ప్రస్థితా)

రాజా : ప్రియే నఖలు ప్రసాదితోఽస్మి యది సమ్ప్రతి విహాయ గమ్యతే.

దేవీ : ఆర్యపుత్ర అలఙ్ఘితపూర్వో మయా నియమః.

(ఇతి సపరివారా నిష్క్రాంతా).

---

దేవి : మూఢుఁడా! స్వసుఖమును త్యజించి నేనే ఆర్యపుత్రుని స్వస్థ శరీరుని గావింప గోరుచున్నాను సుమా. దీనిచే నీవే ఆలోచించు కొనుము అంత ఇష్టుఁడో, కాఁడో.

రాజు :

* దాసుఁడనైన నన్ను అన్యకాంత కిచ్చుటకుఁగాని హరించుటకుఁగాని నీవు సమర్థురాలవు. కాని భీరురాలా! ఎట్లని నీవు నన్ను శంకించుచున్నావో అట్లు మాత్రము నేను కాను.

దేవి : కమ్మ, కాకపొమ్మ. ప్రియాను ప్రసాదన వ్రతము యథావిధిగా అనుష్ఠింపఁబడినది. కన్నెలారా! రండు పోదము. (అని బయలు దేరును)

రాజు : ప్రియా! ఇప్పుడు విడిచిపోయితివేని నేను ప్రసన్నుఁడను కాను సుమా.

దేవి : ఆర్యపుత్ర! నేను నియమము నెన్నడును ఉల్లంఘించి యెఱుఁగను.

(అని పరివారయై నిష్క్రమించును)

ఉర్వశీ : హలా ప్రియకలత్రో రాజర్షిః నపున ర్హృదయం నివర్త యితుం శక్నోమి.

చిత్రలేఖా : కిం పున స్త్వయా నిరాశయా నివర్త్యతే.

రాజా : (ఆసనము పేత్య) వయస్య నఖలుదూరం గతా దేవీ.

విదూషకః : భణ విశ్రబ్ధా యదసి వక్తుకామః. అసాధ్య ఇతి వైద్యే నాతుర ఇవ స్వైరం ముక్తో భవాం స్తత్రభవత్యా.

రాజా : అపినా మోర్వశీ-

ఉర్వశీ : అద్య కృతార్థా భవేత్

రాజా :

గూఢా నూపుర శబ్ద మాత్రమపి మే కాంతా శ్రుతౌ పాతయేత్
పశ్చా దేత్య శనైః కరామ్బుజవృతే కుర్వీత వా లోచనే

---

ఉర్వశి : చెలీ ! ఈ రాజర్షి భార్యానురక్తుఁడు. అయినను మనస్సు నేమో మరలించుకొనఁజాలకున్నాను.

చిత్ర : మఱి నిరాశచే మరలిపోదువా యేమి ?

రాజు : (ఆసనమును చేరి) వయస్య! దేవి దూరము పోలేదను కొందును.

విదూ : చెప్పఁగోరినదానిని నిర్భయముగాఁ జెప్పుము. వైద్యునిచేత కుదుర్ప రానివాఁడని విడువఁబడిన రోగివలె పూజ్యురాలిచేత నీవు స్వేచ్ఛగా విడిచిపెట్టఁ బడితివి.

రాజు : ఉర్వశియే (గనుక)

ఉర్వశి : ఇప్పుడు కృతార్థురాలగు గాక !

రాజు :

* అదృశ్యయై నూపుర శబ్దమునైనను నా చెవిని పడవేయవలెనని, లేదా వెనుకగా వచ్చి మెల్లగా నాకన్నులను తన కరాంబుజముల చేత కప్పవలెనని, లేదా ఈ హర్మ్యము మీఁద దిగి భయమువలన

హార్ద్యేస్మిన్నవతీర్య పార్శ్వసవశాన్మంరాయ మాహా బలా
దాసీమేత పరాత్పరం చతురయా సఖ్యామమోహాన్త్రికమ్

ఉర్వశీ: హలా ఇమం తావదస్య మనోరథం సంపాదయిష్యామి.

(పృష్ఠతో గత్వా రాజ్ఞో నయనే సంవృణోతి)

చిత్రలేఖా: (విదూషకం సంజ్ఞాపయతి)

రాజా: (స్పర్శం రూపయిత్వా) సఖే నారాయణోరుసంభవా సేయం వరోరూః.

విదూషకః: కథం భవానవగచ్ఛతి.

రాజా: కిమత్ర జ్ఞేయమ్

అఙ్గమనఙ్గక్లిష్టం సుఖయేదన్యా న మే కరస్పర్శాత్
నోచ్ఛ్వసితి తపనకిరణైశ్చన్ద్రస్యేవాంశుభిః కుముదమ్ 16

ఉర్వశీ: (హస్తావపనీయ కించిదుపసృత్య) జయతుజయతు మహారాజః

---

కదలజాలనిదై చతురమైన సఖిచేత అడుగువెంట అడుగుగా బలవంతముగా నా చెంతకు తీసికొని రాఁబడవలెనని (అభిలషించుచున్నాను)

ఉర్వశి: చెలీ! ఇప్పుడీయన యీ యభిలాషను తీర్తును.

(వెనుకఁగా బోయి రాజు కన్నులను మూయును)

చిత్ర: (విదూషకునకు సంజ్ఞ చేయును)

రాజు: (స్పర్శను నిరూపించుచు) సఖుఁడా! ఈ సుందరి ఆ నారాయణోరుసంభవయే.

విదూ: నీ వెట్లు తెలిసికొంటివి?

రాజు: ఇందు తెలియరానిదే మున్నది?

* అనంగపీడితమైన నా శరీరమును కరస్పర్శమాత్రమున అన్యస్త్రీ యెవ్వతెయు సుఖపెట్టఁజాలదు. చంద్రుని కిరణములచేత వలె తపనుని కిరణములచేత కుముదము వికసింపదుగదా.

ఉర్వశి: (చేతులు తీసి కొంచెము తొలఁగి) మహారాజునకు జయము, జయము.

రాజా: సుందరి స్వాగతమ్ (పార్శ్వాసన ఉపవేశయతి)

చిత్రలేఖా: అపి సుఖం వయస్యస్య.

రాజా: నన్వేతదుపపన్నమ్.

ఊర్వశీ: హలా దేవ్యా దత్తో మహారాజః. అతోఽస్య ప్రణయవతీవ శరీర సంసర్గం గతాస్మి. మా ఖలు మాం పురోభాగినీం సమర్థయస్వ.

విదూషకః: కథమిహైవ యువయో రస్తమితః సూర్యః

రాజా: (ఊర్వశీ మవలోక్య)

దేవ్యా దత్త ఇతి యది వ్యాపారం వ్రజతి మే శరీరేఽస్మిన్
ప్రథమం కస్యానుమతే చోరితం మే త్వయా హృదయమ్

చిత్రలేఖా: వయస్యే నిరుత్తరైషా సాంప్రతం మమ విజ్ఞాప్యం శ్రూయతామ్

---

రాజు: సుందరీ! స్వాగతము (తన యాసనమున ప్రక్కనుండబెట్టుకొనును)

చిత్ర: (మా) మిత్రులకు సుఖమేకద?

రాజు: ఇదిగో ఇప్పుడు లభించినది కదా.

ఊర్వశి: చెలీ! మహారాజు దేవిచే నాకర్పింపబడినాడు కనుకనే ప్రణయిని వలె నేనీయన శరీరసంపర్కము పొందితిని. నన్ను స్వతంత్రించిన దానినిగా భావింపకుము సుమా.

విదూ: మీ కిరువురకు ఇచ్చటనే సూర్యుడస్తమించెనా యేమి?

రాజు: (ఊర్వశిని చూచి)

• దేవిచే సమర్పింపబడితినని నీవు నా యీ శరీరముతో వ్యవహరించు చున్నట్లయితే అంతకు ముందు ఎవరి యనుమతిపై నీవు నా హృదయము నపహరించితివి?

చిత్ర: మిత్రమా! ఈమె నిరుత్తర. ఇప్పుడు నేను విన్నవింపునది వినవలెను.

రాజా : అవహితోఽస్మి.

చిత్రలేఖా : వసంతానంతర ముష్ణసమయే భగవాన్ సూర్యో మయో పచరితవ్యః. తద్యథేయం మే ప్రియసఖీ స్వర్గస్యనోత్కణ్ఠతే తథా వయస్యేన కర్తవ్యమ్.

విదూషకః : భవతి కిం వాసర్గే స్మర్తవ్యమ్. నవాఽశ్యతే నవా పీయతే కేవల మనిమిషైర్నయనైర్మీనా విడమ్బ్యన్తే.

రాజా : భద్రే !

అనిర్దేశ్య సుఖః స్వర్గః కస్తం విస్మారయిష్యతి
అనన్యనారీసామాన్యోదాసస్త్వస్యాః పురూరవాః. 18

చిత్రలేఖా : అనుగృహీతాస్మి. హలా ఉర్వశి అకాతరా భూత్వా విసర్జయ మామ్.

ఉర్వశీ : (చిత్రలేఖాం పరిష్వజ్య) సఖి మాఖలు మాం విస్మర.

---

రాజు : సావధానుఁడనై యున్నాను.

చిత్ర : వసంతము తరువాత గ్రీష్మమున నేను సూర్య భగవానుని సేవింప వలసియున్నది. కనుక ఏ విధముగా నీమె స్వర్గమును గూర్చి ఉత్కంఠపడకుండునో ఆ విధముగా మిత్రులైన తాము చేయవలసి యున్నది.

విదూ. పూజ్యురాలా ! స్మరింపఁదగినది స్వర్గము నందేమున్నది ? తినుట యూ లేదు, త్రాగుటయూ లేదు. కేవలము అని మిషములైన కన్ను లతో చేపలవలె ఉండవలెను.

రాజు : భద్రా !

* స్వర్గము అనిర్వచనీయ సుఖస్థానము. దానినెవ్వఁడు మఱపింపఁ గలఁడు ? కాని పురూరవుఁడీమెకు అనన్య నారీసాధారణుఁడైన దాసుఁడు.

చిత్ర : అనుగ్రహింపఁబడితిని. చెలి! ఉర్వశి' ధీరురాలవై నన్ను పోనిమ్ము.

ఉర్వశి : (చిత్రలేఖను కౌఁగిలించుకొని) సఖి ! నన్ను విస్మరింపకు సుమా.

చిత్రలేఖా : (సస్మితమ్) వయస్యేన సంగతా త్వమేవైతన్మయా యాచితవ్యా (ఇతిరాజానం ప్రణమ్య నిష్క్రాంతా)

విదూషకః : దిష్ట్యా మనోరథసంపత్త్యా వర్ధతే భవాన్.

రాజా : ఇయం తావద్వృద్ధిర్మమ. పశ్య.

సామంతమౌళి మణిరఞ్జిత శాసనాఙ్క
మేకాతపత్ర మవనేర్నతథా ప్రభుత్వమ్
అస్యాః సఖే చరణయో రహమద్య కాంత
మాజ్ఞాకరత్వ మధిగమ్య యథాకృతార్థః. 12

ఉర్వశీ : నాస్తిమే విభవోఽతః ప్రియతరం మన్త్రయితుమ్.

రాజా : (ఉర్వశీం హస్తేనావలమ్బ్య) అహో విరుద్ధార్థ సంపాదయితేప్సితలాభో నామ.

పాదాస్త ఏవ శశినః సుఖయన్తి గాత్రం
బాణాస్త ఏవ మదనస్య మమానుకూలాః

---

చిత్ర. (చిఱునవ్వుతో) ఈ మిత్రునితోఁగూడియున్న నిన్నే నేనిది కోరవలసి యున్నది. (అని రాజునకు ప్రణమిల్లి నిష్క్రమించును).

విదూ : అదృష్టవశమున నీవు మనోరథ లాభముచే వర్ధిల్లుచున్నావు.

రాజు : నాకు వృద్ధియనఁగా నీ మెయే చూడు –

* సఖుఁడా ! నేనీనాఁడు ఈ మెపాదములచెంత మనోహరమైన పరిచారకత్వమును పొంది యెంతకృతార్థుఁడనైతినో, సామంతుల శిరస్సులందలి మణులచే రంజితమైన శాసన చిహ్నముగల ఏకచ్ఛత్రమైన యవనీ ప్రభుత్వమును పొంది యంతధన్యుఁడను కాలేదు.

ఉర్వశీ : ఇంతకంటె ప్రియతరముగా చెప్పుటకు నాకు శక్తి లేదు.

రాజు : (ఉర్వశిని చేతిలో పట్టుకొని) ఆహా ! ఈ ప్సితలాభము విపరీత కార్య కారియగుట ఎంత విచిత్రము !

అవియే చంద్రకిరణములు (కాని) శరీరమును సుఖపెట్టుచున్నవి.
అవియే మదన బాణములు (కాని) వాకిప్పు డనుకూలములగు

పంరంభరూఢమివ సుందరి యద్వ్యదాసీ
త్త్వత్సంగమేన మమ తత్తదివానునీతమ్. 20

ఉర్వశీ : అపరాద్ధాస్మి చిరకారికా మహారాజస్య.

రాజా : మా మైవమ్.

యదేవోపనతం దుఃఖాత్సుఖం తద్రసవత్తరమ్
నిర్వాణాయ తరుచ్ఛాయా తప్తస్య హి విశేషతః 21

విదూషకః : భోః సేవితాః ప్రదోష రమణీయాః శ్చన్ద్రపాదాః. సమయః ఖలు తే వాసగృహ ప్రవేశస్య.

రాజా : తేన హి సఖ్యాస్తే మార్గమాదేశయ.

విదూషకః : ఇతోఇతో భవతీ.

(ఇతి పరిక్రామన్తి)

రాజా : సుందరి, ఇయమిదానీమభ్యర్థనా.

---

చున్నవి. ఓ సుందరి ! ఏదియేది ప్రతికూల పరుషముగా నుండెనో అదియెల్ల నీ సమాగమముచేత నాకిప్పుడు ప్రసన్నమైనట్లుగా నున్నది.

ఉర్వశీ : ఆలసించినదాననై మహారాజునకు అపరాధము గావించితిని.

రాజు : అట్లుకాదు.

దుఃఖానంతరము సంప్రాప్తమైన సుఖమే మధురతరముగా నుండును. నిదాఘ సంతప్తునకు తరుచ్ఛాయ విశేషముగా ఉపశాంతి గలించునుగదా.

విదూ : ఓయి ! రజనీముఖమున రమణీయములైన చంద్ర కిరణములు ఉపభుక్తములైనవిగదా. ఇది నీకు శయనమందిరము ప్రవేశింపవలసిన సమయము.

రాజు : కనుక నే యీ మిత్రురాలికి మార్గము చూపుము.

విదూ : ఇటు ఇటు పూజ్యురాలు.

(అవి ముందుకు నడతురు)

రాజు : సుందరి ! ఇప్పుడిది నా కోరిక.

ఉర్వశీ : కథమివ.

రాజా :

అనుపగత మనోరథస్య పూర్వం శతగుణితేవ గతా మమ త్రియామా
యదితు తవసమాగమే తథైవ ప్రసరతి సుభ్రు తతఃకృతీ భవేయమ్. ౭౩

(ఇతి నిష్క్రాంతాః సర్వే)

ఇతి తృతీయోఽఙ్కః

---

ఉర్వశీ : ఏమి యగునో !

రాజు :

అప్రాప్త మనోరథుఁడనైన నాకు ఇంతకుపూర్వము నిశాసమయము నూరురెట్లు దీర్ఘము య్యేనా యన్నట్లు గడచెడిది. సుందరి! నీతోడి సంయోగమునందుకూడ అట్లే గడచినచో నేను కృతార్థుఁడ నగుదును.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము



## చతుర్థోఽఙ్కః

(నేపథ్యే సహజన్యా చిత్రలేఖయోః ప్రావేశిక్యాక్షిప్తికా)

ప్రియసఖీ వియోగవిమనాః సఖీసహితా వ్యాకులా సముల్లపతి
సూర్యకరస్పర్శ వికసిత తామరసే సరోవరోత్సఙ్గే. 1

(తతః ప్రవిశతి విమనస్కా సహజన్యా చిత్రలేఖాచ).

చిత్రలేఖా : (ప్రవేశానంతరం ద్విపదికయా దిశోఽవలోక్య)
సహచరీ దుఃఖాలీఢం సరోవరే స్నిగ్ధమ్
బాష్పావర్గితనయనం తామ్యతి హంసీయుగలమ్. 2

సహజన్యా : (చిత్రలేఖాం విలోక్య సఖేదమ్) మ్లాయమానశతపత్ర స్యేవ తే ముఖస్యచ్ఛాయా హృదయస్యాస్వస్థతాంసూచయతి. తత్కథయ నిర్వేదకారణమ్. సమదుఃఖా భవితుమిచ్ఛామి.

---

## చతుర్థాంకము

(తెరలో - సహజన్యా చిత్రలేఖల ప్రవేశమును
సూచించు ఆక్షిప్తిక)

* ప్రియసఖివియోగముచేత ఖిన్న హృదయయై, చెలికత్తెతో కూడినదై, వ్యాకులయై సూర్యకిరణ స్పర్శచే వికసించిన తామర పూవులుగల సరోవరముయొక్క తీరమున విలపించుచున్నది.

(అంతట ఖిన్నచిత్తయై సహజన్యయు, చిత్రలేఖయు
ప్రవేశింతురు)

చిత్రలేఖ : (ప్రవేశానంతరము ద్విపదికా గీతముతో దిక్కులు చూచి)

* సహచరీ దుఃఖపీడితము, స్నేహపూర్ణము, బాష్పతరంగితలోచనము అయిన హంసీయుగళము సరోవరమున పరితపించుచున్నది.

సహజన్య : (చిత్రలేఖను జూచి విచారముతో) సఖి ! వాడిపోవుచున్న పద్మము యొక్క కాంతివలె నీ ముఖముయొక్క కాంతి హృదయము

చిత్రలేఖా : సఖి అప్సరోవార పర్యాయేణేహ భగవతః సూర్యస్య పాదమూలోపస్థానే వర్తమానా బలవత్ఖలూర్వశ్యా ఉత్కంఠి తాస్మి.

సహజన్యా : జానే యువయోరన్యోన్యస్నేహమ్. తతస్తతః.

చిత్రలేఖా : తత ఏతేషు దివసేషు కోనుఖలు వృత్తాంత ఇతి ప్రణిధాన స్థితయా మయాఽత్యాహితముపలబ్ధమ్.

సహజన్యా : (సావేగమ్) కీదృశమివ

చిత్రలేఖా : ఉర్వశీ కిల తం రతిసహాయం రాజర్షి మమాత్యేషు నివేశితరాజ్యధురం గృహీత్వా గంధమాదనవనం విహర్తుం గతా.

సహజన్యా : సనామ సంభోగో యస్తాదృశేషు ప్రదేశేషు. తతస్తతః.

---

యొక్క వ్యాకులత్వమును సూచించుచున్నది. కనుక విషాద కారణమేదో చెప్పుము. నీ దుఃఖమును నేను పంచుకొన గోరుచున్నాను.

చిత్ర : సఖ ! అప్సరసల సేవాక్రమము ననుసరించి సూర్యభగవానుని పాద సేవయందున్న దాననై ఉర్వశినిగూర్చి మిక్కిలి యుత్కంఠిత నగుచున్నాను.

సహ : మీ యన్యోన్య ప్రేమ నే నెఱుంగుదును. తరువాత తరువాత.

చిత్ర : తరువాత, ఈ దినములలో ఏమి జరిగియుండునో తెలిసికొందమని యోగదృష్టి నాశ్రయింపఁగా గొప్ప యనిష్టము గోచరమైనది.

సహ : (ఆత్రముతో) ఎట్టిదో !

చిత్ర : రత్యాసక్తురై యమాత్యులయందు రాజ్యభారముంచిన, యా రాజర్షిని దీసికొని యుర్వశి గంధమాధన పర్వతమున విహరింపఁ బోయినట్లున్నది.

సహ : సంభోగమనఁగా అటువంటి ప్రదేశములందు చేసినదే. తరువాత తరువాత.

చిత్రలేఖా : తత్రఖలు మందాకిన్యాః పులినేషు సికతాపర్వత కేలిభిః క్రీడన్తీ విద్యాధరదారికా ఉదయవతీ నామ తేన రాజర్షిణా చిరం నిధ్యాతేతి కుపితోర్వశీ.

సహజన్యా : భవితవ్యమ్. దూరారూఢః ఖలు ప్రణయోఽసహనః. తత స్తతః.

చిత్రలేఖా : తతో భర్తు రనునయ మప్రతిపద్యమానా గురుశాప సంమూఢహృదయా విస్మృత దేవతానియమా స్త్రీజన పరిహరణీయం కుమారవనం ప్రవిష్టా ప్రవేశానంతరం కాననో పాంతవర్తిలతాభావేన పరిణతమస్యా రూపమ్.

సహజన్యా : నాస్తివిధే రలఙ్ఘనీయంనామ. తస్యానురాగస్యాయం నామైకపద ఈదృశోఽనర్థః. అథ కిమవస్థః సరాజర్షిః

చిత్రలేఖా : తస్మిన్నేవ కాననే ప్రియతమాం విచిన్వన్నహోరాత్రా

---

చిత్ర : అచ్చట గంగానదియొక్క యిసుకతిన్నెలందు ఇసుక తిప్పలలో ఆటలాడుచున్న ఉదయవతి యను విద్యాధర కుమారిని ఆ రాజర్షి చాలసేపు ముచ్చటపడి చూచెనని యుర్వశి కుపిత యయ్యెను.

సహ : అది సంభవమే. లోతుగా నాటుకొన్న ప్రేమ సహనము లేనిదిగదా. తరువాత తరువాత.

చిత్ర : తరువాత మహారాజుయొక్క అనునయమును తిరస్కరించి, గురు శాపమువల్ల జ్ఞానము నశించినదై, దేవతా నియమమును మఱచి స్త్రీ జనము పరిహరింపదగిన కుమారవనమును ప్రవేశించినది. ప్రవేశించిన వెంటనే ఆమె రూపము ఆ వనప్రాంతమందుండు ఒక తీగగా మారిపోయెను.

సహ : విధికి అలంఘనీయమన్నది లేదుగదా. ఆ యనురాగమునకు అకస్మికముగా ఈ యనర్థము. తరువాత ఆ రాజర్షి యెట్టి యవస్థ పాలయ్యెనో!

చిత్ర : ఆ వనమునందే ప్రియురాలిని వెదకుచు దినములు గడుపుచున్నాడు.

నతివాహయతి. ఏతేన పునర్నిర్వృతానా మప్యుత్కంఠా
కారిణా మేఘోదయేనానర్థాధీనో భవిష్యతి.

(అనంతరే జమ్భలికా)

సహచరిదుఃఖాలీఢం సరోవరే స్నిగ్ధమ్
అవిరల బాష్పజలార్ద్రం తామ్యతి హంసీయుగలమ్. 8

సహజన్యా : సఖి. అస్తి కోఽపి సమాగమోపాయః

చిత్రలేఖా : గౌరీచరణరాగసమ్భవం సంగమమణిం వర్జయిత్వా కుతోఽస్యాః సమాగమోపాయః ?

సహజన్యా : సఖి న తాదృశా ఆకృతివిశేషా శ్చిరం దుఃఖభాగినో భవన్తి. అవశ్యం కిమప్యనుగ్రహనిమిత్తం భూయోఽపి సమాగమ కారణం భవిష్యతి. తదేహి. ఉదయోన్ముఖస్య భగవతః సూర్యస్యోపస్థానం కుర్వః.

(అనంతరే ఖణ్డధారా)

---

సుఖితులనుకూడ ఉత్కంఠితులను గావించు ఈ మేఘోదయముచేత ఇంకను దుఃఖాధీనుడు కాగలడు.

(తరువాత జంభలికా గీతి)

* సహచరి దుఃఖపీడితము, స్నేహార్ద్రము, నిరంతర బాష్పజలార్ద్రము అయిన హంసీ యుగళము సరోవరమున పరితపించుచున్నది.

సహ : సఖి! సమాగమమునకు ఉపాయమేదైన గలదా?

చిత్ర : పార్వతీచరణ రాగమువలన బుట్టిన సంగమమణి తప్ప ఈమె సమాగమమునకు ఉపాయము వేఱెచ్చటనున్నది?

సహ : సఖి! అట్టి యుదార స్వరూపులు చిరకాలము దుఃఖభాజనములు కారు. తిరిగి సమాగమము కలిగించు ఏదో యొక యనుగ్రహ నిమిత్తము తప్పక సంభవింపగలదు కనుక రమ్ము. ఉదయింపబోవుచున్న సూర్యభగవానుని సేవింతము.

(తరువాత ఖండధారా గీతి)

చింతామానమానసా సహచరీ దర్శనలాలసా
వికసిత కమలమనోహరే విహరతి హంసీ సరోవరే. 4

(ఇతి నిష్క్రాంతే)

ప్రవేశకః

(నేపథ్యే పురూరవసః ప్రావేశిక్యాక్షిప్తికా)

గహనం గజేంద్రనాథః ప్రియావిరహోన్మాద ప్రకటిత వికారః
విశతి తరుకుసుమ కిసలయభూషిత నిజదేహ ప్రాగ్భారః. 5

(తతః ప్రవిశత్యున్మత్తవేషో రాజా)

రాజా: అః దురాత్మన్ రక్షస్తిష్ఠ తిష్ఠ. క్వమే ప్రియతమాం ఆదాయ గచ్ఛసి హంత శైలశిఖరా ద్గగనముత్పత్య బాణైర్మామభి వర్షతి.

---

• చింతా పరితప్తమానసయు, సహచరీదర్శనలాలసయునైన హంసి వికసించిన కమలములచే రమణీయమైన సరోవరమున దిరుగుచున్నది

(ఇరువురు నిష్క్రమింతురు)

ప్రవేశకము

(తెరలో పురూరవుని ప్రవేశమును సూచించు ఆక్షిప్తిక)

• ప్రేయసీవియోగోన్మాద వికారములను ప్రకటించుచు, చెట్ల పూలతో, చిగుళ్ళతో తన శరీరమును అలంకరించుకొనుచు గజేంద్రుడు అరణ్యమును ప్రవేశించుచున్నాడు.

(అంతట ఉన్మత్తవేషుడైన రాజు ప్రవేశించును)

రాజు: ఓరీ దురాత్ముడా! రాక్షసుడా! నిలు నిలు. నా ప్రియురాలిని తీసికొని ఎచ్చటికి పోవుచున్నావు. అయ్యో! పర్వత శిఖరము నుండి యాకాశమున కెగిరి నామీద బాణవర్షము గురియుచున్నాడు. (మట్టిగడ్డను తీసికొని కొట్టుటకై పరుగెత్తుచు వెంటనే ద్వివరికా సిలిచే దిక్కులు చూచి)

(లోష్టం గృహీత్వా హన్తుం ధావన్, అనన్తరే ద్విపదికయా
దిశోఽవలోక్య)

హృదయాహిత ప్రియాదుఃఖః సరోవరే ధుతపక్షః
వాష్పావప్లుతనయనః తామ్యతి హంసయువా. 6

కథం విప్రలబ్ధోఽస్మి

(విభావ్య సకరుణమ్)

నవజలధరః సన్నద్ధోఽయం న దృప్తనిశాచరః
సురధనురిదం దూరాకృష్టం న నామ శరాసనమ్
అయమపి పటుర్ధారాసారో న బాణపరంపరా
కనకనికషస్నిగ్ధా విద్యుత్ప్రియా న మమోర్వశీ. 7

(ఇతి మూర్ఛితః పతతి పునర్ద్విపదికయోత్థాయ నిఃశ్వస్య)

మయా జ్ఞాతం మృగలోచనాం నిశాచరః కోఽపి హరతి

---

- హృదయమందు నిలుపుకొన్న ప్రియా విరహ దుఃఖము గలిగి, రెక్కలల్లార్చుచు, బాష్పపీడిత నేత్రమై యువహంసము సరోవరమున పరితపించుచున్నది.
ఎంత మోసపోతిని! (పరికించి, సకరుణముగా)

- ఇది (వర్షించు) సన్నద్ధమైన నూత్న మేఘము, దర్పించిన రాక్షసుడు కాదు. ఇది దూరము వ్యాపించిన యింద్రధనువు, శరాసనము కాదు. అదికూడ ప్రబలమైన ధారా వర్షముగాని బాణ పరంపర కాదు. నికషోపలమున మెరయు కనక రేఖవంటి యిది మెరుపు తీగయేగాని నా ప్రేయసియైన యూర్వశి కాదు.

(అని మూర్ఛిల్లి పడిపోవును. మరల ద్విపదికా గీతిచే
లేచి, నిట్టూర్చి)

- నూతన శంపాలతో నీలవర్ణమైన యీ వర్షా మేఘము వర్షించుచుండగా, ఎవ్వడో నిశాచరుడు మృగలోచనయైన యూర్వశిని

యావన్న నవతడిచ్ఛ్యామలో ధారాధరో వర్షతి. 8

(ఇతి సకరుణం విచిన్త్య)

క్వనుఖలు రంభోరూర్గతా స్యాత్ ?

తిష్ఠేత్కోపవశాత్ప్రభావపిహితా దీర్ఘం న సా కుప్యతి
స్వర్గా యోత్పతితా భవేన్మయి పునర్భావార్ద్రి మస్యామనః
తాం హర్తుం విబుధద్విషోఽపి నచ మే శక్తాః పురోవర్తినీమ్
సాచాత్యంతమదర్శనం నయనయోర్యాతేతి కోఽయంవిధిః 9

(ఇతి మూర్ఛితః పతతి)

(సంజ్ఞాం లబ్ధ్వా దిశోఽవలోక్య సనిఃశ్వాసమ్)

అయే పరావృత్తభాగధేయానాం దుఃఖం దుఃఖాను బన్ధి కుతః.

అయ మేకపదే తయా వియోగః
ప్రియయా చోపనతః సుదుఃసహో మే

---

అపహరించుకొనిపోవుచున్నాడని యనుకొంటిని.

(అని సకరుణముగా ఆలోచించి)

ఆ రంభోరువు ఎచ్చటి కేగియుండునో కదా !

* కోపవశమున ప్రభావతిరోహితయై (ఇచ్చటనే) యుండవచ్చును. (అట్లుకాదు) ఆమె చిరకాలము కోపము పూనదు. స్వర్గమున కెగిరిపోయి యుండవచ్చును. (అట్లునుకాదు) మరి నాయందామె చిత్తము ప్రణయార్ద్రిముగదా. నా ఎదుటనున్న యామెను అప హరించుటకు రాక్షసులను సమర్థులుకారు. మఱి ఆమె నా కన్నులకు బొత్తిగా కనబడకుండ పోయినదనిన యీ విధి యేమందును ?

(అని మూర్ఛితుడై పడిపోవును. తెలివొంది, దిక్కులు చూచి నిట్టూర్పుతో)

ఆహా ! అదృష్టము వక్రించిన వారికి దుఃఖము వెంట దుఃఖము సంభవించుసుగదా. ఏలన—

* ఆ ప్రియురాలితోడి యీ దుస్సహమైన వియోగము నాకు

నవవారి ధరోదయా దహోభి-

ర్భవితవ్యంచ నిరాతపర్ధి రమ్యైః. 10

(అనంతరే చర్చరీ)

జలధర సంహా[ర]త కోపమాజ్ఞ ప్తః
అవిరల ధారాసార దిశాముఖాన్తః
ఏ అహం పృథ్వీం భ్రమన్యది ప్రియాం ప్రేక్షిష్యే
తదా యద్య త్కరిష్యసి త త్తత్సహిష్యే. 11

(విహస్య) మునైవ ఖలు మయా మనసః పరితాప వృద్ధి రుపేక్ష్యతే. యథా మునయోఽపి వ్యాహరన్తి 'రాజా కాలస్య కారణమ్' ఇతి. ఉత్క్రమహం జలదసమయం నప్రత్యాదిశామి.

(అనంతరే చర్చరీ)

---

ప్రాప్తించినది. ఈ నవజలధరోదయమువల్ల ఆతపరహితములైన దినములు రమణీయములు కానున్నవి.

(తరువాత చర్చరీ గీతి)

* ఓరీ మేఘుడా ! నిరంతర ధారా వర్షముచే దిగంతములను వ్యాపించి కొంటిల్లు (నీవు) నాచే ఆజ్ఞాపింపబడిన వాడవై యిచ్చట (నాయందు) నీ కోపమును ఉపసంహరింపుము. నే భూమియంతయుఁ దిరిగి నా ప్రియురాలిని కనుగొనఁగలిగినచో అప్పుడు నీవేది చేసినను నేను సహింపఁగలను.

(నవ్వి) మనః పరితాప దీ[క్ష]తను నేను నిష్కారణముగా ఉపేక్షించుచున్నాను. మునీశ్వరులుగూడ చెప్పినట్లు 'రాజు కాలమునకు కారణము' కదా. కనుక ఈ వర్షాకాలమును నేనేల నిషేదింపరాదు ?

(తరువాత చర్చరీ గీతి)

గంధోన్మాదిత మధుకర గీతై
ర్వాద్యమానైః పరభృతతూర్యైః
ప్రసృతపవనోద్వేల్లిత పల్లవనికరః
సులలిత వివిధ ప్రకారై ర్నృత్యతి కల్పతరుః. 12

(ఇతి నర్తిత్వా)

అథవా న ప్రత్యాదిశామి యత్రావృషేణ్యైరేవ లిఙ్గైర్మమ రాజోపచారః సంప్రతి! కథమివ-

విద్యుల్లేఖా కనకరుచిరం శ్రీవితానం మమాభ్రం
వ్యాధూయన్తే నిచులతరుభి ర్మఞ్జరీచామరాణి
ఘర్మచ్ఛేదా త్పటుతరగిరో వందినో నీలకణ్ఠా
ధారాసారోపనయనపరా నైగమాః సానుమన్తః. 13

(పునశ్చర్చరీ) భవతు కిమేవం పరిచ్ఛద శ్లాఘయా.

---

* గంధోన్మత్తములయిన మధుకరముల గీతములతో, వాయింపఁబడుచున్న కోకిల తూర్యములతో, వీచుచున్న వాయువుచేత కదలింపఁబడుచున్న పల్లవనికరములుగల కల్పవృక్షము సులలితములైన యనేక ప్రకారములతో నర్తించుచున్నది.

(అని నర్తించి)

లేదా వర్షాకాల సంబంధములైన చిహ్నములచేతనే నా కిప్పుడు రాజోపచారము జరుగుచున్నది గనుక నిషేధింపను. ఎట్లనగా -

* విద్యుల్లేఖయనెడు కనకముచేశోభిల్లు ఆకాశమేనాకు సుందరమైన వితానము. నిచులవృక్షములచేత పూలగుత్తులనెడు వింజామరములు వీవబడుచున్నవి. గ్రీష్మవిరామమువల్ల ప్రబలములైన వాక్కులుగల మయూరములే వందిపాఠకులు. ధారా సారములను దగ్గఱకుఁ దెచ్చుచున్న పర్వతములే వణిజులు.

(మరల చర్చరీగీతి) కానిమ్ము. ఈ యుపకరణ ప్రశంసతో పనియేమి ? ఇంక నీ కాననమున ప్రియురాలి నన్వేషింతును. (పాఠము

యావదస్మిన్ కాననే తాం ప్రియా మన్వేషయామి (పాఠ
స్యాన్తే భిన్నకః)

దయితారహితోఽధికం దుఃఖితో విరహానుగతః పరిమన్థరః
గిరికాననే కుసుమోజ్జ్వలే గజయూథపతి స్తథా క్షీణగతిః. 14

(అనంతరే ద్విపదికయా పరిక్రమ్యావలోక్యచ సహర్షమ్)

హన్త హన్త! వ్యవసితస్య మే సందీపనమివ సంవృత్తమ్. కుతః -

ఆరక్తరాజిభి రియం కుసుమై ర్నవకన్దలీ సలిలగర్భైః
కోపా దన్తర్బాష్పే స్మరయతి మాం లోచనే తస్యాః. 15

ఇతో గతేతి కథంను తత్రభవతీ మయా సూచయితవ్యా. యతః -

పద్భ్యాం స్పృశేద్వసుమతీం యది సా సుగాత్రీ
మేఘాభివృష్ట సికతాసు వనస్థలీషు

---

వెంటనే భిన్నకరాగము)

* ప్రియాహరహితుడై యతి దుఃఖితుడు, విరహానుగతుడై యలసుడునైన గజయూధపతి కుసుమశోభితమైన పర్వతారణ్యమున అల్లే మెల్లగా సంచరించుచుండెను.

(తరువాత ద్విపదికా గీతితో ముందుకు నడచి, చూచి, సంతోషముతో)

అన్వేషింపబూనిన నాకు ప్రోత్సాహము లభించినట్లయినది. ఏలన -

* ఈ నవకందళి ఎఱ్ఱని కాంతి గలిగి, లోపల జలబిందువులుగల పుష్పములచేత కోపమువల్ల బాష్పజలపూర్ణములైన ఆమెయొక్క (ఊర్వశియొక్క) లోచనములను నాకు స్మరణకుఁ దెచ్చుచున్నది.

ఆమె యేదిక్కున నేగినదో నేను గుర్తించుట యెట్లు? ఏలన-

* మేఘము వర్షించిన యిసుకగల వనస్థలములందు ఆ సుగాత్రి పాదములతో భూమిని స్పృశించి యున్నచో అప్పుడు గురునితంబములు గలిగియున్న కారణమున వెనుకభాగమున లోతుగా దిగబడినవియు,

వర్ణ్యాన్నతా గురువితమ్బతయా తతోఽస్యా
దృశ్యేత చారు పదపఙ్క్తి రలక్తకాఙ్కా. 16

(పరిక్రమ్య వలోక్య చ సహర్షమ్)

ఉపలబ్ధ ముపలక్షణం యేన తస్యాః కోపనయా మార్గోఽనుమీయతే.

హృతోష్ఠరాగై ర్నయనోదబిందుభి
ర్నిమగ్ననాభే ర్నిపతద్భి రఙ్కితమ్
చ్యుతం రుషా భిన్నగతే రసంశయం
శుకోదరశ్యామ మిదం స్తనాంశుకమ్. 17

(విభావ్య) కథం పేన్ద్రగోపం నవశాద్వల మిదమ్. కుతోనుఖలు నిర్జనే వనే ప్రియాప్రవృత్తి రవగమయితవ్యా. (దృష్ట్వా) అయే ఆసారోచ్ఛ్వసిత శైలేయస్థలీ పాషాణ మారూఢః -

ఆలోకయతి పయోదాన్ ప్రబల పురోవాత తాడిత శిఖణ్డః

---

లక్తక గుర్తులు గలవియునగు ఆమెయొక్క సుందరములయిన యడుగుల యొక్క వరుస కనఁబడవచ్చును.

(ముందుకు నడచి, చూచి, హర్షముతో)

ఆ కోపన యొక్క మార్గము ఊహించుటకు వీలయిన గుర్తు లభించినది.

* హరింపఁబడిన ఓష్ఠరక్తిమతో రాలిన కన్నీటిబిందువుల గుర్తులు గలిగి శుకోదరము వలె శ్యామవర్ణమైన యిది నిస్సంశయముగా దురుసు నడకగల ఆ తనాభియొక్క స్తనాంశుకమే.

(పరికించి) ఎట్లు! ఇంద్రగోప సహితమైన పచ్చికబయలా యిది? నిర్జనమైన ఈ వనమున ప్రియురాలి యునికి ఎట్లు తెలిసికో నగునో కదా! (చూచి) ఓహో! వర్షముచే గడిగి వేయఁబడిన పర్వత శిలాతలమున ఆరోహించినదై -

* ప్రబలమైన ఎదురుగాలిచే తాడితమైన పింఛముగల మయూరము

కేకాగర్భేణ శిఖీ దూరోన్నమితేన కణ్ఠేన. 18

యావదేనం పృచ్ఛామి. (ఉపేత్య)

(అనన్తరే ఖణ్డకః)

సంప్రాప్త ఖేద స్త్వరితం వరవారణః
ప్రియతమా దర్శనలాలసో గజవరో విస్మితమానసః. 19

(తేనా ఖణ్డకానన్తరే చర్చరీ)

బర్హిణ పరమిత్యభ్యర్థయే ఆచక్ష్వ మమ తామ్
అత్రారణ్యే భ్రమతా యది త్వయా దృష్టా సామమకాంతా
నిశామయ మృగాఙ్కసదృశేనవదనేన హంసగతిః
అనేన చిహ్నేన జ్ఞాస్యస్యాఖ్యాతం తవ మయా. 20

(చర్చరికయోపవిశ్య, అంజలిం బద్ధ్వా)

---

కేకాగర్భమై మిక్కిలి పైకెత్తఁబడిన కంఠముతో మేఘములను దిలకించుచున్నది

ఇప్పుడు దీనిని ప్రశ్నింతును. (సమీపించి)

(తరువాత ఖండకగీతి)

* శీఘ్రముగా వితరుల వారింపఁగల గజశ్రేష్ఠము ప్రాప్త దుఃఖము, ప్రియాదర్శనోత్సుకమునై ఏమియుతోచని చిత్తముతోఁ దిరుగుచున్నది.

(తేనాఖండకము తరువాత చర్చరీగీతి)

* ఓ మయూరమా! నిన్ను మిక్కిలిగా వేడుకొనుచున్నాను. నాకు ఆమెనుగూర్చి తెలుపుము. ఈ యరణ్యమున సంచరించుచున్న నీచేత ఆ నా ప్రియకాంత చూడఁబడినదా? వినుము. ఆమె చంద్ర సదృశమైన వదనముతో హంసగతివంటి గతిగలది. ఈ గుర్తుచే ఆమెను తెలిసికొందువు కనుక చెప్పుచున్నాను.

(చర్చరికాగీతితోఁ గూర్చుండి అంజలి పట్టి)

నీలకణ్ఠ మమోత్కణ్ఠా వనేఽస్మిన్వనితా త్వయా
దీర్ఘాపాఙ్గా సితాపాఙ్గ దృష్టా దృష్టిక్షమా భవేత్ 21

(చర్చరికయా విలోక్య) కథమదత్త్వైవ ప్రతివచనం నర్తితుం ప్రవృత్తః. కింను ఖలు హర్ష కారణమస్య.(విచిన్త్య) భవతు విదిత మేతత్.

మృదుపవనవిభిన్నో మత్ప్రియాయా వినాశాద్
ఘనరుచిరకలాపో నిఃసపత్నోఽస్య జాతః
రతివిగలితబన్ధే కేశహస్తే సుకేశ్యాః
సతి కుసుమసనాథే కం హరేదేష బర్హీ. 22

భవతు. పరవ్యసన నిర్వృతం న ఖల్వేనం పృచ్ఛామి. (పరిక్రమ్య) ఇయమాత పాన్తసంధుక్షితమదా జమ్బూ విటప మధ్యాస్తే పరభృతా. విహంగమేషు పణ్డితా జాతిరేషా.

---

* తెల్లని కంటికొనలుగల ఓ నీలకంఠమా! ఉన్నతమైన కంఠము గలది, దీర్ఘములయిన అపాంగములు గలది, దర్శనీయమైనదియు నగు నా కాంత ఈ యరణ్యమున నీచేత దర్శింపఁబడియుండవచ్చును.

(చర్చరికాగీతిచే చూచి)

ప్రతివచనము నొసంగకుండగనే నర్తించుచున్నదేమి? దీనికి హర్ష కారణమేమైయుండునో! (ఆలోచించి) కానిమ్ము. తెలిసినది.

* మందమారుత విస్తృతమైన దీని చిక్కని మెఱుగుపింఛము నా ప్రియురాలి యంతర్ధానమువల్ల నిప్పుడు సాటిలేనిదైనది. రతి క్రీడయందు విగళితబంధమైన అసుకేశి యొక్క కుసుమాలంకృతమైన కేశపాశము ఉండగా ఈ బర్హి ఎవ్వరిచిత్తమును హరింపఁగలదు?

కానిమ్ము. ఇతరుల దుఃఖమువలన సంతోషించుచున్న దీనిని ప్రశ్నింపను. (ముందుకునడచి) గ్రీష్మావసానమున ఉద్దీపించిన మదముగలదై యీ కోకిల జంబూవృక్షశాఖ నధివసించియున్నది. పక్షులలో బుద్ధిగలజాతి యిది. ఇప్పుడు దీని ప్రార్థింతును.

యావదేనా మభ్యర్థయే. భవతి!

(అనంతరే ఖురకః)

విద్యాధరకాననలీనో దుఃఖ వినిర్గత బాష్పోత్పీడః
దూరోత్సారిత హృదయానన్దోఽమ్బరమానేన భ్రమతిగజేన్ద్రః. 23

(ఖురకాన్తే చర్చరీ)

హేలే హేలే!

పరభృతే మధుర ప్రలాపిని కాన్తే
నందన వనే స్వచ్ఛన్దం భ్రమన్తి!
యది వరం ప్రియతమా సా దృష్టా,
తద్వ్యా చక్ష్వ మమ పరపుష్టే. 24

(ఏతదేవ నర్తిత్వా వలన్తికయోపసృత్య జానుభ్యాం స్థిత్వా)

భవతి!

త్వాం కామినో మదనదూతి ముదాహరన్తి
మానావభఙ్గ నిపుణం త్వమమోఘ మస్త్రమ్

---

పూజ్యురాలా!

(తరువాత ఖురక మనెడు నృత్యవిశేషము)

* విద్యాధరరాజ్యమున దాగియుండి, దుఃఖముచే వెడలుచున్న కన్నీళ్లచే పీడింపబడుచు, దూరీకృతహృదయానందమై గగనమంత ఉన్నతమైన ఈ గజేంద్రము పరిభ్రమించుచున్నది.

(ఖురకాంతమున చర్చరీగీతి)

ఓసి ఓసి -

* నందనవనమున స్వచ్ఛందముగా విహరించుదానా! మధురభాషిణీ! పరభృతసుందరీ! నాకు అత్యంత ప్రియురాలయిన యామె (ఉర్వశి) నీకు కనబడినట్లయితే చెప్పవే పరపుష్టా!

(దీనినే నర్తించుచు వలంతికారాగముతో సమీపించి మోకాళ్ల మీద నిల్చి) పూజ్యురాలా!

* కాముకులు నిన్ను మన్మథదూతికమగా ఉదాహరింతురు. నీవు

త్వా మానయ ప్రియతమాం మమ వా సమీపం
మాం వానయాశు కలభాషిణి యత్ర కాన్తా. 25

(వామకేన కిఞ్చిద్వివిత్వా, ఆకాశే) కిమాహ భవతీ ?
కథం త్వామేవమనురక్తం విహాయ గతేతి. శృణోతు భవతీ.

కుపితా న తు కోపకారణం సకృదప్యాత్మగతం స్మరామ్యహమ్
ప్రభుతా రమణేషు యోషితాం నహి భావస్ఖలితాన్యపేక్షతే. 26

కథం కథాచ్ఛేదకారిణీ స్వకార్య ఏవసక్తా.

మహదపి పరదుఃఖం శీతలం సమ్యగాహుః
ప్రణయ మగణయిత్వా యన్మమాపద్గతస్య
అధరమివ మదాన్ధా పాతుమేషా ప్రవృత్తా
ఫలమభిముఖపాకం రాజజమ్బూ ద్రుమస్య. 27

---

ప్రణయకోప భంగముగావించు అమోఘాస్త్రమవు. ఓసి మధుర భాషిణీ ! ఆ నా ప్రియురాలిని నా సమీపమునకైన తెమ్ము లేదా నన్ను త్వరగా నా ప్రేయసియున్న చోటికైన తీసికొనిపొమ్ము.

(వామక భంగిమచే (సంస్థాన విశేషముచే) నించుక తిరిగి ఆకాశము దిక్కుచూచి) ఏమంటివి పూజ్యురాలా ? ఈ విధముగా అనురక్తుడైన వానిని విడిచి యెట్లరిగిన దనియా ? పూజ్యురాలు వినవలెను.

* కోపించినది, కాని కోపకారణము నాలో ఒక్కటియు స్మరణకు వచ్చుటలేదు. ప్రియులయందు ప్రియురాండ్రకు గల యధికారము భావ దోషములను అపేక్షింపదుగదా.

ఏమి ? కథాభంగకారిణియై తన కార్యమునందే నిమగ్నయై యున్నదే ?

* ఇతరులదుఃఖము ఎంత గొప్పదైనను చల్లగానే యుండునని చక్కగా చెప్పినారు. ఆపద్గతుడనైన నా ప్రార్థనను లక్ష్యపెట్టకుండ మదాంధయైన యిది(యీ కోయిల)యీ రాజ జంబూవృక్షము యొక్క పాకాభిముఖమైన ఫలమును అధరమునువలె పానము చేయ జొచ్చినది.

ఏవం గతేఽపి ప్రియేవ మే మఞ్జు స్వనేతి న కోపోఽస్యామ్. సుఖమాస్తాం భవతీ. సాధయామస్తావత్.

(ఉత్థాయ ద్విపదికయా పరిక్రమ్యావలోక్య చ)

అయే! దక్షిణేన వనధారాం ప్రియాచరణనిక్షేపశంసీ నూపురశబ్దః. యావదేన మనుగచ్ఛామి.

(పరిక్రమ్య)

ప్రియతమావిరహక్లాన్తవదనః అవిరలబాష్పజలాకులనయనః
దుఃసహదుఃఖ విసంష్ఠులగమనః ప్రసృతగురుతాప దీప్తాఙ్గః
అధికం దూనమానసో దరీంగతః కాననే పరిభ్రమతి గజేన్ద్రః. 28

(ఇతి కకుభేన షడుపభఙ్గాః)

(అనంతరే ద్విపదికయా దిశోఽవలోక్య)

---

ఇట్లున్నదైనను నా ప్రియురాలివలె మధురస్వర గదా యని దీనియందు నాకు కోపము లేదు. పూజ్యురాలా! నీవు సుఖముగా నుందువుగాక! ఇంక మేము పోదుము.

(లేచి ద్విపదికాగీతిచే ముందుకు నడచి, చూచి)

ఓహో! ఈ వనపంక్తి దక్షిణమున ప్రియురాలి గమనమును సూచించు అందెల చప్పుడు! ఇక దీని ననుసరింతును. (ముందుకు నడచి).

* ప్రియతమా విరహముచే వాడిపోయిన ముఖముగలది, ఎడతెగని కన్నీటిచే కలతపడిన కన్నులుగలది, భరింపరాని దుఃఖముచే తొట్రుపడుచున్న నడకగలది, వ్యాపించుచున్న గొప్ప తాపముచే మండుచున్న దేహముగలది, మిక్కిలి పీడింపబడుచున్న మనస్సుగలది, పర్వతగుహాయందుండినది యైన గజేంద్రము అరణ్యమున పరిభ్రమించుచున్నది.

(కకుభరాగమున, ఆఱు విభాగములు)

(తరువాత ద్విపదికాగీతిచే దిక్కులు చూచి)

ప్రియకరిణీ వియుక్తో గురుశోకానల దీప్తః
బాష్పజలాకులలోచనః కరివరో భ్రమతి సమాకులః. 29

(సకరుణమ్) అహో ధిక్ కష్టమ్.

మేఘశ్యామా దిశో దృష్ట్వా మానసోత్సుకచేతసామ్
కూజితం రాజహంసానాం నేదం నూపుర శిఞ్జితమ్ 30

భవతు! యావదేతే మానసోత్సుకాః పతత్రిణః సరసో నోత్పతంతి తావదేతేభ్యః ప్రియాప్రవృత్తి రవగమయితవ్యా. (ఉపేత్య) భో భో జలవిహంగమరాజ!

పశ్చాత్సరః ప్రతిగమిష్యసి మానసం తత్
పాథేయ ముత్సృజ్య బిసం గ్రహణాయ భూయః
మాం తావ దుద్ధర శుచో దయితా ప్రవృత్త్యా
స్వార్థాత్సతాం గురుతరా ప్రణయిక్రియైవ. 31

---

* ప్రియకరిణీ వియుక్తము, అతిశయశోకాగ్నితప్తము, బాష్పజలాకుల నేత్రము అయిన కరివరము వికలచిత్తమై తిరుగాడుచున్నది.

(సకరుణముగా) అయ్యో కష్టము!

* మేఘశ్యామములైన దిక్కులను దిలకించి మానససరోవరమును గూర్చి యుత్కంఠితములగుచున్న రాజహంసముల కూజితమేకాని యిది నూపుర శింజితముకాదు.

కానిమ్ము. మానసోత్కంఠములైన యీ పక్షులు సరస్సునుండి యెగిరిపోకపూర్వమే వీనివలన ప్రియురాలి యునికి తెలిసికోవలయును (సమీపించి) ఓ జల విహంగమరాజమా!

* ఆ మానస సరస్సునుగూర్చి తరువాత వెళ్ళవచ్చును. మార్గమున భోజనమైన తామరతూడును మరల తీసికోవచ్చును గనుక విడిచిపెట్టుము ప్రియురాలి సంగతి తెలిపి నన్ను శోకమునుండి కొంచెము ఉద్ధరింపుము మంచివారికి స్వార్థముకంటె యాచకకార్యమే ముఖ్యముగదా.

యథోన్ముఖో విలోకయతి మానసోత్సుకేన మయా
న లక్షితేత్యేవం వచన మాహ (ఉపవిశ్య చర్చరీ) రేరే హంస!
కిం గోప్యతే.

(ఇతి నర్తిత్వా ఉత్థాయ)

యది హంస! గతా న తే నతభ్రూః
సరసో రోధసి దర్శనం ప్రియా మే
మదఖేలపదం కథం ను తస్యాః
సకలం చోర! గతం త్వయా గృహీతమ్ 32

అతశ్చ

(చర్చరీ) గత్యనుసారేణ మయా లక్ష్యతే.

(చర్చరికయోపసృత్యాఞ్జలిం బద్ధ్వా)

హంస ప్రయచ్ఛ మేకాన్తాం గతిరస్యా స్త్వయా హృతా

---

ముఖము పైకెత్తి చూచుచున్నది గనుక 'మానసోత్సుకము
నైన నాచేత ఆమె గమనింపబడలేదు' అన్నమాదిరి మాటను చెప్పు
చున్నది. (కూర్చుండి, చర్చరీగీతి) ఓ హంసమా! ఏమి? కప్పిపుచ్చు
చుంటివా? (అని నర్తించుచు లేచి)

* హంసమా! వంగిన కనుబొమలుగల నా ప్రియురాలు ఈ సరోవర
తీరమున నీ కంటబడకుండినచో, మదలీలావదమైన యామె గతి
నంతటిని, దొంగా! నీవెట్లు గ్రహించితివి?

అందువల్ల - (చర్చరీగీతి) గమనానుకరణమువల్ల నాకు
తెలియుచున్నది.

(చర్చరికా గీతితో సమీపించి, అంజలి బంధించి)

* హంసమా! నా ప్రియురాలిని ఇమ్ము. ఆమె గమనము నీచే హరింప
బడినది. కొంతభాగముతో పట్టుబడిన దొంగయే అభియుక్తమైన

విభావితైకదేశేన దేయం యదభియుజ్యతే. 33

(పునశ్చర్చరీ)

కస్మాత్త్వయా శిక్షిత మే తద్గతిలాలస
సా వరం దృష్టా జఘనభారాలసా. 34

(పునశ్చర్చరీ. 'హంస ప్రయచ్ఛ' ఇత్యాది పఠిత్వా ద్విపదికయా నిరూప్య, విహస్య)

ఏష చోరానుశాసీ రాజేతి భయాదుత్పతితః.

(పరిక్రమ్య)

అయ మిదానీం ప్రియాసహాయ శ్చక్రవాకః. తావదేనం పృచ్ఛామి.

(అనంతరే కుటిలికా)

మర్మరరణిత మనోహరే

(మల్లవటీ)

---

సర్వమును ఈయవలసియుండును.

(మరల చర్చరిగీతి)

• నితంబభారముచే మందగమనయైన యామె నీకు కనబడినది. కానిచో, గమనలాలసమైన హంసమా! దీనిని నీవు ఎవ్వరివలన నేర్చితివి?

(మరల చర్చరిగీతి. "హంసమా నా ప్రియురాలిని ఇమ్ము" అనుదానిని పఠించి, ద్విపదికా గీతిచే నిరూపించి, నవ్వి) రాజు చోరులను దండించువాడుగదా యను భయమువల్ల ఇది ఎగిరిపోయినది.

( ముందుకు నడచి )

ఇచ్చట ఇదిగో ప్రియురాలితో కూడి యున్న చక్రవాకము. ఇంక దీనిని అడిగి చూతును.

(తరువాత కుటిలిక అను నాట్యభేదము)

• మర్మర ధ్వనిచే మనోహరమై-

(మల్ల (ఘ) వటి యను నాట్యభేదము)

కుసుమిత తరువర పల్లవితే

(చర్చరీ)

దయితా విరహోన్మాదితః కాననే భ్రమతి గజేన్ద్రః. 35

(ద్విలయాన్తే చర్చరీ)

గోరోచనా కుఙ్కుమవర్ణ చక్ర శంస మామ్
మధువాసరే క్రీడన్తీ ధన్యా న దృష్టా త్వయా. 36

(చర్చరికయోపసృత్య జానుభ్యాం స్థిత్వా)

రథాఙ్గనామన్ వియుతో రథాఙ్గశ్రోణిబిమ్బయా
అయం త్వాం పృచ్ఛతి రథీ మనోరథశతైర్వృతః. 37

కథం కః క ఇత్యాహ. మా తావత్. నఖలు విదితోఽహమస్య.

సూర్యాచన్ద్రమసౌ యస్య మాతామహ పితామహౌ
స్వయం వృతః పతిర్ద్వాభ్యా ముర్వశ్యాచ భువా చ యః 38

---

* కుసుమించిన తరువరములచే ఆవరింపఁబడిన-

(చర్చరీగీతి)

* కాననమువందు ప్రియావిరహోన్మత్తమైన గజేంద్రము పరిభ్రమించుచున్నది.

(ద్విలయాంతమున చర్చరీగీతి)

* గోరోచనా కుంకుమవర్ణమైన చక్రవాకమా! మధుమాసమున క్రీడించుచుండిన ఆ ధన్యురాలు నీచేత చూడబడినదేమో నాకు చెప్పుము.

(చర్చరికతో సమీపించి మోకరిల్లి)

* ఓ రథాంగనామకమా! ఆ రథాంగ నితంబినితో వియుక్తుడై, మనోరథశతపరివృతుడైన ఈ రథి నిన్ను ప్రశ్నించుచున్నాడు.

ఏమి కః కః అనుచున్నది? అట్లుకాదు. నే నెవ్వడనో దీనికి తెలియదుగదా!

* సూర్యచంద్రు లెవ్వనియొక్క మాతామహపితామహులో, ఎవ్వఁడు

కథం తూష్ణీం స్థితః. భవతు. ఉపాలప్స్యే తావదేనమ్.

సరసి నళినీప త్రేణాపి త్వయావృతవిగ్రహామ్
నను సహచరీం దూరే మత్వా విరౌషి సముత్సుకః
ఇతి చ భవతో జాయాస్నేహాత్ పృథక్స్థితిభీరుతా
మయి చ విధురే భావః కాన్తాప్రవృత్తి పరాఙ్ముఖః 39

సర్వథా మదీయానాం భాగధేయానాం విపర్యాయేణ ప్రభావప్రకాశః. యావదన్య మవకాశ మవగాహే. (పదాన్తరే స్థిత్వా) భవతు. న తావద్గచ్ఛామి.

ఇదం రుణద్ధి మాం పద్మ మంతఃకూజితషట్పదమ్
మయా దష్టాధరం తస్యాః ససీత్కారమివాననమ్. 40

---

స్వయముగా ఇరువురచేత – ఉర్వశిచేత – భూమిచేత పతిగా వరింపబడెనో.

ఏమి మౌనము వహించియున్నది? కానిమ్ము దీనిని కొంచెము అధిక్షేపించి చూతును.

* సరస్సునందు తామరాకుచే కప్పబడియున్న సహచరినిగూడ దూరమందున్న దానినిగా దలంచి, యుత్కంఠపొంది నీవు ఆక్రందింతువు గదా! కాంతా ప్రేమమువలన నీయొక్క వియోగ భీరుత్వము ఇట్టిది. ఐనను నేను ప్రియావిరహితుడనై యుండగా నా ప్రియురాలి వృత్తాంతమును దెలుపుటయందు నీకింత పరాఙ్ముఖ భావమా?

ఇది యంతయు నా భాగ్యములయొక్క ప్రాతికూల్యమువనైన ప్రభావ ప్రకటనము. ఇంతట వేరొక ప్రదేశమునకు బోవుదును. (అడుగు వేయునంతలో ఆగి) కానిమ్ము వెళ్లను.

* నా చేత కొఱుకబడిన యధరముగలిగి సీత్కారముతో గూడిన ఆమె ముఖమువలె అంతర్భాగమున ఝుమ్మనుచున్న తుమ్మెదగల యీ పద్మము నన్ను కదలనీయకున్నది.

భవతు. అస్మిన్నేవ కమలాధ్యాసిని మధుకరే ప్రణయిత్వం కరిష్యే ఇతో గతస్యానుశయో మాభూదితి.

(అస్యాంతరే అర్ధద్విచతురస్రకః)

ఏకక్రమవర్ధిత గురుతర ప్రేమరసే
సరసి హంసయువా క్రీడతి కామరసేన. 41

(చతురస్రకేణోపేత్యాఞ్జలిం బద్ధ్వా)

మధుకర మదిరాక్ష్యాః శంస తస్యాః ప్రవృత్తిం
వరతను రథవాసౌ నైవ దృష్టా త్వయా మే.

(విభావ్య)

యది సురభి మవాప్స్య స్తన్ముఖోచ్ఛ్వాస గన్ధం
తవ రతి రభవిష్య త్పుండరీకే కిమస్మిన్. 42

సాధయామ స్తావత్. (పరిక్రమ్యావలోక్యచ) ఏష నీప

---

కానిమ్ము. ఇచ్చటినుండి వెడలిపోయిన నాకు పశ్చాత్తాపము కలుగకుండునట్లు, కమలగర్భమునందున్న యీ మధుకరమునే ప్రార్థింతును.

(దీని తరువాత అర్ధ ద్విచతురస్రకమనెడు సంస్థాన విశేషము)

* అవిచ్ఛిన్నముగా వర్ధిల్లిన గొప్ప ప్రేమరసముగల సరస్సునందు యువహంసము కామోత్కంఠతో క్రీడించుచున్నది.

(చతురస్రక సంస్థానముతో సమీపించి అంజలి బంధించి)

* ఓ మధుకరమా! ఆ మదిరాక్షి వృత్తాంతమును దెలుపుము. లేక ఆ సుందరాంగి నీచేత అసలు చూడబడనే లేదా?

(పరిశీలించి)

* మధురమైన ఆమె ముఖమారుత గంధమును నీవు అస్వాదించి యున్నచో ఈ పద్మమునందు నీకు ప్రీతి యెట్లుండగలదు?

కనుక వెడలిపోదును. (ముందుకు నడచి, చూచి) ఇదిగో నీప వృక్షస్కంధమున తొండమునుంచి కరిణితోగూడిన నాగరాజము

స్కన్ధ నిషణ్ణహస్తః కరిణీసహాయో నాగరాజ స్తిష్ఠతి. అస్మాత్ప్రియోద న్త ముపలప్స్యే (విలోక్య) అథవా న త్వరా కార్యా. (నాగరాజ స్తిష్ఠతి).

(కులికా)

కరిణీ విరహ సంతాపితః

(మందవటీ)

కాననే గంధోద్ధత మధుకరః

అయ మచిరోద్గతపల్లవ ముపనీతం ప్రియకరేణుహస్తేన
అభిలషతు తావదాసవసురభిరసం సల్లకీభఙ్గమ్. 44

(క్షణమాత్రం స్థిత్వా. అవలోక్య) హన్త కృతాహ్నికః సంవృత్తః. భవతు పృచ్ఛామి.

(అనంతరే చర్చరీ)

అహం త్వాం పృచ్ఛామి ఆచక్ష్వ గజవర

---

నిల్చియున్నది. దీనివలన నా ప్రియురాలి యుదంతమును పొంద గలను. (చూచి) లేదా, త్వరపడగూడదు. (నాగరాజు నిలిచి యుండును).

(కుటిలికా నాట్యభేదముతో)

* కరిణీ విరహముచే సంతాపితము –

(మంద (ల్ల) ఘటీనాట్యము)

* అరణ్యమున మదముచే దర్పించిన మధుకరములు గలది –

* ఈ నాగేంద్రము ప్రియకరేణు హస్తముచేత అందీయబడిన, మద్య రసగంధయుక్తమైన, అప్పుడే మొలిచిన చివుళ్లుగలిగిన సల్లకీఖండ మును ఇంతలో రుచి చూచుగాక.

(క్షణమాత్రము ఉండి, చూచి) ఓహో! భోజనము గావించి నది. కానిమ్ము. అడుగుదును.

(తరువాత చర్చరిగీతి)

* లలితములయిన ప్రహారములచే నాశము చేయబడిన తరువరములు

అలిత ప్రహారేణ నాశితతరువర
దూరవినిర్జిత శశధరకాన్తి
దృష్టా ప్రియా త్వయా సంముఖం యాన్తీ. 45

(పదద్వయం పురత ఉపసృత్య)

మదకల! యువతిశశికలా గజయూథప యూథికాశబలకేశీ
స్థిరయౌవనా స్థితా తే దూరాలోకే సుఖాలోకా. 46

(ఆకర్ణ్య. సహర్షమ్) అనేన గ్రద్ధమన్ద్రేణ ప్రియోపలమ్భశంసినా సమాశ్వసితోఽస్మి. సాధర్మ్యాచ్చ త్వయి మే భూయసీ ప్రీతిః.

మామాహుః పృథివీభృతా మధిపతిం నాగాధిరాజో భవా
నవ్యుచ్ఛిన్నపృథుప్రవృత్తి భవతో దానం మమాప్యర్థిషు

---

గల ఓ గజవరమా! మిక్కిలిగా తిరస్కరింపబడిన చంద్రకాంతిగల నా ప్రియురాలు నీ సమ్ముఖమునకు వచ్చినదై నీకు గనబడినదా? నిన్ను అడుగుచున్నాను చెప్పుము.

(రెండడుగులు ముందుకు నడిచి)

మదముచే మధురముగా ఘీంకరించు గజయూథపతీ! యువతులలో చంద్రకళవంటిది, యూథికాపుష్పములచే నలంకరింపబడిన కేశములు గలది, శాశ్వతమైన యౌవనము గలది, రమణీయమైన యాకారము గలది, (ఉర్వశి) దూరమునందైన నీ కంటబడినదా?

(విని, హర్షముతో) మధురగంభీరము, ప్రియాలాభసూచకము నైన ఈ గర్జితముచేత ఊరట పొందుచున్నాను. సమాన ధర్మత్వము వల్ల నీయందు నాకు అధికమైన ప్రేమ.

నన్ను రాజాధిరాటని యందురు. నీవు నాగాధి రాజవు. అర్థులందు నాకును, నీకును దానజలము అవిచ్ఛిన్న మహాప్రవాహముగలదే. స్త్రీ రత్నములందు నాకు ఉర్వశియు, గజయూథమునందు నీకు ఈ కరిణియు ప్రియతమురాలు. అంతయు నావలెనే నీకును, కాని

స్త్రీరత్నేషు మమోర్వశీ ప్రియతమా యూథే తవేయం వశా
సర్వం మామను తే ప్రియావిరహజాం త్వంతు వ్యథాం మామభూః.

సుఖమాస్తాం భవాన్. సాధయామస్తావత్. (పరిక్రమ్య పార్శ్వతో దృష్టిం దత్త్వా) అయే సురభికన్దరోనామ విశేష రమణీయః సానుమా నాలోక్యతే. ప్రియశ్చాయమప్సరసామ్. అపినామ సుతను రస్యాపత్యకాయా ముపలభ్యేత. (పరిక్రమ్యావలోక్యచ) హా_వ్త మదీయైర్దురితపరిణామై ర్మేఘోఽపి శతహ్రదాశూన్యః సంవృత్తః. తథాపి శిలోచ్చయమేత మపృష్ట్వా న నివర్తిష్యే.

(అనంతరే ఖండికా)

ప్రసృత ఖరఖురదారిత మేదిని ర్వనగహనేఽవిచలః
పరిసర్పతి పశ్యత లీనో నిజకార్యోద్యుక్తః కోలః. 48

---

ప్రియావియోగమువలన గలిగిన ఱ వ్యథను మాత్రము నీవు అనుభవింపకుందువుగాక.

నీవు సుఖముగా నుందువుగాక ! మేము పోవుదుము. (ముందుకు నడచి ప్రక్కకు చూపు బరపి) ఓహో ! సురభికందర మనెడు అత్యంత సుందరమైన పర్వతము కనబడుచున్నది. ఇది యప్సరసలకు ప్రియమైనది. ఆ సుందరాంగి దీని చరియయందు లభింప గలదో! (ముందుకు నడచి, చూచి) అయ్యో! నా పాపపరిపాకముల చేత మేఘముకూడ విద్యుల్లతారహితమై యున్నది. అయినప్పటికిని ఈ పర్వతమును అడుగకుండ మరలిపోను.

(తరువాత ఖండికాగీతి)

ధీరమై తన కార్యమును ప్రారంభింపనున్నదై, ప్రసారితములయిన గిట్టలతో చీల్చబడిన భూమిగల యీ అడవిపంది వనకుంజములలో లీనమై సంచరించుచున్నది చూడుడు.

అపి వనాంతర మల్పకుచాంతరా
శ్రయతి పర్వత పర్వసు సన్నతా
ఇహ మనఙ్గ పరిగ్రహ మఙ్గనా
పృథునితమ్బ నితమ్బవతీ తవ. 49

కథం తూష్ణీమాస్తే. శఙ్కే విప్రకృష్టో న శృణోతీతి. సమీపేఽస్య గత్వా పునరేనం పృచ్ఛామి. (పరిక్రమ్య)

(అనన్తరే చర్చరీ)

స్ఫటిక శిలాతల నిర్భర నిర్మల
బహువిధకుసుమ విరచిత శేఖర
కిన్నరమధురోద్గీత మనోహర
దర్శయ మమ ప్రియతమాం మహీధర. 50

(చర్చరిక యోపసృత్యాఞ్జలిం బద్ధ్వా)

సర్వక్షితిభృతాం నాథ దృష్టా సర్వాఙ్గసున్దరీ

---

పెద్ద చరియలుగల ఓ పర్వతమా! పెద్ద పిఱుదులు గలది, స్తనముల మధ్య స్వల్పమైన యెడముగలది, సంధిబంధములందు వంగినది అయిన ఉర్వశి మదననివాస సదృశమైన యీ నీ వనాంతరమును ఆశ్రయించి యున్నదా?

ఏమి మాట్లాడదు? దూరమునందుండుటచే వినలేదనుకొందును. సమీపమునకు బోయి మరల దీనిని ప్రశ్నింతును. (ముందుకు నడచి)

(తరువాత చర్చరీగీతి)

• స్ఫటికశిలాతలములచే మిగుల తెల్లనై, బహువిధములైన కుసుమములచే కూర్పబడిన శిరోభూషణముగలిగి, కిన్నరుల మధురము లయిన యుచ్చైర్గీతములచే మనోహరమైన ఓ మహీధరమా! నా ప్రియతమురాలిని చూపింపుము.

(చర్చరికతో సమీపించి, అంజలిపట్టి)

• సర్వమహీభృత్పతీ! చూడబడెనా సర్వాంగసుందరియైన స్త్రీ

రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా. 51

(ఆకర్ణ్య, సహర్షమ్) కథం యథాక్రమం దృష్టేత్యాహ. భవానప్యతః ప్రియతరం శృణోతు. క్వ తర్హి మమ ప్రియతమా. (నేపథ్యే తదేవాకర్ణ్య) హాధిక్. మమైవాయం కన్దరముఖవిసర్పీ ప్రతిశబ్దః. (విషాదం రూపయిత్వా) శ్రాన్తోఽస్మి. అస్యా స్తావద్గిరినద్యాస్తీరే స్థిత స్తరఙ్గ వాత మాసేవిష్యే. ఇమాం నవామ్బుకలుషామపి స్రోతోవహాం పశ్యతో మే రమతే మనః. కుతః-

తరఙ్గభ్రూభఙ్గా క్షుభిత విహగశ్రేణిరశనా
వికర్షన్తీ ఫేనం వసనమివ సంరమ్భశిథిలమ్
యథాఽఽవిద్ధం యాతి స్ఖలిత మభిసంధాయ బహుశో
నదీభావేనేయం ధ్రువ మసహనా సా పరిణతా. 52

---

రమ్యమయిన వనదేశమున నా చేత విడువబడినదై నీ చేత.

(విని హర్షముతో) యథాక్రమముగా చూడబడెనని చెప్పెనా? నీవుకూడ ఇంతకంటె ప్రియమైనదానిని విందువుగాక! అయితే నా ప్రియురాలెక్కడ? (తెరలోనుండి అదేమాటనువిని) అయ్యో! గుహాముఖమునుండి ప్రసరించిన నా ప్రతిధ్వనియే యిది? (విషాదము నభినయించి) అలసిపోయితిని. కొంచెము ఈ గిరినదీతీరమున గూర్చుండి యలలమీది గాలిని అనుభవింతును. క్రొత్తనీటిచే మురికి యైనదైనను ఈ నదీప్రవాహమును దిలకించి నామనస్సు వినోదించు చున్నది. ఎందువల్లననగా -

* తరంగములనెడు భ్రూభంగములతో, మొరయుచున్న పక్షుల వరుస యనెడు మొలనూలితో, కోపమువలన చెదరిపోయిన బట్టనువలె నురుగును ఈడ్చుకొనుచు మాటిమాటికి తొట్రుపాటులను సరిచేసికొనుచు ఇది వెళ్లుచున్నందువల్ల కోపనయైన యూర్వశియే నిశ్చయముగా నదీరూపమున పరిణమించి యుండును.

భవతు. యాచిష్యే తావదేనామ్. (అఞ్జలిం కృత్వా)

(అనన్తరే కుటిలికా)

ప్రసీద ప్రియతమే సున్దరి నదికే క్షుభితతరఙ్గవిహఙ్గమకే నత్యా
సురసరి తీరసముత్కణ్ఠకే అలికులఝఙ్కారితే నది. 53

(కుటిలికానన్తరే చర్చరీ)

పూర్వదిక్పవనాహత కల్లోలోద్గతబాహు
ర్మేఘాన్తైర్నృత్యతి సలలితం జలనిధినాథః
హంస రథాఙ్గ శఙ్ఖ కుఙ్కుమ కృతాభరణః
కరిమకరాకుల కృష్ణకమల కృతావరణః
వేలానిలోద్వేల్లిత దత్తహస్తతాలో
నృత్యతి దశదిశో రుద్ధ్వా నవమేఘకాలః. 54

(చర్చరికయోపసృత్య జానుభ్యాం స్థిత్వా)

---

కానిమ్ము. కొంచెమీదీని ప్రార్థింతును. (అంజలిపట్టి)

(తరువాత కుటిలికానాట్యభేదము)

• కదలుచు రొదచేయుచు ఉత్కంఠితములైన విహంగములు గలదానా! తుమ్మెదల గుంపుల ఝంకారము గలదానా! సుందరీ! ప్రియతమా! ఓ సురనదీ! ఈ పాదానతిచేత ప్రసన్నురాలవుకమ్ము.

(కుటిలిక తరువాత చర్చరి)

• తూర్పుగాలిచే ఎగురగొట్టబడిన తరంగములనెడు ఎత్తిన బాహువులు గలవాడు, హంస చక్రవాక శంఖ కుంకుమములచే చేయబడిన యలంకారముగలవాడు, కరిమకరములచే చిందర వందర చేయబడిన నల్లతామరలనెడు వస్త్రముగలవాడు, నీరలలముల ఉచ్చలనమువలన చేయబడుచున్న తాళముగలవాడు, క్రొత్తమేఘమువలె నల్లనైనవాడు అయిన సముద్రుడు మేఘములే అంగములుగా లలితముగా నర్తించుచు దశదిశలను ముట్టి వ్యాపించుచున్నాడు.

(చర్చరికతో సమీపించి మోకరిల్లి)

త్వయి నిబద్ధరతేః ప్రియవాదినః ప్రణయభఙ్గ పరాఙ్ముఖచేతసః
కమపరాధలవం మయి పశ్యసి త్యజసి మానిని దాసజనం యతః 55

అథవా పరమార్థ సరిదేవైషా. న ఖలూర్వశీ పురూరవస మపహాయ సముద్రాభిసారిణీ భవిష్యతి. భవతు. అనిర్వేద ప్రాప్యాణి శ్రేయాంసి. యావదహమేవ ప్రదేశం గచ్ఛామి యత్ర మే నయనయోః సునయనా తిరోభూతా. (పరిక్రమ్యావలోక్య చ)హన్త దృష్టముపలక్షణం తస్యా మార్గస్య.

రక్తకదమ్బః సోఽయం ప్రియయా ఘర్మాంతశంసి యస్యైకమ్
కుసుమ మసమగ్రకేసరవిషమమపి కృతం శిఖాభరణమ్. 56

(విలోక్య) ఇమం తావత్ప్రియా ప్రవృత్తి నిమిత్తం సారఙ్గ మాసీన మభ్యర్థయే

---

* ఓ మానిని! నీయందు బద్ధానురాగుడను, ప్రియభాషిని, ప్రణయమును భంగముచేయనిష్టపడనివాడను అయిన నాయందు ఏ యపరాధలేశమును చూచినందువల్ల ఈ దాసజనుని త్యజింతువు?

ఒకవేళ ఇది యథార్థమైన నదియే. పురూరవుని త్రోసివుచ్చి యుర్వశి సముద్రుని అభిసరించునది కాజాలదుగదా! కానిమ్ము. ఉత్సాహాలభ్యములుగదా శ్రేయములు. ఇంక ఆ సునయన నా నయనములనుండి మరుగువడిపోయిన ఆ ప్రదేశమునకే యేగెదను. (ముందుకునడచి, చూచి) ఆహా! ఆమె పోయిన మార్గముయొక్క గుర్తు దొరికినది.

* గ్రీష్మాంతమును సూచించుచు, అసమగ్రములైన కేసరములచే ఎగుడు దిగుడుగా నున్నదైనను, దేనియొక్క ఒంటరి పువ్వును ప్రియురాలిచే శిఖాభరణముగా చేసికొనబడెనో ఆ రక్తకదంబ వృక్షము ఇదియే.

(చూచి) ప్రియురాలి యునికినిగూర్చి తెలిసికొనుటకు ఈ పరుండిన లేడిని అడిగిచూతును.

కృష్ణశారచ్ఛవిర్యోఽసౌ దృశ్యతే కాననశ్రియా
వనశోభావలోకాయ కటాక్ష ఇవ పాతితః. 57

(చర్చరీ)

సురసున్దరీ జఘనభరాలసా పీనోత్తుఙ్గఘనస్తనీ
స్థిరయౌవనా తనుశరీరా హంసగతిః
గగనోజ్జ్వల కాననే మృగలోచనా భ్రమన్తీ
దృష్టా త్వయా తద్విరహసముద్రాన్తరా దుత్తారయమామ్.

(విలోక్య) కిం ను ఖలు మామవధీరయ న్నివాన్యతో ముఖః సంవృత్తః.

అస్యాన్తిక మాయన్తీ శిశునా స్తనపాయినా మృగీ రుద్ధా
తామయ మనన్యదృష్టి ర్భుగ్నగ్రీవో విలోకయతి. 58

హం హో యూథపతే!

---

* నీలచిత్ర వర్ణమైన యీ మృగము అరణ్యసౌందర్యావలోకనము కొఱకు వనలక్ష్మిచే ప్రసరింపబడిన కటాక్షమాయన్నట్లు కనబడుచున్నది.

(చర్చరి)

* జఘనభారముచే మందగమన, బలిసిన ఎత్తయిన బిగువైన స్తనములుగలది, నిత్యయౌవన, సన్నని శరీరముగలది, హంసగమన, మృగలోచన అయిన సురసుందరి ఆకాశమువలె ప్రకాశించు ఈ కాననమున దిరుగుచున్నదై నీకు గనబడినదా! ఆమెతోడి వియోగ మనెడు సముద్రమునుండి నన్ను ఉద్ధరింపుము.

(చూచి) నన్ను నిర్లక్ష్యము చేయుచున్నదానివలె పెడమొగమైనది ఎందువల్లనోకదా!

* ఆడులేడి దీనిదగ్గరకువచ్చుచు పాలుత్రావుచున్న శిశువుచే అడ్డగింపబడినది. మలగిన మెడలో అనన్యదృష్టియై యిది దానిని చూచుచున్నది.

ఓహో! మృగపతీ!

అపి దృష్టవానసి మమ ప్రియాం వనే
కథయామి తే తదుపలక్షణం శృణు
పృథులోచనా సహచరీ యథైవ తే
సుభగం తథైవ ఖలుసాఽపి వీక్షతే. 60

కథ మనాదృత్య మద్వచనం కలత్రాభిముఖం స్థితః. ఉపపద్యతే. పరిభవాస్పదం దశావిపర్యయః. ఇతోవయమ్ (పరిక్రమ్యావలోక్య చ) కింను ఖలు శిలాభేదాన్తరగతం నితాంతరక్త మిద మాలోక్యతే.

ప్రభాలేపీ నాయం హరిహతమృగస్యామిషలవః
స్ఫులిఙ్గః స్యాదగ్నే ర్గగనమభివృష్టం పునరిదమ్
(విభావ్య)
అయే రక్తాశోక స్తబకసమరాగో మణి రియమ్

---

* నా ప్రియురాలిని ఈ వనమున చూచియుంటివా? ఆమెగుర్తు నీకు చెప్పెదను వినుము. విశాలలోచనయైన నీ సహచరివలెనే ఆమెకూడ మనోహరముగా చూచునుసుమా!

ఏమి నామాటను అనాదరించి భార్య దిక్కుతిరిగియున్నది? యుక్తమే. భాగ్య విపర్యయము అవమానమునకు గారణమగును. ఇక్కడినుండి మేము - (ముందుకునడచి, చూచి) రాతి పగులులో నుండి మిక్కిలి యెఱ్ఱగా గనబడుచున్నది ఇది యేమైయుండునో కదా?

* కాంతులు వెదజల్లు ఇది సింహముచే జంపబడిన మృగముయొక్క మాంసఖండముకాదు. నిప్పురవ్వకావచ్చును కాని యిది యాకాశము నుండి రాలినదిగదా.

(పరిశీలించి)

ఓహో! రక్తాశోక గుచ్ఛముతో సమానమైన యెఱ్ఱనికాంతి గల యిది మణి. దీనిని ఎత్తి తీసికొనయత్నించుచున్నాడో యన్నట్లు

యముద్ధర్తుం పూషా వ్యవసిత ఇవాలమ్బితకరః. 61
భవతు. హారతి మే మనః. అదాస్యే తావదేనమ్.

(గ్రహణం నాటయతి)

ప్రణయినీబద్ధాస్వాదో బాష్పాకుల నిజనయనః
గజపతి ర్గహనే దుఃఖితః పరిభ్రమతి శ్యామితవదనః. 62

(ద్విపదికయోపసృత్య గృహీత్వా, ఆత్మగతమ్)

మందార పుష్పై రధివాసితాయాం
యస్యాః శిఖాయా మయ మర్పణీయః
సైవ ప్రియా సంప్రతి దుర్లభా మే
కిమేనమస్రోపహతం కరోమి. 63

(నేపథ్యే) వత్స! గృహ్యతాం గృహ్యతామ్!
సఙ్గమనీయ ఇతిమణిః శైలసుతాచరణరాగయోని రయమ్

---

సూర్యుడు కరములను నిగిడించుచున్నాడు.

కానిమ్ము. నా మనస్సును ఆకర్షించుచున్నది. ఇంక దీనిని తీసికొందును. (తీసికొనుటను అభినయించును)

* ప్రియురాలియందు బద్ధమయిన యాసక్తిగల గజరాజు కన్నీటిచే కలతపడిన కన్నులుగలది, వాడిపోయిన మోముగలది, దుఃఖితమునై యరణ్యమున పరిభ్రమించుచున్నది.

(ద్విపదికతో సమీపించి, తీసికొని, తనలో)

* మందార పుష్పములతో వాసించు ఎవ్వతెయొక్క శిఖయందు ఇది యుంచదగినదో ఆ ప్రియురాలే నాకిప్పుడు దుర్లభయైనది. కన్నీటిచే కలుషితమైన దీని నేమి చేయుదును?

(తెరలో)

వత్సా! తీసికొనుము, తీసికొనుము.

* పార్వతీదేవి పాదముల లత్తుకనుండి పుట్టిన సంగమనీయమను

ఆవహతి ధార్యమాణః సఙ్గమ మచిరాత్ప్రియయా నేన. 64

రాజా : (కర్ణం దత్త్వా) కో నుఖలు మామేవమనుశాస్తి. దిశోఽవలోక్య) అయే, అనుకమ్పతే మాం కచ్చిన్మృగచారీ మునిర్భగవాన్. భగవన్ అనుగృహీతోఽస్మ్యహాముపదేశాద్భవతః (మణిమాదాయ) హంహో సంగమనీయ !

తయా వియుక్తస్య విలగ్నమధ్యయా
భవిష్యసి త్వం యది సఙ్గమాయ మే
తతః కరిష్యామి భవన్త మాత్మనః
శిఖామణిం బాలమివేందు మీశ్వరః. 65

(పరిక్రమ్యావలోక్యచ)

అయే కిం ను ఖలు కుసుమరహితామపి లతా మిమాం పశ్యతో మే రతిరుపలబ్ధా. అథవా స్థానే మనోరమా మమేయమ్. ఇయంహి—

---

ఈ మణి ధరింపబడినదై ప్రియజనముతోడి సమాగమమును అచిర కాలముననే కలిగింపగలదు.

రాజు : (చెవియొగ్గి) నన్ను ఈ విధముగా ప్రబోధించుచున్న దెవరోకదా ! (దిక్కులుచూచి) ఓహో ! మృగరూపధారియై సంచరించుచున్న పూజ్యుడైన ముని ఎవ్వడో నన్ను కరుణించుచున్నాడు. స్వామీ. తమ యుపదేశమువల్ల అనుగ్రహింపబడినవాడ నగుచున్నాను! (మణిని తీసికొని) ఓహో ! సంగమనీయమా !

* కృశోదరియైన ఆ యుర్వశితో వియోగముపొందియున్న నాకు ఆమెతోడి సమాగమమునకు నీవు (శక్తిగలదానవు) కాగలవేని అప్పుడు ఈశ్వరుడు బాలచంద్రునివలె నేను నిన్ను నా శిఖామణిని గావించుకొనగలను.

(ముందుకునడచి, చూచి)

ఓహో ! పుష్పములు లేనిదైనను ఈ లతను దిలకించుచున్న నాకు ప్రీతి కలుచున్న దేలనో కదా ? లేదా ఇది నాకు మనోహరి యగుటయు యుక్తయే. నిజముగా ఇది –

తస్మిం మేఘజలార్ద్ర పల్లవతయా ధౌతాధరేవాశ్రుభిః
శూన్యేవాభరణైః స్వకాలవిరహా ద్విశ్రాన్త పుష్పోద్గమా
చిన్తామౌన మివాస్థితా మధులిహాం శబ్దైర్వినా లక్ష్యతే
చణ్డీ మామవధూయ పాదపతితం జాతానుతాపేవ సా. 66

యావదస్యాః ప్రియానుకారిణ్యాః పరిష్వంగప్రణయీ భవామి.

లతే, ప్రేక్షస్వ వినా హృదయేన భ్రమామి
యది విధియోగేన పునస్తాం ప్రాప్స్యామి
తదారణ్యేన వినా కరోమి నిర్భ్రాన్తి
పునర్న ప్రవేశయామి తాం కృతాన్తామ్. 67

(ఇతి చర్చరికయోపసృత్య లతామాలిఙ్గతి. తత స్తదీయస్థాన మాక్రంస్యైవ ప్రవిష్టోర్వశీ)

---

* వాననీటిచే తడిసిన చిగుళ్లుగలిగి కన్నీటిచే కడగబడిన పెదవులు గలదానివలె, పూతకాలము కానందున పుష్పోద్గమము లేనిదై ఆభరణ విహీనవలె, తుమ్మెదల మ్రోతలు లేనందున విచారముచే మౌనము దాల్చిన దానివలె, చిక్కిన శరీరముగలదై పాదములమీద బడిన నన్ను కోపనయై తిరస్కరించి జాత పశ్చాత్తాపయైన ఆ యుర్వశివలె నున్నది.

ఇంతలో ప్రియురాలి ననుకరించుచున్న దీనియొక్క ఆలింగనముచే సుఖితుడ నగుదును.

* ఓ లతా! నేనీ యరణ్యమున హృదయశూన్యుడనై భ్రమించుచున్నాను చూడుము. అదృష్టవశమున ఆమెను తిరిగి పొందఁ గలుగుదునేని అప్పుడు నిస్సందేహముగా నామె నీ యరణ్యము నుండి వెంటనే తీసికొని పోదును. ఆమెను దుఃఖపెట్టి మరల ఈ యరణ్యమున ప్రవేశపెట్టను.

(చర్చరికతో సమీపించి లతను కౌగిలించుకొనును. అంతట దాని స్థానము నాక్రమించి యుర్వశి ప్రవేశించును)

రాజా : (నిమీలితాక్ష ఏవ స్పర్శం రూపయిత్వా) అయే ఉర్వశీ గాత్ర సంపర్కాదివ నిర్వృతం మే శరీరమ్. తథాపి న పున రస్తి విశ్వాసః. కుతః—

సమర్థయే యత్ప్రథమం ప్రియాం ప్రతి
క్షణేన తన్మే పరివర్తతేఽన్యథా
అతో వినిద్రే సహసా విలోచనే
కరోమి న స్పర్శవిభావిత ప్రియః. 68

(శనైః శ్చక్షుషీ ఉన్మీల్య) కథం సత్యమేవ ప్రియతమా!

ఉర్వశీ : (బాష్పం విసృజ్య) జయతు జయతు మహారాజః.

రాజా :

త్వద్వియోగోద్భవే తన్వి మయా తమసి మజ్జతా
దిష్ట్యా ప్రత్యుపలబ్ధాసి చేతనేవ గతాసునా. 69

(అనన్తరే చర్చరీ)

---

రాజు : (కన్నులు మూసికొని యుండియే స్పర్శను నటించుచు) ఓహో ! ఉర్వశీ శరీర సంపర్కము వలనవలె నా శరీరము సుఖమనుభవించు చున్నది. అయినను మరి నమ్మకము కలుగకున్నది. ఏలనన—

* మొదట దేనిని ప్రియురాలినిగా భావించితినో అది క్షణములో నాకు అన్యముగా మారిపోవుచున్నది. అందువల్ల స్పర్శచే గుర్తింప బడిన ప్రియురాలుగల నేను ఒక్కసారిగా కన్నులను తెఱువను.

(మెల్లగా కన్నులను దెఱచి) ఏమి నిజముగానే ప్రియురాలే ? .

ఉర్వశీ : (కన్నీరు విడిచి) మహారాజునకు జయము జయము.

రాజు :

* ఓ తన్వీ ! నీ వియోగమువలన బుట్టిన యంధకారమున మునిగి యున్న నాచేత గత ప్రాణునిచే చైతన్యమువలె భాగ్యవశమున నీవు మరల పొందబడినావు.

(తరువాత చర్చరీ గీతి)

మయూరః పరభృద్దంసో రథాఙ్గోఽలిర్గజః పర్వతః సరిత్కురఙ్గః
తవ కారణేనారణ్యే భ్రమతా కో నఖలు పృష్టో మయా రుదతా.70*

ఉర్వశీ : అభ్యన్తరకరణయా మయా ప్రత్యక్షీకృత వృత్తాన్తః ఖలు మహారాజః.

రాజా : అభ్యన్తరకరణ యేతి నఖలు తే వచనార్థమవైమి.

ఉర్వశీ : కథయిష్యామి. ఏతత్తావత్ప్రసీదతు మహారాజో యన్మయా కోపవశం గతయైతదవస్థాన్తరం ప్రాపితో మహారాజః.

రాజా : కల్యాణి న తావదహం ప్రసాదయితవ్యః. త్వద్దర్శనాదేవ ప్రసన్న బాహ్యాంతః కరణోఽన్తరాత్మా. కథయ కథమియన్తం కాలమవస్థితా మయా వినా భవతీ.

ఉర్వశీ : శృణోతు మహారాజః. భగవతా కుమారేణ శాశ్వతం

---

* నీ నిమిత్తమున అరణ్యమున రోదించుచు దిరుగుచుండిన నాచేత - మయూరము, పరభృతము, హంసము, చక్రవాకము, మధుపము, గజము, పర్వతము, నది, కురంగము - ప్రశ్నింపబడనిది ఏదియు లేదుగదా.

ఉర్వశి : అణచబడిన యింద్రియ శక్తిగల నాచేత మహారాజు వృత్తాంత మంతయు ప్రత్యక్షముగా చూడబడినది.

రాజు : "అణచబడిన యింద్రియ శక్తిగల నాచేత" అన్న నీమాట యొక్క అర్థమును నే నెఱుగను గదా.

ఉర్వశి : చెప్పెదను. కోపపరవశురాలైన నాచేత మహారాజు ఇట్టి యవస్థను పొందింపబడినందుకు మహారాజు నన్నిప్పుడు క్షమింపవలెను.

రాజు : కల్యాణీ! ఇప్పుడు నన్నింక ప్రసన్నుని గావింప నవసరములేదు. నీ దర్శనము వల్లనే అంతరాత్మ ప్రసన్న బాహ్యాంతఃకరణమైనది. నన్నువిడిచి నీ వింతకాల మెట్లుంటివో చెప్పుము.

ఉర్వశి : మహారాజు వినవలె. కుమారస్వామిచేత నిశ్చలమైన బ్రహ్మచర్యము అవలంబింపబడి అకలుషము అను గంధమాదన పర్వతమందలి ఆల

కుమారవ్రతం గృహీత్వాఽకలుషో నామ గన్ధమాదన కచ్ఛోఽ ధ్యాసితః కృతశ్చైష విధిః.

రాజా : క ఇవ.

ఉర్వశీ : య ఏతం ప్రదేశం స్త్రీ ప్రవేక్ష్యతి సా లతాభావేన పరిణంస్యతి. గౌరీచరణరాగసమ్భవం మణింవినా తతోన మోక్ష్యత ఇతి. సాహం గురుశాప సంమూఢ హృదయా దేవతా సమయం విస్మృత్యా గృహీతానునయా కుమార వనం ప్రవిష్టా. ప్రవేశాన న్తరమేవ వాస న్తీలతా సంవృత్తా.

రాజా : ప్రియే సర్వముపపన్నమ్.

రతిఖేద సుప్తమపి మాం శయనే యా మన్యసే ప్రవాసగతమ్
సా త్వం ప్రియే సహేథాః కథం మదీయం చిరవియోగమ్. 71

ఇదం తద్యథాకథితం త్వత్సఙ్గమనిమిత్తం మునేరు

---

ప్రదేశము అధివసింపబడినది. ఈ నియమముకూడ చేయబడినది.

రాజు : ఏమని ?

ఉర్వశి : ఈ వనమును ఏ స్త్రీ ప్రవేశించునో అది లతారూపమున పరిణమింప గలదు. గౌరీ చరణమునుండి పుట్టిన మణి లేనిదే ఆ స్థితినుండి ముక్తిపొందజాలదు అని. నేను గురుశాపమువల్ల మూఢచిత్తనై దేవతా నియమమును మఱచి తమ యనునయమును తిరస్కరించి కుమారవనమును ప్రవేశించితిని. ప్రవేశించినంతనే వాసంతీలత నై పోతిని.

రాజు : ప్రియా ! అంతయు సంభవమే.

ప్రియురాలా ! రతిచే అలసి శయ్యపై నిద్రించియుండినప్పటికి గూడ నన్ను దూరదేశమందున్నవానినిగా భావించుచుందువుగదా. అట్టినీవు నా చిరవియోగమును ఎట్లు సహింపగలిగితివో కదా?

నీవు చెప్పినట్లు నీసమాగమమునకు కారణమైన అమణి యిదియే.

పలభ్య మణిప్రభావాదాసాదితా త్వమస్మాభిః (ఇతి మణిం దర్శయతి)

ఉర్వశీ : అహో సంగమ నీయః – అతఃఖలు మహారాజేనాలిఙ్గిత మాత్రైవ ప్రకృతిస్థాస్మి సంవృత్తా. (మణిమాదాయ మూర్ధని వహతి)

రాజా : ఏవమేవ సుందరి, క్షణమాత్రం స్థీయతామ్.

స్ఫురతా విచ్ఛురిత మిదం రాగేణ మణేర్లలాటనిహితస్య
శ్రియ ముద్వహతి ముఖం తే బాలాతపరక్తకమలస్య. 72

ఉర్వశీ : ప్రియంవద, మహాన్ ఖలు కాలస్తవ ప్రతిష్ఠానాన్నిర్గతస్య. అసూయన్తి మహ్యాం ప్రకృతయః. తదేహి ! నివర్తావహే.

రాజా : యదాజ్ఞాపయతి భవతీ.

---

ఒక మునినుండి సంపాదింపబడిన ఈ మణిప్రభావమువల్ల నీవు మాచే తిరిగి పొందబడినావు. (అని మణిని చూపును)

ఉర్వశి : ఓహో సంగమనీయము! దీనివల్ల నేసుమా మహారాజుచే ఆలింగిత నైనంతమాత్రమున నిజరూపమును పొందినదాననైతిని. (మణిని దీసికొని శిరస్సున బెట్టుకొనును)

రాజు : సుందరీ! క్షణమాత్రము ఇట్లే యుండుము.

* లలాటమునం దుంచుకొనబడిన మణియొక్క మెఱయుచున్న రక్త కాంతిచే శోభిల్లు నీ యీ ముఖము లేయెండచే ఎఱ్ఱబారిన కమలము యొక్క శోభను వహించుచున్నది.

ఉర్వశి : ప్రియవచన! నీవు ప్రతిష్ఠానమునుండి వెలువడి యెంతోకాలమైనదిగదా. ప్రజలు నాపట్ల అసూయవహింతురు. కనుక రమ్ము. మరలిపోదము.

రాజు : నీవు ఆజ్ఞాపించినట్లే.

ఉర్వశీ : కథం మహారాజో గన్తుమిచ్ఛతి.

రాజా :

అచిరప్రభావిలసితైః పతాకినా
సురకార్ముకాభినవ చిత్రశోభినా
గమితేన ఖేలగమనే విమానతాం
నయ మాం నవేన వసతిం పయోముచా. 78

(చర్చరీ)

ప్రాప్త సహచరీసఙ్గమః పులకప్రసాధితాఙ్గః
స్వేచ్ఛాప్రాప్తవిమానో విహరతి హంసయువా. 74

(ఇతి నిష్క్రాంతాః సర్వే)

ఇతి చతుర్థోఽఙ్కః.

---

ఉర్వశి : మహారాజు ఎట్లు ప్రయాణింపగోరుచున్నారు ?

రాజు :

* ఓ విలాసగమనా! విద్యుల్లతా కాంతులచేత పతాకముగలదియు, ఇంద్రధనుస్సుచేత చిత్రసౌందర్యము గలదియు అగు విమానరూపము పొందింపబడిన క్రొత్త మేఘముచేత నన్ను నగరమునకు తీసికొని పొమ్ము.

(చర్చరీగీతి)

* పొందబడిన సహచరీ సంగమముగలది, పులకలచే అలంకరింపబడిన అంగములుగలది, స్వేచ్ఛానుసారము పొందబడిన ఆకాశయానము గలది అయి యువహంసము విహరించుచున్నది.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.



## పఞ్చమోఽఙ్కః

(తతః ప్రవిశతి పరితుష్టో విదూషకః)

విదూషకః : దిష్ట్యా చిరస్య కాలస్యోర్వశీసహాయో నన్దనవన ప్రముఖేషు దేవతారణ్యేషు విహృత్య ప్రతినివృత్తః ప్రియవయస్యః. ఇదానీం స సత్కారోపచారైః ప్రకృతిభి రనురజ్యమానో రాజ్యం కరోతి. అసంతానత్వం వర్జయిత్వా న కిమప్యస్య హీనమ్. అద్య తిథివిశేష ఇతి భగవత్యో ర్గఙ్గాయమునయోః సఙ్గమే దేవీభిః సహ కృతాభిషేకః సాంప్రతముపకార్యాం ప్రవిష్టః. తద్యావత్తత్రభవతోఽలం క్రియమాణస్యానులేపన మాల్యే అగ్రగామీ భవామి. (ఇతి పరిక్రామతి)

(నేపథ్యే)

---

## పంచమాంకము

(అంతట సంతుష్టుడైన విదూషకుడు ప్రవేశించును)

విదూషకుడు : అదృష్టవశమున చిరకాలము ఉర్వశీసహితుడై వందనప్రముఖములైన దివ్యోద్యానములందు విహరించి ప్రియవయస్యుడు తిరిగి వచ్చినాడు. ఇప్పుడు సాదరములయిన యుపచారములతో ప్రజలచే ఆరాధింపబడుచున్నవాడై రాజ్యము చేయుచున్నాడు. సంతాన హీనత్వము తప్ప ఆయనకు ఏ లోటును లేదు. నేడు పుణ్యతిథి యని పవిత్ర గంగాయమునాసంగమమందు రాణులతోగూడి స్నాన మాచరించి యిప్పుడే పటభవనమును ప్రవేశించినాడు. కనుక అలంకృతుడగుచున్న యీ మనరెుక్క అనులేపనసహితమైన మాల్యమునందు నేనును పాలుపంచుకొందును (అని ముందుకు నడచును).

(తెరలో)

హా ధిక్ హా ధిక్. దుకూలోత్తరచ్ఛదే తాలవృంతా
ధారే నిక్షిప్య నీయమానో మయా భర్తు రభ్యన్తరవిలాసినీ
మౌళిరత్నయోగ్యో మణి రామిషశఙ్కినా గృధ్రేణాక్షిప్తః.

విదూషకః : (కర్ణం దత్వా) అత్యాహితమ్. పరం బహుమతః ఖలు
స వయస్యస్య సంగమనీయో నామ చూడామణిః. అతః
ఖలు అసమాప్త నేపథ్య స్తత్రభవానాసనా దుత్థాయేత
ఏవా గచ్ఛతి. యావదేన ముపసర్పామి.

(తతః ప్రవిశతి సావేగ పరిజనో రాజా)

రాజా :

అత్మనో వధ మాహర్తా క్వాసౌ విహగతస్కరః
యేన తత్ప్రథమం స్తేయం గోప్తు రేవ గృహే కృతమ్. 1

కిరాతీ : ఏష ఏష ఖలు ముఖకోటిలగ్న హేమ సూత్రేణ మణినా

---

అయ్యో అయ్యో! పట్టుగుడ్డతో చుట్టిన తాలపత్రపులము
నందుంచి తీసికొనిపోబడుచున్న, ప్రభువుగారి యంతఃపురకాంతల
శిరోరత్నము కాదగిన మణి మాంసపుముక్క యని శంకించిన గ్రద్ద
చేత ఎగదన్నుకొని పోబడినది.

విదూ : (చెవియొగ్గి) గొప్ప యనర్థము. సంగమనీయమను ఆ మణి ప్రభువు
నకు మిక్కిలి యిష్టమైనది గదా. అందువల్లనే అలంకరణము
ముగియకుండనే ఆసనమునుండి లేచి ఆయన యిటే వచ్చుచున్నాడు.
ఇప్పుడీయనను సమీపింతును.

(అంతట కలవరపడుచున్న పరిజనముతో రాజు ప్రవేశించును)

రాజు :

* రక్షకుడైన రాజుయొక్క మందిరమునందే ప్రథమ చౌర్యము
గావించి, తనకు ప్రాణహాని గొనితెచ్చుకొనుచున్న ఆ విహగతస్కరు
డెక్కడ ?

కిరాతి : ఇదిగో ఇదిగో! ముక్కుచివర దగుల్కొన సువర్ణసూత్రము గల

శిఖన్నివాకాశం పరిభ్రమతి.

రాజా : పశ్యామ్యేనమ్.

అసౌ ముఖాలమ్బితహేమసూత్రం బిభ్రన్మణిం మండలచారశీఘ్రః
అలాతచక్రప్రతిమం విహఙ్గ స్తద్రాగరేఖా వలయం తనోతి. 2

కిం ను ఖలు కర్తవ్యమ్.

విదూషకః : (ఉపేత్య) అలమత్ర ఘృణయా. అపరాధీ శాసనీయః.

రాజా : సమ్యగాహ భవాన్. ధనుర్ధను స్తావత్.

(నిష్క్రాన్తా ధనుర్గ్రాహిణీ యవనీ)

రాజా : వయస్య న దృశ్యతే విహఙ్గః.

విదూషకః : ఇతో దక్షిణాన్తేనాపగతః శాసనీయః కుణపభోజనః.

రాజా : (పరివృత్యావలోక్య) దృష్ట ఇదానీమ్.

ప్రభాపల్లవితేనాసౌ కరోతి మణినా ఖగః

---

మణితో ఆకాశము నొరయుచున్నదా యన్నట్లు తిరుగుచున్నది.

రాజు : చూచుచున్నాను.

* ముక్కునుండి వ్రేలాడుచున్న హేమసూత్రముగల మణిని దాల్చి ఈ పక్షి వేగముగా చక్రాకారమున దిరుగుచున్నదై అలాతచక్ర సదృశమైన రక్తవర్ణ రేఖామండలమును కల్పించుచున్నది. ఇప్పుడు కర్తవ్యమేమి?

విదూ : (సమీపించి) దీనిపట్ల కనికరము వలదు. అపరాధి శిక్షింపదగ్గవాడు.

రాజు : నీవు ఉచితముగా బలికితివి. ధనువు, ధనువు త్వరగా. (ధనువులను భద్రపరచు యవనస్త్రీ నిష్క్రమించును).

రాజు : మిత్రమా ! పక్షి కనబడుటలేదు.

విదూ : ఇటనుండి దక్షిణదిశగా తొలగిపోయినది శిక్షింపదగిన ఆ శవభోక్త.

రాజు : (తిరిగి చూచి) ఇప్పుడు కనబడినది.

* ఈ పక్షి కాంతులు విరజిమ్ము మణిచేత అశోకపుష్పగుచ్ఛముచేత

అశోక స్తబకేనేవ దిఙ్ముఖస్యావతంసకమ్. 8

(ప్రవిశ్య చాపహస్తా యవనీ)

యవనీ : భర్తః ఏతద్ధస్తావాప సహితం శరాసనమ్.

రాజా : కిమిదానీం ధనుషా. బాణపథ మతీతః క్రవ్యభోజనః. తథాహి.

అభాతి మణివిశేషో దూరమిదానీం పతత్రిణా నీతః
నక్తమివ లోహితాఙ్గః పరుషఘనచ్ఛేద సంయుక్తః. 4

(కఞ్చుకినం విలోక్య) లాతవ్య మద్యవనా దుచ్యతాం నాగరికః సాయంనివాసవృక్షాశ్రయీ విచీయతాం విహగదస్యురితి.

కఞ్చుకీ ; యదాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రాన్తః)

విదూషకః : ఉపవిశతు భవాన్ సాంప్రతమ్. క్వ గతః స రత్న కుమ్భీరకో భవతః శాసనాన్మోక్ష్యతే.

---

వలె దిఙ్ముఖమునకు కర్ణభూషణమును సమకూర్చుచున్నది.

(విల్లు చేతబట్టుకొని యవనస్త్రీ ప్రవేశించి)

యవని : ప్రభూ ! హస్తత్రాణసహితమైన ధనువు ఇదిగో.

రాజు : ఇప్పుడీ వింటితో నేమిపని ? ఆ మాంసభాది బాణపథమును దాటి పోయినది. ఏలనన-

* పక్షిచే నిప్పుడు అతిదూరముగా కొనిపోబడిన యా మణి విశేషము రాత్రియందు నిబిడమైన మేఘశకలముచే గప్పబడిన యంగారక గ్రహమువలె గనబడుచున్నది.

(కంచుకివంక చూచి) లాతవ్య ! సాయంకాలము గూటిని జేరుకొను ఈ దొంగపక్షిని వెదకవలసినదని ప్రధాన నగరరక్షకునకు నా మాటగా జెప్పుము.

కంచుకి : దేవర యాజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించును)

విదూ : తమరిప్పుడు ఉపవిష్టులుకండు. ఆ రత్నాపహారి యెచ్చటికిబోయి తమ శాసనమునుండి తప్పించుకోగలదు ?

రాజా : (విదూషకేణ సహోపవిశ్య)

రత్నమితి న మమ తస్మిన్మణౌ ప్రియత్వం విహంగమాక్షిప్తే
ప్రియయా తేనాస్మి సఖే సంగమనీయేన సంగమితః. 5

విదూషకః : నను పరిగతార్థోఽస్మి కృతో భవతా.

(తతః ప్రవిశతి సశరం మణిమాదాయ కఞ్చుకీ)

కఞ్చుకీ : జయతు జయతు దేవః.

అనేన నిర్భిన్నతనుః స వధ్యో బలేన తే మార్గణతాం గతేన
ప్రాప్యాపరాధోచిత మంతరిక్షా త్సమౌలిరత్నః పతితః పతత్రీ. 6

(సర్వే విస్మయం రూపయన్తి)

కఞ్చుకీ : అద్భిః ప్రక్షాలితో మణిః కస్మై ప్రదీయతామ్.

రాజా : కిరాతి అగ్నిశుద్ధమేనం కృత్వా పేటకం ప్రవేశయ.

---

రాజు : (విదూషకునితోపాటు కూర్చుండి)

* పక్షి యెత్తుకొనిపోయిన యా మణియందు నాకు మణియన్న ప్రేమ కాదు. సఖుడా ! ఆ సంగమనీయమణిచేతనే నేను ప్రియురాలితో మరల సంగతుడనైతిని.

విదూ : తమచే నిదివరకే తెలియజెప్పబడియుంటినిగదా.

(అంతట బాణసహితమైన మణిని దీసికొని కంచుకి ప్రవేశించును)

కంచుకి : దేవరకు జయము జయము.

* వధింపదగిన ఆ పక్షి బాణరూపము దాల్చిన తమయొక్క యీ సామర్థ్యముచేత చీల్చబడిన శరీరముగలదై అపరాధమునకు దగిన శిక్షను పొంది చూడారత్నసహితముగా ఆకాశమునుండి పడినది.

(అందఱు ఆశ్చర్యము నభినయింతురు)

కంచుకి : జలముచే గడుగబడిన యీ మణిని ఎవ్వరికీయవలెను ?

రాజు : కిరాతీ ! దీనిని అగ్నిశుద్ధము గావించి పెట్టెలో నుంచుము,

కిరాతీ : యద్భర్తాజ్ఞాపయతి (ఇతి మణిం గృహీత్వా నిష్క్రాంతా)

రాజా : లాతవ్య అపి జానీతే భవాన్ కస్యాయం బాణ ఇతి.

కఞ్చుకీ : నామాఙ్కితో దృశ్యతే. నతు మే వర్ణవిచారక్షమా దృష్టిః.

రాజా : తేన హ్యుపనయ శరమ్.

కఞ్చుకీ : (తథా కరోతి.)

రాజా : (నామాక్షరాణ్యనువాచ్య సాపత్యతాం రూపయతి).

కఞ్చుకీ : యావన్నియోగ మశూన్యం కరోమి. (ఇతి నిష్క్రాన్తః)

విదూషకః : కిం భవాన్విచారయతి.

రాజా : శృణు తావత్ప్రహర్తుర్నామాక్షరాణి (వాచయతి)

ఉర్వశీ సంభవస్యాయ మైలసూనో ర్ధనుర్భృతః
కుమారస్యాయుషో బాణః ప్రహర్తు ర్ద్విషదాయుషామ్. 7

---

కిరాతి : ప్రభువు ఆజ్ఞాపించినట్లే. (అని మణిని దీసికొని నిష్క్రమించును)

రాజు : లాతవ్యా ! ఈ బాణము ఎవ్వనిదో నీకేమైన తెలియునా ?

కంచుకి : పేరు చెక్కబడినట్లు కనబడుచున్నది. కాని నా దృష్టి అక్షరములను గుర్తింపజాలకున్నది.

రాజు : అయితే బాణము నిటు సమీపమునకు దెమ్ము.

కంచుకి : (అట్లే చేయును).

రాజు : (నామాక్షరములను తనలో చదువుకొని పుత్రవంతుడనైతిని అన్న భావమును అభినయించును)

కంచుకి : ఇంక స్వకర్తవ్యమున ప్రవేశింతును. (అని నిష్క్రమించును)

విదూ : ఏమిటి తమరు ఆలోచించుచున్నారు ?

రాజు : ఇదిగో ప్రహర్తయొక్క నామాక్షరములు వినుము. (పైకి చదువును)

* ఉర్వశీగర్భసంభూతుడు, పురూరవుని పుత్రుడు, శత్రువుల ఆయువులను హరించువాడు అయిన చిరంజీవి ఆయువు అను ధనుష్మంతుని యొక్క బాణము ఇది.

విదూషకః: (స పరితోషమ్) దిష్ట్యా సన్తానేన వర్ధతే భవాన్,

రాజా: సఖే కథమేతత్. అన్యత్ర నైమిషేయ సత్రా దవి యుక్తోఽహ ముర్వశ్యా. నచ మయా గర్భవ్యక్తి రాలక్షితా. కుతఏవ ప్రసూతిః. కింతు

ఆవిల పయోధరాగ్రం లవలీదళ పాండురాననచ్ఛాయమ్
కతిచిదహాని వపురభూ త్క్లమల మలసేక్షణం తస్యాః. 8

విదూషకః: మా భవాన్ సర్వం మానుషీ ధర్మం దివ్యాసు సంభావ యతు. ప్రభావనిగూఢాని తాసాం చరితాని.

రాజా: అస్తు తావదేవం యథా భవానాహ. పుత్రసంవరణే కిమివ కారణం తత్రభవత్యాః.

విదూషకః: కో దేవతారహస్యాని తర్కయిష్యతి.

---

విదూ: (సంతోషముతో) అదృష్టవశమున నీవు సంతానముతో వర్ధిల్లుచున్నావు.

రాజు: ఇది యెట్లయియుండును మిత్రుడా! నైమిశేయ సత్త్రియాగమున దప్ప ఎచ్చటను నేను ఉర్వశిని ఎడబాసియుండలేదు. ఆమె గర్భచిహ్నమును నాకు ఎఱుకపడలేదు. మఱి ప్రసవ మెచ్చటనుండి వచ్చినది. కాని–

* పూర్వమెప్పుడో కొన్నిదినములు ఆమె శరీరము మాత్రము నల్లనైన కుచాగ్రములు గలది, లవలీదళములవలె పాలిపోయిన ముఖవర్ణము గలది, అలసములయిన కన్నులుగలది అయి యుండెను.

విదూ: దివ్యస్త్రీలయందు మానుషస్త్రీధర్మములన్నియు నుండునని నీవు భావింపరాదు. వారి చర్యలు ప్రభావముచే నిగూఢములుగా నుండును.

రాజు: ఒకవేళ నీవు చెప్పినదే నిజము కావచ్చును. కుమారుని రహస్యముగా దాచియుంచుటయందు ఆమె యుద్దేశ మేమైయుండునో.

విదూ: దేవరహస్యముల నెవ్వ రూహింపగలరు ?

కఞ్చుకీ : (ప్రవిశ్య) జయతు జయతు దేవః ! దేవ, చ్యవనాశ్రమాత్ కుమారం గృహీత్వా తాపసీ సంప్రాప్తా దేవం ద్రష్టు మిచ్ఛతి.

రాజా : ఉభయమప్యవిలమ్బితం ప్రవేశయ.

కఞ్చుకీ : యదాజ్ఞాపయతి దేవః.

(ఇతి నిష్క్రమ్య చాపహస్తేన కుమారేణ తాపస్యాచ సహ ప్రవిష్టః)

కఞ్చుకీ : ఇత ఇతో భగవతీ (సర్వే పరిక్రామన్తి)

విదూషకః : (విలోక్య) కింను ఖలు స ఏష తత్రభవాన్ క్షత్రియ కుమారకో యస్య నామాఙ్కితో గృధ్రలక్ష్యవేధ్యర్ధ నారాచః. తథా బహుతరం భవన్త మనుకరోతి.

రాజా : స్యా దేవమ్. అతః ఖలు.

---

కంచుకి : (ప్రవేశించి) దేవరకు జయము జయము. దేవా ! చ్యవనుని యాశ్రమమునుండి యొక బాలుని వెంటబెట్టుకొని వచ్చిన తాపసి దేవరను దర్శింపగోరుచున్నది.

రాజు : ఇరువురనుగూడ వెంటనే ప్రవేశపెట్టుము.

కంచుకి : దేవర ఆజ్ఞాపించినట్లే.

(అని నిష్క్రమించి చాపహస్తుడైన బాలునితో, తాపసితో కలిసి ప్రవేశించును)

కంచుకి : భగవతీ ! ఇటు యిటు. (అందఱు ముందుకు నడుతురు).

విదూ : (చూచి) నామాక్షరముద్రితమై గ్రద్దను గుఱిచూచి భేదించిన ఆ యర్ధచంద్రబాణ మెవ్వనిదో ఆ క్షత్రియకుమారు డితడే కాబో లును. మఱియు నిన్ను అత్యంతము పోలియున్నాడు.

రాజు : ఇట్లే కావచ్చును. అందువల్ల నే-

బాష్పాయతే నిపతితా మమ దృష్టిరస్మిన్
వాత్సల్యబంధి హృదయం మనసః ప్రసాదః
సంజాతవేపథుభి రుజ్ఝితధైర్యవృత్తి
రిచ్ఛామి చైనమదయం పరిరబ్ధుమఙ్గైః. 9

కఞ్చుకీ : భగవతీ! ఏవం స్థీయతాం.

(తాపసీ కుమారౌ స్థితౌ)

రాజా : అమ్బ. అభివాదయే.

తాపసీ : మహాభాగ! సోమవంశ విస్తారయితా భవ (ఆత్మగతమ్) అహో అనాఖ్యాతోఽపి విజ్ఞాతోఽస్య రాజర్షేరౌరసః సమ్బన్ధః (ప్రకాశమ్) జాత ప్రణమ తే గురుమ్.

కుమారః : (చాపగర్భమఞ్జలిం కరోతి)

రాజా : ఆయుష్మాన్ భవ.

కుమారః : (ఆత్మగతమ్)

---

* ఈతనియందు ప్రసారించిన నా దృష్టి బాష్పపూర్ణమగుచున్నది; హృదయము వాత్సల్యబద్ధమగుచున్నది, మనస్సునకు ప్రసన్నత కలుగుచున్నది. ధైర్యము కోలుపోయినవాడనై కంపితములగుచున్న యంగములతో నీతనిని గాఢముగా గౌగిలించుకొనగోరుచున్నాను.

కంచుకి : భగవతీ! ఇచ్చటనే నిలువుడు.

(తాపసియు, కుమారుడును నిలుతురు)

రాజు : అమ్మా! నమస్కరించుచున్నాను.

తాపసి : మహాభాగ! సోమవంశవర్ధనుడవు కమ్ము! (తనలో) అహః! వీనికిని, ఈ రాజర్షికిని గల ఔరససంబంధము చెప్పబడకయు స్పష్టముగా దెలియబడుచున్నది గదా. (ప్రకాశముగా) బిడ్డా! నీ తండ్రికి ప్రణమిల్లుము.

కుమారుడు : (చాపముతో గూడియుండునట్లు అంజలి పట్టును).

రాజు : ఆయుష్మంతుడవు కమ్ము!

కుమా : (తనలో)

యది వార్ద మిదం శ్రుత్వా పితా మమాయం సుతోఽహమస్యేతి
ఉత్సఙ్గవర్ధితానాం గురుషు భవేత్ కీదృశః స్నేహః. 10

రాజా : భగవతి, కి మాగమన ప్రయోజనమ్.

తాపసీ : శృణోతు మహారాజః. ఏష దీర్ఘాయు రాయుర్జాతమాత్ర ఏవోర్వశ్యా కి మపి నిమిత్తమవేక్ష్య మమ హస్తే న్యాసీకృతః. యత్క్షత్రియకుమారస్య జాతకర్మాదివిధానం తదస్య భగవతా చ్యవనేనాశేషమనుష్ఠితమ్. గృహీతవిద్యో ధనుర్వేదేఽభివినీతః.

రాజా : సనాథః ఖలు సంవృత్తః.

తాపసీ : అద్య పుష్ప సమిదర్థ మృషికుమారకైః సహ గతేనానేనాశ్రమ విరుద్ధమాచరితమ్.

---

* ఈయన నా తండ్రి యనియు, నేను ఈయన కుమారుడననియు విన్నంతమాత్రనే ఇంత ప్రేమ గలిగినచో, ఒడిలో గూర్చుండబెట్టుకొని పెంచబడిన బిడ్డలకు తండ్రులయందు ఎట్టి ప్రేమ కలుగునో కదా.

రాజు : భగవతీ ! తమ రాకకు ప్రయోజనమేమి ?

తాపసి. మహారాజు వినవలెను. దీర్ఘాయుష్మంతుడైన ఈ ఆయువు పుట్టినప్పుడే యేదో కారణము మనస్సునందుంచుకొని యుర్వశిచేత నాకు అప్పగింపబడినాడు. క్షత్రియకుమారున కెట్టి జాతకర్మాదికము విధింపబడునో అది యంతయు నీతనికి భగవంతుడైన చ్యవనునిచేత నిర్వర్తింపబడినది. సర్వవిద్యలు గ్రహించి, ధనుర్వేదమునందును శిక్షితుడైనాడు.

రాజు : కృతార్థుడైనాడ గదా.

తాపసి : ఈ దినము పుష్పములు సమిధలు తెచ్చుటకై ఋషికుమారులతో గలసి యేగిన యీతనిచేత ఆశ్రమ విరుద్ధమైన పని యాచరింపబడినది.

విదూషకః : (సావేగమ్) కి మివ.

తాపసీ : గృహీతామిషః కిల గృధ్రః. పాదపశిఖరే నిలీయమానోఽనేన లక్ష్యీకృతో బాణస్య.

విదూషకః : (రాజాన మవలోకయతి)

రాజా : తత స్తతః.

తాపసీ : తత ఉపలబ్ధ వృత్తాన్తేన భగవతా చ్యవనేనాహం సమాదిష్టా నిర్యాతయ హ స్తన్యాసమితి. తదిచ్ఛామి దేవీ మూర్వశీం ప్రేక్షితుమ్.

రాజా : తేన హ్యాసన మనుగృహ్ణాతు భగవతీ.

తాపసీ : (ఉపనీత ఆసన ఉపవిశతి)

రాజా : లాతవ్య. ఆహూయతాముర్వశీ.

కఞ్చుకీ : యదాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రాన్తః)

---

విదూ : (ఆవేశముతో) ఎట్లో ?

తాపసి : మాంసఖండమును బట్టుకొని వృక్షాగ్రమున దాగియున్న యొక గ్రద్ద వీనిచే బాణమునకు గురిచేయబడినది.

విదూ : (రాజువంక చూచును)

రాజు : తరువాత తరువాత

తాపసి : తరువాత ఈ విషయము తెలిసికొన్న చ్యవనభగవానునిచే నేను 'అప్పగించుకొన్న దానిని తిరిగి యిచ్చివేయుము' అని యాదేశింప బడితిని. కనుక దేవియైన యుర్వశిని దర్శింపగోరుచున్నాను.

రాజు : అయితే భగవతి యీ యాసనమును గ్రహింపవలెను.

తాపసి : (సమీపమునకు తేబడిన యాసనమున కూర్చుండును)

రాజు : లాతవ్య ! ఉర్వశిని బిలుచుకొని రమ్ము.

కంచుకి : దేవర యాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును)

రాజా (కుమార మవలోక్య) ఏహ్యేహి వత్స.

సర్వాఙ్గీణః స్పర్శః సుతస్య కిల తేన మాముపగతేన
అహ్లాదయస్వ తావచ్చన్ద్రకర శ్చన్ద్రకాన్తమివ. 11

తాపసీ: జాత అనన్దయ పితరమ్

కుమారః: (రాజాన ముపగమ్య, పాదగ్రహణం కరోతి)

రాజా: (కుమారం పరిష్వజ్య పాదపీఠే చోపవేశ్య) వత్స ఇత స్తవ పితుః ప్రియసఖం బ్రాహ్మణ మశఙ్కితో వన్దస్వ.

విదూషకః: కిమితి శఙ్క్యతే. నన్వాశ్రమవాసపరిచిత ఏవ శాఖామృగః.

కుమారః: (సస్మితమ్) తాత వన్దే.

విదూషకః: స్వస్తి భవతే.

(తతః ప్రవిశత్యుర్వశీ కఞ్చుకీ చ)

---

రాజు: (కుమారుని జూచి) బిడ్డా రమ్ము రమ్ము.

* పుత్రుని యొక్క స్పర్శ సర్వాంగసుఖప్రదముగదా. పొందబడిన యట్టిదానిచే నిప్పుడు చంద్రకిరణము చంద్రకాంతశిలనువలె నన్ను సుఖపెట్టుము.

తాపసి: బిడ్డా! తండ్రిని ఆనందింపజేయుము.

కుమా: (రాజును సమీపించి పాదగ్రహణము చేయును)

రాజు: (కుమారుని కౌగిలించి, పాదపీఠమున గూర్చుండబెట్టి) బిడ్డా! ఇచ్చట నీ తండ్రి ప్రియసఖుడైన బ్రాహ్మణునకు నిర్భయముగా నమస్కరింపుము.

విదూ: ఏల భయపడుటు? ఆశ్రమవాసమువలన పరిచితమైనదే కదా శాఖామృగము.

కుమా: (చిఱునవ్వుతో) తండ్రీ! నమస్కరించుచున్నాను.

విదూ: నీకు మేలగుగాక.

(అంతట ఉర్వశి, కంచుకి ప్రవేశింతురు)

కఞ్చుకీ : ఇత ఇతో దేవః.

ఉర్వశీ : (కుమార మవలోక్య) కో ను ఖల్వేష నారాచాసనః పాదపీఠే స్వయం మహారాజేన సంయమ్యమాన శిఖండక స్తిష్ఠతి. (తాపసీం దృష్ట్వా) అహో సత్యవతీసూచితో మమపుత్రక అయం. మహాన్ ఖలు సంవృత్తః (పరిక్రామతి)

రాజా : (ఉర్వశీం దృష్ట్వా)

ఇయం తే జననీ ప్రాప్తా త్వదాలోకన తత్పరా
స్నేహప్రస్నవనిర్భిన్న ముద్వహన్తీ స్తనాంశుకమ్. 18

తాపసీ : జాత ఏహి ప్రత్యుద్గచ్ఛ మాతరమ్.

కుమారః : (ఉర్వశీం ప్రత్యుద్గచ్ఛతి)

ఉర్వశీ : అమ్మ పాదప్రణామం కరోమి.

తాపసీ : వత్సే భర్తు ర్బహుమతా భవ.

---

కంచుకి : దేవా ఇటు యిటు.

ఉర్వశి : (బాలుని చూచి) మహారాజుచే స్వయముగా ముడి వేయబడుచున్న జుట్టు గలవాడై ధానుర్ధారియై పాదపీఠమున గూర్చుండినవాడు ఈతడెవ్వడై యుండునో! (తాపసిని చూచి) సత్యవతిని జూడగా వీడు నా పుత్రుడు అయివు అని విదితమగుచున్నది ఎంత పెద్దవాడైనాడు!

రాజు : (ఉర్వశిని చూచి)

* నిన్ను చూచుటయందాసక్తిగలదై, పుత్రప్రేమచే స్రవించిన పాలచే తడిసిన పైటను ధరించినదై ఇదిగో నీ జనని వచ్చినది.

తాపసి : బిడ్డా! రమ్ము. తల్లికి ఎదురేగుము.

కుమా : (ఉర్వశికి ఎదురేగును)

ఉర్వశి : అమ్మా! పాదాభివందనము చేయుచున్నాను.

తాపసి : బిడ్డా! భర్తకు ప్రేమపాత్రురాలవు కమ్ము.

కుమారః : అమ్మ అభివాదయే.

ఉర్వశీ : (కుమారమున్నమితముఖం పరిష్వజ్య) వత్స పితరమారాధయితా భవ. (రాజానముపేత్య) జయతు జయతుమహారాజః.

రాజా : స్వాగతం పుత్రవత్యై. ఇత ఆస్యతామ్. (అర్ధాసనం దదాతి)

ఉర్వశీ : (ఉపవిశతి)

(సర్వే యథోచిత ముపవిశన్తి)

తాపసీ : ఏష గృహీతవిద్య ఆయుః సాంప్రతం కవచహరః సంవృత్తః. తదేతస్య తే భర్తుః సమక్షం నిర్యాతితో హస్తనిక్షేపః తద్విసర్జయితు మిచ్ఛామి. ఉపరుధ్యతే మమాశ్రమధర్మః.

ఉర్వశీ : చిరస్యార్యాం దృష్ట్వాధికతర మవితృప్తాస్మి. న శక్నోమి విస్రష్టుమ్. అన్యాయ్యం పునరుపరోద్ధుమ్. తద్గచ్ఛత్వార్యా పునర్దర్శనాయ.

---

కుమా : తల్లీ ! నమస్కరించుచున్నాను.

ఉర్వశీ : (పైకెత్తబడిన ముఖముగల కుమారుని కౌగిలించుకొని) బిడ్డా ! తండ్రిని సంతోషపెట్టువాడవు కమ్ము. (రాజును సమీపించి) మహారాజునకు జయము జయము.

రాజు : పుత్రవతికి స్వాగతము. ఇటు కూర్చుండుము. (అర్ధాసన మొసంగును)

ఉర్వశీ : (కూర్చుండును).

(అందఱును తగు విధముగా కూర్చుండుదురు)

తాపసి : సర్వవిద్యలు నేర్చిన ఈ ఆయువు ఇప్పుడు కవచధారణవయస్కుడైనాడు. అందువల్ల నీవు నా హస్తమునందుంచినదానిని నీ భర్త సమక్షమునందు నీకు తిరిగి యర్పించుచున్నాను. ఇంక సెలవిప్పింప గోరుదును. నా యాశ్రమధర్మమునకు బాధయగుచున్నది.

ఉర్వశీ : ఆర్యురాలిని చిరకాలమునకు చూచి మిక్కిలి తనివితీరనిదాన నగుచున్నాను. విడిచిపెట్టజాలకున్నాను. మరి నిర్బంధించుటయు అన్యాయమే. కనుక ఆర్యురాలు పోయిరావచ్చును.

రాజా : అమ్బ భగవతే చ్యవనాయ మాం ప్రణిపాతయ.

తాపసీ : ఏవం భవతు.

కుమారః : ఆర్యే యది సత్యమేవ నివర్తసే తదా మామప్యాశ్రమం నేతు మర్హాసి.

రాజా : అయివత్స ఉషితం త్వయా పూర్వస్మిన్నాశ్రమే. ద్వితీయ మధ్యాసితుం తవ సమయః.

తాపసీ : జాత గురోర్వచన మనుతిష్ఠ.

కుమారః : తేన హి –

యః సుప్తవాన్మదఙ్కే శిఖణ్డకణ్డూయనోపలబ్ధసుఖః
తం మే జాతకలాపం ప్రేషయ మణికణ్ఠకం శిఖనమ్. 18

తాపసీ : (విహస్య) ఏవం కరోమి. స్వస్తి భవతు యుష్మభ్యమ్.

(ఇతి నిష్క్రాన్తా)

---

రాజు : అమ్మా ! భగవంతుడైన చ్యవనునకు నా ప్రణామము నంద తేయుము.

తాపసి : అట్లే యగుగాక.

కుమా : ఆర్యురాలా ! నిజముగనే నీవు మరలిపోవుచున్నట్లయితే నన్ను గూడ ఆశ్రమమునకు దీసికొనిపోవలయునుసుమా.

రాజు : బిడ్డా ! ప్రథమాశ్రమవాసము పలిపితివి. ఇంక ద్వితీయాశ్రమము ప్రవేశించుటకు నీకిది తరుణము.

తాపసి : బిడ్డా ! తండ్రిమాటను అనుష్ఠింపుము.

కుమా : అయినచో–

* తోకపై గోకుటవల్ల సుఖముపొంది యేది నా యొడిలో నిద్ర పోయెడిదో, మణికంఠకమనెడు ఆ నెమిలిపిల్లను పింఛము వచ్చిన పిదప నాకు పంపుము.

తాపసి : అట్లే చేయుదును. మీ కందఱకు మేలగుగాక ! (అని నిష్క్ర మించును.)

రాజా : కల్యాణి.

అద్యాహం పుత్రిణామగ్ర్యః సత్పుత్రేణాముణా తవ
పౌలోమీ సంభవేనేవ జయన్తేన పురన్దరః. 14

ఉర్వశీ : (స్మృత్వా రోదితి).

విదూషకః : కింనుఖలు తత్రభవత్యేకపదేఽశ్రుముఖీ సంవృత్తా.

రాజా : (సావేగమ్).

కిం సున్దరి ప్రరుదితాసి మమోపపన్నే
వంశస్థితే రధిగమాన్మహతి ప్రమోదే
పీనోన్నత స్తన విసర్పిభి రానయన్తి
ముక్తావలీ విరచనా పునరుక్తమస్రైః. 15

(బాష్పమస్యాః ప్రమార్ష్టి)

ఉర్వశీ : శృణోతు మహారాజః. ప్రథమం పునః పుత్రదర్శనేన విస్మృతాస్మి. ఇదానీం మహేన్ద్ర సంకీర్తనేవ స్మారితః

---

రాజు : కల్యాణి !

* నీయొక్క సత్పుత్రుడైన యీతనిచేత, పౌలోమీసంభూతుడైన జయంతునిచేత పురందరుడువలె, నే నిప్పుడు పుత్రవంతులలో అగ్రగణ్యుడనై తిని.

ఉర్వశి : (జ్ఞప్తికి దెచ్చికొని యేడ్చును.)

విదూ : ఇది యేమి పూజ్యురాలు ఆకస్మికముగా అశ్రుముఖయైనది ?

రాజు : (ఉద్రేకముతో)

* సుందరి ! వంశప్రతిష్ఠ లభించినందువల్ల నాకు గొప్ప ప్రమోదము కలుగగా, పీనములు ఉన్నతములునైన స్తనములందు ప్రసరించు చున్న యశ్రుబిందువులచే ముత్యాలదండ కూర్పును వ్యర్థము (పునరుక్తము) చేయుచున్నదానవై యేల నీ విట్లు రోదింతువు ?

ఉర్వశి : మహారాజు వినవలెను. పుత్రదర్శనముచే ముందు మఱచిపోతిని. ఇప్పుడు మహేంద్రుని పేరెత్తుటవల్ల గుర్తువచ్చిన విషయము

సమయో మమ హృదయ మాయాసయతి.

రాజా : కథ్యతాం సమయః.

ఉర్వశీ : అహం పురా మహారాజ గృహీతహృదయా మహేన్ద్రేణా జ్ఞాపితా.

రాజా : కి మితి.

ఉర్వశీ : యదా స మము ప్రియసఖో రాజర్షి స్త్వయి సముత్పన్నస్య వంశకరస్య ముఖం ప్రేక్షిష్యతే తదా త్వయా భూయోఽపి మమ సమీపమాగన్తవ్యమితి. తతో మయా మహారాజ వియోగభీరుతయా జాతమాత్రఏవ విద్యాగమనిమిత్తం భగవతశ్చ్యవనస్యాశ్రమపదే ఏష పుత్ర ఆర్యాయాః సత్యవత్యా హస్తేఽప్రకాశం నిక్షిప్తః. అద్య పితురారాధన సమర్థః సంవృత్త ఇతి కలయన్త్యా నిర్యాతితో మే దీర్ఘాయుః.

---

నా హృదయమును దుఃఖపెట్టుచున్నది.

రాజు : ఆ నియమమేమో చెప్పుము.

ఉర్వశి : పూర్వము మహారాజుచే హరింపబడిన హృదయము గల నేను మహేంద్రునిచే ఆదేశింపబడితిని-

రాజు : ఏమని ?

ఉర్వశి : నా ప్రియమిత్రుడైన ఆ రాజర్షి నీయందు జన్మించిన పుత్రుని యొక్క ముఖమును ఎప్పుడు దర్శించునో అప్పుడు నీవు మరల నా సమీపమునకు రావలసియుండును - అని. అందువల్ల మహారాజు వియోగభయముచే పుట్టినప్పుడే ఈ పుత్రుడు విద్యాభ్యాసము కొఱకు భగవంతుడైన చ్యవనుని యాశ్రమమున పూజ్యురాలైన సత్యవతి హస్తమున రహస్యముగా నుంచబడినాడు. ఇప్పుడు తండ్రిని సేవింప సమర్థుడైనాడని తలంచిన యీమెచే ఈ చిరంజీవి నాకు తిరిగి యప్పగింపబడినాడు. అందువల్ల మహారాజుతోడి నా సంయో

తదేతావాన్మే మహారాజేన సంవాసః.

(సర్వే విషాదం రూపయన్తి)

రాజా : (స నిఃశ్వాసమ్) అహో సుఖప్రత్యర్థితా దైవస్య.

అశ్వాసితస్య మమ నామ సుతోపలబ్ధ్యా
సద్యస్త్వయా సహ కృశోదరి విప్రయోగః
వ్యావర్తితాతపరుజః ప్రథమాభ్రవృష్ట్యా
వృక్షస్య వైద్యుత ఇవాగ్నిరుపస్థితోఽయమ్. 16

విదూషకః : అయం సోర్థోఽనర్థానుబన్ధీ సంవృత్తః. సాంప్రతం తర్కయామి తత్రభవతా వల్కలం గృహీత్వా తపోవనం గన్తవ్యమితి.

ఉర్వశీ : మామపి మన్దభాగినీం కృతవినయస్య పుత్రస్య లాభానన్తరం స్వర్గారోహణేనావసితకార్యాం మహారాజః సమర్థయతే.

రాజా : సున్దరి మామైవమ్.

---

గము ఇంతవఱకే.

(అందఱును విషాదము నటింతురు)

రాజు : (నిట్టూర్పుతో) ఆహా విధియొక్క సుఖవ్యతిరేకత !

* ఓ కృశోదరి ! సుతప్రాప్తిచే సంతోషము నందుచున్నంతలోనే, ప్రథమ మేఘవర్షముచే తొలగింపబడిన యెండబాధగల వృక్షమునకు అశనిపాతమువలె, నాకు నీతోడి వియోగము సంభవించుచున్నది.

విదూ : ఈ సంఘటనమింకను దుస్సంఘటనలతో గూడియుండును. ఇప్పుడు తమరు వల్కలము ధరించి తపోవనమున కరుగవలసియుండునని యూహింతును.

ఉర్వశి : వినీతుడైన పుత్రుడు లభించినంతనే స్వర్గమున కేగుటచేత మందభాగినినైన నన్నుగూడ వచ్చినపని ముగించుకొన్నదానినిగా మహారాజు భావించునా ?

రాజు : సుందరి అట్లుకాదు.

నహి సులభవియోగా కర్తు మాత్మప్రియాణి
ప్రభవతి పరవత్తా శాసనే తిష్ఠ భర్తుః
అహమపి తవ సూనా వాయుషి న్యస్తరాజ్యో
విచరిత మృగయూథాన్యాశ్రయిష్యే వనాని. 17

కుమారః : నార్హతి తాతః పుంగవధారితాయాం ధురి దమ్యం నియోజయితుమ్.

రాజా : అయి వత్స!

శమయతి గజానన్యాన్ గన్ధద్విపః కలభోఽపి సన్
భవతి సుతరాం వేగోదగ్రం భుజఙ్గశిశోర్విషమ్
భువ మధిపతిర్బాలావస్థోఽప్యలం పరిరక్షితుం
న ఖలు వయసా జాత్యైవాయం స్వకార్యసహో భరః. 18

లాతవ్య మద్వచనాదమాత్య పరిషదం బ్రూహి సంభ్రియతా

---

* సులభవియోగమైన పరాధీనత మనకు ప్రియములైన వానిని చేయుటకు శక్తిగలది కాదుకదా. ప్రభువుయొక్క ఆజ్ఞయందే వర్తింపుము. నీ పుత్రుడైన ఆయువునందు రాజ్యము సమర్పించి నేను గూడ మృగసమూహములు సంచరించు వనముల నాశ్రయింపగలను.

కుమా : పుంగవము ధరించిన భారమునందు లేగదూడను నియోగించుట నాయనగారికి యుక్తముకాదు.

రాజు : బిడ్డా!

* మదగజము గున్నయయ్యు అన్యగజములను జయింపగలదు. నాగుపాము పిల్లయొక్క విషముకూడ అత్యంతము దారుణమై యుండును. వయస్సున చిన్నవాడయ్యు క్షత్రియుడు భూమిని రక్షించుటకు సమర్థుడగును. స్వకార్యనిర్వాహణ సమర్థమైన ఈ ప్రభుత్వము జాతిచేతనే కాని వయస్సుచేత కలుగునది కాదుగదా.

లాతవ్య! ఆయువుయొక్క రాజ్యాభిషేకమునకు ఏర్పాట్లు

మాయుషో రాజ్యాభిషేక ఇతి.

కఞ్చుకీ: యదాజ్ఞాపయతి దేవః (ఇతి దుఃఖితో నిష్క్రాన్తః)
(సర్వే దృష్టి ప్రతిఘాతం రూపయన్తి)

రాజా: (ఆకాశమవలోక్య) కింను ఖలు నిరభ్రే విద్యుత్సమ్పాతః.

ఉర్వశీ: (విలోక్య) అహో భగవాన్నారదః.

రాజా: అయే భగవాన్నారదః. య ఏషః.

గోరోచనా నికషపిఙ్గ జటాకలాపః
సంలక్ష్యతే శశికలామల వీతసూత్రః
ముక్తాగుణాతిశయ సంభృతమణ్డనశ్రీః
హేమప్రరోహ ఇవ జఙ్గమ కల్పవృక్షః. 19

అర్ఘ్య మస్మై.

ఉర్వశీ: (యథోక్తమాదాయ) ఇదం భగవతేఽర్ఘ్యమ్.
(తతః ప్రవిశతి నారదః)

---

చేయవలెనని నా మాటగా మంత్రిమండలికి చెప్పుము.

కంచుకి: దేవర ఆజ్ఞాపించినట్లే (అని దుఃఖించుచు నిష్క్రమించును).
(అందఱును కన్నులు మిఱుమిట్లు గొనుట నటియింతురు)

రాజు. (ఆకాశము దిక్కుచూచి) ఏమిది మేఘరహితమైన ఆకాశమున మెఱుపుకాంతి?

ఊర్వశి: (చూచి) ఓహో నారదమహర్షి!

రాజు: ఆహా! నారదమహర్షియే! ఈయన.

* గోరోచనము యొక్క ఒరపిడిరేఖవలె పింగళవర్ణమైన జడలగుంపు గలవాడు, చంద్రరేఖవలె తెల్లనైన జందెము గలవాడు, ముత్యాల దండలచే మిక్కిలిగా చేకూర్పబడిన యలంకరణ సమృద్ధిగలవాడు అయి బంగారు కొమ్మలు గలిగి నడచుచున్న కల్పవృక్షమా యన్నట్లు తోచుచున్నాడు.

ఈయనకొఱకు అర్ఘ్యము

ఊర్వశి: (చెప్పినవిధముగా తెచ్చి) ఇదిగో పూజ్యునకు అర్ఘ్యము.
(అంతట నారదుడు ప్రవేశించును)

నారదః : విజయతాం మధ్యమలోకపాలః.

రాజా : (ఉర్వశీ హస్తాదర్ఘ్య మాదాయావర్జ్య)భగవన్నభివాదయే.

ఉర్వశీ · భగవన్ ప్రణమామి.

నారదః : అవిరహితౌ దమ్పతీ భూయాస్తామ్.

రాజా : (ఆత్మగతమ్) అపినామైవంస్యాత్. (ప్రకాశమ్. కుమార మాశ్లిష్య) వత్స భగవన్త మభివాదయస్వ.

కుమారః : భగవన్నౌర్వశేయ ఆయుః ప్రణమతి.

నారదః : ఆయుష్మానేధి.

రాజా : అయం విష్టరోఽనుగృహ్యతామ్.

నారదః : (తథోపవిష్టః) రాజన్ శ్రూయతాం మహేన్ద్రసన్దేశః.

రాజా : అవహితోఽస్మి.

---

నారదుడు : మధ్యమలోకపాలుడు వర్ధిల్లుగాక !

రాజు : (ఉర్వశి హస్తమునుండి అర్ఘ్యము దీసికొని చల్లి) భగవానుడా ! అభి వాదనము చేయుచున్నాను.

ఉర్వశి : భగవంతుడా ! ప్రణమిల్లుచున్నాను.

నారదుడు : ఎడబోని దంపతులు అగుదురుగాక !

రాజు . (తనలో) అట్లయినచో ఎంత బాగుగానుండును ! (పైకి. కుమారుని కౌగిలించుకొని) బిడ్డా ! పూజ్యునకు నమస్కరింపుము.

కుమా : స్వామీ ! ఉర్వశీపుత్రుడైన ఆయువు నమస్కరించుచున్నాడు.

నార : చిరంజీవివై వర్ధిల్లుము.

రాజు : ఈ యాసనము ననుగ్రహింతురుగాక.

నార : (అట్లే కూర్చుండి) రాజా ! మహేంద్రుని సందేశము వినుము.

రాజు : అవహితుడనై యున్నాను.

నారదః : ప్రభావదర్శీ మఘవా వనగమనాయ కృతబుద్ధిం భవన్త మనుశాస్తి.

రాజా : కి మాజ్ఞాపయతి.

నారదః : త్రికాలదర్శిభిర్మునిభిరాదిష్టః సురాసురసంగరో భావీ. భవాంశ్చ సాంయుగీనః సహాయో నః. తేన త్వయా నశస్త్రం సంన్యస్తవ్యమ్. ఇయం చోర్వశీ యావదాయుస్తవ సహధర్మ చారిణీ భవిష్యతి.

ఉర్వశీ : (అపవార్య) అహో శల్యం మే హృదయాదపనీతమివ.

రాజా : పరవానస్మి దేవేశ్వరేణ.

నారదః : యుక్తమ్.

త్వత్కార్యం వాసవః కుర్యాత్ త్వంచ తస్యేష్టమాచరేః
సూర్యః సమేధయత్యగ్ని మగ్నిః సూర్యంచ తేజసా. 20

---

నార. దివ్యదృష్టిచే చూచిన మఘవంతుడు వనగమనముకొఱకు కృతనిశ్చయుడవైన నిన్ను ఆజ్ఞాపించుచున్నాడు.

రాజు : ఏమాజ్ఞాపించుచున్నాడు ?

నార : త్రికాలదర్శులయిన మునులచేత తెలుపబడిన దేవాసుర సంగ్రామము జరుగబోవుచున్నది. నీవుకూడ మాకు సమరసహాయుడవు కావలెను. కనుక నీవు శస్త్రమును విడిచిపెట్టరాదు. ఈ యుర్వశియు నీకు యావజ్జీవము సహధర్మచారణియగుగాక- అని.

ఉర్వశి : (అపవారించి) అహా ! నా హృదయమునుండి శల్యము తొలగింపబడినట్లయినది గదా.

రాజు : దేవేంద్రునిచే అస్వతంత్రుడను గావింపబడితినిగదా.

నార : యుక్తమే -

* నీ కార్యమును ఇంద్రుడు చేయవలెను. నీవాయన యిష్టమును ఆచరింపవలెను. సూర్యుడు అగ్నిని జ్వలింపజేయును, అగ్ని తన తేజముచే సూర్యుని ప్రకాశింపజేయును.

(ఆకాశమవలోక్య) రమ్భే, ఉపనీయతాం స్వయం మహేన్ద్రేణ సంభృతః కుమారస్యాయుషో యౌవరాజ్యాభిషేకః.

(ప్రవిష్టా యథోక్తహస్తా అప్సరసః)

అప్సరసః : భగవన్నేతేఽభిషేక సమ్భారాః.

నారదః : ఉపవేశ్యతా మాయుష్మాన్ భద్రపీఠే.

రమ్భా : ఇతో వత్స (ఇతి కుమార ముపవేశయతి)

నారదః : (కుమారస్య శిరసి కలశమావర్జ్య) రమ్భే నిర్వర్త్యతాం శేషోవిధిః.

రమ్భా : (యథోక్తం నిర్వర్త్య) వత్స ప్రణమ భగవన్తం మాతా పితరౌచ.

కుమారః : (యథాక్రమం ప్రణమతి)

నారదః : స్వస్తి భవతే.

---

(ఆకాశమువంక చూచి) రంభా! స్వయముగా మహేంద్రునిచే సమకూర్చబడిన చిరంజీవి ఆయువుయొక్క యౌవరాజ్యాభిషేక ద్రవ్యమును తెమ్ము.

(చెప్పబడినట్లు అభిషేకహస్తలై అప్సరసలు ప్రవేశింతురు)

అప్సరసలు : పూజ్యుడా! ఇవిగో అభిషేక సంభారములు.

నార : చిరంజీవిని భద్రపీఠమున కూర్చుండబెట్టుడు.

రంభ : నాయనా! ఇటు (అని కుమారుని కూర్చుండబెట్టును).

నార : (కుమారుని శిరస్సున కలశోదకమును చల్లి) రంభా! మిగిలిన విధానమును నిర్వర్తింపుము.

రంభ : (చెప్పినట్లు నిర్వర్తించి) బిడ్డా! మహర్షికి, మాతాపితరులకు నమస్కరింపుము.

కుమా : (వరుసగా నమస్కరించును).

నార : నీకు మేలగుగాక!

రాజా : కుల ధురంధరో భవ.

ఉర్వశీ : పితురారాధయితా భవ.

(నేపథ్యే వైతాలికౌ)

ప్రథమః : విజయతాం యువరాజః

అమరముని రివాత్రి ర్బ్రహ్మణోఽత్రేరివేన్దు
ర్బుధ ఇవ శిశిరాంశో ర్బోధస్యేవ దేవః
భవ పితు రనురూపస్త్వం గుణైర్లోకకాన్తైః
అతిశయిని సమాప్తా వంశ ఏవాశిషస్తే. 21

ద్వితీయః :

తవ పితరి పురస్తాదున్నతానాం స్థితేఽస్మిన్
స్థితిమతి చ విభక్తా త్వయ్యనాకమ్ప్య ధైర్యే
అధికతరమిదానీం రాజతే రాజలక్ష్మీ
ర్హిమవతి జలధౌ చ వ్యస్తతోయేవ గఙ్గా. 22

---

రాజు : వంశోద్ధారకుడవు కమ్ము.

ఉర్వశి : తండ్రిని ఆరాధించువాడవు కమ్ము.

(తెరలో ఇరువురు వైతాళికులు)

ప్రథముడు . యువరాజు వర్ధిల్లుగాక !

* బ్రహ్మకు దేవర్షియైన అత్రివలె, అత్రికి చంద్రుడువలె, చంద్రునకు బుధుడువలె, బుధునకు మహారాజువలె, నీవు లోకాహ్లాదకరములైన గుణములచేత నీ తండ్రికి దగినవాడవు కమ్ము. ఉత్కృష్టమైన నీ వంశమున ఆశిషములన్నియు ఇదివరకే పూర్తియైనవి.

ద్వితీయుడు :

* ఉన్నతులయొక్క అగ్రమున నిల్చిన యీనీ తండ్రియందును, నిశ్చల ధైర్యుడవు, మర్యాదాపాలకుడవునైన నీ యందును సమవిభక్తయై రాజ్యలక్ష్మి యిప్పుడు హిమవంతునియందుమ, సాగరునియందుమ విభక్తమైన జలముగల గంగానదివలె అధికతరముగా శోభిల్లుచున్నది.

అప్సరసః : (ఉర్వశీము పేత్య)దిష్ట్యా పుత్రస్య యువరాజశ్రియా భర్తు రవిరహేణ వర్ధతే.

ఉర్వశీ : సాధారణ ఏషోఽభ్యుదయః (కుమారం హస్తే గృహీత్వా) ఏహి వత్స జ్యేష్ఠమాతర మభివన్దస్వ.

కుమారః : (ప్రతిష్ఠతే)

నారదః : తిష్ఠ, సమయే తత్రభవత్యాః సమీపం గచ్ఛసి.

ఆయుషో యౌవరాజ్యశ్రీః స్మారయత్యాత్మజస్య తే
అభిషిక్తం మహాసేనం సైనాపత్యే మరుత్వతా. 20

రాజా : ఏవ మనుగృహీతో భగవతా కథం న యోగ్యో భవిష్యతి!

నారదః : కిం తే భూయః పాకశాసనః ప్రియం కరోతు.

---

అప్సరసలు : ఉర్వశిని సమీపించి) అదృష్టవశమున పుత్రుని యౌవరాజ్య సంపత్తిచేతను, పతి వియోగభయము తొలగుటచేతను గోళిల్లు చున్నావు.

ఉర్వశి : ఈ యభ్యుదయము మన యందరికి సాధారణమైనదే బిడ్డా! పెద తల్లిగారికి నమస్కరింతువు రమ్ము.

కుమా : (బయలుదేరును).

నార : ఆగుము. యుక్తసమయమున్నందామె సమీపమునకు వెళ్ళగలవు.

* నీ కుమారుడైన ఆయువుయొక్క యౌవరాజ్యాభిషేకము దేవేంద్రునిచే సేనాపతిత్వమునందభిషిక్తుడైన కుమారస్వామిని స్మరింపజేయుచున్నది.

రాజు : పూజ్యుడవైన నీచేత నిట్లనుగ్రహింపబడినవాడు యోగ్యుడు కాకెట్లుండగలడు ?

నార : దేవేంద్రుడు నీకింకను ఏమి ప్రియమాచరింపవలెను ?

రాజా : యది మే మఘవా ప్రసన్నః కి మతః పరమిచ్ఛామి. తథాపి ఇదమస్తు.

(భరతవాక్యమ్)

పరస్పర విరోధిన్యో రేకసంశ్రయ దుర్లభమ్
సఙ్గతం శ్రీసరస్వత్యో ర్భూతయేఽస్తు సదా సతామ్. 24

(ఇతి నిష్క్రాన్తాః సర్వే)

ఇతి పఞ్చమోఽఙ్కః.

---

రాజు : మఘవంతుడు నాపట్ల ప్రసన్నుడైనచో నింతకంటె కోర దగిన దేమున్నది ? అయినను నిట్లగుగాక !

( భరత వాక్యము )

* పరస్పరము విరోధించు లక్ష్మీ సరస్వతుల ఏకాశ్రయ దుర్లభమైన సాంగత్యము సర్వదా సజ్జనుల కల్యాణము కొఱకు సంభవించుగాక !

( అందఱు నిష్క్రమింతురు )

ఇది పంచమాంకము



# 'కరదీపికా' వ్యాఖ్య

## ప్రథమాంకము

శ్లో. 1. అన్వయము : యం రోదసీ వ్యాప్య స్థితం ఏకపురుషం వేదాంతేషు ఆహుః, యస్మిన్ ఈశ్వరః ఇతి శబ్దః అనన్యవిషయః యథార్థాక్షరః, యః చ నియమిత ప్రాణాదిభిః ముముక్షుభిః అంతః మృగ్యతే, సః స్థిరభక్తియోగ సులభః స్థాణుః వః నిశ్శ్రేయసాయ అస్తు.

అర్థము : యం=ఎవనిని; రోదసీ=భూమ్యాకాశములయంతరాళమును; వ్యాప్య = వ్యాపించి; స్థితం=ఉన్న; ఏక-పురుషం = అద్వితీయుడైన పురుషునిగా (బ్రహ్మమునుగా); వేదాంతేషు=ఉపనిషత్తులయందు; ఆహుః = చెప్పుదురో: యస్మిన్=ఎవనియందు: ఈశ్వరః-ఇతి = ఈశ్వరుడుఅను; శబ్దః=శబ్దము; అనన్యవిషయః= ఇతరులకు సంబంధింపనిదై; యథార్థాక్షరః=సార్థకమైనదో; యః-చ=మరియు నెవ్వడు; నియమిత-ప్రాణ + ఆదిభిః=నియమింపబడిన ప్రాణము మొదలయిన పంచప్రాణములుగల; ముముక్షుభిః = మోక్షమునభిలషించువారిచేత (యోగులచేత); అంతః = హృదయములో; మృగ్యతే=అన్వేషింపబడునో; సః=అ; స్థిర-భక్తియోగ-సులభః=నిశ్చలమైన భక్తియోగములచే సుఖముగా పొందదగిన; స్థాణుః=శివుడు; వః=మీయొక్క; నిశ్శ్రేయసాయ=కల్యాణముకొఱకు; అస్తు=అగుగాక.

శ్లోకములు ఆంధ్రీకరింపబడి యున్నవి గనుక వానితాత్పర్యములు మరల ఇచ్చట వ్రాయబడుటలేదు.

నాంది :

నాటక ప్రదర్శనము నిర్విఘ్నముగా నెఱవేరుట కొఱకు నటులు తెరలోపల జరుపు పూజా విధానమునకు పూర్వ రంగమని పేరు. అందు పఠింపబడు శ్లోకము నాంది. నాంది పూర్వ రంగమున ఒక అంగము. స్తుతి రూపమున దేవతలను, ఆశీర్వచన రూపమున సామాజికులను ఆనందింప జేయునది గనక దీనికి నాంది యని పేరు. నటరాజైన పరమేశ్వరుని నాట్యమునకు నందీశ్వరుడే రంగస్థలము. నటులు తాము నాట్యముచేయు రంగస్థలమునకు చేయు పూజా విధానము నందిపేర నాంది యనబడునని కొందరి యభిప్రాయము.

"నందంతి కావ్యాని, కవీంద్ర వర్గాః,
కుశీలవాః, పారిషదశ్చ, సంతః,
యస్మా దలం సజ్జన సింధు హంసీ
తస్మా దియం సా కథితేహ నాందీ."

కావ్యములు, కవులు, నటులు, సభికులు, సజ్జనులు దీనివల్ల ఆనందింతురు గనుక ఇది నాంది యనబడినది అని నాట్య ప్రదీపమున నిర్వచింపబడినది.

"దేవద్విజ నృపాదీనాం ఆశీర్వాద పరాయణా
నందంతి దేవతా యస్మాత్ తస్మాన్నాందీతి కీర్తితా."

దేవతలు, బ్రాహ్మణులు, రాజులు మున్నగువారి యాశీర్వాదము గలదైన దీనివల్ల దేవత లానందింతురు గనుక ఇది నాంది యని భరతమహర్షి నిర్వచనము.

"ఆశీర్న మస్క్రియా వస్తునిర్దేశో వాఽపితన్ముఖం" అను దండి వచనమునుబట్టి నాటకారంభ శ్లోకమైన నాందియందు ఆశీర్వచనము, నమస్కారము, వస్తు నిర్దేశము అను అంశములలో అన్నిగాని గొన్ని గాని ఉండవలెను. శంఖ, చంద్ర, అబ్జ, కోక, కైరవాది మంగళ వస్తు ప్రశంసయు ఉండవలెనని కొందరి మతము. నాందియందు

8 గాని 12 గాని 18 గాని 22 గాని పదములు ఉండవలెనని నియమము. పదమనగా సుప్తిఙంతమని కొందఱు, పాదమని కొందఱు.

ప్రకృత నాందీ శ్లోకమున "నిశ్శ్రేయసాయాస్తు వః" అను ఆశీర్వచన మున్నది. స్థాణువైన పరమేశ్వరుని ప్రశంస యగుటచే దేవతా నమస్కార మున్నది. 'పురుష' శబ్దముచే పురూరవుడు, 'ఈశ్వర' శబ్దముచే చక్రవర్తిత్వము సూచితములు. 'రోదసీ' శబ్దముచే పురూరవుని స్వర్గ గమనశక్తి సూచింపబడినది. 'స్థాణు' శబ్దముచే అతని ధీరత్వము, 'యోగిభిః' శబ్దముచే దివ్య సిద్ధులుగల యప్సరసలు సూచింపబడెను. 'స్థిరభక్తియోగ సులభః' అనుటచే నిశ్చలమైన ప్రేమవల్ల ఉర్వశి పురూరవుని పొందుట, 'అంతః' అనుటచే ఉర్వశి అదృశ్యముగా నుండుట సూచితములు. ఈ విధముగా ఈ నాందియందు వస్తు నిర్దేశముకూడ ఉన్నది. నాంది ముగిసిన పిదప సూత్రధారుడు ప్రవేశించును.

*సూత్రధారుడు :*

పూర్వరంగము నందలి పూజావిధానమును నిర్వహించు వాడొక సూత్రధారుడు. నాట్యాంతమున ప్రస్తావన నిర్వహించువాడు వేరొక సూత్రధారుడు.

"నాట్యోపకరణాదీని సూత్రమి త్యభిధీయతే
సూత్రం ధారయతీత్యర్థే సూత్రధారో నిగద్యతే."

కథ, నాయకుడు, రసము మున్నగు నాట్యోపకరణములకు సూత్రమని పేరు. దానిని ధరించువాడు సూత్రధారుడు.

"నాట్యస్య యదనుష్ఠానం తత్సూత్రం స్యాత్ సబీజకం
రంగదైవత పూజాకృత్ సూత్రధార ఉదీరితః."

బీజరూపమైన యారంభముగల నాయకుని వర్తనమును చతుర్విధములయిన యభినయములతో ప్రదర్శించుట నాట్యము. ఆ నాట్యముయొక్క ప్రయోగము సూత్రము. దానిని ధరించువాడు సూత్రధారుడు.

"వర్ణనీయ కథాసూత్రం ప్రథమం యేన సూచ్యతే
రంగభూమిం సమాక్రమ్య సూత్రధారః స ఉచ్యతే."

ప్రదర్శింపబడబోవు కథయందలి వివిధ సన్నివేశములను ఏక ముఖముగా నడిపించు కథా సూత్రమును రంగభూమిపై నిల్చి మొట్టమొదట ఎవ్వడు సూచించునో వాడు సూత్రధారుడు.

సూత్రధారుడు చక్కని రూపముగలవాడై యుండవలెను. వేదశాస్త్ర పురాణాదులు, ఆచార వ్యవహారములు, చతుర్విధాభి నయములు, గీతవాద్యాదులు చక్కగా నెఱిగినవాడై యుండ వలెను. నాట్యప్రయోగమునందేకాక మంత్ర ప్రయోగము నందును సమర్థుడై యుండవలెను.

నేపథ్యము :

నటులు వేషధారణము మున్నగునవి చేయుస్థలము నేపథ్యము. "కుశీలవ కుటుంబస్య స్థలీ నేపథ్య ముచ్యతే." నాట్య సంఘ సభ్యు లుండుచోటు నేపథ్యము. పూర్వము నటులందఱు ఏక కుటుంబము నకు జెందియుండెడివారు. కుశీలవుడనగా నటుడు.

ప్రవేశము :

రంగస్థలమునుండి ప్రేక్షకులకు కనబడుట ప్రవేశించుట. తెర యెత్తినపిదప వచ్చినను, తెర యెత్తునప్పటికే రంగస్థలమునం దున్నను ప్రేక్షకుల దృష్టిపథమున ప్రవేశించుటయే ప్రవేశము.

మారిషుడు :

నాటకారంభమునకు పూర్వము ప్రస్తావనను నిర్వహించుట యందు సూత్రధారునకు తోడ్పడువాడు మారిషుడు. సూత్రధారుడు తన సహాయకుని "మారిష" అని సంబోధించును. మారిషుడు సూత్ర ధారుని "భావ" అని సంబోధింపవలెను.

పారిపార్శ్వకుడు :

సూత్రధారుని ప్రక్కనుండి తోడ్పడు నటునకు పారిపార్శ్వకు డని పేరు. వీనిని సూత్రధారుడు "మారిష" అని సంబోధించును.

"సూత్రధారస్య పార్శ్వే యః ప్రవదన్ కురుతేఽర్థనాం
కావ్యార్థ సూచనాలాపం స భవేత్ పారిపార్శ్వకః."

సూత్రధారుని ప్రక్కన నిల్చి కావ్యార్థ సూచకములైన మాటలను పలుకుచు ప్రస్తావనను జరిగించువాడు పారిపార్శ్వకుడు.

*పరిషత్తు :*

ప్రేక్షక మండలము పరిషత్తు. కథానాయకుని కష్ట సుఖములను తమవిగా భావించి తన్మయులై నాట్యమును తిలకించి ఆనందము ననుభవించుటకు దగిన నిర్మల హృదయము గలవారు ప్రేక్షకులు. వారే నాటక ప్రదర్శనముయొక్క గుణదోషములు నిర్ణయించుటకు దగినవారు.

పుట 2. ప్రయోగబంధాః = ప్రదర్శించుటకు యోగ్యములయిన కావ్యములు. అనగా నాటకములు, లేదా చతుర్విధములయిన యభినయములు దేనియందు బంధింపబడునో ఆ నాటక ప్రదర్శనములు; విక్రమోర్వశీయమ్ = విక్రముడనగా పురూరవుడు. విక్రముడు, ఊర్వశి విక్రమోర్వశులు. విక్రమోర్వశులను అధికరించి రచింపబడిన గ్రంథము విక్రమోర్వశీయము. అద్యాఛరమునకు వృద్ధి వచ్చి వైక్రమోర్వశీయము కావలెను. కాని గ్రంథము ఆఖ్యాయికయైనచో వృద్ధి రాకుండవచ్చును. ఇది నాటకమే అయినను విక్రమోర్వశుల కథ అన్న యర్థమున వృద్ధి చేయకుండ "విక్రమోర్వశీయమ్" అన్నను దోషములేదు.

*నాటకము :*

ప్రఖ్యాతమైన ఇతివృత్తము, ధీరోదాత్త నాయకుడు, వీర శృంగారములలో నొకటి ప్రధాన రసము - అయి ఐదు మొదలు పది యంకముల పరిమితి గలిగియుండు రూపక భేదమునకు నాటకము అని పేరు. అట్టి నాటకమున ప్రతి యంకమునందును విదూషకుడు ప్రవేశించునో దానిని త్రోటకము అందురు. విక్రమోర్వశీయము త్రోటకము అని కొందరి యభిప్రాయము. కాని విక్రమోర్వశీయము

నందలి ప్రథమ చతుర్థాంకములందు విదూషకుని ప్రవేశము లేదు. కనుక దీనిని నాటకమనుటయే ఉచితము.

*పాత్రవర్గము :*

వేషధారుల సమూహము. ప్రేక్షకులు నాట్యరసమును గ్రోలుటకు పాత్రములవంటివారు కనుక నటులు పాత్రములు; పాఠేషు = వాచకములందు - నాయకాదులు పఠింపవలసిన వాక్యములు; భావః=పారిపార్శ్వకుడు సూత్రధారుని గుఱించి యుపయోగించు గౌరవ వాచకము; ఆర్యమిశ్రాన్=ఆచారవంతులు, పూజ్యులైనవారు.

శ్లో. 2. అన్వయము : ప్రణయిషు దాక్షిణ్యాత్ వా అథవా సద్వస్తు పురుష బహుమానాత్ అవహితైః మనోభిః కాళిదాసస్య ఇమాం క్రియాం శ్రుణుత.

అర్థము : ప్రణయిషు=ప్రేమపాత్రులందు, యాచకులందు (మాయందు); దాక్షిణ్యాత్=అనుకూల భావమువలన (దయవలన); వా=కాని; అథవా=లేదా; సత్-వస్తు-పురుష-బహుమానాత్=మంచి యితివృత్తముగల నాయకుని యందలి గౌరవము వలన; అవహితైః=సావధానములైన; మనోభిః=చిత్తములతో; కాళిదాసస్య=కాళిదాసునియొక్క; ఇమాం-క్రియాం=ఈ కృతిని, నాటకమును; శ్రుణుత=వినుడు.

దాక్షిణ్యాత్ - ఈ పదము పురూరవుని దక్షిణ నాయకత్వమును, అర్థులయందలి దయను సూచించుచున్నది.

సద్వస్తు-పురుష అన్న శబ్దములు దేవాంశ సంభూతుల వృత్తాంతము, పురూరవ నాయకత్వమును సూచించుచున్నది.

శ్రుణుత - నటుల యభినయమును చూచుటకంటె కాళిదాసు కవితను వినుటయే ముఖ్యమని వ్యంగ్యము.

శ్లో. 3. అన్వయము : నరసఖస్య మునేః ఊరూద్భవా సురస్త్రీ కైలాసనాథం ఉపస్పృత్య నివర్తమానా అర్ధమార్గే విబుధశత్రుభిః బందీకృతా; అతః అయం అప్సరసాం గణః కరుణం క్రందతి.

అర్థము : నరసఖస్య=నరుడను ఋషి యొక్క మిత్రుడైన నారాయణుడను, మునేః=ముని యొక్క; ఊరు + ఉద్భవా = తొడ నుండి పుట్టిన; సురస్త్రీ = దేవతాస్త్రీ = కైలాసనాథం = కుబేరుని; ఉపసృత్య = ( సేవించుటకు ) చేరబోయి; నివర్తమానా = తిరిగి వచ్చుచున్నదై ; అర్ధమార్గే=నడిదారిలో; విబుధ - శత్రుభిః=దేవతల శత్రువులైన రాక్షసుల చేత; బంధీకృతా=చెఱబట్టబడినది; అతః=అందు వల్ల; అయం=ఈ; అప్సరసాం=అప్సరసల యొక్క; గణః=సమూహము శరణం=రక్షకునిగురించి; క్రందతి=ఆక్రోశించుచున్నది.

ఊరూద్భవా :

నరనారాయణులను ఋషులు బదరికావనమున తపస్సు చేయుచుండగా వారి తపస్సును భంగము చేయుటకై ఇంద్రుడు అప్సరసలను పంపెను. అప్పుడు నారాయణముని తన తొడనుండి ఒక సుందరిని పుట్టించెను. ఆమె ఉర్వశి. ఆమె యందము చూచి అప్సరసలు సిగ్గుపడిరి. నారాయణుడు ఉర్వశిని ఆ యప్సరలతో ఇంద్రునివద్దకు పంపెను.

అప్సరసలు :

జలములను మథింపగా వాని రసమునుండి పుట్టిన స్త్రీలు అప్సరసలు.

కైలాసనాథుడు :

కైలాసము పార్వతీ పరమేశ్వరులుండుచోటు. అది ఉత్తర దిక్కున మన్నది. ఉత్తర దిక్కునకు పాలకుడు కుబేరుడు గనుక అతడు కైలాసనాథుడు.

ప్రస్తావన

సూత్రధారుడు నటినిగాని, విదూషకునిగాని, పారిపార్శ్వకుని గానీ పిలిచి వారితో నాటక కథార్థమును సూచించుతీరున చమత్కారముగా కావించు సంభాషణ ప్రస్తావన. దీనికి ఆ ముఖము, స్థాపన అనియు పేర్లు కలవు. కవి, నాటకము, నాటకవస్తువు మున్నగు

వానిని సూచించి సూత్రధారాదులు నిష్క్రమింతురు. నిష్క్రమించు నప్పుడు సూత్రధారుడు నాటకపాత్ర యొక్క ప్రవేశమును కూడ సూచించును సూత్రధారుని వాక్యములందు నిర్దేశింపబడినతీరున పాత్ర ప్రవేశము జరిగినచో అట్టి సూచనను ప్రయోగాతిశయము అందురు.

*నిష్క్రమణము :*

తెరపడుటవల్లగాని, రంగస్థలమునుండి వెడలిపోవుటవల్లగాని పాత్రములు ప్రేక్షకుల దృష్టి పథమునుండి కనబడకుండ పోవుట నిష్క్రమణము.

*పుట. 4. అపటీక్షేపము :*

పటి లేక అపటి యనగా తెర. తెరను త్రోసికొని ప్రవేశించుట అపటీక్షేపమున ప్రవేశించుట. ప్రవేశసూచన లేకుండ పాత్ర ప్రవేశింప రాదు. ఒకవేళ ఆకస్మికముగా ప్రవేశింపవలసివచ్చినచో తెర చిమ్ము కొని ప్రవేశింపవలెను. రాజు, సూతుడు ప్రవేశించుటకు సూచన చేయ బడలేదు గనుక వారి ప్రవేశము అపటీక్షేపముచే జరుగును. భవత్యః = పూజ్యురాండ్రయిన స్త్రీలు.

*పురూరవుడు :*

ఇతడు బ్రహ్మనుండి ఐదవతరమువాడు. బ్రహ్మ - అత్రి - చంద్రుడు - బుధుడు - పురూరవుడు. తల్లిపైపున ఇతడు సూర్యునకు నాల్గవ తరమువాడు. సూర్యుడు - మనువు - ఇలుడు. ఈ యిలుడు 'ఉమావనము' నందు ప్రవేశించి స్త్రీయై ఇలయయ్యెను. బుధుడు ఇలను పెండ్లాడగా వారికి పురూరవుడు జన్మించెను. ఈ విధముగా దేవాంశసంభూతుడైన పురూరవుడు సురపక్షపాతి, ఆకాశగమన శక్తిగలవాడు. కనుకనే రోదించుచున్న అప్సరసలను ఓదార్చి వారి కష్టమేమి చెప్పుకొండనెను.

పుట 5. యతిష్యే = యత్నింపగలను. ఉర్వశిని రక్షించి తీసికొనిరాగల సామర్థ్యముండియు 'యత్నింపగలను' అనుట పురూరవుని నిరహం కార భావమును సూచించును.

సోమాత్ + ఏక + అంతరస్య = చంద్రునినుండి ఒక్కతరము ఎడముకలవాడు, చంద్రుని మనుమడు.

పుట 6. ఐశానీం - ఈశానునకు సంబంధించినది ఐశాని. ఈశానుడు శివుడు. ఆయుష్మాన్ - సూతుడు (సారథి) రాజును ఆయుష్మంతుడు' అనును. ఇతర సేవకులు దేవ, మహారాజ అందురు. రాజు అధికారియైనను సూతుడు వయస్సుచే పెద్దవాడగుటచే అతనిని ఆయుష్మంతుడా అని సంబోధించు అర్హతగలిగియుండును. వైనతేయుడు = వినత కొడుకు, గరుత్మంతుడు.

శ్లో॥ 4 : అన్వయము : చూర్ణీభవంతః అమీ ఘనాః రథస్య అగ్రే రేణువత్ యాంతి; చక్రభ్రాంతిః అరాంతరేషు అన్యాం అరావలీం జనయతి ఇవ; హయశిరసి ఆయామవత్ చామరం చిత్రన్యస్తం ఇవ అచలం; వేగానిలాత్ ధ్వజపటః యష్ట్యగ్రే చ ప్రాంతే చ సమం స్థితః.

అర్థము : చూర్ణీభవంతః=పొడియగుచున్నవై; అమీ-ఘనాః= ఈ మేఘములు; రథస్య=రథముయొక్క; అగ్రే = ముందట; రేణువత్=ధూళివలె; యాంతి=పోవుచున్నవి; చక్రభ్రాంతిః = చక్రముల భ్రమణము; అర + అంతరేషు=ఆకుల సందులయందు; అన్యాం = వేరైన; అర + అవలీం = ఆకులవరుసను; జనయతి - ఇవ = పుట్టించుచున్నట్లున్నది;హయ-శిరసి=గుఱ్ఱముల శిరమునందలి; ఆయామవత్= విస్తారముగల; చామరం=కుచ్చు; చిత్ర-న్యస్తం = చిత్రపటమందుంచబడినది; ఇవ=వలె; అచలం=నిశ్చలముగానున్నది; వేగ + అనిలాత్ = వేగముచే గలిగిన గాలివల్ల; ధ్వజ - పటః = జెండాగుడ్డ; యష్టి + అగ్రే - చ=జెండాకఱ్ఱ కొనయందును; ప్రాంతే-చ = ప్రక్కలయందును: సమం = ఏక కాలమందే; స్థితః=ఉన్నది.

పుట 7 : హలా - చెలికత్తెను సంబోధించుట యందుపయుక్తమగు పదము. దీనికి హండే, హంజే అను నవి పర్యాయపదములు.

సంపరాయము=యుద్ధము; విజయసేనాముఖము - ఇట్లనుటచే పురూరవుడు నాయకత్వము వహించినప్పుడు దేవసేనకు జయము

తప్పక లభించుచుండునని భావము. కనుక ఆయన ఉర్వశిని తప్పక శత్రువునుండి రక్షింపగలడని మేనక విశ్వాసము. ఉచ్ఛలిత హరిణ కేతనః=ఎగురుచున్న లేడి గుర్తుగల జెండా. సోముడు తన మనుమడైన పురూరవునకు తన అంకమైన లేడియే గుర్తుగాగల జెండాతో ఒప్పునట్టి రథము నిచ్చెను. ఆ రథము సోమదత్తము. అట్టి దివ్య రథమున పురూరవుడు ఆకాశమున తిరుగగలడు. జెండా కనబడుటచే పురూరవుడు మరలివచ్చుచున్నాడు. ఊరక మరలిరాడు కనుక ఉర్వశిని తీసికొనియే వచ్చుచున్నాడు. ఇది రంభ విశ్వాసము.

పుట 8 : ఉత్ + చక్షుషః=ఎత్తబడిన కన్నులు గలవారు.

శ్లో॥ 5 అన్వయము ; భీరు! సురారిసంభవం భయం గతం, వజ్రిణః మహిమా త్రిలోకరక్షీ హి; తత్, ప్రత్యుషసి పద్మినీ మహోత్పలం ఇవ ఏతత్ ఆయతం చక్షుః ఉన్మీలయ.

అర్థము : భీరు = పిరికిదానా; సుర + అరి-సంభవం = రాక్షసునివల్ల పుట్టిన; భయం = భయము; గతం = పోయినది; వజ్రిణః = వజ్రము ధరించు ఇంద్రునియొక్క; మహిమా=ప్రభావము, శక్తి; త్రి-లోక-రక్షీ-హి=ముల్లోకములను రక్షించునదిగదా; తత్=అందుచేత; ప్రత్యుషసి=ప్రాతఃకాలమున; పద్మినీ=పద్మలత; మహోత్పలం= తామరపూవును; ఇవ=వలె; ఏతత్ = ఈ; ఆయతం=విస్తారమైన; చక్షుః=నేత్రమును; ఉన్మీలయ=తెఱువుము.

'అహో' - ఇది ఆశ్చర్యము, భయము, విషాదము మున్నగు భావములను సూచించు శబ్దము; సంభావిత=ఊహింపబడిన; సంజ్ఞా= చైతన్యము; ఉర్వశి ఉచ్ఛ్వాసమును గురించి ప్రసంగించుటచే పురూరవుని దృష్టి ఉర్వశి వక్షస్థలము మీదికి ప్రసరించినది. దానిని వర్ణించుచున్నాడు.

పుట 9 : బలవత్=బలముగా; మిక్కిలిగా; పరిత్రస్తా=భయపెట్టబడినది; అత్రభవతీ=ఈ పూజ్యురాలు.

శ్లో॥ 6 : అన్వయము : అస్యాః కుసుమసమబంధనం హృదయం కంపం తావత్ న ముంచతి; స్తనమధ్యోచ్ఛ్వాసినా హరిచందనేన కథితం పశ్య.

అర్థము : అస్యాః = ఈమెయొక్క; కుసుమ-సమ-బంధనం= పువ్వుముతో సమానమైన బంధము (పట్టు) గల; హృదయం=హృదయము; కంపం=వణకును; తావత్=ఇంకను; న-ముంచతి=విడువకున్నది; స్తన-మధ్య + ఉచ్ఛ్వాసినా= స్తనముల నడుమ కదలుచున్న; హరిచందనేన=మంచిగంధపు పూతచేత; కథితం=చెప్పబడుచున్నది; పశ్య=చూడు.

పురూరవుడు ముందు ఉర్వశి కన్నులను వర్ణించెను. ఇప్పుడు స్తనములను వర్ణించినాడు. కనుక ఆయనకు ఉర్వశియందు అనురాగము కలుగుచున్నది.

పర్యవస్థాపయ=గట్టిపరచుకొనుము; అనప్సరా + ఇవ=అప్సరస కానిదానివలె- దేవతలు భయపడరాదు. ఊర్వశి భయపడుచుండుటచేత ఆమె మానవస్త్రీవలె కనబడుచున్నది; ప్రత్యాగచ్ఛతి= మరల స్వస్థత పొందును; అయి=చెలిని గౌరవముగా సంబోధించు శబ్దము; ప్రకృతిం=స్వాస్థ్యమును.

శ్లో॥ 7 : అన్వయము : శశిని ఆవిర్భూతే తమసా ముచ్యమానా రాత్రిః ఇవ, నైశస్య హుతభుజః ఛిన్నభూయిష్ఠ ధూమా అర్చిః ఇవ, రోధః పతనకలుషా ప్రసాదం గృహ్ణాతి గంగా ఇవ అంతః మోహేన ముక్త కల్పా ఇయం వరతనుః లక్ష్యతే.

అర్థము ; శశిని=చంద్రుడు; ఆవిర్భూతే=ఉదయించినవాడు కాగా; తమసా=చీకటిచేత; ముచ్యమానా=విడువబడుచున్న; రాత్రిః- ఇవ=రాత్రివలె; నైశస్య=నిశాసంబంధమైన; హుతభుజః=అగ్నియొక్క; ఛిన్న-భూయిష్ఠ-ధూమా=చెదరగొట్టబడిన గొప్ప ధూమముగల; అర్చిః- ఇవ=జ్వాలవలె; రోధః-పతన-కలుషా=ఒడ్డుయొక్క విఱిగిపాటువలన మురికియైన; ప్రసాదం= తేటదనమును; గృహ్ణాతి=గ్రహించుచున్న (పొందుచున్న); గంగా-ఇవ=గంగాప్రవాహమువలె; అంతః=లోపలి

మోహేన=మూర్ఛచేత; ముక్తకల్పా=ఇంచుమించుగా విడువబడిన దైన; ఇయం=ఈ; వరతనుః=సుందరాంగి; లక్ష్యతే=కనబడుచున్నది.

పుట 10 : నిస్సాధ్వసా=నిశ్వాసముగలది, భయములేనిది; రాజర్షి=ఋషివంటి రాజు. ధర్మముతప్పక, ప్రజల ప్రయోజనముకొఱకే రాజ్యపాలనముచేయు రాజు రాజర్షి.

"ఉపకృతం ఖలు దానవైః" దానవులచేత ఉపకారమే చేయబడినదిగదా. రాజును చూడగనే ఉర్వశి యిట్లనుటవల్ల ఆమెకు పురూరవునియందు అభిలాష కలిగినదని భావము. ప్రభావముచూపిన మహేంద్రునిచేతనా? అని ప్రశ్నించి "కాదు మహేంద్రసదృశ మహిమగల ఈ రాజర్షిచేత" అని చిత్రరేఖ చెప్పగా ఉర్వశి రాజు వంక చూచినది. దానవులు ఉపకారమేచేసిరి అన్నది. మహేంద్రుడే ఆమెను రక్షించియుండినచో ఈమాట అనదు. ఎదుటనున్నరాజు మహేంద్ర సదృశుడు కాకున్నను అట్లనదు. దానవులు తన్ను ఎత్తుకొని పోయినందున పురూరవుడు తన్ను రక్షించుటయు, తనకంటబడుటయు జరిగినది. కనుక తన్నపహరించిన రాక్షసులు పురూరవునివంటి ఇంద్రసమానుడైన రాజుతో తనకు పరిచయము కలిగించి ఉపకారమే చేసిరి. ఉర్వశి పురూరవునకు భార్య కాబోవుచున్నదని యీ వాక్యము సూచించుచున్నది. ఉర్వశీ పురూరవుల శృంగారమునకిది బీజము.

నిర్వర్ణ్య=పరిశీలించిచూచి-పురూరవుడు ఉర్వశి యవయవము లన్నియు అభిలాషతో చూచినాడు. స్వాస్థ్యముపొందిన పిమ్మట ఉర్వశి సౌందర్యము సంపూర్ణముగా వ్యక్తమైనది. దానిని చూచి పురూరవుడు 'ఈమె సౌందర్యమునుగాంచి అప్సరస లెల్లరు సిగ్గుపడుట యుక్తమే' అనుచున్నాడు. అయినను ఇంత సౌందర్యము గలస్త్రీని నీరసుడైన ముని సృష్టించెనా యని శంకించుచున్నాడు.

శ్లో॥ 8 : అన్వయము : అస్యాః సర్గవిధౌ కాంతప్రభః చంద్రః ప్రజాపతిః అభూత్ ను? శృంగారైకరసః మదనః స్వయం (ప్రజాపతిః అభూత్)

ను ? పుష్పాకరః మాసః ను ? వేదాభ్యాస జడః విషయవ్యావృత్త కౌతూహలః పురాణః మునిః ఇదం మనోహరం రూపం నిర్మాతుం కథం ను ప్రభవేత్ ?

అర్థము : అస్యాః=ఈమెయొక్క; సర్గ-విధౌ=సృష్టికార్యమునందు; కాంత-ప్రభః=మనోహర కాంతిగల; చంద్రః=చంద్రుడు; ప్రజాపతిః=సృష్టికర్త; అభూత్-ను=అయ్యెనేమో; శృంగార+ఏక-రసః-శృంగారమునందే ప్రధానముగా ఆసక్తిగల; మదనః=మన్మథుఁడు; స్వయం-ను=స్వయముగా (సృష్టికర్తయయ్యె)నో; పుష్పాకరః=పూలకు నెలవైన; మాసః-ను = చైత్రమాసమో; వేద+అభ్యాస-జడః=వేదములను వల్లెవేయుటచే మందబుద్ధియైన: విషయ-వ్యావృత్త-కౌతూహలః = ఇంద్రియసుఖములనుండి మరలింపబడిన యుత్సాహముగల; పురాణః=వృద్ధుడైన; మునిః=ఋషి (నారాయణుడు); ఇదం=ఈ; మనోహరం=సుందరమైన; రూపం=ఆకారమును; నిర్మాతుం=నిర్మించుటకు; కథం-ను = ఎట్లు: ప్రభవేత్ = సమర్థుడు కాగలడు.

పుట 11 :

శ్లో॥ 9 : అన్వయము ; సుందరి త్వం యదృచ్ఛయా సకృత్ అపి యస్య అవంధ్యయోః నేత్రయోః పథి స్థితా, సఃఅపి త్వయా వినా సముత్సుకః భవేత్, తే ఆర్ద్రసౌహృదః సఖీజనః కిముత ?

అర్థము : సుందరి=రమణీ; త్వం=నీవు; యదృచ్ఛయా=తలవని తలంపుగా; సకృత్-అపి=ఒక్కపర్యాయమైనను; యస్య=ఎవని యొక్క; అవంధ్యయోః = వ్యర్థములుకాని, ధన్యములైన; నేత్రయోః=రెండు కన్నులయొక్క ; పథి=మార్గమున (దృష్టియందు) స్థితా=ఉందువో; సః-అపి=అట్టివాడుకూడ; త్వయా-వినా=నీవులేక: సముత్సుకః=ఉత్కంఠగలవాడు; భవేత్=అగును; తే=నీయొక్క: ఆర్ద్రసుహృదః=మృదువైన హృదయముగల; సఖీజనః=చెలికత్తెలు; కిముత=చెప్పవలసినదేమున్నది.

ఉర్వశిని చూడనిచో తనకు ఉత్కంఠగా నుండునని పురూరవుని సూచన.

అపవార్య—త్రిపతాకా హస్తమును అడ్డుపెట్టి యితరులను అపవారించి వినదగినవారికి మాత్రమే వినబడునట్లు భాషించుట అపవారితము. ఎదుటనున్న పాత్రను అపవారించి యితరులు విను నట్లుచెప్పినచో జనాంతికము. రెండిటికిని భేదము ఇంతమాత్రమే.

అభిజాతం=ఉత్తమవంశమునకు దగినది, హృదయంగమమైనది. తన సౌందర్యమును పురూరవుడు ప్రశంసించుట, తన్నుచూడక ఉండ జాలనని సూచించుట ఉర్వశికి ఆనందముగా నున్నది. ఆయన తనయం దనురక్తుడని గ్రహించినది.

చంద్రాత్ అమృతం— చంద్రునివలన అమృతమే పుట్టును. పురూరవుని వదనము చంద్రుడు. అందుండి పుట్టినమాట అమృతము. చంద్రుని వంశమున బుట్టిన పురూరవుడు అమృతమే. పురూరవుడు మధురభాషి కనుక ఉత్తమనాయకుడు.

పుట 12; ఏనం- ఈమాటకు రెండర్థములు వచ్చును. ఈ సఖీజనమును, ఈ రాజును అని. ఊర్వశి తనకు పురూరవునియందు గలిగిన అభి లాషను మరుగుపరచుకొనుచు గడుసుగా పలికినది.

శ్లో॥ 10: అన్వయము: సుతను! హేమకూటగతాః ఏతాః సఖ్యః ఉప ప్లవాత్ ముక్తం ప్రత్యాగతప్రసాదం తే ముఖం (ఉపప్లవాత్ ముక్తం ప్రత్యాగత ప్రసాదం) చంద్రం ఇవ పశ్యంతి

అర్థము: సుతను=సుందరాంగీ; హేమకూట-గతాః=హేమ కూటమందున్న; ఏతాః=ఈ; సఖ్యః=చెలికత్తెలు; ఉపప్లవాత్=ప్రమా దమునుండి (మూర్ఛనుండి); ముక్తం=విడువబడిన; ప్రత్యాగత- ప్రసాదం=తిరిగి పొందబడిన ప్రసన్నకాంతిగల; తే=నీయొక్క; ముఖం=ముఖమును; ఉపప్లవాత్=రాహుగ్రహణమునుండి:ముక్తం= విడువబడిన; ప్రత్యాగత-ప్రసాదం=తిరిగి పొందబడిన నిర్మలకాంతి గల; చంద్రం-ఇవ=చంద్రునివలె; పశ్యంతి=చూచుచున్నారు.

కేశియను రాక్షసుడు పట్టుకొనగా మూర్ఛిలి మరల తేరు కొన్న ఉర్వశి ముఖము తేటగా ఉన్నది. రాహువను రాక్షసునిచే గ్రసింపఁబడి ముక్తమైన చంద్రబింబము నిర్మలమైన కాంతితో ప్రకాశించును. ఉర్వశి ముఖము చంద్రబింబమువలె ఉన్నదని రాజుస్తుతి. రాజుముఖము చంద్రబింబమని ఊర్వశి తలపు. నాయికా నాయకుల సౌందర్యము సమానమే.

సఖి పశ్య=చెలీ చూడుము- చిత్రలేఖ గడుసుగా పలికినది. ఎవరిని చూడవలెను? సఖులనా? రాజునా? ఉర్వశి రాజునే చూచినది. ఏదో కోరికతో చూచినది.

"సమదుఃఖః పిబతీవ మాం నయనాభ్యాం"— సానుభూతి గలిగి కన్నులతో నన్ను త్రాగుచున్నట్లున్నది. ఉర్వశి పలికిన ఈ మాటయు గడుసుగనే యున్నది. ఆమె రాజువంక అభిలాషతో చూడగా ఆయన అంతకంటె అభిలాషతో తన్ను కన్నులతో త్రాగివేయుచున్నట్లున్నాడు. తనవంక సానుభూతిగలిగి అతి ప్రేమతో చెలికత్తెలుకూడ చూచుచున్నారు.

సాకూతం=సాభిప్రాయముగా - కన్నులతో నన్ను త్రాగుచున్నట్లున్నది అన్న ఉర్వశి సమాధానములోని భావమును చిత్రలేఖ గ్రహించినది. అయినను 'అయి కః'- చెలీ ఎవరు? అని యడిగినది. 'రాజు' అని ఉర్వశి తడబడునేమో చూతమని చిత్రలేఖ యుద్దేశము. కాని ఉర్వశి తడబడలేదు. "నను సఖీజనః" సఖీజనము కాదటే అని గడుసుగా సమాధాన మిచ్చినది.

పుట 18 : "విశాఖా సమీపగతః భగవాన్ చంద్రః" విశాఖా నక్షత్రము సమీపమునందున్న చంద్రుడువలె మన్నాడు పురూరవుడు. ఉర్వశి విశాఖానక్షత్రము. రాజు చంద్రుడు. ఉర్వశి ప్రక్కనే ఉన్నాడు రాజు. సమీపగతుడు అనుటచేత ఇంకను విశాఖయందు ప్రవేశింపలేదు. ప్రవేశింపబోవుచున్నాడు. ఉర్వశీ పురూరవులు భార్యాభర్త లగుదురని ఉత్తరకథార్థ సూచన. అట్లగుట రంభాదులకు ఇష్టము. విశాఖయందు చంద్రుడు ప్రవేశించునప్పుడు వైశాఖమాస మగును. అది

వసంతకాలము. శృంగారమునకు దగిన సమయము. మొదటి మాసము చైత్రము. చంద్రుడు చిత్తానక్షత్రగతుడై యుండును. రాజునకు ఒకభార్య యున్నది. విశాఖా సమీపగతు డగుటచే ఉర్వశి రాజునకు రెండవభార్య కాబోవుచున్నది. చంద్రుని ఉపమానముగా గ్రహించుటచేత మనుమడు అచ్చముగా తాతగారి పోలిక అని భావము. రథమునందు రాజు, ఉర్వశి, చిత్రలేఖ వరుసగాకూర్చుండిరి. చిత్రలేఖ చిత్తానక్షత్రమనుకొన్నచో దానికిని రాజునకు నడుమ ఉర్వశి విశాఖానక్షత్రమువలె ఉన్నది అనికూడ భావింపవచ్చును. లేదా విశాఖానక్షత్రము రెండు నక్షత్రములు గలదిగనుక ఉర్వశీ చిత్రలేఖల సమీపమున ఉన్న రాజు విశాఖా సమీపగతుడైన చంద్రునివలె ఉండెననియు భావింపవచ్చును.

"దుర్జయాః ఖలు దానవాః" రాక్షసులు సులభముగా జయించదగ్గవారు కారుగదా. అట్టివారిని పురూరవుడు క్షణములో జయించి ఉర్వశిని తిరిగి తెచ్చినాడు. పైగా శరీరమున ఒక్క గాయము కూడ కనబడుటలేదు. నాయకుడు మహావీరుడు. తమ చెలిక త్తెను రక్షించుటలో రాజు శరీరము ఎంతమాత్రము దెబ్బతిన లేదుగనుక అప్సరసలకు సంతోషము.

చక్రోద్ఘాతం = చక్రములు గ్రుద్దుకొనుట - హేమకూటమున రథము దిగునప్పుడు రథచక్రములు కొండమీద గ్రుద్దుకొని రథమున కుదుపు కలిగినది. రాజు, ఉర్వశి చేరికగా కూర్చుండుటవల్ల కుదుపుచే వారి శరీరములు ఒకదాని కొకటి గట్టిగా తగిలినవి. రాజునకు ఉర్వశీ శరీరస్పర్శసుఖముగా నున్నది. ఈ స్పర్శసుఖము రథము యొక్క కుదుపువల్ల లభించినది కనుక "హంత! దత్తఫలో మే విషమావతారః" అహో! రథము ఎగుడు దిగుడుగా దిగుట నాకు లాభమే అయినది - అనుచున్నాడు. ఈ పుణ్యముకట్టుకొన్న సారథి రాజు ఋణము తీర్చుకొన్నట్లయినది.

శ్లో. 11 : అన్వయము : రథ సంక్షోభాత్, అయం అంసః రథోపమర్ద్రోణ్యాః అంసేన సరోమ విక్రియం స్పృష్టః (ఇతి) యత్ (తత్) మనసి జేన అంకురితం ఇవ.

అర్థము. రథ సంక్షోభాత్ = రథముయొక్క కుదుపువలన; అయం=ఈ; అంసః=భుజాగ్రము; రథ + ఉపమ - శ్రోణ్యాః= రథ సదృశమైన పిరుదుగల ఉర్వశియొక్క; అంసేన = భుజాగ్రముచేత; సరోమవిక్రియం=పులకరింపులతో గూడియుండునట్లు; స్పృష్టః=తాక బడినది; (ఇతి) యత్=అనునది ఏదికలదో; (తత్=అది); మనసిజేన = మన్మథునిచేత; అంకురితం + ఇవ= మొలకెత్తింపబడినదాయన్నట్లున్నది.

"కి మపి పరతో అవసర" = కొంచెము ప్రక్కకు జరుగుము - పురూరవునకు తన స్పర్శవల్ల పులకాంకురమగుట ఉర్వశి గుర్తించినది. ఆమెకుగూడ పులకాంకురమై యుండును. పులకాంకుర మొక సాత్విక భావము. దీనివల్ల ఉర్వశికి లజ్జయనెడు వ్యభిచారి భావము కలిగినది. అందుచే పురూరవుని స్పర్శ ఆమె కిష్టమైనను చిత్రలేఖ ఏమనుకొనునో యని కొంచెము ప్రక్కకు జరుగుము అన్నది. చిత్రలేఖ యిదంతయు గుర్తించినది. అందుచేతనే "నా చేతకాదు" అని సమాధానము చెప్పినది. ఉర్వశీ పురూరవుల హృదయములందు 'మనసిజుడు అంకురింపజేసిన' రతిని పోషించుటకు చిత్రలేఖ తోడ్పడు చున్నది.

పుట 14: న అహం శక్తా=నేను శక్తురాలను కాను, నా చేతకాదు.

శ్లో. 12: అన్వయము: యావత్ ఇయం సముత్సుకా సుభ్రూః ఉత్సుకాభిః సఖీభిః ఆర్తవీ శ్రీః లతాభిః ఇవ పునః సంపర్కం యాతి (తావత్ రథం స్థాపయ).

అర్థము: యావత్ = ఎంతలో; ఇయం=ఈ: సముత్సుకా = ఉత్కంఠితురాలైన; సుభ్రూః=సుందరి; ఉత్సుకాభిః = ఉత్కంఠగల; సఖీభిః=చెలికత్తెలతో; ఆర్తవీ=(వసంత) ఋతుసంబంధమైన; శ్రీః = శోభ; లతాభిః + ఇవ=తీగెలతోవలె; పునః=తిరిగి; సంపర్కం=సంబంధ ముము, కలయికను; యాతి = పొందునో (అంతవరకు రథమును నిలుపుము).

ఇందలి ఉపమాలంకారమువల్ల అప్సరసలందఱు వట్టి తీగె అనియు ఉర్వశి వారికి సౌందర్యము కలిగించు వసంతలక్ష్మి యనియు

తెలియును. ఆమె లేనిచో వారికి శోభలేదు. అప్సరసల సౌందర్యము సర్వము ఉర్వశియే.

దిష్ట్యా=అదృష్టముచేత, అదృష్టవశమున రాజు జయముచే వర్ధిల్లుచున్నాడని అప్సరసలు పలుకగా రాజు "మీరందఱు సఖీసమాగమముచే వర్ధిల్లుచున్నారు" అని రాజు పలికెను. "ఉర్వశీ సమాగమముచే రాజు వర్ధిల్లుచున్నాడు" అనిపించుకోవలెనని రాజు కోరిక యిందు వ్యక్తమగుచున్నది.

పుట 15 : కల్పశతాని = కల్పములయొక్క వందలు. కల్పమనగా వేయి యుగములు. పూర్వస్యాం దిశి = తూర్పుదిశయందు - ఇంద్రుడు పూర్వదిక్కును పాలించును. ఆ దిక్కున రథ శబ్దము వినవచ్చుటచే ఇంద్రుడే ఎవ్వనినో పంపుచుండవచ్చును. ఉపదర్శితః = తెలియజేయబడినది, సూచింపబడినది. రథ వేగధ్వని తెలిసిన సూతుడు ఈ ధ్వనిని ముందుగా గుర్తించుట ఉచితముగా నున్నది.

శ్లో. 18 : అన్వయము : తప్తచామీకరాంగదః అయం చ కః అపి గగనాత్ తడిత్వాన్ తోయదః ఇవ శైలాగ్రం అవరోహతి.

అరము : తప్త - చామీకర + అంగదః=మేలిమిబంగరు దండకడెములుగల; అయంచ = ఈతడు; కః + అపి = ఎవ్వడో ఒకడు; గగనాత్=ఆకాశమునుండి; తడిత్వాన్=మెఱపులీగెగల; తోయదఃఇవ=మేఘమువలె; శైలాగ్రం = పర్వతశిఖరమునుగూర్చి; అవరోహతి = దిగుచున్నాడు.

విక్రమమహిమ్నా=పరాక్రమ శక్తిచేత - పరాక్రమము అనుటకు కాళిదాసు విక్రమ శబ్దము నుపయోగించుట తన ప్రభువైన విక్రమార్కుని గౌరవించుటకు అందురు. పురూరవునకు విక్రముడు అన్న పేరులేదు. అయినను నాటకమునకు పేరుపెట్టుట యందే విక్రమ శబ్దము నుపయోగించి కాళిదాసు తన ప్రభువును గౌరవించెను.

"ప్రియసుహృదే"=ప్రియమిత్రునకు - పురూరవుడు స్వర్గమునకు పోయివచ్చువాడు కనుక చిత్రరథుని బాగుగా నెఱుంగును. ఉర్వశిని చెలికత్తెలవద్ద దింపి వెళ్ళవలెనన్న యుద్దేశముతో పురూర

వుడు రథమునందే యుండెను. చిత్రరథుని చూచి అప్పుడు దిగెను. 'అయే' – ఆశ్చర్యమును, ఆదరమును సూచించు శబ్దము.

పుట 16 : అంతరా=మధ్య; చారణేభ్యః-రాజులు మొదలైనవారి వీరకృత్యములను గుఱించి గానముచేయుచు సంచరించువారు చారణులు; జయోదాహణం – జయ అను మాటతో ప్రారంభించి ఏదో యొక తాలము ననుసరించి గద్య పద్య సమన్వితముగా గానము చేయబడు కావ్యవిశేషము ఉదాహరణము – చారణులు కేశిని ఓడించి ఉర్వశిని రక్షించిన పురూరవుని వీరకృత్యమును పాటలుగా పదములుగా కట్టి పాడుచుండిరి. చిత్రరథుడు, అతని గంధర్వసేన ఈ పాటలు విని హేమకూటమునకు వచ్చిరి.

" ఇమాం పురస్కృత్య " – ఈమెను ముందుంచుకొని – అని ఉర్వశిని ప్రత్యేకించి చెప్పుట ఉర్వశీ పురూరవుల భావిదాంపత్యమునకు ఇంద్రుడు కారణమగుట సూచించును.

శ్లో. 14 : అన్వయము : ఇయం పురా నారాయణేన సంప్రతి దైత్యహస్తాత్ అపాచ్ఛిద్య సుహృదా త్వయా మరుత్వతే అతిసృష్టా.

అర్థము : ఇయం=ఈమె ( ఉర్వశి ); పురా = పూర్వము; నారాయణేన = నారాయణమునిచేత; సంప్రతి = ఇప్పుడు; దైత్య-హస్తాత్=రాక్షసుని చేతినుండి; అపాచ్ఛిద్య=తొలగించి; సుహృదా= మిత్రుడైన; త్వయా=నీ చేత; మరుత్వతే=దేవేంద్రునకు; అతిసృష్టా= ఈయబడినది.

రాజర్షియైన పురూరవునకు నారాయణ ఋషితో సామ్యము సూచింపబడినది.

. 15 : అన్వయము : అస్య పక్ష్యాః ద్విషదః విజయంతః (ఇతి) యత్ ఏతత్ వజ్రిణః ఏవ వీర్యం నను; హరేః వసుధాధరకందరాత్ విసర్పి ప్రతిశబ్దః అపి నాగాన్ భినత్తి.

అర్థము : అస్య=ఈ యింద్రునియొక్క; పక్ష్యాః = పక్షమందుండువారు; ద్విషదః=శత్రువులను; విజయంతః = జయించువారు;

(ఇతి) యత్=అని యేదికలదో; ఏతత్ = ఇది; వజ్రిణః - ఏవ=ఇంద్రుని యొక్కయే; వీర్యం - నను=శక్తి కదా; హరేః = సింహము యొక్క; వసుధాధర - కందరాత్=పర్వతగుహనుండి; విసర్పీ=వెలువడునట్టి: ప్రతిశబ్దః - అపి=ప్రతిధ్వనికూడ, నాగాన్ = ఏనుంగులను; భినత్తి= భేదించును.

పురూరవుడు తన నిరహంకారత్వమును ప్రకటించుచు ఇంద్రుడు శబ్దమైనచో తాను ఆ శబ్దమునకు ప్రతిశబ్దమునని సూచించి గూఢముగా నేనింద్రతుల్యుడనన్న అంకారమును ప్రకటించినాడు. వినీతత్వము, గూఢాహంకారము ధీరోదాత్తనాయకలక్షణములు. దృష్టాంతాలంకారముచే నాయకగుణములు వ్యక్తముచేయబడినవి.

పుట 17 : "అనుత్సేకః ఖలు విక్రమాలంకారః - గర్వము లేమియే కదా విక్రమమునకు (విక్రమునకు) అలంకారము. లేదా విక్రమాలంకారుడు గర్వరహితుడు గదా. విక్రమశబ్దము పరాక్రమమునకు, పురూరవునకు, విక్రమార్కునకు బోధకముగా నున్నది. విక్రమాలంకారుడనగా "విక్రమ" బిరుదము కలవాడనియు చెప్పవచ్చును. గర్వము లేమిచేత విక్రమము శోభిల్లునని చక్కని సూక్తి.

"సఖే"-అనుటచే ఇరువురు సమానులే. ఇంద్రునకు సహాయులే. ఇంద్రుని జూచుటకు నాకిది యవసరముకాదు అని చెప్పి పురూరవుడు తాను రక్షించిన ఉర్వశిని చిత్రరథునిచే ఇంద్రునకు పంపి మిత్రుడైన గంధర్వరాజునకు కొంత గౌరవము కట్టబెట్టినాడు.

"యథా భవాన్ మన్యతే" సమానుడు గనుక "మన్యతే" అనెను. తక్కువవారు "ఆజ్ఞాపయతి" అందురు.

"జనాంతికం" - రాజున కెదురుగా నిల్చి ఆయనను అపవారించి ఉర్వశి చిత్రలేఖతో భాషించుచున్నది. ఇదియు అపవారితము వంటిదే. "మే ముఖం భవ" - నా ముఖము కమ్ము - అనగా నాకు బదులుగా మాట్లాడుము. కారణము వ్రీడ. రాజును ప్రేమించినందున ఉర్వశికి తక్కిన అప్సరసలకు లేని సిగ్గు కలిగినది.

"ప్రియసఖీం ఇవ"- కేశిని గెల్చి తన్ను రక్షించిన పురూరవుని కీర్తి ఉర్వశికి ప్రియసఖి. దాని నెన్నడు విడువదు అనగా ఆ సంఘటనను మఱువదు. రాజు ఎల్లప్పుడు ఆమె హృదయమందే ఉండునని భావము.

పుట 18: "పునర్దర్శనాయ" - మఱువకుండుటయే కాదు మరల తప్పక వచ్చి కనబడవలెను అని రాజు ఉర్వశీ పునర్దర్శన కాంక్షను తెలిపినాడు. సవ్యాజం = నెపముతో; ఏకావళీ వైజయంతికా = ఒంటి పేట గలిగి పాదములవఱకు వ్రేలాడు ముత్యాలదండ. పాదముల వఱకు వ్రేలాడునది కనుకనే ఎగురబోవుచుండగా తీగెకు తగుల్కొన్నది రాజును చూచుటకిది ఒక మిష. తాను విడిపించుకోగలిగియు చిత్రలేఖను పిలుచుట మరికొంత సేపు రాజును చూచుటకు, ఆయన కళ్ళయెదుట నిలుచుటకు.

"దృఢంఖలులగ్నా" - గట్టిగా తగుల్కొన్నది. రాజునందు నీ హృదయము దృఢముగా లగ్నమైనది అని చిత్రలేఖ వ్యంగ్యము. విడదీయ శక్యముగానట్లు తోచుచున్నదనుట భావికథా ధ్వని.

"స్మర తావదేత దాత్మనః వచనం"-ఈ నీమాటను కొంచెము గుర్తుపెట్టుకొనుము. రాజును కలిసికొనుటకు ఉర్వశికి చిత్రలేఖ తోడ్పాటు మున్ముందు కావలసియున్నది కనుక ఈ మాట.

శ్లో. 16: అన్వయము: లతే అస్యాః గమనే క్షణవిఘ్నం ఆచరంత్యా త్వయా మే ప్రియం ఆచరితం; యత్ అపాంగనేత్రా ఇయం పరివృత్య అర్ధముఖీ మయా పునః అపి అద్య దృష్టా.

అర్థము: లతే=ఓ లతా; అస్యాః=ఈమెయొక్క: గమనే= గమనమునందు; క్షణవిఘ్నం=తెప్పపాటు కాలము భంగము: ఆచరంత్యా=చేయుచున్న; త్వయా=నీచేత; మే=నాకు; ప్రియం=ఇష్టము, సంతోషము; ఆచరితం=చేయబడినది; యత్=ఏలనన; అపాంగ-నేత్రా= కడగంటి చూపుగల; ఇయం=ఈమె; పరివృత్య = వెనుకకు దిరిగి; అర్ధముఖీ=ప్రక్క ముఖము గలదై; మయా = నాచేత; పునః-అపి= మరల నొకసారి; అద్య = ఇప్పుడు; దృష్టా = చూడబడినది.

అభిజ్ఞాన శాకుంతలమునందును కాళిదాసు ఇట్టి పన్ని వేశమును ప్రవేశ పెట్టెను.

పుట 19 : శ్లో. 17 : అన్వయము : అదః తే వాయవ్యం అస్త్రం సురేంద్రస్య కృతాపరాధాన్ దైత్యాన్ లవణాంబురాశౌ ప్రక్షిప్య మహోరగః శ్వభ్రం ఇవ పునః శరధిం ప్రవిష్టః.

అర్థము : అదః=ఈ, ఇదిగో; తే=నీయొక్క; వాయవ్యం=వాయుదేవతాకమైన; అస్త్రం=అస్త్రము; సురేంద్రస్య=దేవేంద్రునకు; కృత + అపరాధాన్=చేయబడిన అపరాధముగల; దైత్యాన్=రాక్షసులను; లవణ + అంబురాశౌ=లవణ సముద్రమునందు; ప్రక్షిప్య=విసరివైచి; మహా + ఉరగః=మహా సర్పము; శ్వభ్రం-ఇవ=పుట్టనువలె; శరధిం = అమ్ముల పొదిని; ప్రవిష్టః = ప్రవేశించినది.

ఈశాన్యదిక్కున దానవులను జయించి, యుర్వశిని రక్షించి, రాక్షసులను దక్షిణముననున్న లవణ సముద్రమున ద్రోసిరమ్మని వాయవ్యాస్త్రమును బంపి పురూరవుడు ఉత్తరమందున్న హేమకూటమునకు దిరిగి వచ్చెను. అస్త్రము కూడ తన పని నెరవేర్చి తిరిగి వచ్చి అమ్ముల పొదిలో ప్రవేశించెను.

"నాట్యేన" - నాట్య తో అనగా విలాసముతో ఉర్వశి మనస్సును హరించునట్లు. ఉర్వ నిట్టూర్పుచే చింతయను భావమును వ్యక్తము చేయుచు, రాజును జూచుచు తప్పనిసరియై వెడలిపోయినది.

"అహోను ఖలు దుర్లభాభినివేశీ మదనః"—ఆశ్చర్యము గదా! మన్మథుడు దుర్లభములైనవాని యందును అత్యంతాసక్తి గలిగించును - ఇంద్ర సేవికయైన ఉర్వశి దుర్లభయే. ఐనచో మన్మథుడు తనకు ఆమెయందు అంత గాఢవాంఛ నేల కలిగించెను? ఒకవేళ ఉర్వశి తనకు మాత్రము సులభ కావచ్చునేమో. శకుంతలపై మనస్సు లగ్నమైనప్పుడు దుష్యంతు డిట్లే యనుకొనెను. ఈ యంకము చివర తెగినట్లుగా కనబడు ప్రేమ బంధము రెండవ అంకమున మరల అతుకుకొనును.

పుట 60 : శ్లో. 18. అన్వయము : పితుః మధ్యమం పదం ఉత్పతంతీ ఏషా సురాంగనా మే శరీరాత్ మనః రాజహంసీ ఖండితాగ్రాత్ మృణాలాత్ సూత్రం ఇవ ప్రసభం కర్షతి.

అర్థము : పితుః = తండ్రియొక్క; మధ్యమం=నడిమిదైన; పదం = పాదమును గూర్చి; ఉత్పతంతీ=ఎగురుచున్న: ఏషా=ఈ; సురాంగనా=దేవతా స్త్రీ; మే=నాయొక్క; శరీరాత్=శరీరము నుండి: మనః=హృదయమును; రాజ హంసీ=రాజ హంసి; ఖండిత-అగ్రాత్=త్రుంచబడిన చివరగల; మృణాలాత్=తామరతూడునుండి; సూత్రం-ఇవ = తంతువునువలె; ప్రసభం=బలాత్కారముగా; కర్షతి= లాగుచున్నది.

"పితుః మధ్యమ పదం"—నారాయణ మునియే విష్ణువు. ఆయన త్రివిక్రముడు, ఆయన మధ్యమ పాదము ఆకాశము, ఉర్వశి తన తండ్రి మధ్యమ పాదమైన ఆకాశమున కెగిరెను.

"మనః కర్షతి" అనుటవల్ల ఈ యంకాంతమున పురూరవునకు గలిగిన ఉర్వశీ వియోగ తాపము తరువాతి యంకములోనికి ఆకర్షింపబడును. ఇందువల్ల అంకావతారము అను అర్థోప క్షేపకము సిద్ధించును. ఒక అంకము చివర రాబోవు అంకమునందలి వస్తువు సూచింపబడుట అంకావతారము.

అంకము : నాయకునితో ప్రత్యక్ష సంబంధముగల వస్తువు గలది, నాయకుడు ఆసన్నుడై యున్నది, రసభావ సముజ్జ్వలమైనది, ఏకదివస వృత్తము గలది అయిన నాటక భాగము అంకము. అంకాంతమున పాత్రములన్నియు నిష్క్రమింప వలెను.

---

# ద్వితీయాంకము

**విదూషకః :**

నాయకుని శృంగారవ్యాపారమున సహాయుడు, హాస్యనిపుణుడు, కలహశీలి, వికృతరూప వేషుడు, భోజన ప్రియుడు, మూఢుడు అయిన బ్రాహ్మణ బ్రహ్మచారి.

**చేటి :**

నాయికకు విశ్వాస పాత్రురాలయిన అంతరంగిక పరిచారిక.

ఆకీర్ణే = జన సంకులమైన స్థలమునందు; జనసంపాతే=జన సమ్మర్దముగల దానియందు.

దేవి - పట్టమహిషియైన రాణిని నిర్దేశించు పదము. హంజే= ఓసి - చేటికను, చెలికత్తెను సంబోధించు పదము.

పుట 28 ఆర్యపుత్రః - భార్య భర్తను నిర్దేశించు పదము. ఆర్య-మాణవకాః= పూజ్యుడైన మాణవకుడను పేరుగల రాజమిత్రుడు - విదూషకుడు; బ్రహ్మబంధుః=బ్రాహ్మణజాతి బంధువుగా గలవాడు-జాతిమాత్ర బ్రాహ్మణుడు-బ్రాహ్మణాధముడు. అవశ్యాయ సలిలం= మంచునీరు;

ఆత్మగతం, స్వగతం - రంగస్థలమందలి పాత్రములు విన కూడని భాషణము. "దుష్ట చేటికాం" - నిపుణిక మిక్కిలి గడుసరియని విదూషకు డెరుగును తనవద్ద ఎట్టి రహస్యమున్నను అది బయటకు రాగలదు. రాజు రహస్యము వెల్లయిన దాచవలెనని విదూషకుడు ఏకాంత స్థలమున వచ్చి మౌనముగా కూర్చుండెను. అప్పటికే నిపుణిక వచ్చెను. "ఆర్య వందే" అని పలుకరించెను. ఈ మాటతో విదూషకుడు పొంగిపోయెను. రహస్యము దాని హృదయము చీల్చుకొని బైటబడునట్లుండెను.

పుట 23 : రాణియే నిపుణికను తన వద్దకు పంపెనని విని విదూషకునకు అమితానంద మయ్యెను. విదూషకుడు మూఢుడు గనుక నిపుణిక ఒక యసత్యమును కల్పించినది. రాజు తాను మనసులో ప్రేమించు చున్న స్త్రీ పేరుతో రాణిని పిలిచెనని బొంకినది. విదూషకుడు నమ్మెను. రాజే తన రహస్యమును బయట పెట్టుకొనగా తానింక దాపరికము చేయనేలయని తలచి "ఉర్వశీ" అని సంబోధింపబడినదా యని రహస్యమును బయట పెట్టెను ? గడుసువాడైనచో "ఏ పేరుతో సంబోధించెను ?" అని యడుగవలయునుగదా. రహస్యమును దాచి యుంచు బాధయే కాక వినోద ముఖుడై రాజు తన్ను బాధించు చున్నాడన్న విసుగుదలకూడ విదూషకునకు గలదు. అందుచే వాడు రాణి పక్షము వహించెను.

.పుట 24 : మృగతృష్ణిక=జలభ్రాంతి కలిగించు సూర్యరశ్మి, ఎండమావులు.

అప్సరసలు తమ యందముచే మనుష్యులను లోభ పెట్టుదురే కాని లభింపరు. అట్టి యప్సరసయందలి వ్యామోహామునుండి రాజును మరలించుటకు యత్నింతును, ఆ పిమ్మటనే రాణి ముఖమును చూడగలను అని విదూషకుడు నిపుణికకు చెప్పుచున్నాడు. చెప్పినట్లే ప్రయత్నించినట్లు మున్ముందు గుర్తింప వచ్చును.

వైతాలికుడు - వివిధ తాళములతో గీతములను పాడునతడు. రాజునకు ఆయా సమయములందు ఆచరించవలసిన యంశములను అన్యాప దేశముగా గుర్తు చేయువాడు. రాజుయొక్క, ఆయన పూర్వులయొక్క గుణగణములను స్తుతించు గీతములు పాడి సమయ సూచన చేయుట వైతాలికుని కర్తవ్యము. రాజు ధర్మాసనమున నుండు కాలము పగలు రెండవ యామము. ఆయన కార్యాసనము నుండి లేచువేళ యైనది గనుక వేళ ఉదయము 9.00 గంట లయినది.

శ్లో 1 : అన్వయము : అలోకాంతాత్ ఆసాం ప్రజానాం ప్రతిహతతమో వృత్తిః తవ దివకృతః చ అధికారః తుల్యోద్యోగః నః మతః; ఏష జ్యోతిషాం అధిపతిః వ్యోమమధ్యే క్షణం తిష్ఠతి, త్వం అపి దివసస్య షష్ఠేభాగే ఆత్మనః ఛందవర్తీ.

అర్థము : ఆలోకాంతాత్=లోకముయొక్క అంతము వఱకును; అసాం-ప్రజానాం=ఈ ప్రజలయొక్క; ప్రతిహత-తమః + వృత్తిః=నాశము చేయబడిన చీకటియొక్క (తమో గుణము యొక్క) వ్యాపారము గలదైన; తవ=నీయొక్క; దినకృతః-చ=సూర్యుని యొక్కయు; అధికారః=అధికారము; తుల్య + ఉద్యోగః=సమానమైన ప్రయత్నము కలది; (అని) నః=మాయొక్క: మతః=అభిప్రాయము; ఏష=ఈ; జ్యోతిషాం=గ్రహముల యొక్క; అధిపతిః=రాజైన సూర్యుడు; వ్యోమ-మధ్యే=ఆకాశము నడుము; క్షణం=ఒక నిమేషము; తిష్ఠతి=నిల్చియున్నాడు; త్వం-అపి=నీవుకూడ; దివసస్య=పగటియొక్క; షష్ఠే=ఆఱవదైన; భాగే=భాగమునందు. ఆత్మనః=నీయొక్క; ఛందవర్తీ=ఇచ్ఛానుసారము వర్తించువాడవు.

పుట 25 : ప్రవేశకః : ప్రవేశకము, విష్కంభము, చూళిక, అంకాస్యము, అంకావతారము అను ఐదును అర్థోపక్షేపకములు. జరిగిన, జరుగబోవు, జరుగుచున్న కథను సూచించునవి. ప్రవేశకము నీచపాత్రలచే ప్రయోగింపబడును. వృత్త, వర్తిష్యమాణ కథాంశములను సూచించును. నీరసమైన విషయమును తెలుపును. రెండంకముల నడుమనే ఉండును. నాటకారంభమునందుండదు.

శ్లో॥ 2 : అన్వయము : సా సురసుందరీ మకరకేతోః అవంధ్య పాతేన బాణేన కృతమార్గం మే హృదయం ఆదర్శనాత్ ప్రవిష్టా.

అర్థము : సా=ఆ; సురసుందరీ=దివ్యస్త్రీ; మకరకేతోః=మన్మథునియొక్క: అవంధ్య-పాతేన=అమోఘమైన పాతముగల, బాణేన=బాణముచేత; కృతమార్గం=చేయబడిన త్రోవగల; మే=నాయొక్క; హృదయం=హృదయమును; ఆదర్శనాత్=చూచినది మొదలుకొని; ప్రవిష్టా=ప్రవేశించినది.

ప్రథమాంకము చివర సందిగ్ధ స్థితియందుండి అణగిన బీజరూపమైన రతి యిచ్చట మరల తలచూపినది. కనుక ఉర్వశీగతమైన రాజుయొక్క రతి స్మరింపబడిన ఇచ్చట బిందువు కలదు. బిందు ప్రయత్నముల సంయోగమువల్ల ఇచ్చటనుండి ప్రతిముఖ సంధి

తపస్వినీ=దుఃఖతురాలు, దీనురాలు - విదూషకుడు రాణి యందు పక్షపాతము ప్రదర్శించుచున్నాడు.

రహస్య - నిక్షేపః=రహస్య మనెడు కుదువబెట్టిన సొమ్ము. హాధిక్=అయ్యో ఛీ - విచారముతో తన్ను నిందించుకొనుట. అభి సంహితః=వంచింపబడితిని.

పుట 26 : నియంత్రితా=కట్టివేయబడినది; సహసా = వెంటనే. మౌనముగా నుండుటకు కారణము నాలుకను గట్టిగా బంధించియుంచుట యేయని చెప్పి, రహస్యమును తాను భద్రముగా కాపాడుచుంటినని విదూష కుడు బొంకుచున్నాడు. "యుక్తం" అని రాజు నమ్మినాడు.

"మహానసం గచ్ఛావః"- ఇది విదూషకుని భోజనప్రియత్వము నకు గుర్తు. భోజన పదార్థములను తయారుచేయుట చూచినంత మాత్రముననే విదూషకునకు కొంత మనశ్శాంతి కలుగును.

పుట 27 : "ఈప్సితసన్నిధానాత్" - ఇష్టమైన భోజన పదార్థములు ఎదుట నుండుటవల్ల విదూషకుడు వినోదించును. తన కిష్టమైన ఉర్వశి ఎచ్చ టనో ఉన్నది. విదూషకుని కోరిక సులభము; తన కోరిక దుర్లభము. తనకు వినోద మెట్లు లభించును? "నఖలుసా దుర్లభా"- నీవు ఉర్వశి కంటబడితివి కదా. ఇంక ఆమె నీకు దుర్లభ కాదు. నీ యందమును చూచిన స్త్రీ నీకు వశ్యురాలు కాకుండదు. ఉర్వశి నిన్ను తప్పక ప్రేమించియుండును. విదూషకుని యీ వాక్యము మిత్ర పక్షపాత మును సూచించుచున్నదని రాజు పలుకుచున్నాడు. ఏలన ఉర్వశి సౌందర్యము ఎట్టిదో విదూషకు డెఱుంగక తన సౌందర్యమును పొగడుచున్నాడు. ఈ మాటవల్ల రాజు సౌందర్యగర్వి కాదని తెలియుచున్నది.

కౌతూహలం - ఉర్వశి సౌందర్యవర్ణన వినవలెనని ఆసక్తి. విదూషకుడు డిట్లని రాజునకు ఉర్వశి సౌందర్యము వర్ణించి వినో దించుటకు అవకాశము కల్పించినాడు.

"సమానతః శ్రూయతాం" - ఉర్వశి యంగములన్నియు వర్ణించుటకు ఉపమానములు లభింపవు. కనుక ఆమె యందము యొక్క లోకోత్తరతను రాజు వర్ణించినాడు. ప్రత్యంగవర్ణన పరిహరించుట ఔచిత్యముకొఱకు. ఇది కాళిదాసు మార్గము.

పుట 28 : శ్లో. 3 : అన్వయము : సఖే ! తస్యాః వపుః ఆభరణస్య ఆభరణం, ప్రసాధన విధేః ప్రసాధన విధిః, ఉపమానస్య అపి ప్రత్యుపమానం.

అర్థము : సఖే=చెలికాడా; తస్యాః=ఆమెయొక్క; వపుః = శరీరము; ఆభరణస్య=భూషణమునకు; ఆభరణం=భూషణము; ప్రసాధన-విధేః=అలంకరణ విధానమునకు; ప్రసాధన - విధి = అలంకరణ విధానము; ఉపమానస్య-అపి = ఉపమానమునకు గూడ; ప్రత్యుపమానం=మారైన ఉపమానము.

ఆమె ధరించుటవల్ల ఆభరణములకు అందము కలుగును. ఆమె యలంకారము చేసికొనుటవల్ల అలంకరణమునకే అందము కలుగును ఆమె ఉపమానమునకే ఉపమానము. ఆమె ముఖము చంద్రునివలె ఉండుటకాక చంద్రుడే ఆమె ముఖమువలె ఉండును. ఆమెనుగూర్చి ప్రతీపాలంకారమే తప్ప ఉపమాలంకారము సాధ్యముకాదు. ఆమె సౌందర్యము నిరుపమానము అనుట.

"దివ్య రసాభిలాషిణా చాతకవ్రతం గృహీతం" - దివ్యరస మనగా దివినుండి జారిన జలము అని యొక అర్థము. చాతకము నేలపైబడిన నీటిని త్రాగదు. ఆకాశమునుండి పడుచుండగనే త్రాగును. దివ్యరసము అనగా దేవతాసంబంధమైన ప్రేమ అని యింకొక అర్థము - దేవతాస్త్రీ ప్రేమ ననుభవించుటయందు ఆసక్తి గలవాడు మనుష్యస్త్రీ ప్రేమను ఆదరించడు. కనుక అప్సరసయైన ఉర్వశియందు ఆసక్తిగల రాజు మనుష్యస్త్రీయైన రాణిని నిరాదరించుచున్నాడు. నేలమీది నీటిని ముట్టనని చాతకము యొక్క వ్రతము. రాజు అట్టి వ్రతమును పట్టినాడు. ఈ మాటలతో విదూషకుడు రాణియందు పక్షపాతము చూపుచు రాణిని అన్యాయముగా

బుద్ధిపూర్వకముగా నిరాదరించి పీడించుచున్నావు అని రాజును గూఢముగా అధిక్షేపించుచున్నాడు.

"కాగతిః" ఇంక గతియేమి? అని విదూషకుడు తనలో విచారించినాడు. తాను వంటియింటికి పోవుదమని చెప్పగా రాజు ప్రమదవనమునకు దారి చూపుమనుచున్నాడు.

"దక్షిణమారుతేన" - దక్షిణమారుతముచేత. బహు భార్యలందు సమాన ప్రేమగలవాడు దక్షిణుడు. మారుతునకు "దక్షిణ" శబ్దమును విశేషణముగా వాడి విదూషకుడు ఉర్వశియందువలె రాణియందును సమానముగా ప్రేమగలవాడవు కమ్ము, ఆమెను బాధింపక దయజూడుము- అని గూఢముగా బోధచేయుచున్నాడు. రాజు గ్రహించియుండును. "ఉపపన్నమిదం విశేషణం అన్యవాయోః" ఈ వాయువునకు విశేషణము యుక్తముగా నున్నది అని దక్షిణము నుండి వీచుటచేత నేకాక అని పుష్పములందును సమానమైన యాదరము కలిగియుండుటచేత కూడ ఈ వాయువు దక్షిణమే అని వివరించుచున్నాడు.

శ్లో. 4 : అన్వయము : ఏతాం మాధవీం లతాం నిషించన్ కౌందీం చ (లతాం) నర్తయన్, స్నేహదాక్షిణ్యయోః యోగాత్ (వాయుః) కామీ ఇవ మే ప్రతిభాతి.

అర్థము : ఏతాం=ఈ; మాధవీం=మాధవి అనెడు; లతాం = తీగెను; నిషించన్ = నిషేకించుచు, చిందించుచు; కౌందీం - చ = కౌంది యనెడు తీగెనుగూడ; నర్తయన్ = కదలించుచు; స్నేహ - దాక్షిణ్యయోః = స్నేహముయొక్క దయయొక్క; యోగాత్ = సంపర్కమువల్ల; కామీ-ఇవ=కాముకునివలె; మే=నాకు; ప్రతిభాతి= తోచుచున్నది.

ఈ మాటలయందు రాజు తనయొక్క దక్షిణ నాయకత్వమునే వ్యక్తము చేయుచున్నాడు. మాధవీలత వసంతర్తువున శోభ వహించునది. కౌంది శిశిరమున శోభిల్లునది. కథాసందర్భము వసంతర్తువు. వాయువు మాధవియందు స్నేహమును చిలుకుచున్నది. కౌందిని

ఆడించుచున్నది. రాజును ఇట్లే క్రొత్తగా చిత్తమును ఆకర్షించిన ఉర్వశియందు ప్రేమ చిలుకుచున్నాడు, ప్రాతదైన పట్టపురాణి యందు దయచూపుచున్నాడు. "మాధవీం నిషించన్" అనుటచే ఉర్వశితోడనే భోగించుననియు, "కాందీం వర్తయన్" అనుటచే పట్టపుదేవిని కేవలము ఉపలాలన చేయుననియు సూచన. కథాపర్యవసాన మట్లేయున్నది. ఉర్వశియందే సంతానము కలుగును.

పుట 29 : ఈ దృశ ఏవ త వాభినివేశో భవతు" - విదూషకుడు రాజు భావమును గ్రహించెను. నీ నిశ్చయమును ఇట్టిదే యగునుగాక అనుచున్నాడు. ఉర్వశిని ప్రేమించినను రాణిని మాత్రము పీడింపకుము. ఆమెను గూడ లాలింపుము అని రాజునకు సూచించుచున్నాడు. "ఆ మృగతృష్ణికనుండి మరలింప యత్నింతును" అని రాణికి వాగ్దానము చేసినాడు గదా. అట్లు రాజు చిత్తమును ఉర్వశినుండి మరలించుట సాధ్యముకాదని ఇప్పుడు గ్రహించి రాణియందు ఆదరము వీడకుండినచో చాలునని తృప్తిపడినాడు. మిత్రుడైన రాజు ఉర్వశిని పొందుట విదూషకున కిష్టమే. తనయందు అభిమానముగల రాణిని రాజు నిరాదరముచేయక లాలించునంతమాత్రమైన చేసినచో అతనికి తృప్తి.

శ్లో. 5 : అన్వయము : అహం తాపశాంతయే తూర్ణం ఉద్యానం వివిక్షుః (ఇతి) యత్, తత్ స్రోతసా ఉహ్యామానస్య ప్రతీపతరణం ఇవ హి.

అర్థము : అహం=నేను; తాప-శాంతయే=మదన తాపశాంతి కొఱకు; తూర్ణం=త్వరగా; ఉద్యానం=ఉద్యానవనమును; వివిక్షుః= ప్రవేశింపగోరినవాడను; ఇతి యత్ = అనునేది కలదో; తత్ = అది; స్రోతసా=ప్రవాహముచేత; ఉహ్యామానస్య = మోచికొని పోబడుచున్నవానికి; ప్రతీప-తరణం-ఇవ-హి=ఎదురీతవంటిది గదా.

ఉద్యానవనమున-విశేషించి వసంతర్తువున రతిని ఉద్దీపింపజేయు సామగ్రి అతిశయముగా నుండును. విదర్శనాలంకార గర్భితమైన ఉపమాలంకారము.

శ్లో. 6 : అన్వయము : పంచబాణః ప్రథమం అపి అసులభ ప్రార్థనాదుర్ని వారం ఇదం మే మనః క్షిణోతి; మలయవాతోన్మీలితాపాండు పత్రైః ఉపవన సహకారైః అంకురేషు దర్శితేషు కి ముత ?

అర్థము : పంచబాణః = అయిదు బాణములుగల మన్మథుడు; ప్రథమం-అపి=ఇంతకుముందు కూడ, ఇప్పటికే; అసులభ - ప్రార్థనా-దుర్నివారం=సులభముగా తీరనికోర్కియందు అడ్డగింప శక్యము గాకున్న; ఇదం=ఈ; మే = నాయొక్క; మనః = హృదయమును; క్షిణోతి = కృశింపజేయుచున్నాడు, బాధించుచున్నాడు; మలయ - పవన + ఉన్మీలిత + ఆపాండు-పత్రైః = మలయమారుతముచే వెక లించివేయబడిన పూర్తిగాపండిన ఆకులు గల; ఉపవన-సహకారైః = ఉద్యానమందలి మామిడిచెట్లచేత; అంకురేషు=చిగుళ్లు, బాణపుములు కులు; దర్శితేషు = చూపబడినవి అగుచుండగా, కి ముత = ఇంక చెప్పెడిదేమి.

ఇదివఱకు "దుర్లభ" అన్న రాజు ఇప్పుడు "అసులభ" అనుటచే ఉర్వశీ ప్రాప్త్యాశ కొంచెము ఎక్కువగుచున్నదని సూచన.

పంచబాణములు : "అరవింద మశోకంచ చూతంచ నవ మల్లికా నీలోత్పలంచ పంచైతే పంచబాణస్య సాయకాః." ఈ అయిదు విధములయిన పుష్పములు మదనబాణములు. ఇంకొక విధ ముగా - "సమ్మోహనోన్మాదనౌ చ శోషణ స్తాపన స్తథా స్తంభ నశ్చేతి కామస్య పంచబాణాః ప్రకీర్తితాః." సమ్మోహనము, ఉన్మా దనము, శోషణము, తాపనము, స్తంభనము అను అయిదును మన్మ థుని పంచబాణములు. వీనిచే మన్మథుడు రాజును ఇప్పటికే పీడించు చున్నాడు. ఉద్యానవనమున ప్రవేశించినచో పైని చెప్పిన పుష్పబాణ ములచేతగూడ పీడించును. మదనుని మిత్రుడు వసంతుడు. ఉద్యానవన మున అతడు విజృంభించి యున్నాడు. మలయానిలుడును మదనుని మిత్రుడే. అతడు పండుటాకులను తొలగించి సహకారములందు ఎఱ్ఱని చిగుళ్ళను ప్రదర్శించుచున్నాడు. మదనునకు సహాయము చేయు

మామిడిచెట్టు సహకారము. కనుక ఉద్యానవన ప్రవేశము రాజునకు బాధ అతిశయింపజేయును.

పుట 80. "ఇష్ట సంపాదయితా అనంగ ఏవ సుఖదః భవతి" - ఇప్పుడు అనంగుడు నిన్ను బాధించుచున్నాడు గాని అతడే మున్ముందు నీకు సుఖము కలిగింపగలడు. ఇష్టమైన ఉర్వశిని నీకు సంపాదించిపెట్ట పెట్టగలడు. ఇది విదూషకుని ఆశీర్వచనము. "గృహీతం బ్రాహ్మణ వచనం" అని రాజు ఆ యాశీర్వాదమును స్వీకరించి సంతోషించెను. విదూషకుడు బ్రహ్మబంధువే అయినను కష్టసమయమున అతడు పలికిన ప్రియవచనము రాజునకు తప్పక ఫలించు ఆశీర్వాదముగనే తోచినది.

"అనంగ ఏవ సుఖదః భవతి" అన్న విదూష వాక్యమున ఉత్తరకథా ధ్వనియున్నది. "మదనః ఖలు మాం నియోజయతి" అన్న ఉర్వశి వాక్యమును గమనింపవలెను (పుట 88.)

"వసంతావతార సూచకం అభిరామత్వం ప్రమదవనస్య"— వసంత ఋతువు యొక్క ఆగమనమును సూచించు ఉద్యానవన సౌందర్యము - వసంతము రాబోవుచున్నది. దాని రాకను వన సౌందర్యము సూచించుచున్నది. "అవతార" శబ్దముచేత ఆకాశము నుండి దిగివచ్చుట అన్న యర్థము కలిగి ఉర్వశీ ప్రవేశము సూచింప బడుచున్నది. రాజుచేత "ఆర్తవీ శ్రీః" అని ఉర్వశి యిదివఱకు నిర్దేశింపబడినది. ఉర్వశియే వసంతలక్ష్మి. ఆమె స్వర్గమునుండి దిగి వచ్చుచున్నదని ఉపవన సౌందర్యము సూచించుచున్నది.

"నను ప్రతిపదమేవ అవలోకయామి"—అడుగడుగునను చూచుచునే యున్నానుగదా. రాజు వసంతావతార లక్షణమును వర్ణించుచున్నాడు. వసంతలక్ష్మి ముగ్ధా, ప్రౌఢా నాయికల నడిమి దశలో - మధ్యా నాయికా రూపమున నున్నది. రాజు ఉద్యాన లక్ష్మియందు ఉర్వశినే చూచుచున్నాడు.

శ్లో. 7 : అన్వయము : కురవకం అగ్రే స్త్రీనఖపాటలం ద్వయోః భాగయోః శ్యామం (తిష్ఠతి); బాలాశోకం ఉపోఢరాగ సుభగం

భేదోన్ముఖం తిష్ఠతి; చూతే ఈషద్బద్ధరజఃకణాగ్ర కపిశా నవా మంజరీ (తిష్ఠతి); సఖే! మధుశ్రీః ముగ్ధత్వస్య చ యౌవనస్య చ మధ్యే స్థితా.

అర్థము : కురవకం=కురవక పుష్పము; అగ్రే=పై భాగమున; స్త్రీ-నఖ-పాటలం=స్త్రీ యొక్క గోరువలె ఇంచుక రక్తవర్ణము గలది; ద్వయోః=ఉభయమైన; భాగయోః=ప్రక్కలయందును: శ్యామం = నల్లనిదియునై; తిష్ఠతి=ఉన్నది; బాల + అశోకం=లేతయయిన అశోక పుష్పము; ఉపోఢ - రాగ-సుభగం = వ్యాపించిన రక్తవర్ణముచే సుందరమై; భేద + ఉన్ముఖం = వికసించుటకు సిద్ధముగా; ఉన్నది; చూతే=మావిగున్నయందు; ఈషత్ + బద్ధ–రజఃకణ + అగ్ర-కపిశా= కొంచెము బిగిసిన పుప్పొడి రేణువులచేత అగ్రమున ముదురైన ఎఱ్ఱరంగు గలదై; నవా=క్రొత్తదైన; మంజరీ=పూవుగుత్తి; తిష్ఠతి= ఉన్నది; సఖే=చెలికాడా; మధుశ్రీః=వసంతలక్ష్మి; ముగ్ధత్వస్య–చ= ముగ్ధత్వమునకును; యౌవనస్య-చ=యౌవనమునకును; మధ్యే=నడిమి దశయందు; స్థితా=ఉన్నది.

రాజు మూడు పూవులయందు ముగ్గురు నాయికలను, అను రాగముయొక్క మూడు దశలను వర్ణించినాడు. కురవకము అప్పు డప్పుడే వికసింపబోవుచు అగ్రమున కొంచెము ఎఱుపు కలిసిన తెలుపుగా ఉన్నది. ఇది ముగ్ధ. ప్రథమ దర్శనమున రాగోదయమైన ఉర్వశి. అశోకము అంతటను రక్తము వ్యాపించి విప్పారుటకు సిద్ధముగా నున్నది. ఇది మధ్య. పురూరవుని యందు ప్రేమ యధిక ముగా ఆవేశించి లజ్జనువిడి ఆ యనురాగమును సాక్షాత్తుగా ప్రకటిం చుటకు సిద్ధముగా నున్నది. చూతమంజరి వికసించి పుప్పొడి కొంచెము బిగిసి ఎఱ్ఱదనమున నీలిమ కలిసియున్నది. ఇది ప్రౌఢ. చిరపరిచయము వల్ల అనురాగము కొంత మందగించినది. ఉర్వశియందు తళతళ లాడు చున్న కుసుంభరాగము అశోక పుష్పముచేతను, పట్టపు రాణియందు మందగించిన నీలిరాగము చూతమంజరియందును సూచింపబడినవి,

"మధుశ్రీః" అనుట "ఆర్తవీశ్రీ" అనుట ఉర్వశి వసంత లక్ష్మి యనుట.

పుట 81 : "అతిముక్త లతామండపః"—అతిముక్తలత యనగా మాధవీ లత. "నిషించన్ మాధవీం" అనిన రాజు మాటయందలి మాధవీలతా పక్షపాతమును గుర్తించి విదూషకుడు మాధవీలతా మండపమున గూర్చుండుమని రాజును ప్రోత్సహించినట్లు తోచును. "లలితలతా విలోభమాననయనః ఉర్వశీగతాం ఉత్కంఠాం వినోదయతు - సుకు మారములయిన లతలచేత ఆకర్షింపబడుచున్న కన్నులు గలవాడవై ఉర్వశి యందలి ఉత్సుకతను తొలగించుకొనుము" అని విదూషకుడు రాజు హృదయము గ్రహింపక పలుకుచున్నాడు. లతలు ఉర్వశిని మరపించుటకు మారు అధికముగా తలపించుచున్నవి. "అనుపద మేవ అవలోకయామి" - అడుగడుగునను చూచుచున్నాను అని రాజనెను గదా. చూచుచున్నది లతలనుగాదు, లతల యందలి ఉర్వశిని. విదూషకుని వాక్యము ఉత్తర కథను - చతుర్థాంకమున రాజు లలిత లతా రూపముచే ఆకర్షింపబడిన కన్నులు గలవాడై దానిని కౌగి లించి ఉర్వశీ వియోగ దుఃఖమును దొలగించు కొనుటను ధ్వనించు చున్నది.

శ్లో. 8 : అన్వయము : సఖే తద్రూపాలోక దుర్లలితం మమ చక్షుః నమ్రవిట పాసు కుసుమితాసు అపి ఉపవనలతాసు ధృతిం న బధ్నాతి.

అర్థము : సఖే=చెలికాడా: తత్ + రూప + ఆలోక - దుర్ల లితం=ఆ యుర్వశియొక్క రూపమును చూచుటయందు లాలసమైన; మమ = నాయొక్క; చక్షుః=కన్ను, చూపు; నమ్ర-విటపాసు=వంగిన కొమ్మలుగల; కుసుమితాసు + అపి=పుష్పించినవియైనను; ఉపవన- లతాసు=ఉద్యాన లతలయందు; ధృతిం=బుద్ధి నిలకడను; న-బధ్నాతి= బంధింపకున్నది, కలిగింపకున్నది.

పుష్పితలత ఉపమానము. ఉర్వశి ఉపమేయము. లతలను జూచుటవల్ల మనస్సు ఉర్వశి మీదకే పోవుచున్నది గాని లతలపై నిల్చుటలేదు. ఇవి ఉర్వశీ సాదృశ్యమువల్ల ఉత్కంఠను పెంచుచున్నవే కాని తగ్గించుటలేదు.

పుట 82: "మహేంద్రస్య వైద్యః" — అహల్యను కామించి తపించు మహేంద్రునకు దేవవైద్యుడైన అశ్వినీకుమారుడును ఉర్వశిని కామించి తపించు నీకు నేనును చికిత్స చేయుటకు ఉపాయము దొరకనివారైనాము. ఏ యుపాయమును నీ తాపమును తీర్పలేక పోవుట యట్లుండ వృద్ధిచేయుచున్నది. నీబాధ చూడగా నాకును మతిపోవుచున్నది - అని విదూషకుని యభిప్రాయము.

"అతి స్నేహః ఖలు కార్యదర్శీ"—అట్లనకుము. ఎంత కష్ట పడియైనను కార్యము దర్శించగలవాడు ఆప్తమిత్రు డొక్కడే కదా. కనుక ఉపాయ మాలోచింపుము - అని రాజు.

సమాధి = చిత్తమును ఒకే విషయమున నిలుపుట - ఏకాగ్రత. రాజు పరిదేవనమును మాన్పుటకు విదూషకుడు ఆలోచన నభినయించెను. "సమాధి" అన్న యోగదర్శన భాషను ఉపయోగించి యోగశక్తిచే భవిష్యత్తును తెలిసికొందుననెను! ఆపదలో నున్న రాజు నమ్మెను.

"నిమిత్తమ్"—శకునము, సూచన. కుడిభాగము అదరుట వంటి శుభఫల సూచన. ఇట్టి సూచన అభినయించి రాజు "ఆత్మగతము"న అనుకొనెను. పైకి మాట్లాడవద్దని విదూషకుడు చెప్పెను గదా.

శ్లో. 9: అన్వయము: సకలేందుముఖీ సా చ న సులభా; కిమపి చ ఇదం అనంగ విచేష్టితం; కాంక్షిత సిద్ధిషు అభిముఖీషు ఇవ మనః ఏకపదే నిర్వృతిం వ్రజతి.

అర్థము: సకల + ఇందుముఖీ=కళలతో గూడిన చంద్ర బింబమువంటి ముఖముగల; సా-చ=ఆమె యేమో; న-సులభా= తేలికగా లభించునది కాదు; కిమపి-చ=ఏదోయొక; ఇదం=ఈ; అనంగ-విచేష్టితం=మన్మథ వికారము; కాంక్షిత-సిద్ధిషు=ఇష్టముల ప్రాప్తులు అభిముఖీషు + ఇవ=ఎదురై వచ్చుదువలె; మనః=మనస్సు; ఏకపదే= ఆకస్మికముగా; నిర్వృతిం=సుఖమును; తృప్తిని; వ్రజతి=పొందు చున్నది.

కాంక్షితసిద్ధి అభిముఖమైనట్లున్నదనిన రాజు వాక్యమే ఉర్వశీ చిత్రలేఖల ప్రవేశమునకు సూచన.

విదూషకుడు ధ్యానమునందును, రాజు ఆలోచనయందును ఉండుటచేత ఉర్వశీ చిత్రలేఖలు ప్రవేశించి సంభాషించుటకు వీలయినది. ఇది ప్రయోగదృష్టిగల కవిచేయు విధానము.

పుట 83 : "అనిర్దిష్ట కారణం" అనుటచే ఉర్వశి లజ్జాపరిత్యాగ మొనర్చి మదనోన్మత్తయైనదని భావము.

"తదా...మాముపహాస్య కిమిదానీం పృచ్ఛసి" అని యుర్వశి తనకామమునకు కారణము, గమ్యస్థానము సూచించినది. "స్మర తావ దేవం" అని ఏకావళిని విడిపించుచు చిత్రలేఖ నవ్వినప్పుడు తాను అన్న మాటను గుర్తు చేసినది.

"అపహస్తిత లజ్జః"-లజ్జా పరిత్యాగమును ఉర్వశియే యొప్పుకొనుచున్నది. చక్కగా ఆలోచింపుము అని చిత్రలేఖ యనగా "మదనః ఖలు మాం నియోజయతి" - మన్మథుడే నన్నాజ్ఞాపించుచున్నాడు అని సమాధానము చెప్పినది. విదూషకుడు అనంగుడే నీకు సుఖము కలిగించును." అని రాజును ఓదార్చుటకు చెప్పిన భావ్యర్థమే యిది.

పుట 84 : "ఆదేశయ మార్గం" త్రోవ చూపుము - దానవులవల్ల అంతరాయము కలుగకుండ సురక్షితమైన మార్గమువెంట కొనిపొమ్ము.

"శిఖాబంధన విద్యా" - కేశి దానవుడు ఉర్వశిని అపహరింప యత్నించిన తరువాత దానవభీతి లేకుండుటకై అప్సరసలకు బృహస్పతి ఈ విద్యను ఉపదేశించి యుండవలెను. అపరాజితయను పేరుగల శిఖాబంధన మంత్రము తంత్ర శాస్త్రములందు చెప్పబడి యున్నది.

"విస్మృతం మమ హృదయం" - ఉర్వశి హృదయము పురూరవుని యొద్ద నున్నది. ఆమె యొద్ద నున్నది శూన్య హృదయము. కనుక మనస్సంతయు పురూరవునియందే యుండుటచే ఉర్వశికి శిఖాబంధన విద్యమాటయే గుర్తులేదు.

"సిద్ధమార్గం" – సిద్ధ, సాధ్య, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుష, విద్యాధరాదులు దేవజాతి విశేషములు. వీరిలో సిద్ధ జాతివారు సంచరించు మార్గము భూమికి చేరువగా నుండును. ఉర్వశీ చిత్రలేఖలు స్వర్గమునుండి దిగుచు సిద్ధ మార్గమును ప్రవేశించు నప్పుడు వారికి భూమిపై నున్న ప్రతిష్ఠాన పురము, అందలి రాజ భవనము కనబడినవి.

"ఆలోకయతే ఇవ ఆత్మానం" గంగా యమునా సంగమమున తన్ను తాను జూచుకొనుచున్నదా యన్నట్లున్నది. రాజభవనము నది యొడ్డుననే మిక్కిలి ఎత్తుగానున్నది. గంగా యమునా సంగమ స్థానమున ఉండుటచే మిక్కిలి పవిత్రమైనదని చిత్రలేఖ అభిప్రాయము.

"స్థానాంతర గతః స్వర్గః"–వేఱు ప్రదేశమున నున్న స్వర్గమే యని చెప్పవచ్చును గదా యనుచున్నది ఉర్వశి. ఆమెకు ఆ నగర పవిత్రతతో అంతగా పనిలేదు. అది భోగస్థాన మగుట ఆమెకు ప్రియము. ఈమాట భావి కథనుగూడ సూచించుచున్నది. భరతుని శాపమువల్ల ఉర్వశి దివ్యత్వమును కోల్పోవును. అప్సరసలు ఉండు చోటు స్వర్గము. మున్ముందు ఉర్వశి యుండబోవుచోటు స్వర్గమే కావలయును. ఆమె స్థానాంతరగతయైన అప్సరస యైనచో ప్రతిష్ఠానము స్థానాంతర గతమైన స్వర్గమే.

"ఆపన్నానుకంపీ" – దానవ బాధనుండి తన్ను రక్షించి అనుకంప చూపినవాడు పురూరవుడు. ఇప్పుడు మదన బాధనుండియు తన్ను కాపాడి యనుకంప చూపగలడు అని ఉర్వశి భావము.

పుట. 85 : "నందన వనైకదేశే ఇవ" – ప్రతిష్ఠానము స్థానాంతరగతమైన స్వర్గమని ఉర్వశి పలికిన యభిప్రాయము ననుసరించి ఉపవనము నందనవనమునందలి ఒక భాగమువలె నున్నదని చిత్రలేఖ యనుచున్నది. ఇంద్రుని యుద్యానవనము నందనము. పురూరవుడు "మహేంద్ర సదృశానుభావు" డని వెనుక చెప్పబడినది. కనుక ఆయన నగరము స్వర్గము, ఆయన ఉపవనము నందనవన భాగము, పట్టపు రాణియైన ఔశీనరి "న కిమపి పరిహీయతే శచ్యా ఓజస్వితయా"

అని శచీదేవిగా ఉపమింపబడును. ఇంద్రుని అహల్యా కాముకతతో పురూరవుని ఉర్వశీ కాముకత ఉపమింపబడినదిగదా.

"ప్రథమోదిత ఇవ భగవాన్ చంద్రః" - అప్పుడే ఉదయించిన చంద్రుడు కౌముదికొఱకు ఎదురుచూచుచున్నట్లు ఈయన నీకొఱకు ఎదురు చూచుచున్నాడు. చంద్రుని మనుమనికి బాల చంద్రోపమానము ఉచితముగా నున్నది. ఇంకను వెన్నెల విరియనందున అప్పుడు చంద్రబింబము ఎఱ్ఱగానుండును. రాజు విరహతప్తుడై కందియున్నాడు.

"స విశేషం ప్రియదర్శనః" - విరహముచే కృశించియున్న రాజు ఉర్వశికి ప్రథమ దర్శనము నప్పటికంటె అత్యంతము రమణీయుడుగా గనబడుచున్నాడు. తన విరహము వల్లనే ఆయన కృశించి యుండెనన్న భావనయే దీనికి కారణము.

"తిరస్కరిణీ ప్రతిచ్ఛన్నా" - అదృశ్యముచేయ శిఖాబంధన విద్యచేత కప్పివేయబడినది. కనుక నిస్సందేహముగా రాజు ప్రక్కన నిల్చి ఆయన మాటలు వినవచ్చును.

"యథా తే రోచతే"- నీ కిష్టమైనట్లే. కామావేశమున లజ్జాత్యాగము గావించి తెగబడివచ్చిన ఉర్వశి తాను వలదన్నను వినునట్లు లేదు. కనుక చిత్రలేఖ 'నీ యిష్టము' అనెను.

పుట. 86 : "తూష్ణీం ఆస్తే" - రాజు మౌనముగా నుండెను. ఉపాయము ఆలోచించితినని విదూషకుడు చెప్పినమాట ఆయన వినిపించుకోలేదు. ఆయన ఉర్వశీ ధ్యానమగ్నుడై యుండెను.

"కాను ఖలు ఏషా" _ ఈమె యెవ్వతియో కదా! విదూషకుని మాట ఉర్వశి విన్నది. రాజు ఎవ్వతెనో తలంచుకొనుచుండెననుకొన్నది. ఆమె 'దుర్లభ' యనుటచే ఇంత యందగానికి దుర్లభయైన ఆమె యెవ్వతెయో తన యందమును గూర్చి మిక్కిలి గర్వపడునదియై యుండవలెను అనుచున్నది.

"మానుష్యం విడంబతే" - దివ్య స్త్రీవైయుండియు మనుష్య స్త్రీ వలె ప్రవర్తింతువేమి? అన్న చిత్రలేఖ ప్రశ్న భావి కథా సూచకము. రాజు మనస్సులో నున్న స్త్రీ యెవ్వతెయో దివ్య శక్తిచేత తెలిసికొన జాలవా? అని చిత్రలేఖ మందలింపు. మనుష్య గత హృదయయైన ఉర్వశి తన దివ్యత్వమును మరచిపోవుచున్నది. కాని మరల తెలివి తెచ్చుకొని "ప్రభావముచే తెలిసికొనుటకు భీతిల్లు చున్నాను" అన్నది. రాజు మనస్సునందు అన్య స్త్రీ యుండునేమో అని ఆమె భయము.

"స్వప్నసమాగమ-కారిణీం నిద్రాం" - నిద్రపోతివా ఉర్వశి నీకు స్వప్నమున కనుబడును. లేదా ఆమె రూపమును చిత్రపటమున లిఖించి చూచుకొనుచుండుము. విదూషకుని వాక్యమున "ఉర్వశ్యాః" అనుమాట వినవచ్చి ఉర్వశికి సందేహము విడిపోయినది.

పుట 37: "హీనసత్త్వ" - దుర్బలమైనదానా, ధైర్యములేనిదానా అను భారమైనదానా అని తన హృదయమును తానే నిందించుకొను చున్నది.

"ఉభయమపి అనుపపన్నం" - విదూషకుడు చెప్పిన రెండు ఉపాయములును నిరుపయోగములే. "ఏతావాన్ మమ మతి విభవః"- నా బుద్ధి సంపదయింతటిదే అని అతడే అంగీకరించినాడు.

శ్లో. 10: అన్వయము: సఖే! ఇదం హృదయం కామస్య ఇషుభిః సదా అంతః సశల్యం; స్వప్నే సమాగమకారిణీం నిద్రాం కథం ఉపలభే? ఆలేఖ్యే చ తాం సువదనాం ప్రియాం అసమాప్య అపి మమ నయనయోః ఉద్బాష్పత్వ న న భవిష్యతి?

అర్థము. సఖే=చెలికాడా; ఇదం = ఈ; హృదయం = హృదయము; కామస్య=మదనుని యొక్క; ఇషుభిః=బాణముల చేత; సదా= ఎల్లప్పుడు; అంతః=లోపల; సశల్యం=ములుకులు గ్రుచ్చుకొని వ్రణమై యున్నది, స్వప్నే= కలయందు; సమాగమకారిణీం=సమాగమమును కలిగించు; నిద్రాం=నిద్రను, కథం=ఎట్లు, ఉపలభే = పొందుదును,

ఆలేఖ్యే చ=చిత్రపటమునందైనను; తాం - సువదనాం = ఆ సుముఖ యైన; ప్రియాం=ప్రియురాలిని; అసమాప్య + అపి=పూర్తిగా చిత్రింప కుండగనే; మమ=నా యొక్క; నయనయోః= రెండు నేత్రములందును; ఉద్బాష్పత్వం=కన్నీటిపొంగు; న - న - భవిష్యతి=కలుగకయుండదు (తప్పక కలుగును).

"నపునః పర్యాప్తం హృదయస్య" - కాని యింకను హృద యమునకు తృప్తిలేదు. రాజు తన్నే ప్రేమించి తపించుచున్నాడని తెలిసికొని ఉర్వశి సంతోషించినది. కాని అట్టిమాటను ఇంకను వినవలె నని యామెకోరిక.

శ్లో॥ 11 అన్వయము : సా మమ నితాంతకఠినాం మానసీం రుజం న వేద; ప్రభావ విదితానురాగం అపి మాం వా అవమన్యతే; తస్మిన్ జనే మమ సమాగమమనోరథాన్ అలబ్ధఫల నీరసాన్ విధాయ పంచ బాణః కృతీ భవతు.

అర్థము : సా=ఆమె; మమ = నా యొక్క; నితాంతకఠి నాం=అత్యంతము తీవ్రమైన; మానసీం=మనస్సంబంధమైన; రుజం = వ్యాధిని; న- వేద=తెలిసికొనలేదో; ప్రభావ-విదిత + అనురాగం= తన దివ్యశక్తిచే తెలిసికొనబడిన ప్రేమగలవాడను; అపి=అయిన ప్పటికిని; మాం=నన్ను; అవమన్యతే- వా=తిరస్కరించు చున్నదో; తస్మిన్ - జనే=ఆ జనమునందు, ఆమెయందు; మమ=నా యొక్క; సమాగమ - మనోరథాన్ = కలిసికొనవలెనన్న కోరికలను; అలబ్ధ- ఫల - నీరసాన్ = పొందబడని ఫలమువల్ల నిష్ప్రయోజనములనుగా; విధాయ=చేసి; పంచబాణః=మన్మథుడు; కృతీ=కృతార్థుడు; భవతు= అగుగాక.

"ప్రభావ విదితానురాగం"— ఉర్వశి దివ్యస్త్రీగనుక తన దివ్య ప్రభావముచే పురూరవుని ప్రేమను ఎరుగ గలదు. ఎఱిగియు తన్ను తిరస్కరించు చున్నది కాబోలు. అట్లయినచో తనకు నిరాశ వల్ల మరణించుట తప్పదు.

"పంచబాణః కృతీ భవతు" ఐదువిధములయిన బాణములు గల మదనుడు ఆ బాణములతో తన హృదయమును ప్రహరించి తన్ను సంహరించి పంచబాణత్వమును సార్థకము చేసికొనునుగాక. ఆ యుపవనమున మదనునకు బాణములు సమృద్ధిగా లభించును. రాజు యొక్క దశము మదనావస్థ సూచితము.

పుట. 38 : "శ్రుతం త్వయా"— వింటివా ? హృదయమునకు తృప్తికలిగినదా ? అని చిత్రలేఖ ఉర్వశిని ప్రశ్నించినది.

"మాం ఏవం అవగచ్ఛతి"— నన్ను ఇట్టి దానినిగా తలంచు చున్నాడు. తన్ను తిరస్కరించునంతటి నిర్దయురాలను అని తలంచు చున్నాడు. ఎదుటబడి సమాధానము చెప్పుటకు ధైర్యము చాల కున్నది. కనుక ప్రభావముచే కల్పింపబడిన భూర్జ పత్రమున లేఖ వ్రాసి నా హృదయమును ఎఱిగింతును అని ఉర్వశి లేఖ మూలమున రాజును ఓదార్చుచున్నది. ఎదుటబడి మాటలతో చెప్పినచో ఉర్వశీ పురూరవుల ప్రేమ కలాపమునకు సాఫల్యము ఉండదు. రాణి మానక్రోధమునకు, రాజు దక్షిణనాయకత్వ నిరూపణమునకు అవకాశము ఉండదు. కనుక కథయందు ఈ లేఖా కల్పన.

"అవిహా అవిహా" భయాందోళనము సూచించు మాటలు. "భుజంగ నిర్మోకః ఇవ" పాముకుబుసమువలె ఉన్నది. తెల్లని భూర్జ పత్రముపై మచ్చలవలె అక్షరములున్నవి. ఆకస్మికముగా తమ ముందు రాలిపడిన దానిని చూచి విదూషకుడు పాముకుబుసమని భ్రమపడెను. కాని రాజు వెంటనే అది భూర్జపత్రలేఖయని గ్రహించెను. ఇరువురి ప్రకృతులందు ఇంత భేదమున్నది.

"న ఖల్వ దృష్టయా"— లేఖయని తెలియగనే ఉర్వశియే అదృశ్యముగానుండి వ్రాసి పడవైచి యుండునని విదూషకుడు రాజుయొక్క ముఖప్రీతి కొఱకు అనుచున్నాడు. "సమానానురాగ సూచకాని అక్షరాణిస్యుః"- సమానమైన ప్రేమనుసూచించు మాటలు కావచ్చును. అవి విదూషకుని మిత్ర పక్షపాతసూచకమైన ఆశ.

పుట 89 : "నాస్తి అగతిః మనోరథానాం"— కోరికలకు అందరానిది లేదు. మనోరథములు చేరరానిచోట్లు ఉండవు. మనస్సనెడు రథము ఎచ్చటికైనను పోగలదు. మనోరథశబ్దము యౌగికార్థమున ప్రయోగింప బడినది. "మనోరథానాం అగతిర్న విద్యతే" అని కుమార సంభవమునగూడ కాళిదాసు ప్రయోగించెను.

"ప్రసన్నః తే తర్కః"— నీ ఊహ నిర్మలముగా ఉన్నది. నీవు చక్కగా ఊహించితివి. ఇది ఉర్వశీ ప్రేమలేఖయే.

"భవాన్ ఇదానీం ప్రసీదతు"— నా తర్కము ప్రసన్నమైనది. ఉర్వశీ ప్రసన్నురాలయినది. నీవు కూడ ఇప్పుడు ప్రసన్నుడవు కమ్ము. సంతాపము మాని ఉత్తరమును నాకు గూడ వినిపింపుము - అని విదూషకుని భావము.

"నాగరికః అసి"— సుకుమారమైన మనస్సు కలవాడవు. అన్యోన్యప్రేమ వృత్తాంతములను సానుభూతితో విని యానందింపగల సానుభూతి పరుడవు. విదూషకుడు ఆ లేఖను వినిపింపుమని అడుగనిచో రాజు దానిని పైకి చదువవలసిన పనిలేదు. విదూషకుడు ఆ విధముగా అడిగి ప్రేక్షకులకు ఉపకారము చేసెను. "నాగరికః అసి" అని ప్రేక్షకులే ఉర్వశీ ముఖమున విదూషకుని ప్రశంసించినట్లు భావింప వచ్చును.

"వాచయతి" - చదువును 'అనువాచయతి' - చదువుకొనును. రాజుముందు చదువుకొనెను. తరువాత విదూషకుడు వినుటకై చదివెను.

శ్లో॥ 12 : అన్వయము : స్వామిన్ అజ్ఞాతా అహం అనురక్తస్య తవ ఉపరి యథా త్వయా సంభావితా తథా యదినామ -

అర్థము. స్వామిన్=నాథా; అజ్ఞాతా=(నీయందు ప్రేమగల దానినని) ఎఱుగ బడనిదాననైన; అహం=నేను; అనురక్తస్య=అనురాగముగల; తవ + ఉపరి=నీమీద; యథా=ఏవిధముగా; త్వయా=

నీచేత: సంభావితా=ఊహింపబడితినో; తథా - యదినామ=అ విధము గానే అయినచో -

శ్లో. 18: అన్వయము: నను లులిత పారిజాత శయనీయే మమ శరీరకే నందనవన వాతాః అపి అత్యుష్ణకాః భవంతి.

అర్థము: నను = ఎట్లోకదా; లులిత - పారిజాత - శయనీయే=నలిపి వేయబడిన పారిజాతపుష్పముల శయ్యపై; మమ=నా యొక్క; శరీరకే = శరీరమునందు; నందనవన - వాతాః - అపి = నందన వనమునందలి గాలులుకూడ; అత్యుష్ణకాః = మిక్కిలివెచ్చనైనవి, మిక్కిలి తాపముకలిగించునవి; భవంతి=అగును.

'స్వామిన్' - ప్రభూ, నాథా యన్న సంబోధన 'నేను దయ జూడదగినదానను, నీకు వశమైనదానను' అని ఆత్మార్పణమును వ్యక్తము చేయును.

"అజ్ఞాతా" - నీవునన్ను గాఢముగా ప్రేమించుచుంటివని నే నెఱుగను. అట్లే నేను నిన్ను గాఢముగా ప్రేమించుచుంటినని నీ వెఱుగవు నీ స్థితిచూచి నేనిప్పుడు తెలిసికొంటిని. నేను అదృశ్యురాలను గనుక నీవు తెలిసికొనలేకుంటివి. 'శరీరకే' అనుటచే నా శరీరము విరహతాపముచే చిక్కిపోయినది అనుట. "లులిత పారిజాత శయనీయే" అనుటచే తాపముచే పొరలుటవల్ల పారిజాతములు నలిగిపోయినవి అనుట. 'నందనవనవాతాః అపి' అనుటచే అంత చల్లని గాలులు కూడ తాపము కలిగించుచున్నవనుట. నందనవనమువంటి ఈ ఉపవనమున నీ వెట్లు తపించు చుంటివో నందనవనమున నేనును అట్లే తపించితిని. తాపము భరింపజాలక ఉన్మత్తనై యిట్లు పరువిడి వచ్చితిని - అని భావము.

ఏకాన్వయముగల యీ రెండు శ్లోకములు కలిసి యుగళకము అనబడు కావ్యబంధ భేదము.

పుట. 40: "కమల నాలాయమానైః అంగైః" - తామరతూడులవలె వాడిపోవుచున్న అవయవములచేత విరహ సంతప్తుడని చెప్పినట్లైనది.

"స్వస్తి వాచనకేన" - వ్రతాంతమున వాయనము గ్రహించుటకు ఆహూతుడైన వానిచేత. భోజనమునకు పిలుపు వచ్చినంతనే విదూషకుని చిత్తము శాంతి పొందును.

"సమాశ్వాసన మితి కిముచ్యతే" - ఓదార్పు అందుమేమి ? సంపూర్ణ న తృప్తియే కలిగినది. ఇది కేవలము ఆహ్వానమే కాదు. ఇష్ట వస్తువు కన్నుల యెదుట ఉన్నట్లే యున్నది.

శ్లో॥ 14 : అన్వయము : సఖే! తుల్యానురాగ పిశునం లలితార్థ బంధం పత్రే నివేశితం ప్రియాయాః ఉదాహరణం తస్యాః ఉత్పక్ష్మలం ఆననం మమ ఆననేన సమాగతం ఇవ.

అర్థము : సఖే=చెలికాడా; తుల్య + అనురాగ - పిశునం= సమానమైన ప్రేమను సూచించునది; లలిత + అర్థ - బంధం=సుకుమారమైన అర్థముల యొక్క కూర్పు గలది; పత్రే=భూర్జ పత్రమున, లేఖయందు; నివేశితం=ఉంచబడినదియైన: ప్రియాయాః= ప్రియురాలియొక్క; ఉదాహరణం=గీతము, తాలబద్ధమైన కావ్యము; తస్యాః=ఆమెయొక్క; ఉత్పక్ష్మలం = పైకెత్తబడిన ఱెప్పలుగల; ఆననం=ముఖము; మమ=నాయొక్క; ఆననేన=ముఖముతో; సమాగతం + ఇవ=చేరవచ్చినదాయన్నట్లున్నది.

"ఉదాహరణం" - ఉత్ + ఆ హారణం - హృదయమందలి భావమును పైకి తీసి చూపుట. పురూరవుడు తన హృదయమును మాటలలో వెల్లడించెను. ఉర్వశి తన హృదయమును లేఖలో వెల్లడించెను. ఆ లేఖయందు తన హృదయమే కనబడుచున్నట్లున్నది పురూరవునకు.

"తస్యాః ఆననం మమ ఆననేన సమాగతం ఇవ" - ఆమె ముఖము నా ముఖముతో చేరవచ్చినట్లున్నది. లేఖయందలి వాక్యములు ఉర్వశి తన యెదుట నిల్చి మాట్లాడిన వాక్యములవలె ఉన్నవి. మాటలే మనస్సు, మనస్సే మనిషి - కనుక లేఖ ఉర్వశి ముఖమే. అదృశ్యయైన ఉర్వశి ఆయన యెదుట కనబడుచున్నట్లే యున్నది.

"అత్ర అవయోః సమవిభాగా ప్రీతిః"— ఇందు మన యిరువురకు ప్రీతి సమభాగములుగా ఉన్నది. ఉర్వశి పురూరవుని ప్రత్యక్షముగా చూచుచునే యున్నది. రాజు ఆమెను చూచు చున్నట్లు భావించుకొను చున్నాడు. పరమార్థమున రెండును సమానములే. కళ్లతో చూచినను, మనస్సుతో చూచినను తృప్తియొక్కటే అని భావము.

"అంగుళీ స్వేదేన"— వ్రేళ్ల చెమటచేత. రాజునకు రతిభావావేశమున స్వేదము అను సాత్త్విక భావము ఉదయించినది.

"దూష్యేరన్ అక్షరాణి"— అక్షరములు చెరగిపోవచ్చును. ప్రియురాలి హస్తాక్షరములు రాజునకు అంతప్రియములు.

"స్వహస్తః"—స్వహస్తముతో వ్రాసినలేఖ. లేఖను హస్తమే యనుటచే రాజునకు ఉర్వశి హస్తము స్పృశించినట్లే యున్నది.

పుట 41 : "కుసుమం దర్శయిత్వా ఫలే విసంవదతి"—పుష్పమును చూపి ఫలమున అన్యథా చేయునా? అనగా లేఖమూలమున ప్రేమను తెలిపి దర్శనమీయ కుండునా? ప్రేమను తెలుపుట పుష్పమైనచో అనుభవము నొసంగుట ఫలమగును.

"అలబ్ధఫల నీరసాన్"— అనిన రాజు మాటనుబట్టి విదూషకుడిట్లనెను. పుష్పము కనిపించినది గనుక ఫలమును లభించును. నీప్రేమ నీరసము కాదు. సరసమే యగును

నాటక గమనమున ఉర్వశీ పురూరవుల పరస్పరానురాగము ఇది వరకు మొగ్గ — ఇప్పుడు అది కుసుమించినది. మున్ముందు ఫలించును.

విదూషకుడు వెలిబుచ్చిన యీ సందేహమును నివర్తింపజేయుటకు ఉర్వశి రాజునెదుట ప్రత్యక్షము కావలసియున్నది.

"ఉపగమన కాతరం హృదయం"— రాజునెదుట నిల్చుటకు బెదరుచున్న హృదయమును కుదుటబరచు కొనులోగా నీవు ఆయనకు గనబడి మాట్లాడుము. రాజునకు ఉర్వశీ దర్శనమును ఆకస్మిక

తుగా చేయింపక కవి చిత్రలేఖను ముందు దర్శింపజేయు చున్నాడు. చిత్రలేఖను జూచి ఉర్వశియే యని భ్రమపడిన విదూషకుని సౌందర్య జ్ఞాన స్వరూపము కూడ ఇచ్చట బయటపడి హాస్యజనక మగును.

"భద్రే"— సామాన్య స్త్రీలను, వేశ్యలను సంబోధించు పదము. ప్రియురాలి చెలికత్తె కనుక తనకు శుభము కలిగించునదై 'భద్ర' యని సంబోధింప బడుటయు సహజమే. తనకు గనబడి యుపకారము చేసినది గనుక పూజ్యురాలా యనుటయు ఉచితమే.

శ్లో॥ 15 : అన్వయము. సంగమే పూర్వదృష్టా గంగయా వినా యమునా ఇవ తయా సఖ్యా విరహితా (త్వం) మాం తథా న నందయసి.

అర్థము: సంగమే = గంగా యమునా సంగమమునందు; పూర్వదృష్టా = పూర్వము చూడబడినదై; గంగయా - వినా= గంగతో గూడని; యమునా - ఇవ=యమునవలె; తయా - సఖ్యా= ఆ సఖచేత; విరహితా=కూడని దానివైన (త్వం=నీవు) మాం=నన్ను; తథా=ఆ విధముగా (ఆమెతో కూడియున్నప్పటివలె); న-నందయసి= సంతోష పెట్టకున్నావు.

"గంగా రోధః పతన కలుషా" అన్న ప్రథమాంక శ్లోకమున ఉర్వశి గంగతో పోల్చబడినది అందుచే ఆమె చెలికత్తెయైన చిత్రలేఖ యిచ్చట యమునతో పోల్చబడినది గంగ తెల్లగా నుండును. యమున నల్లగా నుండును. ఉర్వశి మెఱుపు రంగు గలది, చిత్రలేఖ మబ్బురంగు గలది అని భావింపవలెను. గంగా యమునా సంగమమున నున్న పురూరవుడు ఈ యుపరూపకమును ఉపయోగించుట సరసముగా, సహజముగా నున్నది.

"న తథా నందయసి"— నిన్ను చూచిన సంతోషమే కాని ఇరువురను కలిసి చూచినంత సంతోషము కాదు - అని రాజు ఉర్వశి దర్శన కూతూహలమును వ్యక్తము చేసెను. సంగమమునందు గంగను విడిచి యమున యుండుట సహజము కాదు గనుక ఉర్వశి కూడ చిత్రలేఖ వెంట వచ్చియుండునని రాజు ఊహించి యుండును.

"నను ప్రథమం మేఘరాజిః దృశ్యతే"— ముందు మేఘ సమూహము కనబడును. తరువాతనే విద్యుల్లత కనిపించును. ఉర్వశి కూడ వెంటనే కనిపించగలదు అని రాజునకు ఓదార్పు. మేఘరాజి చిత్రలేఖ - నల్లనిది. విద్యుల్లత ఉర్వశి - గౌరవర్ణ.

"కథం నైషా ఉర్వశీ?"— చిత్రలేఖ అప్సరస కనుక అంద; గత్తెయే. రాజు ప్రసంగమున ఉర్వశి మాత్రమే ఉండుటచేత విదూః షకుడు ఎదుట కనబడిన చిత్రలేఖనే ఉర్వశి యనుకొనెను.

పుట 42 : "కిం ఆజ్ఞాపయతి" - ఉర్వశి విజ్ఞాపించుచున్నది అని చిత్రలేఖ యనగా ఏమి ఆజ్ఞాపించుచున్నది అనుట ఉర్వశియందు ఆయనకుగల బహుమానమునకు గుర్తు.

దుర్జాతే=విపత్తియందు; భద్రముఖ=శోభనమైన ముఖముగల దానా - ఉర్వశి తన్ను ప్రేమించుచున్నదన్న ప్రియవార్తను చెప్పినది గనుక ఇది ముఖస్తుతి.

శ్లో. 12 : అన్వయము : తాం ప్రియదర్శనాం సముత్సుకాం కథయసి తదర్థే ఆర్తం పురూరవసం న పశ్యసి; స్మరస్య అయం ప్రణయ ఉభయోః సాధారణః; తప్తం (అయః) తప్తేన అయసా ఘటనాయ యోగ్యం.

అర్థము : తాం - ప్రియదర్శనాం=ఆ సౌందర్యవతిని; పర్యుత్సుకాం=ఉత్కంఠితురాలినిగా; కథయసి = చెప్పుచున్నావు: (కాని); తదర్థే=ఆమెవిషయమున; ఆర్తం=పీడితుడైన; పురూరవసం=పురూరవుని; న-పశ్యసి = చూడకున్నావు; స్మరస్య = మన్మథ సంబంధమైన; అయం=ఈ; ప్రణయః=ప్రార్థన, ప్రేమ; ఉభయోః = ఇరువురకును; సాధారణః=సమానమే; తప్తం=వేడిచేయబడిన; అయః = లోహము; తప్తేన=వేడిచేయబడిన; అయసా=లోహముతో; ఘటనాయ=కలుపుటకు; యోగ్యం=తగినది.

ఉర్వశి మదన తాపమును గూర్చి రాజునకు విన్నవింపవచ్చిన చిత్రలేఖ రాజుమదన తాపమును చూచిజాలిపడినది. ఉర్వశి 'పర్యుత్సుక'

రాజు 'అర్తుడు'. చిత్రలేఖ రాజుపక్షము వహించి ఆయన దూతియై ఉర్వశిని చేరబోయినది.

పుట 43 : "లఘు త్వయా ఉజ్ఝితా" - నీవు ఇంత తొందరగా, తేలికగా నన్ను విడిచి రాజు పక్షముచేరితివా ? అని యుర్వశియనగా చిత్రలేఖ ఇంకొక ముహూర్తములో తెలియునుగదా ఎవరు ఎవరిని విడిచి రాజు పక్షమునచేరునో అని సరసమాడినది. కాలిన లోహము కాలిన లోహముతో అతుకుకొనునుగదా.

"ఆచారం తావత్ప్రతిపద్యస్వ" - కొంచెము మర్యాదను పాటింపుము. ప్రియుడైనను రాజు కనుక రాజుపట్ల పాటింపవలసిన గౌరవమును పాటింపుము అని యుపదేశించుచున్నది.

శ్లో. 17 : అన్వయము : సహస్రాక్షాత్ పురుషాంతరం అగతః అయం జయ శబ్దః యస్య త్వయా సముదీర్యతే (తేన) మయా నామ జితం.

అర్థము : సహస్రాక్షాత్ = ఇంద్రునికంటె; పురుష + అంతరం=అన్యుడైన పురుషుని; అగతః=పొందని; అయం=ఈ జయశబ్దః=జయము అను శబ్దము; యస్య=ఎవ్వనికి; త్వయా=నీచేత; సముదీర్యతే = పలుకబడుచున్నదో; (తేన) మయానామ=అట్టి నా చేతనే; జితం=నిజముగా జయింపబడినది.

ఇప్పటివఱకు ఉర్వశి ఇంద్రునకే జయపెట్టుచుండెడిది, ఇప్పుడు పురూరవునకు జయ పెట్టినది. ఇంద్రుని సేవకురాలైన ఉర్వశి తనకు సేవకురాలగుటచేత పురూరవుడు ఇంద్రుని తరువాత అంతవాడైనాడు. ఇది నిజముగా అభ్యుదయమే.

"హస్తే గృహీత్వా" - ఆమెను ప్రేయసిగా అంగీకరించినట్లు గుర్తుగా చేతితో ఆమె చేతిని పట్టుకొని దగ్గరగా కూర్చుండబెట్టుకొనెను. తప్త లోహము తప్త లోహముతో కూర్చబడినది.

"కిం న వంద్యతే" - రాజుగారి భార్య తనకు ఎప్పుడును వందనము చేయును. ఉర్వశి చేయలేదు. విదూషకుని ఉర్వశి ఎఱుగదు గదా. కనుక తాను రాజు ప్రియసఖుడనని చెప్పి అడిగి నమస్కా-

రము చేయించుకొనుచున్నాడు. అట్లడిగినందుకు ఉర్వశి చిఱునవ్వు కొన్నది.

పుట 44 : "స్వస్తి భవత్యై" - విదూషకుడు స్వస్తివాచన క్రియుడు' స్వస్తి అను వాచనముచేసి పంచభక్ష్య పరమాన్నములు భుజించి దక్షిణ పుచ్చుకొనుట వాని కిష్టము. ఉర్వశి కూడ ముందుముందు ఆ విధముగా చేయవలెనన్న ఆశతో అడిగి వందనము చేయించుకొని స్వస్తి వాచనము చేయుచున్నాడు.

"త్వరయ ఉర్వశీం" - ఉర్వశిని తొందర పెట్టుము. ఈమాట తెరలోనుండి వినబడినది. ఉర్వశీ పురూరవులు కలిసికొన్నారు. కాని వారి సంయోగానందమునకు అంతరాయము కలిగినది. ఇంద్రుని యధీనమందున్న ఉర్వశి పురూరవుని ప్రేమించియు ఆయనకు భార్య కాజాలదు, ఆయనతో కామోపభోగము లనుభవింపజాలదు. కనుక నే ఈ యంతరాయము.

శ్లో. 18 : అన్వయము : భరతేన మునినా భవతీషు అష్టరసాశ్రయః య ప్రయోగః నియుక్తః లలితాభినయం తం సలోకపాలః మరుతాం భర్తా అద్య ద్రష్టుమనాః.

అర్థము : భరతేన=భరతుడనెడు; మునినా=మునిచేత; భవతీషు=మీయందు: అష్ట-రస+ఆశ్రయః=ఎనిమిది రసములకు ఆధారమైన; యః=ఏ; ప్రయోగః=నాట్య ప్రయోగము; నియుక్తః=ప్రతిష్ఠింపబడినదో; లలిత-అభినయం=సుకుమారమైన అభినయముగల; తం=ఆ నాట్య ప్రయోగమును; స-లోకపాలః=లోకపాల సహితుడైన; మరుతాం-భర్తా=దేవేంద్రుడు; అద్య=ఇప్పుడు; ద్రష్టు-మనాః=చూడగోరుచున్నాడు.

"భరతేన" - భరత మహర్షి నాట్య శాస్త్రము రచించెను. నృత్తము, నృత్యము, నాట్యము, దశవిధ రూపకములు మున్నగు పెక్కు విషయములా గ్రంథమున వివరింప బడినవి.

"అష్టరసాశ్రయః" - రసములు తొమ్మిది; శృంగారము; హాస్యము, వీరము, రౌద్రము, కరుణము, అద్భుతము, బీభత్సము

భయానకము, శాంతము. వీనిలో శాంతరసమును భరతముని చెప్పలే దందురు. కనుక భరతముని రచించిన నాట్యశాస్త్రమునందు అష్ట రసములకు సంబంధించిన అభినయమే కలదని తలంప వలెను. కాళి దాసు నాటికి అష్టరసములనియే ప్రతీతి.

"లలితాభినయం" - సుకుమారమైన యభినయము స్త్రీ సంబంధి. భరతుడు దానిని అప్సరసలకు నేర్పెను. అభినయమనగా రసభావములను ప్రేక్షకులకు అభిముఖముగా కొనివచ్చు చేష్ట మొద లయినది. అది చతుర్విధము - ఆంగికము, ఆహార్యకము, వాచికము, సాత్వికము. ఈ రస ప్రధానమైన అభినయమే నాట్యము లేక నాటకము.

"విషాదం నాటయతి" - మరికొంతసేపు పురూరవునితో సంతోషముగా గడుపుటకు వీలుపడనందున విషాదము. ఉర్వశి యింద్రుని సేవకురాలు గనుక ఆయన వద్దనుండి పిలుపు వచ్చిన క్షణమందే వెళ్ళితీర వలయును. కథను ముందుకు సాగించుటకు కాదాసు ఈ కల్పన గావించెను. అన్యులవల్ల విఘ్నములు కలిగిన కొలది అనురాగము వృద్ధి పొందును. సంయోగమునకు పూర్వము ఇట్టి విఘ్నములు రసమును పోషించును. కథను చమత్కారవంతము చేయును.

"నాస్తి మే వాక్" - నాకు నోటమాట వచ్చుటలేదు. ఉర్వశికి అటనుండి వెళ్ళుట యిష్టముకాదు కనుక వెళ్ళుదునన్నమాట ఆమె నోటరాదు.

"పరవశః అయం జనః" - ఈ వ్యక్తి పరాధీనురాలు (శబ్ద ములు పుంలింగములైనను స్త్రీ వాచకములుగా ఇచ్చుట గ్రహింప వలెను).

"దేవేషు అనపరాద్ధం" - మానవుడైన పురూరవుని యందలి ప్రేమచే ఉర్వశి అటనుండి వెళ్ళనిచో దేవతలపట్ల అపరాధము చేసిన దగును. ఆమె యట్టి అపరాధమునకు పాల్పడకుండ రాజు ఆమె వెళ్ళుటకు అనుమతింపవలెను.

పుట 45 : ఉర్వశి అసలే మాటాడలేక పోయినది. పురూరవుడు ఎట్లో మాట పెకలించుకొన్నాడు. "ఈశ్వర వియోగ ప్రత్యర్థీ" - మీ ప్రభువు యొక్క ఆజ్ఞను వ్యతిరేకించువాడను, లేదా, విధి నిర్ణయమును వ్యతిరేకించువాడను - ఉర్వశీ పురూరవుల అప్పటి వియోగమునకు ఇంద్రుడు కారణము లేదా విధియే కారణము. దానికి పురూరవుడు తలయొగ్గెను. ఇంద్రుని యాజ్ఞ ఉర్వశ్యాదులకువలె తనకును అవశ్య కర్తవ్యమేయని పురూరవుని భావము.

"స్మర్తవ్యః అయం జనః" - ఈతడు స్మరింపదగినవాడు. ఉర్వశి తన్ను ఎల్లప్పుడు స్మరించుచుండవలెనని పురూరవుని కోరిక. ఈ కోరిక ననుసరించి ఆయనను స్మరించుచు ఉర్వశి నాట్య ప్రయోగమున ప్రమాదపడి శాపము పొందును.

"వైయర్థ్యమివ" - ఇప్పుడు ఈ కన్నులుండి యేమి ప్రయోజనము. ఉర్వశిని చూచుటయే తన కన్నులకు చరితార్థత.

"నన్వేతత్" - ఈ పత్రము ఉన్నదిగదా అని విదూషకుడు రాజునకు ఉర్వశి లేఖ నీయబోయెను. అది కనబడలేదు. అతడు అర్ధోక్తియందే ఊరకుండెను

"ఉర్వశీ దర్శన విస్మితేన" - ఉర్వశి సౌందర్యము చూచి విదూషకుడు విస్మయము పొందెను. వాడు మానవ స్త్రీల సౌందర్యమే చూచెనుగాని అప్సరసల అందము చూచి యెరుగడు. ఆమె వంక విస్మితుడై చూచూచు, చేతినుండి జారిపోయిన పత్రమును గమనింపలేదు. అది గాలికి ఎటో కొట్టుకొని పోయెను. రాజు 'ఏదో చెప్పదలచినట్లున్నావు? అని యడుగగా' ఆమె నిన్ను గట్టిగా ప్రేమించుచున్నది గనుక నీవు నీరస పడవద్దు' అని విదూషకుడు మాట మార్చివేసెను.

పుట 46 : శ్లో. 19 ; అన్వయము : శరీరస్య అనీశయా (తయా) స్వవశం హృదయం స్తనకంపక్రియాలక్ష్యైః నిశ్శ్వసితైః మయి న్యస్తం ఇవ.

అర్థము : శరీరస్య = దేహమునకు; అనీశయా = అధికారి కానట్టి; (తయా=ఆమె చేత); స్వవశం=తన యధీనమైన; హృదయం

హృదయము; స్తన-కంప-క్రియా-లక్ష్మ్యః= స్తనముల యొక్క కంప నము అనెడు వ్యాపారముచేత గుర్తింపదగిన; నిఃశ్వసితైః= నిట్టూర్పులచేత; మయి=నాయందు; న్యస్తం-ఇవ = ఉంచబడినదా యన్నట్లున్నది.

ఉర్వశి వియోగదుఃఖముచే నిట్టూర్చగా ఆమె స్తనములు కంపించెను. స్తనకంపనమువల్ల లోపలనున్న హృదయమును దీసి యుర్వశి పురూరవునియందు ఉంచినదాయన్నట్లుండెను. ఈ యుత్ప్రేక్ష పురూరవుని యూహ.

"గతం ఉర్వశ్యాః మార్గేణ" - ఉర్వశి ఎట్లు స్వర్గమున కేగి నదో ఆమె ప్రణయలేఖ కూడ అట్లే స్వర్గమున కేగినది.

"సర్వత్ర ప్రమాదీ వైధేయః - మూఢుడు అన్నిటియందును పొరపడుచునే యుండును. అప్పుడు నోరుజారి ఉర్వశి పేరు బయట పెట్టెను. ఇప్పుడు ఉర్వశి ప్రణయలేఖనే జారవిడిచెను. రాజు రహ స్యము సాక్ష్యముతో సహా బయటబడి పోవును.

ఇరువురును లేఖను వెదకుచుండగా రాణి ప్రవేశించును. రాణిని ప్రవేశపెట్టి కొంత సంభాషణ నడిపించుటకు ఈ లేఖను వెద కించుట నాటక కవి నేర్పుతో కూర్చిన సన్నివేశము.

పుట 4- : భట్టిణి=రాజు భార్య, భర్త్రికి ప్రాకృతము కావచ్చును.

"జీర్ణ చీవర మివ" - ప్రాతగుడ్డ పీలికవలె - భూర్జ పత్రము అక్షరములున్నవైపు చూచిన విదూషకునకు పాము కుబుసమువలె కనబడినది. అక్షరములు లేనివైపు చూచిన రాణికి ప్రాతగుడ్డ పీలిక వలె కనబడినది.

"దక్షిణ మారుతేన" - దయగల వాయువు రాణి దిక్కునకు ఆ ప్రేమలేఖను తెచ్చుచున్నది. వాయువునకు దాక్షిణ్యము రాణి యందు కావచ్చును. ఉర్వశియందును గావచ్చును.

"పరివర్తన విభావితాక్షరం" - దొరలు చుండుటచే కనబడిన యక్షరములు గలది. బోర్లబడి యున్నప్పుడు గుడ్డపీలికవలె నున్నది.

"నూపుర కోట్యాలగ్నం" - కాలియందె కొనకు తగుల్కొన్నది. ఇట్లు తగుల్కొనుటవల్ల ఉర్వశి రాజుపై తనకుగల ప్రేమను రాణికి దెలిపి అందులకు అంగీకరింపుమని రాణి పాదములు పట్టుకొన్నట్లు చమత్కారమైన సూచన. రాణికి రాజుమీదనే కోపము వచ్చినదిగాని ఉర్వశిపై వచ్చినట్లు లేదు.

"యది అవిరుద్ధం తతః శ్రోష్యామి" - సమంజసమైనచో అప్పుడు విందును. ముందు నీవు చదువుకొనుము. వినదగినదైనచో చెప్పుము. అన్యుల లేఖ యందలి వృత్తాంతము విననొల్లకుండుట రాణి యుదారశీలమునకు గుర్తు.

**పుట 48 :** "కౌలీనమ్" - జనవాదము; కులమునకు సంబంధించిన అపవాదము. ఉర్వశీ పురూరవుల ప్రేమ విషయమే. ఉర్వశి వేశ్య గనుక ఇది కులమునకు నింద యేయని యభిప్రాయము.

"కావ్య బంధః" - పద్య రచన.

"ఆర్య మాణవక ప్రమాదేన" - నిపుణిక గడుసుది. విదూషకుడు శ్రద్ధలేనివాడని యెరుగును. ఉర్వశి యని పేరు బయట పెట్టెనుగదా. వానివద్ద రహస్యము నిలువదు, రహస్య వస్తువు నిలువదు.

"అనేనైవ ఉపాయనేన" - ఈ కానుకతోడనే. ఆ యుత్తరమును కానుకయనుట కోపముతోడనే. (కాని తరువాతి కథలో ఆమెయే ఉర్వశిని రాజునకు అర్పించినంత పని చేయును). రాజు దొంగతనమునకు సాక్ష్యము తన చేతిలో చిక్కినది. దానివి ఆయనకు చూపి నిగ్గదీయవలెనని రాణి కోరిక.

"అప్సరః కాముకం" - అప్సరసను కామించిన వానిని - ఇది కోపావేశమున పలికినమాట. 'ఆర్యపుత్రం' అనవలసినది. కనీసము 'మహారాజం' అనియైన అనవచ్చును. కోపావేశమున ఆమె మర్యాదను పాటింపజాలక పోయినది.

"క్రీడా పర్వత పర్యంతే దృశ్యతే" - ఉద్యానవనమందలి క్రీడా పర్వత సమీపమున ఏదో కనబడుచున్నది. విదూషకుడీమాట

యనగా రాజు "గతం ఉర్వశ్యాః మార్గేణ" అన్న మాట గుర్తుకు వచ్చినది కాబోలు. గాలిలో ఎగురుచున్న దేనినో చూచి భూర్జ పత్రమే అని భ్రమపడెను. ఇంతవరకు విచారముతో కూర్చుండిన రాజు ఆశతో లేచి దక్షిణ వాయువును ప్రార్థించుచున్నాడు.

"భగవన్, వసంత ప్రియ" – అనుట వాయుదేవుని పొగడి, సంతోష పఱచినచో తన ప్రియురాలి యుత్తరమును తనకు తిరిగి యిచ్చివేయునన్న ఆశను సూచించును.

శ్లో. 20 : అన్వయము : సురభిణా సంభృతం పీరుధాం పౌష్పం రజః వాసార్థం హర: మిథ్యా హృతేన మే దయితా స్వహస్తేన భవతః కిం? అంజనాం ప్రతి ఆలక్షిత ప్రార్థనః భవాన్ ఏవం విధైః మనోవినోదనఫలైః ధారితం కామార్తం జనం జానీతే హి.

అర్థము : సురభిణా = సుగంధముచే; సంభృతం = నిండిన; పీరుధాం=లతలయొక్క; పౌష్పం=పుష్ప సంబంధమైన; రజః= ధూళిని; వాసార్థం=సువాసన కొఱకు; హర=హరింపుము; మిథ్యా= వృథగా; హృతేన = హరింపబడిన; మే=నాయొక్క: దయితా- స్నేహ-స్వహస్తేన = ప్రియురాలియొక్క ప్రేమ సూచకమైన; స్వహస్త లిఖితమైన లేఖ చేత; భవతః=నీకు; కిం=ఏమి ప్రయోజనము= అంజనాం-ప్రతి=అంజనాదేవి వట్ల; ఆలక్షిత-ప్రార్థనః = చూపబడిన ప్రేమగల; భవాన్=నీవు: ఏవం విధైః=ఇట్టి విధములయిన; మనః + వినోదన-ఫలైః=మనస్సును వినోదపఱచు కొనుటయే ఫలముగాగల ఉపాయములచేత; ధారితం=నిలుపబడిన (ప్రాణములు నిలుపుకొను) నదిగా; కామార్తం=కామ పీడితమైన; జనం=జనమును; జానీతే- హి=ఎఱుగుదువుగదా.

అంజనాదేవి పేరెత్తి, కామార్త జనమును ఎన్ని రాజు దక్షిణ మారుతము యొక్క హృదయమునకు హత్తుకొనునట్లు అతి దీనముగా ప్రార్థించుచున్నాడు. పూల గంధమును కొనిపోయినచో అంజనాదేవి సంతోషించునుగాని నా ప్రియురాలి ప్రణయ లేఖను ఎత్తుకొని పోయినచో ఆమె యేల సంతోషించును. పైగా ఎవ్వ

తెయో ప్రియురాలు నీకు వ్రాసిన లేఖయని శంకించి ఆమె నీపై కోపించినను కోపింపవచ్చును.

పుట 49 : "పశ్యామి" - చూచుచున్నాను. ఈ ఉత్తరము యొక్క అన్వేషణయే జరుగుచున్నది అని నిపుణిక విదూషకుని చూపి చెప్పగా రాణి గంభీరముగా 'చూచుచున్నాను' అని ఒక్కమాటయని యూరకున్నది. రాజు దీనవాక్యములనుగూడ ఆమె వినియే యుండును. ఆమెకును గొంత జాలి పుట్టియుండును.

"మయూర పింఛేన విప్రలబ్ధః అస్మి" - నెమిలి యీకను జూచి భూర్జపత్ర మనుకొని మోసపోయితిని అని విదూషకుడు క్రీడా పర్వత ప్రాంతమున నేలకు రాలిన వస్తువును జూచి తిరిగివచ్చి రాజునకు చెప్పెను. రాజు తాను కూర్చుండిన చోటనే లేచి నిలిచి వాయువును ప్రార్థించుచుండెను. రాజు ప్రార్థనను విని వాయువు ఆ వస్తువును జారవిడిచెనుగాని అది ఉత్తరము కాదు. దక్షిణ వాయువు ఆ యుత్తరమును ఇదివరకే రాణి పాదముల కడకు దీసికొని పోయెగదా.

"సర్వథా హతోస్మి" సర్వ విధముల దురదృష్టవంతుడను. ఉర్వశి వెడలిపోయినది. ఆమె ప్రణయలేఖయు పోయినది. పైగా ఎవరిచేతికి చిక్కునో! రాణి చేతికే చిక్కవచ్చు. రాజునకు తీవ్రమైన నిరాశ కలిగెను.

"అలం ఆవేగేన" - ఉద్వేగము చాలును. దీనముగా వాయువును ప్రార్థించుట విని, నిరాశతో క్రుంగిపోవుట చూచి రాణి యిట్లన్నది.

"ఏతత్ భూర్జ పత్రం" - ఇదిగో భూర్జ పత్రము. ప్రణయలేఖ యనుట ఆమె కిష్టములేదు. ఉర్వశి పేరెత్తుట అంతకన్నను ఇష్టముకాదు. ఏదో ముఖ్యమైన పత్రము కొఱకు వెదకుచు ఆవేగపడుచున్నాడని భావించినట్లు నటించు రాణి 'ఇదిగో భూర్జ పత్రము' అని యూరకున్నది.

"అయే దేవీ?" - ఓహో దేవియా? ఆకస్మికముగా వచ్చి

నందులకు ఆశ్చర్యపడినట్లు రాజు నటించెను. నిజమునకు ఆయన 'అహో' అనుట భయాందోళన చేత.

"స్వాగతం దేవ్యై" - దేవికి స్వాగతము - పైకి మర్యాద. పోయినదనుకొన్న ఉత్తరము దెచ్చి యిచ్చినది గనుక లోలోన సంతోషము. నిజమునకు విదూషకు డన్నట్లు అప్పు డా మెరాక 'దురాగతం' అయినది. రాజు, విదూషకుడు 'జనాంతిక' సంభాషణ చేసిరి.

"లోప్త్రేణ గృహీతస్య" - దొంగ సొమ్ముతో పట్టుబడిన దొంగకు చెప్పుటకు సమాధాన మేముండును. అని విదూషకు డను చున్నాడు. దొంగ సొమ్ముతో దొరికిన దొంగ ఏమి చెప్పినను దండ నాధికారియైన రాజు ఒప్పికొనడుగదా. అట్లే ఇప్పుడేమి ప్రతివచన మిచ్చినను రాణి యంగీకరింపదు. కనుక ఊరకుండుట మేలు అని విదూషకుని హితవు.

"నాయం పరిహాస కాలః" - విదూషకుడు పరిహాసము చేయుచున్నట్లు రాజునకు తోచినది. మూర్ఖుడా! ఇది పరిహాసమునకు సమయము కాదు అని రాజు విదూషకుని మందలించెను. విదూష కుడు కేవలము హాస్యకరుడేకాదు. రాజునకు రహస్య సచివుడు కూడ. సాధారణ సమయములందు హాస్యము పుట్టించును. రహస్య ప్రేమ వృత్తాంతములలో ఉపాయములు చెప్పును. ఇప్పుడు ఉపా యము చెప్పవలసిన సమయము. వాడేదో సమాధానము చెప్పి రాణిని శాంతపరచునని రాజు ఆశపడెను. కాని వాడు తనయందే నేరము చూపుచు మాట్లాడెను.

"పరసమన్వేషణార్థం" - వేరు వస్తువును గూర్చిన యన్వేష ణము కోసము. మేము వెదకుచున్నది నీవు తెచ్చిన భూర్జ పత్రము కొఱకు గాదు అది వేరు పత్రము - అని రాజు రాణిని మభ్యపెట్ట జూచెను. ఆ భూర్జ పత్రమును రాణి చదివియుండలేదని రాజు తలంచి యుండును.

"యుజ్యతే ఆత్మనః సౌభాగ్యం ప్రచ్ఛాదయితుం" - నీ అదృష్టము నిట్లు దాచుకొనుట యుక్తమా? ఉర్వశివంటి యప్సరసచే ప్రేమింపబడుట గొప్ప యదృష్టముగదా! ఆ విషయమును కప్పి పుచ్చుకొనుట యేల? అని రాణి భావము. సౌభాగ్య మనగా ప్రేమను చూరగొనుట. అన్యస్త్రీ ప్రేమను చూరగొన్న నీ కథను దాచిపెట్టుకొనుట యుచితమే - ముఖ్యముగా భార్యవద్ద.

"యత్ పిత్తోప శమనం" - వాత, పిత్త, శ్లేష్మములలో పిత్తము ప్రకోపించినచో పిచ్చి యెత్తును. రాజునకు ఉన్మాద మెక్కినది గనుక అది శమించునట్టి మధుర పదార్థములుగల భోజనమును త్వరగా సిద్ధము చేయుము అని విదూషకుడు రాణికి సలహా చెప్పుచున్నాడు. ఇది వానికిని లాభమే.

"శోభనం ఖలు బ్రాహ్మణేన ఆశ్వాసితః వయస్యః" - బ్రాహ్మణునిచేత మిత్రుడు చక్కగా ఓదార్చబడినాడుగదా - రాజునకు ఉష్ణము ఎక్కువైనదని చెప్పి, దానికి మధుర భోజనము విరుగుడని చెప్పి బ్రాహ్మణుడైన విదూషకుడు రాజుయొక్క తత్కాలా వేగమును సమర్థించినాడని రాణి యనుచున్నది.

"ఆశ్వాసితః పిశాచః అపి భోజనేన" - పిశాచము కూడ భోజనముచేత శాంతించును. మానవ స్త్రీ కాని ఉర్వశి పిశాచి యనియు, అది రాజును ఆవేశించినదనియు, పిశాచ శాంతి కొఱకు రాజునకు సంపన్నమైన భోజనమును దిగదుడిచి పిశాచదృష్టి దోషము తొలగించవలెననియు విదూషకుడు గూఢముగా నిజమును బయట పెట్టుచున్నాడు. రాజునకు ఇది యర్థమైనది.

"బలాత్ అపరాధినం మాం ప్రతిపాదయసి" - బలవంతముగా నన్ను దోషిగా నిరూపించుచున్నావు. నేను ఏ యపరాధము నెఱుగను. ఏదో ముఖ్యమైన పత్రము కొఱకు వెదకుచుంటిని. అంతే. అని రాణి తెచ్చిన పత్రముతో తనకు సంబంధము లేదన్నట్లు రాజు బొంకెను.

"అహమేవ అపరాద్ధా"— రాజు నేనపరాధిని కాను అని నంతనే రాణి "అయితే నేనే అపరాధినిని. కన్నులకు బాధ కలిగించుచు ఎదురుగా నిలబడి యుంటినిగదా!" అని కోపముతో పలికినది. ఈ సమయమున నేను వచ్చుట నీకు కష్టముగా నున్నది. కంటి యెదుట నేను నిల్చుటయు నీకు కష్టముగానే యున్నది. నీ వేదో ముఖ్యమైన పత్రమును వెదుకబోవు చుంటివిగదా. ఇక్కడ నిల్చుట నాదే తప్పు. ఇదిగో పోవుచున్నాను.

పుట 51 : ఈ మాటలని రాణి కోపముతో వెళ్లబోవును. రాజు దక్షిణుడు గనుక రాణికి కోపము తెప్పించుట కిష్టపడడు. ఆమె నెట్లయినను ప్రసన్నురాలిని చేసికొనుట అవసరము. ఆమె ప్రసన్నురాలైననే తాను ఉర్వశితో సుఖపడగలడు. గనుక రాజు వెంటనే ఆమె పాదములమీద పడెను.

శ్లో. 21 : అన్వయము : అహం నామ అపరాధీ; రంభోరు; ప్రసీద; సంరంభాత్ విరమ; సేవ్యః జనః కుపితః చ; దాసః కథంను నిరపరాధః ?

అర్థము : అహం - నామ=నేనే; అపరాధీ=దోషిని, రంభోరు= కదళీకాండములవంటి ఊరువులు గలదానా!; ప్రసీద=శాంతింపుము, ప్రసన్నురాలవు కమ్ము; సంరంభాత్=కోపావేగమునుండి; విరమ=విరమింపుము; సేవ్యః=సేవింపదగిన; జనః - చ=జనము; కుపితః - చ= కోపించినదైనచో; దాసః=దాసుడు; కథం - ను=ఎట్లోగదా; నిరపరాధః = నిరపరాధుడగును.

రాజు తనయపరాధమును కప్పిపుచ్చుకొనుచుండుట చూచి - ప్రణయ లేఖను సాక్ష్యముగా చూపినప్పటికిని ఒప్పుకొనకుండుట చూచి - రాణికి కోపమువచ్చి "నేనే అపరాధినిని లెమ్మనినది. ఆమె కోపమును శాంతింపజేయుటకై రాజు "కాదు నేనే అపారాధిని" అనుచున్నాడు. ఇది అపరాధమును ఒప్పుకొనుట కాదు. ఒప్పుకొనవలసి యొప్పికొనుట. కారణమేమో ఆయనయే చెప్పుచున్నాడు. సేవకునిపై ప్రభువునకు కోపమువచ్చిన దన్నచో సేవకునియందేదో దోషమున్న దన్నమాట.లేనిచో ఊరక అధికారికి ఏల కోపము వచ్చును?

ఈ మాటలతో రాజు రాణిని ఉపాలంభ జేయుచున్నాడు. నీవు చాల శాంత చిత్తవు. ఊరక కోపము తెచ్చికొనవు. ఇప్పుడు నీకు కోపము వచ్చిన దన్నచో తప్పక నాయందు ఏదో తప్పు ఉండవలయును. కనుక నేను తప్పక అపరాధినే. నీ వంటి దానికి కోపము తెప్పించుట తప్పు కాదా? కనుక తప్పు నొప్పుకొంటిని. కోపము వీడుము. ప్రసన్నరాలవు కమ్ము - అని రాజు బతిమలాడినాడు.

"పాదయోః పతతి" - రెండు పాదముల మీద పడును. రాణికి ఊరక కోపము తెప్పించుటయే తన యపరాధమైనచో రాజు ఆ మాట చెప్పి యూరకుండవచ్చును. పాదముల మీద పడవలసినంత అవసరము లేదు. కాని తాను చేసిన యపరాధమేమో రాజునకు తెలియును. ఆ యపరాధమువల్ల రాణికి ఎంత కోపము రావచ్చునో కూడా రాజునకు తెలియును. చేసిన యపరాధమును సాక్ష్యము చూపినప్పుడైన ఒప్పికొన్న నెట్లుండెడిదో. బలవంతముగా నాపై యపరాధము మోపబడుచున్నదని తప్పించుకొన జూచినప్పుడు రాణికి ఎంత కోపము రావచ్చునో రాజునకు బాగుగా తెలియును. రాజుయొక్క అన్యకాంతాసక్తికి సాక్ష్యము చేత చిక్కిన రాణి ఇప్పుడు ఖండిత. పాదానతిచేతకూడ ఆమెను ప్రసన్నను చేయుట కష్టము. రాజునకు ఆమె పాదములపై బడుట తప్పలేదు. విశేషించి తన్ను అట్టి స్థితినుండి తప్పించుటకు తోడ్పడవలసిన విదూషకుడు కూడ గూఢముగా తన యపరాధమును బయటబెట్టుచు రాణి పక్షమే వహించుచున్నట్లున్నాడు.

"లఘుహృదయా" - అధీరహృదయనై నేను ఈ యనునయ మును ఆదరించగూడదు. కాని తరువాత జాలివల్ల పశ్చాత్తాపము పడవలసి వచ్చునేమో యని జంకుచున్నాను - ఇట్లు అనుకొనుచు రాణి వెడలిపోవును. "పశ్చాత్తాపాద్ బిభేమి" - అనుటవల్ల రాణి యిప్పుడు రాజును తిరస్కరించినందుకు పశ్చాత్తాపపడుననియు, దాక్షిణ్యమువల్ల ఉర్వశీ పురూరవుల సంయోగమున కంగీకరించు ననియు ఉత్తర కథ ధ్వనించుచున్నది.

ఉర్వశీ పురూరవుల ప్రేమ వ్యవహారము ఈ సన్నివేశమందలి వ్యక్తులందఱకు తెలియును. ఆ యంశమును పైకి ఒక్కరును అన లేదు. రాణి ఉర్వశి పేరైన నెత్తలేదు, రాజును ఎత్తలేదు. అంతయు గంభీరముగా నడచిపోయినది. ఇది కాళిదాసుని సన్నివేశ నిర్వహణ నైపుణి. "ప్రావృట్ నదీ ఇవ అప్రసన్నా" - రాజు ఉర్వశిని గంగ యనెను. చిత్రలేఖను యమున యనెను. విదూషకుడు రాణిని కూడ నదితోడనే పోల్చెను కాని యీమె వర్షానది. కోపముచే కలుషితమై పొంగిపోవుచున్నది.

"తత్ ఉత్తిష్ఠ" - కనుక లెమ్ము. పాదములపైఁబడిన రాజు అట్లే యుండెను. రాణి చరచర నడచి వెడలిపోయెను. రాజునకు దెలియదు. విదూషకు డనుచున్నాడు. ఆమె వెడలి పోయినది. ఇంక నెంత సేపు పడియుందువు లెమ్ము - అని.

"న ఇదం అనుపపన్నం" - ఇది యసంగతము కాదు. పాదానతుడనైన నన్ను తిరస్కరించి రాణి వెడలిపోవుట యుక్తమే - అని దక్షిణుడైన రాజు తన యుదాత్తశీలమును ప్రకటించుచున్నాడు.

పుట 52: శ్లో. 22. అన్వయము: కృత్రిమరాగయోజితః మణిః తద్విదాం (హృదయం) ఇవ ప్రియవచనశతః అపి దయిత జనానునయః రసాత్ ఋతే యోషితాం హృదయం న ప్రవిశతి.

అర్థము: కృత్రిమ - రాగ - యోజితః=కృత్రిమమైన రక్త వర్ణముతో కూర్చబడిన; మణిః=మణి; తత్-విదాం=మణుల విషయ మెఱిగిన వారి యొక్క; హృదయం-ఇవ=హృదయమును వలె; కృత్రిమ-రాగ-యోజితః=కపట ప్రేమతో గూర్చబడిన; ప్రియ-; వచన-శతః + అపి=మధురములైన నూరు వాక్యములు గలదైనను దయితజన + అనునయః=ప్రియుల యొక్క అనునయము; రసాత్ + ఋతే=ప్రీతిలేనిదే; యోషితాం=స్త్రీల యొక్క; హృదయం= హృదయమును; న-ప్రవిశతి=ప్రవేశింపదు.

ఆ సమయమున రాజు రాణితో పలికిన అనునయ వాక్యములు తీయగా ఉన్నప్పటికిని వానియందు నిజమైన ప్రేమ లేదు. ఇది రాణికి

తెలియును. రాణికి తెలియునని రాజునకును తెలియును. కనుకనే తన కృత్రిమానురాగపూర్ణములైన మధుర వచనములు రాణి హృదయమును ప్రవేశించి యామె కోపమును విరిచివేయజాలక పోయినవి. భర్త మాట్లాడుచున్న తియ్యని మాటలలో నిజమైన ప్రేమయున్నదో లేదో భర్త హృదయము నెరిగిన స్త్రీ వెంటనే గుర్తించగలదు.

ఇచ్చట కాళిదాసు కావ్యమునుగూర్చి అన్యాపదేశముగా తన యభిప్రాయమును చెప్పుచున్నాడు. మధురములు, సుకుమారములు నైన పదములతో కూర్చి నీరస విషయమును చెప్పినచో అది కావ్య తత్త్వము నెఱింగిన రసికుల హృదయముల కెక్కదు. తన కావ్యమున సుకుమార మధుర శబ్దములచేత లోకసహజములైన భావములు ప్రకటింపబడుచున్నవి గనుక అది రసికుల హృదయముల నెక్కును. సహజములయిన భావములను మధురములైన పదములచే ప్రతిపాదించుట ఉత్తమనాటకకవి లక్షణము. అట్టివాని కావ్యము రసికులకు హృదయంగమ మగును. "శ్రుణుత.... కాలిదాస క్రియామిమాం" అన్న సూత్రధార వాక్యమును స్మరింపవలెను

"అతీ దుఃఖితః ... "— రాజు అతి దుఃఖతుడు-నేత్రరోగి_ కనువేదురు గొన్నవాడు. ఉర్వశి రూపమున మరులుకొని ఆమెనే చూడవలెనన్న దృష్టితో నున్నాడు. నేత్రరోగి దీపశిఖను చూడ జాలడు. పట్టపురాణి - పతివ్రత - దీపశిఖవంటిది. ఆమె రాజు కన్ను లకు పీడ కలిగించును. రాజు కన్నులకు ఉర్వశి వెన్నెలవలె నుండును. రాణి దీపశిఖవలె నుండును. విదూషకుడు రాణి పక్షమే మాట్లాడు చున్నాడు. ఆమె వెడలిపోవుట నీకు మంచిదే అయినదిగదా - కండ్లకు బాధలేకుండ పోయినది - అని విదూషకుడనగా.—

"స ఏవ దేవ్యాం బహుమానః"— దేవియందు నాకు అదే ఆదరము - నా మనస్సు ఉర్వశియందు లగ్నమై యున్నను రాణి యందు నాకు పూర్వమెట్టి యాదరమో ఇప్పుడును అట్టి యాద రమే. ఉర్వశిని చూడగోరుచున్న మాత్రమున ఈమెను చూచుట

యిష్టముకాదని తలంచుట యుక్తము కాదు. ఇది శుద్ధమైన దక్షిణ నాయక లక్షణము.

"ధైర్యం అవలంబిష్యే—" పాదానతిని తిరస్కరించినది కనుక ఇంక ముందు ఈమెపట్ల కొంచెము బెట్టు అవలంబింతును. ఐతే మాలినసే తప్ప ఈమె యంతఃపురమునకు వెళ్లను - అని భావము.

"స్నాన భోజనం"— ఈ సమాహార ద్వంద్వమువల్ల విదూష కుని విషయమున స్నానము, భోజనము అవినాభావ సంబంధము కలవి. బ్రాహ్మణుల విషయమున 'స్నానసంధ్యలు' కలిసియుండును. విదూషకుడు అధమ బ్రాహ్మణుడు గనుక వానికి "స్నానభోజన ములు" కలిసియుండును. సంధ్యాదులు లేవు.

పుట 58 : "గత మర్ధం దివసస్య" - పగటిలో సగముగతించినది. నాటకేతి వృత్తమున సగము గడచినది అని కాళిదాసు గూఢముగా ప్రకటించు చున్నాడు. ఇప్పటి రెండంకములలో సగము కథ జరిగినది. మూడు, ఐదు అంకములలో మిగిలిన కథ జరుగును. నాల్గవ అంకమున కథ లేనట్లే భావింపవచ్చును.

"ఊర్ధ్వం అవలోక్య" - పైకి చూచి - సూర్యుని యునికి చూచి - లేదా ఉర్వశి కొఱకు ఆకాశము దిక్కు చూచి.

శ్లో. 28 : అన్వయము : ఉష్ణాలుః శిఖీ తరోః శిశిరే మూలాలవాలే నిషీదతి; షట్పదః కర్ణికారముకులాని ఉపరి నిర్భిద్య అలీయతే; కారండవః తప్తం వారి విహాయ తీరనలినీం సేవతే; క్రీడావేశ్మని ఏషః క్లాంతః పంజరశుకః చ జలం యాచతే.

అర్థము ; ఉష్ణాలుః=తాపము సహింపజాలనిదై; శిఖీ=నెమలి; తరోః=చెట్టుయొక్క: శిశిరే=చల్లనైన; మూల - ఆలవాలే=మూల మందలి పాదునందు; నిషీదతి=కూరుచున్నది; షట్పదః=తుమ్మెద; కర్ణికార - ముకులాని=కొండగోగు మొగ్గలను; ఉపరి=అగ్రమునందు; నిర్భిద్య=భేదించి; అలీయతే=దాగికొనుచున్నది; కారండవః=నీటి కోడి; తప్తం=వేడి యెక్కిన; వారి=నీటిని; విహాయ=విడిచి; తీర-

నలినీం=ఒడ్డునందలి తామరపూవును; సేవతే=ఆశ్రయించుచున్నది; క్రీడా-వేశ్మని=క్రీడాభవనమునందు; ఏవ=ఈ; క్లాంతః=బడలిన; పంజర-శుకః-చ=పంజరమందున్న చిలుక కూడ; జలం=నీటిని; యాచతే=అడుగుచున్నది.

మధ్యాహ్నపు ఎండకు తాళజాలక పశులు తపించుట యందు రాజుయొక్క మనస్తాపము ధ్వనించుచున్నది. అదివసంతము. మట్టమధ్యాహ్నము. ఎండ తీవ్రముగా నుండును. రాజు ఉర్వశీ విరహాముచే తప్తుడు. దానికితోడు రాణి కోపించి ఆ తాపమును తీవ్రతరము గావించినది.

ఈ యంకము ప్రారంభమున రాజు కార్యాసనము నుండి లేచినట్లు సూచన చేయబడినది. రాజు ధర్మాసనమందుండు కాలము ఉదయము 7-30 నుండి 9-00 వరకు. కనుక అప్పటినుండి మట్ట మధ్యాహ్నము వరకు ఈ యంకమందలి కథ జరిగినది.



# తృతీయాంకము

పుట 54 : ప్రయోగేణ=రూపకముయొక్క అభినయ ప్రయోగముచేత; పరిషత్=సభ, ప్రేక్షక సమాజము,

"సరస్వతీ కృత కావ్యబంధే" - సరస్వతీదేవిచేత స్వయముగా రచింపబడిన దృశ్య ప్రబంధమను కావ్యము రసవంతముగ నిర్దుష్టముగ నున్నది. కాని ప్రయోగమునందే దోషము కలిగినది. ఆ దోషమునకు నాట్యాచార్యుడైన భరతముని కారణముకాదు.

"తేషు తేషు రసాంతరేషు" - ఆయా రసభేదములందు - నాటకమున పెక్కు రసము లుండవలయును. కాని అన్నియు ఒక ప్రధాన రసమునకు అంగములై యుండవలయును.

పుట. 55 : ఆమ=అవును - అంగీకార వ్యంజకమైన శబ్దము.

"భూమికా" పాత్రము, వేషము. మూర్త్యంతర పరిగ్రహము భూమిక యనబడును. "అన్యరూపైః యదన్యస్య ప్రవేశః సతు భూమికా" - ఒకడు వేరురూపములతో ప్రవేశించుట భూమిక.

"భావాభి నివేశః" - రతి భావబంధము - గాఢమైన ప్రేమ.

"నిర్గతా వాణీ" - మాట వెలువడెను. లక్ష్మీ వేషమునందున్న ఉర్వశి తనకు పురుషోత్తమునియందు ప్రేమ అని చెప్పవలసి యుండగా నిరంతర పురూరవ స్మరణమువలన ఉర్వశికి తెలియకుండగనే ఆమె నోట 'పురూరవునియందు' అను మాట వెలువడెను. పురుషోత్తమ, పురూరవ శబ్దముల సాదృశ్యము కూడ ఈ పొరపాటునకు కారణము.

"భవితవ్యతానువిధాయీని ఇంద్రియాణి" - ఇంద్రియములు భవిష్యత్కాలమున జరుగబోవు దానిని అనుసరించి ప్రవర్తించునవి.

ఉర్వశి పురూరవునకు భార్య కాబోవుచున్నది గనుక ఆమె వాగింద్రి యము దాని ననుసరించియే ప్రవర్తించినది.

"మహేంద్రేణ పునః అనుగృహీతా" - మహేంద్రునిచేత తిరిగి అనుగ్రహింప బడినది. ప్రమాదవశమున పురూరవుని పేరు చ్చరించి ప్రయోగము భంగము గావించినది కనుక భరతముని యామెపై ఆగ్రహించి శపించెను. కాని గురువు విగ్రహామును ప్రభువు వెంటనే అనుగ్రహాముగా మార్చెను.

పుట 56 : "న తే దివ్యం స్థానం భవిష్యతి"— నీకు దేవలోక నివాసము ఉండబోదు. దేవదేవుడైన పురుషోత్తముని పేర్కొనవలసి యుండగా, మర్త్యుడైన పురూరవుని పేర్కొంటివి. నా నియోగమును ఉల్లం ఘించితివి. కనుక నీవు మర్త్యలోకమందే ఉందువుగాక అని భరత ముని శాపము. శాపముపొంది ఆమె చిన్నబోయి తలవంచుకొన్నది. దివ్యస్త్రీయయ్యు మనుష్యుని ప్రేమించినందుకు, ఆ ప్రేమను దివ్య సభలో బయట బెట్టుకొన్నందుకు, సాటి యప్సరసలలో, నిండు సభలో గురువుచే శపింపబడినందుకు ఉర్వశి లజ్జితయైనది అంతే కాని భయపడలేదు. ఆ శాపము ఆమెకు ఇష్టమే. అట్టి యవస్థయందున్న ఆమెను జూచి యింద్రుడు జాలిపడెను.

"రాజర్షేః ప్రియమత్ర కరణీయం"— ఈ శాప సందర్భమున నేను పురూరవునకు ప్రియము చేయవలయును. అతడు నాకు రణ సహాయుడు. ఇంద్రుడు ముని శాపమును కాదనలేదు. ఉర్వశి ఎట్లును మర్త్యలోకమునకు పోవలెను. ఆ పోవుట పురూరవుని భార్యగా పోయినచో మంచిది. ఇట్లుచేయుట ఉర్వశికిని ప్రియమే. కాని ఇంద్రుడు ఉర్వశిమాట యెత్తలేదు. ఎత్తినచో భరతమునికి కష్టము కలుగును. ఉర్వశి పొరపాటున పురూరవుని పేరెత్తెనని భరతముని యభిప్రాయము. కనుక భూలోకమునకు పొమ్మనుట ఆమెకు అప్రియము చేయుట అని తలచి ఆయన శపించెను. పురూరవుడు ఉర్వశిని రక్షించెనని ఇంద్రునకు తెలియును గాని భరతమునికి

తెలియదు. కనుక ఇంద్రుడాసంగతి యెత్తక తనకు రణసహాయుడైన పురూరవునకు ప్రియముగా ఆమెను ఆయనకు భార్యగా నుండుమని చెప్పెను. "యస్మిన్ బద్ధభావాసి" అనుటలో ఇంద్రుడు గడుసుదనము చూపెను. నాటక సందర్భమున నీవు ఎవ్వనియందు ప్రేమగల దానినని నోరుజారి పలికితివో వానికే భార్యవుకమ్ము - అని యింద్రుడనెను. ఇట్లు గూఢముగా ఉర్వశికి ప్రియము చేయుటేకాక మునిశాపమునకు ఒక అవధిని గూడ ఇంద్రుడు నిర్ణయించెను.

"యావత్ సః త్వయి దృష్ట సంతానో భవేత్"— పురూరవుడు నీయందు దృష్టమైన సంతానము కలవాడగునంతవఱకు". "దృష్టసంతానః" అన్న మాటకు పొందబడిన సంతానము కలవాడు అని యర్థము. కాని దానికి ఉర్వశి వేఱు విధముగా అర్థము తీసెను. చూడబడిన సంతానము కలవాడు - అనగా సంతానము కలుగుట కాదు. ఆ సంతానమును రాజు కన్నులార చూడవలెను. పంచమాంకమున ఈ యర్థము స్పష్టపడును.

"పురుషాంతర విదః" - ఇతర పురుషులను ఎఱిగినవాడు. అనగా అన్యులయొక్క మనస్సులను గుర్తించువాడు. ఉర్వశీ పురూరవులు పరస్పరము ప్రేమించుకొనుచుండిరని ఎఱిగినవాడు. లేదా పురుషుల యందలి తారతమ్యము నెఱింగినవాడు. మర్త్యలోకమునందలి రాజులలో పురూరవు డొక్కడే తన యంతటివాడు. ఉర్వశి తన్ను సేవింపవలసినది. లేదా తనయంతవాడైన పురూరవుని సేవింపవలయును. ఈ యంశము నెఱిగినవాడు దేవేంద్రుడు కనుక తగిన విధముగా ఉర్వశిని పురూరవునకు భార్యగా నిశ్చయించినాడు.

"అస్మాభిరపరాద్ధా" - మనచేత అపరాధము చేయబడినది. ఇది రెండవ శిష్యుని మాట. అపరాధము చేసిన యుర్వశిని గురువుగారు శపించినారు. మనల నేమి చేయునో - అని క్రొత్తవాడైన పల్లవుని భయము. గాలవుడు ఆరితేరినవాడు గనుక వానికి భయము లేదు.

"కథా ప్రసంగేన" - గాలవ పల్లవులు రెండవ అంకమునకు, మూడవ అంకమునకు నడిమి కాలమున జరిగిన కథను ప్రసంగించిరి. కనుక ఇది వృత్తకథాంశ నివేదనము.

"విష్కంభకము" - లేక విష్కంభము. ఇది ప్రవేశకమువంటి అర్థోపక్షేపకము. ఇది మధ్యమ పాత్రలచేత ప్రయుక్తమైనచో శుద్ధ విష్కంభము. నీచ పాత్రముకూడ కలిసినచో మిశ్ర విష్కంభము. ముని శిష్యులు మధ్యమ పాత్రలు కనుక ఇది శుద్ధ విష్కంభము కావలెను. కాని మూలమున పల్లవుడు ప్రాకృతము మాట్లాడుటచే నీచపాత్ర యగును. అందువల్ల ఇది మిశ్ర విష్కంభ మన వలసి యున్నది.

పుట. 57 : "కంచుకీ" – ఒక విధమైన కంచుకమును తొడిగికొని యుండువాడు. అంతఃపురస్త్రీల సేవయందుండు వృద్ధుడు.

"అంతఃపురచరో రాజ్ఞాం వృద్ధో విప్రో గుణాన్వితః"

రాజాంతఃపురమునందుండు వృద్ధుడు, గుణవంతుడునైన బ్రాహ్మణుడు కంచుకి. కంచుకి గుణసంపన్నుడు, కామరోష వివర్జితుడు, జ్ఞాన విజ్ఞాన కుశలుడు అయియుండవలయును.

శ్లో॥ 1 : అన్వయము : సర్వః కుటుంబీ కల్యే వయసి అర్థాన్ లబ్ధుం యతతే; పశ్చాత్ పుత్రైః అపహృతభరః విశ్రమాయ కల్పతే; అస్మాకం తు ప్రతిదినం శరీరం సాదయంతీ ఇయం సేవా కారాపరిణతిః; అహో స్త్రీషు అధికారః కష్టః,

అర్థము : సర్వః-కుటుంబీ=ప్రతి కుటుంబియు; కల్యే=పటుత్వముగల; వయసి=వయస్సునందే; అర్థాన్=ధనములను, ప్రయోజనములను; లబ్ధుం=పొందుటకు; యతతే=ప్రయత్నించును; పశ్చాత్=తరువాత; పుత్రైః = కుమారులచేత; అపహృత - భరః = తీసికొనబడిన భారముగలవారై; విశ్రమాయ=విశ్రాంతికొఱకు; కల్పతే=యోగ్యుడగు చున్నాడు; అస్మాకం - తు=కాని మా కన్ననో; ప్రతిదినం=దిన దినము; శరీరం=శరీరమును; సాదయంతీ=పీడింపచేయు

చున్నదై; ఇయం=ఈ; సేవా=సేవ; కారా - పరిణతిః=కారాగార ముగా పరిణమించు చున్నది; అహో = ఔరా; స్త్రీషు=స్త్రీలవిష యమున; అధికారః = నియోగము, బాధ్యత; కష్టః = కష్టమైనది;

'వ్రతసంపాదనాయ' - వ్రతఫలసిద్ధి కొఱకై; మానం = గర్వ మును, మానక్రోధమును;

"అవసిత సంధ్యా జాప్యం"—పూర్తిచేయబడిన సంధ్యాకాల విధులు గలవాడు – 'జప్యం' అన్నచో మంత్రములను జపించుట యని యర్థమగును. 'జాప్యం' అనుటచే తత్కాల కృత్యములు.

"దివసావసాన వృత్తాంతః"— సంధ్యా సమయము నందలి దృశ్యములేక విధానము. దివ సావ సాన శబ్దముచేత కథయందలి పరిణామము సూచింపబడు చున్నది. రాణికోపము విడువబోవు చున్నది. ఉర్వశి లభింపబోవుచున్నది. అయోగ తాపము శమించి సంయోగ సుఖము లభింపబోవు చున్నది. కనుక రాజమందిర మందలి అప్పటి దృశ్యము రమణీయముగా నున్నది.

పుట 58 : శ్లో॥ 2 అన్వయము : నిశానిద్రాలసాః బర్హిణః వాసయష్టిషు ఉత్కీర్ణాః ఇవ; జాల వినిఃసృతైః ధూపైః వలభయః సందిగ్ధపారా వతాః; ఆచారప్రయతః శుద్ధాంత వృద్ధాజనః చ సపుష్పబలిషు స్థానేషు అర్చిష్మతీః సంధ్యామంగలదీపికాః విభజతే.

అర్థము : నిశా - నిద్రా + అలసాః = రాత్రియందు నిద్రచేత నిశ్చలములైన; బర్హిణః = నెమిళ్లు; వాస - యష్టిషు = నివసించుట కుద్దేశింపబడిన గూటములందు; ఉత్కీర్ణాః - ఇవ = పొదుగబడినవా యన్నట్లున్నవి; జాల - వినిస్సృతైః=గవాక్షములనుండి బయలు వెడలు చున్న: ధూపైః=ధూపముల చేత; వలభయః=ముంజూరులు; సందిగ్ధ- పారావతాః = శంకకు అస్పదములైన పావురములుకలవి యగు చున్నవి; ఆచార - ప్రయతః=ఆచారచే నియమముగల; శుద్ధాంత- వృద్ధా - జనః - చ = అంతఃపురమందలి వృద్ధస్త్రీసమూహాముకూడ; స-పుష్ప-బలిషు = పుష్పములతో బలులతోగూడిన; స్థానేషు=ప్రదేశ

ములందు; అర్చిష్మతీః=జ్వాలలుగల; మంగల-దీపికాః=మంగళప్రద ములైన దీపములను; విభజతే=వేఱు వఱచియుంచు చున్నది.

రాజాంతః పురమునందలి పరిచారికలందఱును రాజునకు మంగళము సూచించుచు రాజభవనమును దీపికాలంకృతము గావించుచున్నారు.

శ్లో॥ 3 : అన్వయము : పరిజన వనితా కరార్పితాభిః దీపికాభిః పరివృతః ఏషః (రాజా) అపక్షలోపాత్ గతిమాన్ అనుతట పుష్పిత కర్ణికార యష్టిః గిరిః ఇవ విభాతి.

అర్థము : పరిజన-వనితా-కర + అర్పితాభిః=పరిచారికా స్త్రీల యొక్క చేతులయందు ఉంచబడిన; దీపికాభిః=దీపికలచేత; పరివృతః=పరివేష్టింపబడిన వాడైన; ఏషః (రాజా)=ఈ రాజు; అపక్షలోపాత్=ఱెక్కలు లోపింపనందువలన; గతిమాన్=గమనము గలదియు; అనుతట - పుష్పిత - కర్ణికార - యష్టిః=పార్శ్వములందు పుష్పించిన కొండగోగు చెట్లు గలదియు అగు; గిరిః-ఇవ=పర్వతము వలె; విభాతి=ప్రకాశించుచున్నాడు.

"అపక్ష లోపాత్" - ఇంద్రుడు పర్వతముల పక్షములను ఖండించుట చేత అవి గమనములేక పడియున్నవి. పురూరవుడు పర్వతమువలె మన్నాడు. ఆయన ఇంద్రునకు మిత్రుడు గనుక ఆయనకు పక్షములు లోపింపలేదు. ఆయన ఱెక్కలుగల పర్వతమువలె ధీరముగా నడుచు చున్నాడు. ఆయనకిరుప్రక్కల దీపికా హస్తలైయున్న పరిచారికలు పూచిన కొండ గోగులవలె నున్నారు. ఇది చక్కని యుత్ప్రేక్ష.

శ్లో॥ 4. అన్వయము : కార్యాంతరితోత్కంఠం దినం మయా అనతి కృచ్ఛ్రేణ నీతం; అవినోద దీర్ఘయామా రాత్రిః కథం ను గమయి తవ్యా?

అర్థము : కార్య + అంతరిత + ఉత్కంఠం=రాజ కార్యము లచే మఱుగు పరచబడిన ఉత్కంఠ గలదైన; దినం=పగటి వేళ;

మయా=నాచేత; అనతి-కృచ్ఛ్రేణ=ఎక్కువకాని (అల్పమైన) కష్ట
ముతో; నీతం=గడుపబడినది; అవినోద - దీర్ఘ - యామా=వినోద
రాహిత్యముచే దీర్ఘమగు జాములుగల; రాత్రిః=రాత్రివేళ; కథం-
ను=ఎట్లోగదా; గమయితవ్యా=గడుపదగినది.

పుట. 59 : సుదర్శనః=చక్కగా నగపడువాడు; ప్రతిపాలయితుం=ఎదురు
చూచుటకు, వేచియుండుటకు; పృష్ఠే=పై భాగమున;

"యావత్ రోహిణీ సంయోగః" - రోహిణి చంద్రునకు
అత్యంత ప్రేమపాత్రురాలయిన భార్య. ఇరువదియేడు నక్షత్రములు
దక్షుని పుత్రికలు. చంద్రుడు రోహిణిని ప్రేమించి యామెతోపాటు
తక్కిన నక్షత్రములను గూడ పెండ్లాడెను. రాణి యుద్దేశ్యమున
ఆకాశమున రోహిణీ చంద్రులు కలిసిన సమయమున తాను
రాజును కలిసి యుండవలెను. కవి యభిప్రాయమున రోహిణి
యుర్వశియేయని యూహింపదగి యున్నది. ఉర్వశీ వియోగ
సంతప్తుడైన రాజు ఉర్వశీ సంయోగము పొందు వరకు మణి
హార్మ్యముమీద రాణి రాజుతో కలిసి యుండును.

"యః తే ఛందః" - నీ యభిలాష యేదో అట్లే - ఇది
వఱకు 'అజ్ఞాపయతి' అనుచుండిన రాజు ఇప్పుడు కొంచెము బెట్టు
చేయుచు 'నీ యిష్టము' అని పలుకుచున్నాడు. అయినను 'విజ్ఞా
ప్యతాం' అని గూఢముగా గౌరవమును తెలుపుచునే యున్నాడు.

"ప్రమార్ష్టు కామా" - కడిగి వేసికొన గోరుచున్నది, ప్రణి
పాత లంఘన దోషమును తొలగించుకొన గోరుచున్నది.

పుట. 60 : శ్లో॥ 5 : అన్వయము . అవధూత-ప్రణిపాతాః పశ్చాత్ సంతప్య
మాన మనసః అపి మనస్విన్యః నిభృతైః దయితానునయైః వ్యపత్ర
పంతే.

అర్థము : అవధూత-ప్రణిపాతాః = అనాదరింపబడిన యను
నయము గలవారై; పశ్చాత్=పిమ్మట; సంతప్యమాన-మనసః-

అపి=సంతాపము పొందుచున్న మనస్సులు గలవారయ్యు; మన స్విన్యః=అభిమానముగల స్త్రీలు; నిభృతైః=గూఢములైన: దయిత + అనునయైః = ప్రియుల యనునయములచేత; వ్యపత్రపంతే=సిగ్గు పడుదురు.

"నిభృతైః దయితానునయైః" - గూఢములైన ప్రియుల యనునయములచేత - 'విజ్ఞాప్యతాం దేవీ యస్తే ఛందః ఇతి' అనుట యందు గూఢమైన యనునయముకలదు. ప్రణిపాతలంఘనముచేసి నది గనుక రాజు విగిసి రాణి కోర్కెను నిరాకరింపవచ్చును. కాని ఆమె పశ్చాత్తాపము పొందుచున్నది గనుక గూఢముగా అనునయము చేసినచో తన చర్యకు తానే సిగ్గుపడును. రాణిని ఎట్లయినను మృదువుగా లొంగదీసికొని యుర్వశితోడి తన సంబంధమునకు ఆమె యంగీకరించునట్లు చేయుట రాజు తలంపు. అది ఫలించును. ఆయన నిగూఢానునయము కార్య కారియైనది.

"గంగాతరంగ సశ్రీకేణ"— గంగాతరంగములతో సదృశమైన శోభగల - మహారాణి భవనము అంత పవిత్రమైనది. సదృశ శబ్దమునకు సశ్రీక శబ్దము నుపయోగించుట విదూషకునకు ఇష్టము.

"తిమిర రిచ్యమానం పూర్వదిశాముఖం"— చీకటిచే విడిచి పెట్టబడుచున్న తూర్పు దిక్కుయొక్క అంచు - కోపము విడచి ప్రసన్నమగుచున్న మొదటి భార్య ముఖము అని వ్యంగ్యము.

"ఆలోక సుభగం"— వెలుగుచేత శోభిల్లుచున్నది - చూచుటకు అందముగా నున్నది రాణి ముఖము.

"సమ్యగాహ భవాన్"— నీవు చక్కగా చెప్పితివి - తూర్పు దిక్కు వెలుగుచేత అందముగా నున్నదనిన విదూషకుని వాక్యమును రాజు మెచ్చుకొను చున్నాడు. "దిశా ముఖం" అనిన ఉక్తియందు ప్రతీయ మానమగు స్త్రీవదనమును ఉపమచే వర్ణించుచున్నాడు.

శ్లో॥ 6: అన్వయము : ఉదయగూఢ శశాంకమరీచిభిః తమసి ఇతః దూరం ప్రసారితే హరివాహన దిఙ్ముఖం అలకసంయమనాత్ ఇవ మే లోచనే హరతి.

అర్థము : ఉదయ - గూఢ - శశాంక - మరీచిభిః = ఉదయపర్వతముచే కప్పబడిన చంద్రుని కాంతులచేత; తమసి = చీకటి; ఇతః = ఇచ్చటి నుండి; దూరం = దూరముగా; ప్రసారితే = తొలగింప బడినదికాగా; హరివాహన - దిక్ + ముఖం = ఇంద్రునియొక్క దిక్కుయొక్క ముఖము; అలక - సంయమనాత్ + ఇవ = ముంగురులను చక్క దిద్దుకొనుట వలన వలె; మే = నా యొక్క; నేత్రే = రెండు కన్నులను; హరతి = ఆకర్షించుచున్నది.

"ఉదయ గూఢ శశాంక మరీచిభిః" = తూర్పు కొండచాటున నున్న చంద్రకిరణములు - ఇంకను పూర్తిగా ఉదయించనందువల్ల చంద్ర బింబము కనబడుటలేదు కాని కిరణ కాంతులు ప్రసరించుచు చీకటిని తొలగించుచున్నవి. హరివాహనుడు ఇంద్రుడు. అయన దిక్కు తూర్పు. ఆ దిక్కు యొక్క ముఖము చీకట్లు తొలగుచుండుట చేత ముంగురులను ప్రక్కలకు దిద్దుకొన్న స్త్రీ ముఖమువలె మనోహరముగా నున్నది. ఇంద్ర దిశనుండి ఉర్వశి రాబోవుచున్నది. ముంగురుల నెగద్రోచికొని తేటమైన ఆమె ముఖమే రాజు భావనయందున్నది. తిమిరము దుఃఖ ప్రతీక. ఇంక రాజునకు ఇంద్ర దిశ నుండి సుఖము లభింపనున్నది.

"హరివాహన"–పసుపుపచ్చని గుఱ్ఱములు గలవాడు–ఇంద్రుడు. "త్వక్కేశ బాలరోమాణి సువర్ణాభాని యస్యతు। హరిః స వర్ణతోఽశ్వస్తు పీత కౌశేయ సప్రభః" - చర్మము, జూలు, వెంట్రుకలు బంగరువన్నె గలిగి పసుపుపచ్చని పట్టువలె ప్రకాశించు అశ్వమునకు హరి యని పేరు. ఇంద్రు డిట్టి యశ్వములు గలవాడు.

పుట. 61 : ఏష ఖండమోదక సశ్రీకః ఉదితో రాజా ద్విజాతీనాం" – చంద్రుడు ద్విజ రాజు – బ్రాహ్మణులకు ప్రభువు. సగము ఉదయించిన చంద్రుడు భోజన ప్రియుడైన విదూషకునకు ఖండ మోదకము వలె కనబడెను. తేటపడుచున్న తూర్పు దిక్కును జూడగా రాజునకు ఉర్వశి ముఖము గుర్తు వచ్చెను. అర్థ చంద్రుని చూడగా విదూషకునకు ఖండమోదకము గుర్తువచ్చెను. ఎవరి రుచి వారిది. విదూషకు

వకు ఖండమోదకము ఎంతో అందముగా గనబడును. ఇప్పుడు అర్ధ చంద్రుడు అంత అందముగా నున్నాడు. ఇచ్చట మోదక శబ్దము రాణి దానము చేయబోవు మోదకములను సూచించును.

"ఔదరికః" - ఉదరంభరుడు. అభ్యవహార్యః = భక్ష్యము. భోజన ప్రియునకు భక్ష్యమే విషయము, కాముకునకు కామినియే విషయము.

"క్షపానాథ" - నిశాపతియన్న సంబోధనము తత్కాలమున పురూరవుని నోట ఉచితముగా నున్నది.

శ్లో. 7: అన్వయము: సతాం క్రియార్థైః రవిం అవసతే, సురాన్ పితౄన్ చ సుధయా తర్పయతే, నిశి మూర్ఛతాం తమసాం నిహంత్రే, హర చూడానిహితాత్మనే తే నమః.

అర్థము: సతాం=సత్పురుషులయొక్క; క్రియార్థైః=యజ్ఞ క్రియకొఱకై; రవిం = సూర్యుని; అవసతే = ప్రవేశించునట్టియు; సురాన్=దేవతలను; పితౄన్ + చ = పితృదేవతలను; సుధయా= అమృతముచేత; తర్పయతే=తృప్తిపొందించునట్టియు: నిశి = రాత్రి యందు; మూర్ఛయతాం=వ్యాపించునట్టి: తమసాం=చీకట్లయొక్క: నిహంత్రే=హంతయైనట్టి (సంహరించునట్టి)యు; హర - చూడా - విహిత + ఆత్మనే = శివునియొక్క శిరస్సునందు ఉంచబడిన మూర్తి గలిగినట్టియు; తే=నీకొఱకు; నమః=నమస్కారము.

"చంద్రమా వా అమావాస్యాయాం ఆదిత్య మనుప్రవిశతి" అనున్యాయమున చంద్రుడు అమావాస్యనాడు సూర్యునిలో ప్రవేశించును. ఆనాడు దర్శేష్టి పితృయజ్ఞము మున్నగు కర్మలు చేయ బడును.

"ద్వాదశీం పితరః సర్వే సమం ప్రాశ్నంతి భాగశః"—అనుట చేత దేవతలవలె పితృదేవతలును చంద్రుని కళను గ్రోలుదురు. చంద్రుడు చీకట్లను పారదోలుటయు, చంద్రకళ శివుని మౌళియందుం డుటయు ప్రసిద్ధములు.

"బ్రాహ్మణ సంక్రామి తాతరేణ"— చంద్రుడు బ్రాహ్మణు లకు రాజు గనుక తన మనుమడైన పురూరవుని కూర్పుండుము అని

స్వయముగా చెప్పక తన పరివారములోనివాడైన బ్రాహ్మణుని ముఖమున చెప్పుచున్నాడని విదూషకుడు చమత్కరించెను. చంద్రుని పూజించి రాజు పరధ్యానముగా అట్లే నిల్చియుండెను. రాజు కూర్చుండిన గాని తాను కూర్చుండరాదు గనుక విదూషకుడు కూర్చుండుమని నీ తాతగారు నానోట నీకు చెప్పుచున్నారు అనెను.

పుట 62 : "కిం దీపికాపౌనురుక్త్యేన"— ఈ దీపికల వెలుగు పునరుక్తి. వెన్నెల వచ్చిన పిదప ఇవియేల?— ఇట్లని రాజు ఏకాంతమున విదూషకునితో ఉర్వశిని గూర్చి ప్రసంగింపగోరి పరిచారికలను బంపివైచెను.

"నను దృశ్యతే ఏవ సా"— అది కనబడుచునే యున్నది. ఆమెకు నీయందుగల యనురాగమును దలంచుకొని నీవు నిరాశతో నీరసపడనక్కరలేదు.

శ్లో. 8 : అన్వయము : విషమ శిలా సంకట స్ఖలిత వేగః నద్యాః ప్రవాహః ఇవ విఘ్నిత సమాగమ సుఖః మనసిశయః శతగుణో భవతి.

అర్థము : విషమ - శిలా - సంకట - స్ఖలిత - వేగః = ఎగుడు దిగుడైన రాళ్ల తాకిడిచేత తొట్రుపడుచున్న వేగముగల; నద్యాః=నది యొక్క; ప్రవాహః - ఇవ=ప్రవాహమువలె; విఘ్నిత - సమాగమ - సుఖః=భంగము చేయబడిన సంయోగసుఖముగల; మనసిశయః= కామము; శతగుణః = నూరు రెట్లు; భవతి=అగును.

విషమ శిలలచే అడ్డగింపబడిన నదీప్రవాహము వానిని తప్పించుకొని మార్గాంతరమున మరింత వేగముతో ప్రవహించును. అట్లే కామముకూడ విఘ్నములు కలుగుచున్న కొలది బలపడి గమ్యమును చేరుటకు మార్గములన్వేషించును. ఉర్వశిని ఎట్లు పొందుటా అని రాజు ఆలోచించు చున్నాడు. దృష్టమై, నష్టమైనట్లున్న ఉర్వశీ ప్రాప్త్యుపాయము ఇచ్చట మరల అన్వేషింపబడు చున్నది గనుక ఇది గర్భసంధి. గర్భసంధి యందు పతాకముండవలెను. పతాక యనగా ప్రధాన వృత్తాంతమునకు సహాయకారిగా నుండు అవాంతర వృత్తాంతము. అట్టిది ఇచ్చట లేదు లేకున్నను గర్భసంధికి నష్టములేదు.

పుట 63 : "పరిహీయమానైః అంగైః అధికం శోభసే"— కృశించి పోవు చున్న అంగములతో అధికముగా శోభిల్లుచున్నావు. విరహబాధ వలన అంగములు కృశించియు సౌందర్యము అతిశయించినచో త్వరలోనే సంయోగము ప్రాప్తించునని యొక విశ్వాసము. రాజునందట్టి లక్షణము కనబడుటచే ప్రియా సమాగమము నీకు చేరువనే యున్నదని విదూషకుడు రాజును ఉత్సాహపరచుచున్నాడు.

"నిమిత్తం సూచయిత్వా"— దక్షిణ భాగమున స్పందము కలుగుట సూచించి - అదే సమయమున రాజునకు శుభ శకునముకూడ కలిగినది.

శ్లో॥ 9 : అన్వయము : ఆశాజననైః వచోభిః భవాన్ ఇవ స్పందితైః అయం దక్షిణః బాహుః గురువ్యథం మాం ఆశ్వాసయతి.

అర్థము : ఆశా - జననైః = ఆశను గలిగించునట్టి; వచోభిః = మాటలచేత; భవాన్ + ఇవ = నీవువలె; స్పందితైః = స్పందనములచేత; అయం = ఈ; దక్షిణః = కుడిదైన; బాహుః = భుజము; గురువ్యథం = గొప్పబాధ గలిగిన; మాం = నన్ను; ఆశ్వాసయతి = ఓదార్చుచున్నది.

"దక్షిణః"—దయగల బాహువు స్పందనములచే ఆశ్వాసించుచున్నది. నీవలెనే ఈ బాహువు కూడ నాయందు దాక్షిణ్యము వహించుచున్నది.

పుట 64 : అభిసారిక : ఒక నాయికా భేదము —

"అభిసారయతే కాంతం యా మన్మథ వశంవదా
స్వయం వా అభిసరత్యేషా ధీరైరుక్తా అభిసారికా"

మన్మథ వశంవదయై ప్రియుని తన వద్దకు రప్పించుకొన్నను, తానే ప్రియునివద్దకు పోయినను నాయిక అభిసారిక యగును. అభిసారికా నాయిక సామాన్యముగా వేశ్యయై యుండును. వేశ్యయైన యభిసారిక విచిత్రోజ్జ్వలవేషము, ధ్వని చేయుచున్న నూపురాదులు గలదియు, సంతోషమున చిరునవ్వుచున్నదియు అయి యుండును. ఉర్వశి నారాయణోరు సంభవయైన యప్సరస గనుక సామాన్య

వేశ్య కాదు. ఆమె అభిసారికావేషము అల్పాభరణ భూషితమై, నీలాంశుకశోభితమై యున్నది. నూపురధ్వనులు లేవు. మహారాజునకు భార్య కాబోవుచున్నది కనుక వేశ్యాభిసారికాలక్షణము లిచ్చట వర్తింపవు.

స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక – అని నాయికలు ఎనిమిది విధములు.

"అపినామాహం పురూరవా భవేయం"— నేనే గనుక పురూరవుడనైనచో – ఉర్వశి యందము స్త్రీయైన చిత్రలేఖకే మోహము పుట్టించునదిగా నున్నది. ఆ యందమును జూచి తాను పురూరవుడు కావలెననిపించుచున్నదని చెప్పి ఉర్వశి మోహనాకారమును గొనియాడినది.

"మదనః ఖలు త్వా మాజ్ఞాపయతి"— చిత్రలేఖ పురూరవుని చేరెత్తినంతనే ఉర్వశికి కామావేగము మిక్కుటమైనది. నేను కాదు మదనుడే నిన్ను ఆజ్ఞాపించుచున్నాడు. త్వరగా నన్ను పురూరవుని వద్దకు తీసికొని పొమ్ము – అనుచున్నది.

"పరివర్తిత మివ కైలాస శిఖరం"— స్థలము మార్పుచెందిన కైలాస శృంగము. వెన్నెలలో పురూరవుని ప్రాసాదము తెల్లగా మెఱయుచు కైలాస శృంగమువలె నున్నది. ఇదివఱకు స్వర్గమువలె నున్నదని చెప్పబడినది. ఇప్పుడు ఉర్వశి స్వర్గమున కాలుపెట్టరాదు. గనుక అంతకంటెను గొప్పదైన కైలాస శిఖరముగా మారినది. కైలాసము చేరువ గంధమాదనమను ఉద్యానము గలదు. ఉర్వశీ పురూరవులు గంధమాదనమున క్రీడింప బోయిరన్న భావికథాంశమునకు ఈ యౌపమ్యము పోషకము.

"హృదయచోరః"— హృదయము దొంగిలించిన వాడు. ఉర్వశియే హృదయమును తనయందుంచి పోయినదని పురూరవుడు. అతడే తన హృదయము నపహరించెనని ఉర్వశి.

"మనోరథలబ్ధప్రియా సమాగమసుఖం అనుభవన్"- కోరికచే పొందబడిన లేదా కోరికయందు పొందబడిన ప్రియురాలితోడి సంగమ సుఖమును అనుభవించుచు - ఉర్వశిని ఆడించుటకై చిత్రలేఖ రెండర్థములు వచ్చు తీరున పలికినది. ఉర్వశి మొదటి యర్థమును గ్రహించి విషాదము పొందినది.

పుట 65 : "అదక్షిణం సందిగ్ధే మే హృదయం"— సందిగ్ధమైన విషయమున నా హృదయము దయలేనిది. కోరి సంపాదించుకొన్న యే సుందరితోడనో పురూరవుడు సుఖించుచున్నాడు కాబోలు నని విషాద పడితిని.

"అభిన్నార్థేన అనేన"— అస్ఫుటమైన అర్థముగల ఈ మాట చేత. రా జెవ్వతెతోడనో సుఖించుచున్నాడన్న యర్థము వచ్చునట్లు మాట్లాడిన చిత్రలేఖ వాక్యములవల్ల ఉర్వశి హృదయమున గలిగిన సందేహము పూర్తిగా పోలేదు. కనుక రాత్రితోపాటు మదన బాధయు వృద్ధిపొందుచున్నది అన్న రాజు వాక్యము ఎవ్వతెను గూర్చియో ఉర్వశికి స్పష్టముకాలేదు.

"అంతరితే ఏవ శృణువః"—గూఢముగానుండియే యీయన స్వేచ్ఛాప్రసంగమును విందము. ఒక క్షణములో రాణి రాబోవుచున్నది. కనుక ఉర్వశీ చిత్రలేఖలను అదృశ్యలుగా నుంచుటయే ఉచితము. ఇందుకే కాళిదాసు ఉర్వశి హృదయమున సందేహము పుట్టించెను. ఇప్పుడు ప్రత్యక్షమైనను రాణి వచ్చినప్పుడు మరల అదృశ్యకావలసి యుండును. అప్పుడు మరల విరహము. కనుక రాణి వచ్చి వెళ్లిన తరువాత బయటబడుటయే మేలు.

పుట 66 : "నను ఏతే అమృతగర్భాః సేవ్యంతాం చంద్రపాదాః"—అమృతగర్భములయిన ఈ చంద్ర కిరణములను అనుభవింపరాదా. విదూషకుని వాక్యమందు వానికి దెలియని వ్యంగ్యమున్నది. అమృతము ఉర్వశి. ఆమెను లోపల దాచిపెట్టుకొని యున్నది వెన్నెల. ఇది నీకు తాపశాంతి కలిగించును. వెన్నెల ఒకవిధమైన శీతలోపచారము.

"ఏవమాదిభిః"— ఈ మొదలైన వానిచేత - వెన్నెల మొదలయిన శీతలోపచారములచేత ఈ తాపము శమించునది కాదు.

శ్లో॥ 10: అన్వయము: మమ మనసిజరుజం అపోహితుం ప్రత్యగ్రం కుసుమశయనం న అలం; చంద్రమరీచయః న అలం; సర్వాంగీణం మలయజం చ న అలం; మణియష్టయః వా న అలం; దివ్యా సా వా అలం; రహసి అరబ్ధా తదాశ్రయిణీ కథా వా లఘయేత్.

అర్థము: మమ=నా యొక్క; మనసిజ - రుజం=మదనజ్వరమును; అపోహితుం = తొలగించుటకు; ప్రత్యగ్రం = క్రొత్తదైన; కుసుమ - శయనం = పూలపానుపు; న - అలం = సమర్థము కాదు; చంద్ర - మరీచయః=చంద్రకాంతులు; న - అలం=సమర్థములు కావు; సర్వాంగీణం=సర్వాంగములందును పూయబడిన; మలయజం - చ= మంచిగంధముకూడ; న - అలం=సమర్థము కాదు; మణి - యష్టయః - వా=మణిహారములు కూడ; న - అలం=సమర్థములు కావు; దివ్యా= దేవతాస్త్రీయైన; సా - వా = ఆమెయైనచో; అలం = సమర్థురాలు; రహసి=ఏకాంతమున; అరబ్ధా=ప్రారంభింపబడిన; తత్ + ఆశ్రయిణీ= ఆమెను ఆశ్రయించిన; కథా-వా=కథయైనచో; లఘయేత్=కొంత తగ్గింపవచ్చును.

"దివ్యాసావా" దేవతాస్త్రీయైన ఆమెకాని - ఇచ్చట 'కాని' అన్నమాట ఉర్వశికి సంశయహేతువైనది. 'కావా అపరా ?'-కానిచో వేరెవ్వతెయో అని సంశయించినది. ఆమెకు సంబంధించిన ప్రసంగము అనుమాట విని తృప్తిపడినది. రాజు తాపమును పోగొట్టుటకు తానే సమర్థురాలు అని విని ఉర్వశి సంపూర్ణముగా తృప్తిపడినది.

"త్వయా ఫలం ఉపలబ్ధం" - నన్ను విడిచి యీ రాజును చేరినందుకు, హృదయమా ! నీకు తగిన ఫలము లభించినది.

"అమ" - అంగీకారమును, స్మరణను తెలియజేయు శబ్దము. రాజు చెప్పినమాటవిని, తన యనుభవమును స్మరించి, అంగీకార సూచకముగ విదూషకుడు 'అమ' అనెను. రసాలము, శిఖరిణి లభింపనప్పుడు

విదూషకుడు వానిని తలంచుకొనుచు తృప్తిపడును కనుక రాజు ఉర్వశిని తలచుకొనుచు తృప్తిపడుట సహజమే యనుచున్నాడు.

"రసాలము" - మామిడిపండు; లేదా శర్కర, సుగంధ ద్రవ్యములు కలిపిన పెరుగు. 'శిఖరిణి' - ద్రాక్షాభేదము; లేదా ఏలకులు, లవంగము, కర్పూరము కలిపిన దధి దుగ్ధమిశ్రపదార్థము.

పుట 67 : శ్లో. 11. అన్వయము. రథక్షోభాత్ తస్యాః అంసేన నిపీడితః అయం అంసః ఏకః అస్మిన్ శరీరే కృతీ, శేషం అంగం భువః భరః.

అర్థము : రథ - క్షోభాత్ = రథముయొక్క కుదుపువలన; తస్యాః = ఆమెయొక్క; అంసేన=భుజాగ్రముతో; నిపీడితః = ఒరసికొనిన; అయం=ఈ; అంసః=భుజాగ్రము; ఏకః=ఒక్కటే; అస్మిన్=ఈ; శరీరే=దేహమున; కృతీ=ధన్యమైనది; శేషం = మిగిలిన; అంగం= శరీరము; భువః=భూమికి; భరః=భారము.

"ఉదాసీనః ఇవ" - ఉపేక్షించుచున్నట్లున్నాడు. నేను ఎదట నిలిచియున్నను మహారాజు నన్ను నిర్లక్ష్యము చేయుచున్నాడు - రాజు తలంచుకొనుచున్నది తన్ను కాదేమో అని యుర్వశికి మరల సందేహము.

పుట 69 : "అతిత్వరితే'=తొందరపాటుగలదానా! - రాజునెదుట పడవలెనన్న తొందరలో ఉర్వశి తిరస్కరిణిని తొలగించుట మరచిపోయినది. అందుచే ఎదుట నిలిచినను ఆమెను రాజు చూడజాలకపోయెను.

"ఇత ఇతో భట్టి్రి" - ఇటు ఇటు మహారాణీ-రాణి ప్రవేశించుచున్నట్లు దూరమునుండియే పరిచారికల వచనము సూచించినది. అందఱు వినిరి. ఉర్వశీ చిత్రలేఖలు విషాదము పొందిరి.

"అవిహా అవిహా" - అయ్యో అయ్యో - భయాశ్చర్యములు సూచించు శబ్దము.

"వాచం యమః" - వాక్కును కట్టివేసినవాడు. మౌనము వహించినవాడు.

"సంవృతాకారం" - మనస్సునందలి యభిప్రాయమును దాచిపెట్టుకొన్నవాడుగా. ఉర్వశీ ప్రసంగము జరుగుచున్నట్లు రాణికి దెలియరాదు.

"కిం అత్ర కరణీయం"-ఇప్పుడేమి చేయవలెను. ఉర్వశి మరల త త్తరపడుచున్నది. తాను తిరస్కరిణిచే అదృశ్యయని మరచిపోయినది.

"తత్ న ఏషా ఇహా చిరం తిష్ఠతి" - కనుక ఈమె యిచ్చట ఎక్కువసేపుండదు. రాణి ఉపవాసవేషమును జూచి చిత్రలేఖ ఆమె త్వరలోనే వెళ్ళిపోగలదని గ్రహించి ఉర్వశికి ధైర్యము చెప్పుచున్నది.

పుట 69: "రోహిణీ సంయోగేన" - రోహిణీ నక్షత్ర సంయోగముచే చంద్రుడు మిక్కిలి శోభిల్లుచున్నాడు. ఈ వాక్యమున రాణికి తెలియని ధ్వని యున్నది. ఉర్వశి రాజుప్రక్కనే యున్నది. ఆమె సంయోగముచే ఆయన మిక్కిలి అందగించుచున్నాడు. రోహిణి చంద్రునకు ప్రియతమభార్య.

"నను దేవీసహితో భర్తా విశేష రమణీయః". దేవితో గూడి యున్న రాజు అత్యంతరమణీయుడగును గదా. నిపుణిక రాణియే రోహిణియని రాజ్ఞీ పక్షపాతముచే పలికినది.

"అద్య మమ అక్ష్ణోః శుభదర్శనా దేవీ" - ఇప్పుడు రాణి నా కన్నులకు అందముగా కనబడుచున్నది - నాకు స్వస్తి వాచన మిచ్చుననియో లేక నీ ప్రణిపాతలంఘనమును పరిహరించుకొన వచ్చినదనియో. విదూషకుని యూహలు రెండును సత్యములే యగును.

"ఉభయ మపి ఘటతే"- రెండును సంభవములే. అయినను రెండవదే నాకు నిజమని తోచుచున్నది అని రాజు తన యూహకు కారణము నిరూపించుచున్నాడు.

శ్లో. 12 : అన్వయము : సితాంశుకా మంగళ మాత్రభూషణా పవిత్ర దుర్వాంకురలాంఛితాలకా (దేవీ) వ్రతాపదేశోజ్ఝిత గర్వవృత్తినా వపుషా ఏవ మయి ప్రసన్నా లక్ష్యతే.

అర్థము : సిత + అంశుకా = తెల్లని వస్త్రము ధరించినది; మంగళమాత్ర - భూషణా = సుమంగలీత్వసూచకములైన అలంకారములను మాత్రమే ధరించినది; పవిత్ర-దూర్వా + అంకుర-లాంఛిత + అలకా=పవిత్రమైన గరికపోచచేత అలంకరింపబడిన ముంగురులు గలది; అయిన దేవి; వ్రత + అపదేశ + ఉజ్ఝిత - గర్వ - వృత్తినా = వ్రతము అనెడు మిషచేత విడువబడిన గర్వస్థితిగల; వపుషా + ఏవ = శరీరముచేతనే, మయి=నా యందు; ప్రసన్నా = ప్రసన్నురాలుగా; లక్ష్యతే=కనబడుచున్నది.

పుట 70 : "హస్తేన గృహీత్వా". రాణిని చేతితో పట్టుకొని దగ్గరగా కూర్చుండబెట్టుకొనును. ఇది రాజుయొక్క దాక్షిణ్యము, నాగరికత, నిశ్చితానునయము.

"స్థానే ఖలు"— ఈమె దేవీ శబ్దముచే గౌరవింపబడుట యుక్తమే. ఈమెయందు పట్టమహిషి లక్షణములు సంపూర్ణముగా నున్నవి - అని యుర్వశి రాణి తేజోవిశేషమును గాంచి శచీదేవికి ఈమె యొంతమాత్రమును తీసిపోదు అనుచున్నది. రాజు ఇంద్రుడగుటయేకాదు. రాణియు శచియే. తాను స్వర్గము విడిచినను నష్టము లేదు. ఇచ్చట రెండవ స్వర్గము తనకొఱకు ఏర్పడియున్నది. ఇది ఆ స్వర్గమును మఱపింపగలదు.

"అసూయా పరాఙ్ముఖం మంత్రితం" - అసూయ లేకుండ మాట్లాడితివి. రాణి దేవీ శబ్దమునకు అర్హురాలనుటయందు ఉర్వశి యసూయ విడిచి వర్తించినది. ఇది ఆమె సౌశీల్యమునకు గుర్తు.

"ఉపరోధః సహ్యతాం" - నిర్బంధమును సహింపవలెను. మీరేదో అన్యవిషయమునం దాసక్తులయి యుండగా ఈ వ్రత నియమము తెచ్చిపెట్టి మీ వినోదమునకు అంతరాయము కలిగించితిని. దీనిని సహించవలెను- అని రాణి మాటిపోటిగా పలికినది. ఆమెకు తెలియకున్నను ఉర్వశీ పురూరవుల సమాగమమునకు అడ్డు వచ్చినది కదా. రాణి మాట ఉర్వశికి క్షమార్పణగా కూడ పనిచేయును.

"అనుగ్రహః ఖలు" - ఇది యనుగ్రహమే కాని ప్రతిబంధము కాదు. రాణి తనయెడ ప్రసన్నురాలగుట తన యుర్వశీ సంగమము నకు అనుకూలముగా నుండును గనుక ఆమెను సంతోషపెట్టుటకై రాజు నాగరకముగా బల్కినాడు.

పుట 71 : "నిపుణికాం అవేక్షతే"- నిపుణికవంక జూచును. ఈ వ్రతము పేరేమి యని రాజడుగగా అభిమానమువల్ల తాను చెప్ప నిష్టములేక రాణి నిపుణికవంక జూచినది. వ్రతముపేరు అది చెప్పెను.

శ్లో. 18 : అన్వయము : కల్యాణి ! అనేన వ్రతేన మృణాళకోమలం గాత్రం అకారణం గ్లపయసి; యః ఉత్సుకః తవ ప్రసాదం ఆకాంక్షతి సః దాసజనః త్వయా కిం ప్రసాద్యతే.

అర్థము : కల్యాణి=ఓ కల్యాణి; అనేన-వ్రతేన=ఈ వ్రత నియమముచేత; మృణాళ - కోమలం = తామరకాడవలె సుకుమారమైన; గాత్రం=శరీరమును; అకారణం=నిష్కారణముగా; గ్లపయసి=బడల తేయుచున్నావు; యః=ఎవ్వడు; ఉత్సుకః=ఉత్కంఠితుడై; తవ= నీయొక్క; ప్రసాదం=దయను; ఆకాంక్షతి = కోరుచున్నాడో; సః- దాసజనః=ఆ దాసుడు; త్వయా=నీ చేత; కిం = ఏల; ప్రసాద్యతే= ప్రసన్నుడు కావింపబడవలెను.

"దాసజనః"—నేను నీయం దనురక్తుడను. నీవు ఆజ్ఞాపించి నట్లు చేయవలసినవాడను. నీకు కోపము వచ్చినదని నేను ఉత్కంఠ పడుచున్నాను. నన్ను ప్రసన్నుని చేయవలసిన అవసరము లేదు. అందుకొఱకు నీ సుకుమార దేహమును వ్రతనియమములచే ఆయాస పెట్టనక్కఱలేదు.

"ఏతస్యాం బహు మానః"— ఈయనకు ఈమెయందు గొప్ప గౌరవముగదా. రాజు దేవిపట్ల ప్రదర్శించుచున్న గౌరవము చూచి ఉర్వశి ఆశ్చర్యపడినది. ఇట్టివాడు తన్ను నిజముగా ప్రేమించునా యని సంశయపడినది.

"ముగ్ధే"—బేలా ! నిన్ను పొందుటకు రాణి యంగీకారము అవసరము గనుక నాగరకుడైన రాజు రాణిపట్ల ఇంత మన్నన ప్రద

ర్పించుచున్నాడు. నిన్ను గాఢముగా ప్రేమించుట లేదేమోయని శంకిల్లకుము. నిన్ను గాఢముగా ప్రేమించుటవల్లనే రాణియందు ఇంత గౌరవము నటించుచున్నాడు అని చిత్రలేఖ ఉర్వశిని సమాధాన పరచినది.

పుట 72 : "ఏ తావత్ మంత్రితః అర్యపుత్రః"-అర్యపుత్రుడు ఈ మాత్రము పలుకుటకు ఈ వ్రతప్రభావమే కదా కారణము. ఈ నడుమ రాజు రాణితో మాట్లాడుటలేదు. వ్రతసంపాదనము కొఱకు రమ్మనగా రాణి యింటికి వచ్చి యీ మాత్రము మాట్లాడినాడు.

"నయుక్తం సుభాషితం ప్రత్యాచరితుం"- రాణికి ప్రత్యుత్తరముగా రాజు ఏదో చెప్పబోయినాడు. రాణి పలికినది సుభాషితము కనుక దానికి ఎదురు చెప్పుట తగదు అని విదూషకుడు రాజును వారించినాడు. వాని దృష్టి యంతయు మోదకముల మీద నున్నది. సంభాషణవల్ల వృథగా ఆలస్యమగును.

"చంద్రపాదాన్"— పూజార్థమున బహువచనము - పూజ్యులైన చంద్రులను. లేదా చంద్రకిరణములను అనుటకు బదులు పూజార్థమున చంద్రపాదములను అనుట. కిరణములను కరములనుట పరిపాటి. ఇచ్చట పాదములనుట అర్చనకొఱకు. పాదముల నర్చింతురు గాని కరముల నర్చింపరు గదా.

పుట 73 : "అయమస్మి"— ఇట్లనుట రాణియందు గౌరవము చూపుటకు.

"యాం స్త్రియం"— ఏ స్త్రీని – ఆ స్త్రీ ఉర్వశియని రాణికి తెలియును. అచ్చట నున్న అందఱకు తెలియును. కాని ఆ పేరు ఎవ్వరు ఎత్తరు.

ప్రీతిబంధేన వర్తితవ్యం"— సపత్నియని ద్వేషింపక చెల్లెలని, రాజు ప్రియురాలని ప్రేమతో ప్రవర్తింపవలెను.

"కిం పరం"- దేని నుద్దేశించియో - రాణి ఏ స్త్రీని ఉద్దేశించి ప్రతిజ్ఞ చేసినదో ఉర్వశికి తెలియలేదు. రాజునకు తనకు గల ప్రేమ

బంధము రాణికి దెలియునని యుర్వశి ఎఱుగదు. అయినను తన్నుద్దేశించియే రాణి పలికినది. ఉర్వశికి ఏలనో విశ్వాసము కలిగెను.

"పతివ్రతయా"— రాణి మహాపతివ్రత. తనకు అప్రియమైన సంబంధమునకు రాజు ప్రీతికై అంగీకరించినది. ఇంక ఉర్వశీ పురూరవుల సమాగమమునకు అంతరాయము లేదు.

"ధర్మో మే భవిష్యతి"— రాజు మనస్సును ఉర్వశిపైనుండి మరలింపజాలక రాణి తాను పతివ్రతగా ప్రవర్తించినది-అని విదూషకుని పరిహాసము.

"కిం తా దృశః ప్రియః"— అన్యస్త్రీకి అప్పగించి వేయదగినంత ప్రియుడా ఏమి అని రాణిని అధిక్షేపించుట. నన్నేదో ప్రయత్నము చేయుమని నీవే యిట్లు చేసితివేమి? అని వాని భావము.

పుట 74: 'మూఢ'— ఆర్య అనుచుండెడి రాణి యిప్పుడు మూఢ అన్నది. విదూషకుని హాస్యము, అధిక్షేపణము అసంగతములై రాణికి కోపము తెప్పించినవి. నా సుఖమును త్యాగముచేసి రాజునకు సుఖము కలిగించుచున్నాను. మరి ఎంత ప్రియుడో ఆలోచింపుము.

శ్లో॥ 14: అన్వయము: దాసం మాం అన్యస్త్యై దాతుం వా హర్తుం ఏవ వా ప్రభవసి; భీరు! అహం పునః యథా హి త్వం మాం శంకసే తథా న.

అర్థము: దాసం=దాసుడైన; మాం=నన్ను; అన్యస్త్యై=ఇతర స్త్రీకి; దాతుం వా=ఇచ్చుటకుగాని; హర్తుం-ఏవ-వా= తీసికొనుటకేగాని; ప్రభవసి=నీవు సమర్థురాలవు; భీరు=పిరికిదానా; అహం-పునః=నేనుమాత్రము; యథా-హి=ఏ విధముగానైతే; త్వం= నీవు; మాం=నన్ను; శంకసే=శంకించుచున్నావో; తథా=ఆ విధముగా; న=కాదు.

ఇక ముందుసంగతి ఎట్లున్నను ఇప్పటికి మాత్రము నేను నీవు శంకించుచునట్లు అన్యస్త్రీరక్తుడను కాను- అని రాజు తన రహస్యము రాణికి తెలియదన్న నమ్మకతో బొంకుచున్నాడు.

"భవ వా మా వా" కమ్ము కాకపొమ్ము- రాజు కపటముగా ఇప్పటికిని పలుకుట రాణికి నచ్చలేదు. కనుక ఆమె రాజు మాటను లక్ష్యపెట్టక నిర్ణయించుకొన్న ప్రకారము వ్రతము పూర్తి చేసితిని. ఇక పోవుచున్నాను. అని బయలుదేరినది.

"నఖలు ప్రసాదితో౽స్మి"— నేను ప్రసన్నుడను కాలేదు సుమా. ఈ మాటకు రాణి భయపడి యాగిపోవునని రాజు తలచెను.

"అలంఘిత పూర్వో మయా నియమః"—నే నెన్నడును వ్రత నియమము నుల్లంఘించినదానను కాను. లేదా మనస్సులో చేసికొన్న నిశ్చయము నెన్నడు తప్పినదానను గాను. తాను ఆ క్షణమున వెడలి పోవుట వ్రతనియముగా చెప్పి రాణి వెడలిపోయినది

పుట 75 : "ప్రియ కలత్రో రాజర్షిః"- ఈ రాజునకు భార్యయందు మిక్కలి ప్రేమ - ఆ భార్యాభర్తల యనురాగమునకు తాను అడ్డువచ్చు వచున్నందుకు కొంచెము విచారపడినది కాని తాను రాజును వదలజాలదు.

"వైద్యేన ఆతురః ఇవ"— కుదుర్చరానివాడని వైద్యుడు రోగిని విడిచిపెట్టినట్లు రాణి నిన్ను లాభములేదని వదలిపెట్టినది. ఇంక నిర్భయముగా చెప్పదలచినది చెప్పుము. రాణి మీద విసిరినట్లే రాజు మీద కూడ విదూషకుడొక విసురు విసిరినాడు. రాజు మరల ఉర్వశి ప్రసంగములో పడినాడు.

"అపినామ ఉర్వశీ"— ఉర్వశియే గనుక వచ్చినచో ఎంత బాగుండును.

శ్లో॥ 15 : అన్వయము : కాంతా గూఢా (సతీ) నూపుర శబ్ద మాత్రం అపి మే శ్రుతౌ పాతయేత్; పశ్చాత్ శనైః ఏత్య లోచనే కరాంబుజ వృతే వా కుర్వీత; అస్మిన్ హర్మ్యే అవతీర్య సాధ్వస వశాత్ మందా యమానా చతురయా సఖ్యా మమ ఉపాంతికం పదాత్ పదం బలాత్ అనీయేత.

అర్థము : కాంతా=ఆ సుందరి; గూఢా=రహస్యముగానుండి; నూపుర శబ్దమాత్రం + అపి-కాలి యందె చప్పుడైనను; మే= నా యొక్క; శ్రుతౌ = చెవియందు; పాతయేత్ = పడవేయవలయును; పశ్చాత్ = తరువాత, వెనుకగా; శనైః = మెల్లగా; ఏత్య = వచ్చి; లోచనే=రెండు కన్నులను; కర + అంబుజ . వృతే - వా = తామర పూవులవంటి చేతులతో కప్పబడినవానినిగానైన; కుర్వీత = చేయ వలెను; అస్మిన్ - హర్మ్యే=ఈ భవనముమీద; అవతీర్య=దిగి; సాధ్వస వశాత్=పిరికితనమువలన; మందాయమానా = వెనుకాడుచున్నదై, కదలజాలనిదై; చతురయా=నేర్పరియైన; సఖ్యా = చెలికత్తెచేత; మమ=నాయొక్క; ఉపాంతికం = సమీపమునకు; పదాత్ = అడుగు వెంట; పదం=అడుగుగా; బలాత్=బలవంతముగా; ఆనీయేత=తీసి కొని రాబడవలెను.

"తావత్ అస్య మనోరథం సంపాదయిష్యామి"- ఇంక ఈయన కోరికను తీర్చెదను. రాణి యనుజ్ఞయైనది గనుక ఉర్వశి యిప్పుడు రాజును సంతోషపెట్టగలదు. ఉర్వశీ పురూరవుల సంయోగమునకు గావలసిన పరిస్థితులన్నియు సమకూడినవి; అంతరాయము లన్నియు తొలగినవి. యథేచ్ఛగా ఆయనతో భోగింపవచ్చును.

"నారాయణోరు సంభవా"- ఉర్వశిని 'వరోరూః' అని రాజు నిర్దేశించెను. వెనుకనుండి కన్నులను మూయునప్పుడు ఆయన చేతులు వెనుకకు మలచి యామెను పట్టుకొనుటలో ఆమె ఊరువులు ఆయన చేతులకు తగిలియుండును. అందమైన ఊరువులు గల ఆమెను నారా యణుని యూరువునుండి పుట్టినది అనుట రమ్యముగా నున్నది.

శ్లో. 16: అన్వయము : అనంగ క్లిష్టం మే అంగం అన్యా కరస్పర్శాత్ న సుఖయేత్; కుముదం చంద్రస్య అంశుభిః ఇవ తపనకిరణైః న ఉచ్ఛ్వసితి.

అర్థము : అనంగ-క్లిష్టం=మన్మథపీడితమైన; మే=నాయొక్క; అంగం=శరీరమును; అన్యా=ఇతర స్త్రీ; కర-స్పర్శాత్ = కరస్పర్శ వలన; న - సుఖయేత్ = సుఖంపజేయజాలదు; కుముదం = కలువ;

చంద్రస్య = చంద్రునియొక్క; అంశుభిః_ఇవ = కిరణములచేతవలె; తపన - కిరణైః=సూర్యుని కిరణములచేత: న - ఉచ్ఛ్వసితి = వికసింపదు గదా.

మదన పీడితమైన తన శరీరమును తన ప్రియురాలు మాత్రమే కరస్పర్శచేత సుఖపెట్టగలదు. కనుక తన్ను సుఖపెట్టిన ఆ కరస్పర్శ ఉర్వశిదే అని రాజు ప్రియాస్పర్శజ్ఞానమును నిరూపించెను. ప్రథమాంకమున ఆమె యంసము తగులుటవల్ల, ద్వితీయాంకమున ఆమెను చేయిపట్టుకొని కూర్చుండ బెట్టుటవల్ల రాజునకు ఉర్వశి స్పర్శ యెట్లుండునో అనుభవమైనది.

పుట 77 : "ఏకాసనే ఉపవేశయతి"— రాజుతో ఏకాసనమున గూర్చుండ దగినది రాణి. ఉర్వశికి పురూరవభార్యాత్వము సిద్ధించినది.

"అపిసుఖం వయస్యస్య"— ఉర్వశి కనిపించిన తరువాతనే చిత్రలేఖ కనిపించినది. ఇది వఱకు చిత్రలేఖయే ముందుండి ఉర్వశి బదులు మాట్లాడుచుండెడిది. ఇప్పుడు చిత్రలేఖకంటె ముందే వచ్చి ఉర్వశి స్వయముగా వ్యవహరించు కొనుచున్నది. చిత్రలేఖ బాధ్యత తీరిపోయినది. కనుక ఆమె యిప్పుడు రాజును 'వయస్య'- మిత్రుడా అనుచున్నది. ఇది వఱకు 'మహారాజ' అనుచుండెడిది.

"నను ఏతత్ ఉపపన్నం"- ఇదిగో లభించినదిగదా. ఉర్వశియే రాజు సుఖము. ఆమె లభించుట సుఖము లభించుట.

"పురోభాగినీం"— స్వతంత్ర ప్రవర్తనగల దానినిగా. నేను స్వతంత్రించి రాజు ప్రక్కన కూర్చుండ లేదు. రాణి యనుమతియైనది గనుక కూర్చుంటిని అని ఉర్వశి నలువుర ఎదుటనే రాజు ప్రక్కన కూర్చుండుటను సమర్థించుకొను చున్నది.

"యువయోః అస్తమితః సూర్యః"— సూర్యాస్తమయము నకు ముందు నుండియు మీ రిచ్చటనే యున్నారా ? అని విదూషకుని ప్రశ్న. దేవిచే వొసంగబడివాడు - అని యుర్వశి యన్నమాటను బట్టి

రాణి రాకపూర్వము నుండియే ఉర్వశీ చిత్రలేఖలు అచ్చట నుండిరని వాని భావము.

శ్లో॥ 17 : అన్వయము : దేవ్యా దత్తః ఇతి అస్మిన్ మే శరీరే వ్యాపారం వ్రజసి యది, కస్య అనుమతే పతత్ హృదయం త్వయా ప్రథమం చోరితం ?

అర్థము : దేవ్యా=రాణిచేత; దత్తః=దానము చేయబడినాడు; ఇతి=అని; అస్మిన్=ఈ; మే=నా యొక్క; శరీరే=శరీరమునందు; వ్యాపారం=వ్యవహారమును, ఉపయోగమును; వ్రజసి - యది = పొందుచున్న దానవైనచో; కస్య=ఎవరియొక్క; అనుమతే=అంగీకృతమైన దానియందు; పతత్=ఈ; హృదయం=హృదయము; త్వయా=నీ చేత; ప్రథమం=మొదట; చోరితం=అపహరింపబడినది.

పుట 78 : 'ఉష్ణసమయే'— గ్రీష్మమునందు - గ్రీష్మఋతువున చిత్రలేఖ సూర్యుని ఉపచరింపవలెనట.

కృతస్థలి, పుంజికస్థలి, మేనక, సహజన్య, ప్రమ్లోచ, అనుమ్లోచ, ఘృతాచి, విశ్వాచి, ఉర్వశి, పూర్వచిత్తి, తిలోత్తమ, రంభ - ఈ పండ్రెడుగురు అప్సరలలో ప్రధానలు. వీరు క్రమముగా చైత్రమాసము మొదలుకొని నెలకొకర్తె చొప్పున సూర్యుని సేవింతురు. వీరిలో చిత్రలేఖ పేరులేదు. గ్రీష్మమున సేవించువారు మేనక, సహజన్య. ఒకవేళ ఉర్వశి బదులు చిత్రలేఖ సేవింపబోవునని తలంచినను ఉర్వశివంతు హేమంతమున వచ్చునుగాని గ్రీష్మమున కాదు. నాటక ప్రయోజనము కొఱకు కాళిదాసు చిత్రలేఖకు గీష్మమున సూర్యసేవ కల్పించెను.

"కిం వా స్వర్గే స్మర్తవ్యం"— స్వర్గమున స్మరింపదగినదేమున్నది ? ఉర్వశి స్వర్గమునుగూర్చి బెంగపడకుండ చూడుము అని చిత్రలేఖ రాజును కోరగా విదూషకు డిట్లనినాడు. స్వర్గమందేమున్నది ? తినుటలేదు, త్రాగుటలేదు. ఊరక అనిమిష నేత్రములతో చేపలవలె చూచు చుండుటయే కదా. దేవతలు అమృతము త్రాగి జీవింతురు. నిరంతరము తినుట త్రాగుటలేదు. వారికి రెప్ప

పాటు లేదు. ఇట్టి స్వర్గము విదూషకునకు వచ్చులేదు. ముఖ్యముగా వానికి కావలసిన భోజన పానని(ద్రలు లేవు గదా.

శ్లో॥ 18 : అన్వయము : స్వర్గః అనిర్దేశ్య సుఖః; తం కః విస్మారయిష్యతి ? అనన్య నారీ సామాన్యః పురూరవాః తు అస్యాః దాసః.

అర్థము : స్వర్గః=స్వర్గము; అనిర్దేశ్య - సుఖః=వర్ణింపశక్యము గాని సుఖముగలది; తం = దానిని; కః=ఎవ్వడు; విస్మారయిష్యతి= విస్మరింప జేయగలడు; అనన్య - నారీ - సామాన్యః = అన్యస్త్రీలకు లభ్యము కానట్టి; పురూరవాః - తు = పురూరవుడు మాత్రము; అస్యాః=ఈమెకు; దాసః=దాసుడు.

అనిర్వచనీయ సుఖస్థానమైన స్వర్గమును నేను మఱపింప గలనా ? అయినను అన్యస్త్రీలను స్మరింపక నిరంతరము నేనీమెకు దాసుడనై యుందును. ఇంత మాత్రము నేను వాగ్దానము చేయ గలను. అని పురూరవుడు వినయముతో, మితముగా సమాధానము చెప్పెను.

పుట 79 : "ఇయం తావత్ వృద్ధిః మమ"- ఇదిగో ఇదియే - ఈమె లభించు టయే - నాకు నా వృద్ధి. అప్సరశ్శిరోమణియైన యుర్వశి ఏ రాజు నకును లభింపదు. అట్టిది లభించుటకన్న గొప్ప యభ్యుదయము ఏ ముండును.

శ్లో॥ 19 : అన్వయము : సఖే! సామంత మౌళి మణిరంజిత శాసనాంకం - ఏకాత పత్రం అవనేః ప్రభుత్వం అధిగమ్య అహం తథా కృతార్థః నః యథా అద్య అస్యాః చరణయోః కాంతం ఆజ్ఞాకరత్వం అధిగమ్య కృతార్థః.

అర్థము : సఖే=చెలికాడా; సామంత-మౌళి-మణి - రంజిత - శాసన + అంకం=సామంతరాజుల యొక్క శిరస్సులందలి మణులచేత రంజితమైన శాసన చిహ్నములు గల; ఏక + ఆతపత్రం = ఏకచ్ఛత్ర మైన; అవనేః = భూమియొక్క; ప్రభుత్వం = పాలకత్వమును; అధిగమ్య=పొంది; అహం=నేను; తథా=అ విధముగా; కృతార్థః=

న = ధన్యుడనుకాలేదు; యథా = ఏ విధముగా; అద్య = ఇప్పుడు; అస్యాః=ఈమెయొక్క; చరణయోః=పాదములయొక్క; కాంతం= మనోహరమైన; ఆజ్ఞాకరత్వం=పరిచారకత్వమును; అధిగమ్య=పొంది; కృతార్థః=కృతార్థుడనైతినో.

"విరుద్ధార్థసంపాదయితా"— ఈప్సితలాభము విరుద్ధమైన ఫలమును సంపాదించునది. కోరినవస్తువు దొరికినప్పుడు కష్టము సుఖముగా మారును.

శ్లో॥ 20 : అన్వయము : తే ఏవ శశినః పాదాః గాత్రం సుఖయంతి; తే ఏవ మదనస్య బాణాః మమ అనుకూలాః; సుందరి! యత్ యత్ సంరంభరూక్షం ఇవ ఆసీత్ తత్ తత్ త్వత్సంగమేన మమ అనునీతం ఇవ.

అర్థము : తే-ఏవ=అవియే: శశినః=చంద్రునియొక్క;పాదాః—కిరణములు ; గాత్రం=శరీరమును, సుఖయంతి = సుఖపెట్టుచున్నవి; తే-ఏవ=అవియే; మదనస్య=మన్మథునియొక్క; బాణాః=బాణములు; మమ=నాకు; అనుకూలాః=అనుకూలములగుచున్నవి; సుందరి = ఓ సుందరి; యత్-యత్=ఏది యేది; సంరంభ-రూక్షం-ఇవ=కోపముచే పరుషమైనదానివలె; ఆసీత్=ఉండెనో; తత్-తత్=అది యది; త్వత్-సంగమేన=నీ సంగమముచేత; మమ=నాకు; అనునీతం-ఇవ=శాంతించినదివలె అయినది.

వియోగదశయందు దుఃఖకరములైనవన్నియు సంయోగదశయందు సుఖకరములుగా పరిణమించినవి. ఈప్సితార్థలాభము ఇట్లు వ్యతిరేకఫలములను సమకూర్చును.

పుట 80 : "చిరకారికా"- ఆలస్యముచేయునది. నీ సంయోగము పొందుటకు ఆలస్యముచేసి నేను నీపట్ల అపరాధముచేసినాను. ఉర్వశి పురూరవునకు భార్యయైనప్పటికిని ఆమె రాజును 'మహారాజ' అనునేకాని 'ఆర్యపుత్ర' అనదు. రాజు ఆమెను 'ప్రియే' 'ఉర్వశి' అనునే కాని 'దేవి' అనడు. ఉర్వశీపురూరవులు దంపతులేయైనను వారి సంబంధము విలక్షణమైనదిగా గనబడుచున్నది.

శ్లో॥ అన్వయము: దుఃఖాత్ ఏవ యత్ సుఖం ఉపనతం తత్ రసవత్తరం; తరుచ్ఛాయా త ప్తస్య విశేషతః నిర్వాణాయ హి.

అర్థము: దుఃఖాత్ + ఏవ=దుఃఖమువలననే; యత్ - సుఖం= ఏ సుఖము; ఉపనతం=పొందబడినదో; తత్=ఆ సుఖము; రసవత్తరం= మిక్కిలి యానందకరము; తరుచ్ఛాయా = చెట్టునీడ; త ప్తస్య = తాపము పొందినవానికి, విశేషతః=విశేషముగా; నిర్వాణాయ-హి = సుఖము కొఱకు అగును గదా.

"సఖ్యాః తే"- నీ మిత్రురాలికి. ఉర్వశి విదూషకునకు రాణి కాదు. కేవలము మిత్రురాలు-మిత్రుని ప్రియురాలు.

శ్లో॥ 22: అన్వయము: సుభ్రు! పూర్వం అనుపగత మనోరథస్య మమ త్రియామా శతగుణితా ఇవ గతా; కింతు తవసమాగమే తథా ఏవ ప్రసరతి యది, తతః కృతీ భవేయం.

అర్థము: సుభ్రు=అందమైన కనుబొమలు కలదానా; పూర్వం= ఇదివఱకు; అనుపగత-మనోరథస్య=పొందబడని కోరికలుగల; మమ= నాకు; త్రియామా=మూడు యామములుగల రాత్రి; శత-గుణితా- ఇవ = నూరురెట్లయినదా యన్నట్లు; గతా=గడచినది; కింతు=కాని; తవ=నీయొక్క; సమాగమే=సంయోగమునందు; తథా + ఏవ = అట్లే; ప్రసరతి - యది=జరుగునదియైనచో; తతః=అప్పుడు; కృతీ = ధన్యుడను; భవేయం=కాగలను.

ఇష్టవస్తుప్రాప్తి విరుద్ధఫలము గలిగించునని యిదివఱకు రాజు సంతోషించెను. రాత్రి విషయము మాత్రము అట్లు కాగూడదని యిప్పుడు కోరుకొనుచుండెను. ఇదివఱకు మూడు యామములుగల రాత్రి మూడువందల యామములవలె గడచెను. ఇప్పుడు కూడ అట్లే గడువలెనని రాజు కోరిక.

———

# చతుర్థాంకము

"ప్రావేశికీ ఆక్షిప్తికా" - పాత్రప్రవేశమును సూచించుచు తెరలో నుండి వివిధ రాగతాళములతో గానము చేయబడు గీతి విశేషము. ప్రవేశించుపాత్రల యవస్థను వర్ణించు గీతము తెరలోనుండి పాడబడుచుండగా పాత్రలు ప్రవేశించును. పాత్రలయొక్క ప్రవేశము, అవస్థ, నిష్క్రమణము మున్నగు వానిని సూచించు స్వరతాళసహితములై ఛందోబద్ధములైన గీతములకు ధ్రువలు అని పేరు. ఈ యంకమున అట్టివి పెక్కు ఉపయోగింపబడినవి. ప్రవేశము సూచించునది ప్రావేశికి. అన్యార్థమును ఆక్షేపించునది ఆక్షేపికి. ఇట రెండును కలిసినవి.

శ్లో. 1 : అన్వయము : సూర్యకరస్పర్శ వికసిత తామరసే సరోవరోత్సంగే ప్రియసఖీ వియోగ విమనాః వ్యాకులా సఖీసహితా హంసీ సఖీం సముల్లపతి.

అర్థము . సూర్య-కర - స్పర్శ - వికసిత-తామరసే=సూర్యుని యొక్క కిరణములయొక్క స్పర్శచే వికసించిన తామరపూవులుగల; సరోవర + ఉత్సంగే=సరోవరముయొక్క తీరమున; ప్రియ - సఖీ - వియోగ-విమనాః=ప్రియమైన చెలికత్తెతోడి యెడబాటువలన ఖిన్నమైన మనస్సుగలదై; వ్యాకులా = విహ్వలమై; సఖీ-సహితా = చెలికత్తెతోగూడినదైన; హంసీ = ఆడుహంస; సఖీం = చెలికత్తెతో; షముల్లపతి = విలపించుచున్నది.

ఉర్వశీ వియోగ దుఃఖితయైన చిత్రలేఖ సహజన్యాసహితయై విలపించుట ఆడుహంసల పరముగా ప్రతిపాదింపబడినది. ఈ గీతము ముగియుచుండగా చిత్రలేఖ, సహజన్య ప్రవేశింతురు. ద్విపదిక యను గీతము పాడబడుచుండగా దిక్కులు తిలకింతురు. ధ్రువలయందు ఉత్తమస్త్రీలకు హంసి, కరిణి మున్నగునవి ఉపమానములుగా ఉండ

వలెనని భరతముని యుపదేశించెను. కాళిదాసు ఆ యుపదేశము ననుసరించెను.

శ్లో. 2: అన్వయము. సహచరీ దుఃఖాలీఢం స్నిగ్ధం భాష్పావగ్లిత నయనం హంసీయుగళం సరోవరే తామ్యతి.

అర్థము: సహచరీ-దుఃఖ + ఆలీఢం = చెలికత్తెను గూర్చిన దుఃఖముచేత ఆక్రమింపబడినది; స్నిగ్ధః = స్నేహాయుక్తమైనది; బాష్ప + అవగ్లిత - నయనం=కన్నీటిచే నిండిన కన్నులుగలది అయిన హంసీ-యుగలం=ఆడుహంసల జంట; సరోవరే = సరోవరమునందు; తామ్యతి=తపించుచున్నది.

ఈ గీతము కూడ నేపథ్యముననే గానము చేయబడును.

"సమదుఃఖా భవితుం"-సమానమైన దుఃఖము గలదియగుటకు-దుఃఖమును పంచుకొనుటకు.

పుట 83: "అప్సరో వార పర్యాయేణ"- అప్సరసల సమూహము యొక్క వంతు ననుసరించి - సూర్యుని సేవించు వంతు చిత్రలేఖకు లేదు; సహజన్యకు కలదు. ఆమెతో కలిసి చిత్రలేఖ ఆ పని చేయుచున్నదని భావింపవలెను.

"ఏతేషు దివసేషు"- ఈ దినములలో - చిత్రలేఖ ఉర్వశిని రాజువద్ద విడిచివచ్చినది వైశాఖమున. ఇప్పుడు నవ మేఘోదయము కాబోవుచుండుట ముందు తెలుపబడునుగనక కాలము ఆషాఢమాస మని భావింపవలెను. ఈ కడచిన దినములలో ఉర్వశీ పురూరవుల ప్రవర్తన యెట్లుండెనో తెలిసికొనవలెనని చిత్రలేఖ యోగదృష్టితో చూచినది. ప్రణిధానము=సమాధి, ధ్యానము.

"రతి సహాయం"- రతియుక్తుని, కామావేశము గలవానిని; "గంధమాదనం"- కైలాస పర్వతశిఖర సమీపమునగల ఒక పర్వతము. అందలి యుద్యానమున గౌరీ శంకరులు విహరింతురు. ఆ యుద్యానవనమందలి గంధము మత్తుగలిగించునది గనుక దానికి గంధమాదనము అని పేరు. నందనమున విహరింప వీలు లేనందున

ఉర్వశి పురూరవుని గంధమాదనమునకు దీసికొనిపోయినది. "పరి వర్తితమివ కైలాసం" అని రాజ భవనమును వర్ణించుట ఈ గంధ మాదన విహారమునకు ఉపోద్ఘాతము.

పుట 84 : "విద్యాధరదారికా"- విద్యాధరులు అను దేవజాతికి సంబంధించిన బాలిక. ఇసుక కుప్పలతో ఆడుకొనుచుండుటచే మిక్కిలి చిన్నపిల్ల యనియు, ఆమె ఆటయందు ముచ్చటపడి పురూరవుడు ఆ పిల్లవంక చాలసేపు చూచెననియు భావింపవలెను. రాజు కామముతో చూచెనని ఉర్వశి కోపము తెచ్చుకొన్నది. తనతో క్రీడింపవచ్చి ఈ పిల్లదానిని చూచుట యేమి అని ఆమె కోపము కావచ్చును.

"దూరారూఢః ఖలు ప్రణయః అసహనః"-గాఢముగా నాటు కొనియున్న యనురాగము అసహనశీలముగా నుండునుగదా యని సహజన్య ఉర్వశి కోపమును సమర్థించుచున్నది. తనతో క్రీడించుట తప్ప రాజు ఇతర విషయమును దేనిని పట్టించుకొనగూడదని ఉర్వశి యభిప్రాయము.

"గురుశాప సమ్మూఢహృదయా"- భరతముని శాపమువల్ల ఉర్వశి తెలివి నశించినది. దేవతానియమమును మఱచిపోయినది. కుమారస్వామి బ్రహ్మచర్య మవలంబించి తపస్సు చేయుచున్న వన మును స్త్రీలు ప్రవేశింపరాదని తెలిసియు మఱచిపోయి, కోపావేశ ముతో ప్రవేశించినది.

"పరిణతం అస్యాః రూపం"- ఆమె రూపము మారిపోయినది. ఉర్వశి రూపము మాత్రమే లతగా మారిపోయినది. తీగెరూపము పొందినను ఆమె ఉర్వశియే. అన్నియు చూడగలదు, వినగలదు. ఇంద్రియములశక్తి నశించలేదు.

"నాస్తి విధేః అలంఘనీయం నామ"— విధికి దాటరాని దన్నది ఏదియు లేదుగదా. విధియేదైనను చేయగలదు. ఇంత ప్రేమ గల వారిని ఇట్లు వేఱు పఱచి దుఃఖపెట్టరాదు. ఈ నియమమును గూడ విధి ఉల్లంఘించినది. పురూరవుడు ఒక బాలికవంక చూచెనని ఉర్వశి కోపము తెచ్చుకొనుట, కోపావేశమున ఒడలు తెలియక,

బుద్ధి మాంద్యము కలిగి కుమారవనమున ప్రవేశించుట, లతగామారి పోవుట – ఇది యంతయు విధి నిర్ణయము. నాటక కథాగతిని నిర్ణయించు విధి కవియే.

పుట 85 : "మేఘోదయేన" — మేఘోదయము కామమును ఉద్దీపింపచేయును. ఉర్వశీ విరహముచే రాజు ఇప్పటికే బాధపడుచున్నాడు. ఈ మేఘోదయమువల్ల ఇంకెంత దుఃఖపడునో! విరహముచే ఉన్మత్తుడైన పురూరవుని ప్రవేశమునకు, ప్రవర్తనకు ఇది సూచన.

అప్పుడు తెరలో జంభలిక యను గీతిభేదము గానము చేయబడును. చిత్రలేఖా సహజన్యలు దుఃఖాతిశయమును అభినయింపవలెను.

శ్లో. 3 : అవిరల - బాష్ప - జల + ఆర్ద్రం = ఎడతెగని కన్నీటిచే తడిసినది. (తక్కిన భాగము 2వ శ్లోకము వలెనే) ఇది సహజన్యా చిత్రలేఖల దుఃఖావస్థను సూచించు ఆక్షేపికీధ్రువ.

"సంగమమణి"— ఎడబాటుపొందిన వారికి సంగమమును సమకూర్చు దివ్యమణి విశేషము.

"ఆకృతి విశేషాః" — సుందరమైన యాకారములుగలవారు చిరకాలము దుఃఖ భాజనులు కారు.

"కుర్వః"— అనుటవల్ల ఇరువురును కలిసి సూర్యుని సేవింతురని గ్రహింపవలెను. ఉర్వశీ విరహ దుఃఖమును మఱచుటకై చిత్రలేఖ సహజన్యతో కలిసి సూర్యుని ఉపచరించుచున్నదని భావింపవలెను.

పుట 86 శ్లో. 4 : అన్వయము : చింతాదూనమానసా సహచరీదర్శనలాలసా హంసీ వికసితకమలమనోహరే సరోవరే విహరతి.

అర్థము : చింతా - దూన - మానసా = దుఃఖముచే తపించుచున్న మనస్సుగలది; సహచరీ - దర్శన - లాలసా=చెలికత్తెయొక్క దర్శనమందు ఆసక్తిగలది అయిన; హంసీ=హంసి; వికసిత - కమల - మనోహరే=వికసించిన కమలములచే రమ్యమైన; సరోవరే=సరస్సునందు; విహరతి=తిరుగు చున్నది.

ఈ ఖండధారాగీతి సహజన్యా చిత్రలేఖల నైష్క్రామికీ ధ్రువ. ఇరువురును ప్రాకృతము మాట్లాడు స్త్రీలుగనుక ఇది ప్రవేశకము.

శ్లో॥ ౬. అన్వయము : ప్రియావిరహోన్మాద ప్రకటిత వికారః తరు కుసుమ కిసలయ భూషితనిజ దేహప్రాగ్భారః గజేంద్రనాథః గహనం ప్రవిశతి.

అర్థము : ప్రియా-విరహ + ఉన్మాద - ప్రకటిత - వికారః= ప్రియురాలి యెడబాటు వలన గలిగిన ఉన్మాదముచే ప్రకటింపబడిన వికారములు గలది; తరు-కుసుమ - కిసలయ-భూషిత - నిజ - దేహ-ప్రాగ్భారః = వృక్షముల పూలచే చిగుళ్లచే అలంకరింపబడిన తన శరీరము యొక్క ముందు భాగముగలదియైన; గజ + ఇంద్ర-నాథ= గజరాజము; గహనం=అరణ్యమును; ప్రవిశతి=ప్రవేశించుచున్నది.

ఇది పురూరవుని ప్రావేశికీ ధ్రువ. అన్యార్థమును సూచించుచున్నది గనుక ఆక్షేపికి. ఉత్తమ నాయకుడు గనుక మత్తగజ సాదృశ్యము చెప్పబడినది. తెరలో ఈ గీతము పాడుట ముగియుచుండగా ఉన్మత్త వేషముతో పురూరవుడు ప్రవేశించును.

"ఆః దురాత్మన్! రక్షః! తిష్ఠ తిష్ఠ"— ఓరీ దురాత్మా! రాక్షసుడా! నిలు నిలు - ప్రథమాంకమున కేశియను రాక్షసుడు ఉర్వశిని ఎత్తుకొని పోయెను గదా. ఇప్పుడు ఉర్వశి కనబడనందున అహోరాత్రములు వెదకి వెదకి మతిపోయిన పురూరవుడు ఇప్పుడును ఉర్వశిని ఎవ్వడో రాక్షసుడు ఎత్తుకొని పోవుచున్నట్లు భావించినాడు. ఆ నాడు తాను కేశిని తరుముచు కేకవైచినట్లే ఇప్పుడు 'నిలు నిలు' మనుచున్నాడు.

"బాణైః మా మభివర్షతి"- బాణములతో నా మీద వర్షించుచున్నాడు. ఒడలు సగము తెలిసియు తెలియని స్థితియందలి మాటయిది. రాక్షసుడన్న భ్రాంతిచే బాణములన్న భ్రాంతి. కాని మీదపడుచున్నవి నీటిబిందువులు గనుక 'వర్షతి' అన్న ప్రయోగము.

పుట 87 : "లోష్టం గృహీత్వా"- మట్టి గడ్డ తీసికొని-రాజువద్ద విల్లంబులు లేవు. ప్రియురాలితో విహరింప వచ్చెను గదా. కనుక మట్టి గడ్డతో కొట్టబోయెను.

శ్లో॥ 6 : అన్వయము : హృదయాహితప్రియాదుఃఖః ధుతపక్షః వ్యాధావ వల్గిత నయనః హంసయువా సరోవరే తామ్యతి.

అర్థము : హృదయ + అహిత - ప్రియా - దుఃఖః = హృదయము నందుంచబడిన ప్రియురాలి సంబంధమైన దుఃఖముగలది; ధుత - పక్షః = కదలింపబడిన ఱెక్కలు గలది; వ్యాధ - అవవల్గిత - నయనః = కిరాతునిచే పీడింపబడిన కన్నులుగలదియైన; హంస యువా = యువ హంసము; సరోవరే = సరోవరమున; తామ్యతి = తపించుచున్నది.

తన ప్రియురాలిని అపహరించుచున్న రాక్షసుడని భ్రమింపబడిన మేఘమును జూచి విచారపడుచున్న పురూరవుడు ప్రియురాలిని హరించిన వ్యాధుని జూచి దుఃఖించు యువ హంసముగా రూపింపబడినాడు. ఈ ద్విపదికాగీతి తెరలో నుండి వినబడుచుండగా రాజు దిక్కులు చూచి తాను రాక్షసుడని భ్రమించినది మేఘమని తెలిసికొని దుఃఖావేశము పొంది రోదించును.

శ్లో॥ 7 : అన్వయము : అయం సన్నద్ధః నవజలధరః, దృప్తనిశాచరః న; ఇదం దూరాకృష్టం సురధనుః. శరాసనం నినామ; అయం అపి పటుః ధారాసారః, బాణపరంపరా న; కనకనికషస్నిగ్ధా విద్యుత్, మమ ప్రియా ఉర్వశీ న.

అర్థము : అయం = ఇది; సన్నద్ధః = సిద్ధమైన; నవ - జలధరః = క్రొత్త మేఘము; దృప్త - నిశాచరః = దర్పించిన రాక్షసుడు; న = కాదు; ఇదం = ఇది; దూర + ఆకృష్టః = దూరముగా లాగబడిన; సురధనుః ఇంద్రధనువు; శరాసనం = విల్లు; న నామ = కాదుకాబోలు; అయం - అపి = ఇదికూడ; పటుః = తీవ్రమైన; ధారా + అసారః = ధారావర్షము; బాణ - పరంపరా = బాణములవరుస; న = కాదు; కనక - నికష - స్నిగ్ధా = బంగారు ఒరపిడిగీటువలె మెఱయుచున్న యిది; విద్యుత్ = మెఱపుతీగె; మమ = నా యొక్క; ప్రియా = ప్రియురాలైన; ఉర్వశీ = ఉర్వశి; న = కాదు.

శోకావేగమున మూర్ఛిల్లిపడి మరల తెరలో 'హృదయాహిత' ఇత్యాది ద్విపదికాగీతము వినిపించుచుండగా లేచి నిట్టూర్చును.

శ్లో॥ 8: అన్వయము : నవతడిత్ శ్యామలః ధారాధరః యావత్ వర్షతి కః అపి నిశాచరః మృగలోచనాం హరతి (ఇతి) మయా జ్ఞాతంను.

అర్థము : నవ-తడిత్ = క్రొత్త మెఱుపుగలది; శ్యామలః = నల్లనిదియైన; ధారాధరః=వర్షామేఘము; యావత్-వర్షతి=వర్షించుచుండగా; కః-అపి = ఎవ్వడో; నిశాచరః = రాక్షసుడు; మృగ-లోచనాం=లేడి కన్నులవంటి కన్నులుగల ఊర్వశిని; హరతి = ఎత్తుకొనిపోవుచున్నాడు (ఇతి=అని); మయా=నా చేత; జ్ఞాతం-ను=తలచబడనదికాబోలును.

పుట 33: "సకరుణం విచింత్య"- దీనముగా ఆలోచించి.

శ్లో॥ 9: అన్వయము : కోపవశాత్ ప్రభావపిహితా తిష్ఠేత్, సా దీర్ఘం న కుప్యతి; స్వర్గాయ ఉత్పతితా భవేత్, పునః అస్యాః మనః మయి భావార్ద్రం; విబుధద్విషః అపి చ మే పురోవర్తినీం తాం హర్తుం న శక్తాః, సా చ నయనయోః అత్యంతం అదర్శనం యాతా ఇతి కః అయం విధిః.

అర్థము : కోపవశాత్ = కోపకారణమువలన; ప్రభావ-పిహితా=దివ్యశక్తిచే అంతర్హితయై; తిష్ఠేత్=ఉండవచ్చును; కాని; సా=ఆమె, దీర్ఘం=చిరకాలము, న-కుప్యతి=కోపింపదు; స్వర్గాయ=స్వర్గము కొఱకు; ఉత్పతితా=ఎగిరిపోయినది; భవేత్=కావచ్చును; పునః = కాని; అస్యాః=ఈమెయొక్క; మనః = మనస్సు; మయి = నా యందు; భావ + అర్ద్రం=ప్రేమ మృదులము; విబుధ-ద్విషః = రాక్షసులు; అపి-చ=కూడను; మే=నా యొక్క; పురః + వర్తినీం= ఎదుటనున్న; తాం=ఆమెను; హర్తుం=అపహరించుటకు; న-శక్తాః= సమర్థులుకారు; సా-చ = మరి ఆమె; నయనయోః = కన్నులకు; అత్యంతం = పూర్తిగా; అదర్శనం=అగోచరత్వమును; యాతా = పొందినది; ఇతి=అను; కః=ఏమి; అయం=ఈ; విధిః = విధానము, దైవనిర్ణయము.

ఊర్వశీ పురూరవుల నడుమ పెక్కువర్యాయములు ప్రణయ కలహములు జరిగియుండును. అప్పుడప్పుడు ఆమె అదృశ్యయై

ఆయనను బాధపెట్టి యుండును. కాని యెన్నడు నింత దీర్ఘకాలము ఆమె కోపము పూని యుండలేదు. రాజు దీనముగా ఏమియు తోచక చింతించి మూర్ఛిల్లు చున్నాడు.

"పరాప్తే త్ర భాగధేయానాం....."— అదృష్టము మారిన వారికి దుఃఖము వెంట దుఃఖము వచ్చును. చిత్రలేఖ యూహించి నట్లుగా అసలే విరహ దుఃఖితుడు, ఆ మీద నవమేఘోదయము.

శ్లో॥ 10 : అన్వయము : ఏకపదే తయా ప్రియయా అయం సుదుస్సహః వియోగః చ మే ఉపనతః; నవవారిధరోదయాత్ అహోభిః నిరాత పర్ధిరమ్యైః చ భవితవ్యం.

అర్థము : ఏకపదే = ఆకస్మికముగా; తయా - ప్రియయా= ఆప్రియురాలితో; అయం= ఈ; సుదుస్సహః=మిక్కిలి భరింపరాని; వియోగః - చ=వియోగముకూడ; మే=నాకు; ఉపనతః=ప్రాప్తించినది; నవ - వారిధర + ఉదయాత్= క్రొత్తదైన మేఘముయొక్క పుట్టుకవల్ల; అహోభిః = పగళ్లు; నిరాతప + ఋద్ధి-రమ్యైః = ఎండ తీవ్రత లేనందున రమణీయములుగా కూడ; భవితవ్యం=కానున్నవి.

తరువాత చర్చరీగీతి. ఇది ద్రుత మధ్యలయాశ్రయముగా ప్రేమభారమున నటిచే గానము చేయబడును ఒక చర్చరీభేదమునకు రాసము అనిపేరు. రాజు నర్తించుచు ఈ గీతము పాడెనని భావింపవలెను.

శ్లో॥ 11 : అన్వయము : జలధర ! అవిరల ధారా సార దిశా ముఖకాంతః ఆజ్ఞప్తః అత్ర కోపం సంహార; ఏ అహం పృథివీం భ్రమన్ ప్రియాం ప్రేక్షిష్యే యది తదా యత్ యత్ కరిష్యసి తత్ తత్ సహిష్యే.

అర్థము : జలధర= మేఘమా; అవిరల - ధారా + ఆసార - దిశా - ముఖ - కాంతం = ఎడతెగని ధారయైన వర్షముచేత దిక్కుల యందుచుండు రమణీయమైన నీవు; ఆజ్ఞప్తః= నాచే ఆజ్ఞాపింపబడి; అత్ర=ఇాదు, నా యందు; కోపం=కోపమును; సంహార=మానుము; ఏ=ఒకరి; అహం= నేను; పృథివీం=భూమిని; భ్రమన్ = తిరిగి; ప్రియాం=

ప్రియురాలిని; ప్రేక్షిష్యే-యది=చూడగలిగితినేని; తదా=అప్పుడు; యత్ - యత్ = ఏది యేది; కరిష్యసి = చేయుదువో; తత్ - తత్= అది యది; సహిష్యే=సహింపగలను.

"పృథివీం భ్రమన్"— ప్రపంచమెల్లెడ తిరిగియైనను తన ప్రియురాలిని కనిపట్టి తిరవలయునని రాజు సంకల్పము.

"విహాస్య"—పకపకనవ్వి — ఉన్మాదలక్షణము. ముధా + ఏవ=వృథాగానే; వ్యాహరంతి=చెప్పుదురు.

"రాజా కాలస్య కారణం"- రాజే కాలమునకు గారణము- అని భారతమున వ్యాసముని చెప్పెను. రాజు నానతి ననుసరించియే కాలమునందలి మార్పులు జరుగుచుండునని యభిప్రాయము. కనుక ఈ విరహసమయమున వచ్చిన వర్షాకాలమును నేను నిషేధింతును.

పుట 90 : శ్లో॥ 12 : అన్వయము · గంధోన్మాదిత మధుకర గీతైః వాద్యమానైః పరభృత తూర్యైః ప్రసృత పవనోద్వేల్లిత పల్లవ నికరః కల్పతరుః సులలిత వివిధ ప్రకారైః నృత్యతి.

అర్థము : గంధ + ఉన్మాదిత - మధుకర - గీతైః=సుగంధము చేత మత్తెక్కిన తుమ్మెదల పాటలతోడను; వాద్యమానైః = మ్రోయింపబడుచున్న; పరభృత-తూర్యైః=కోకిలలనెడి వాద్యముల తోడను; ప్రసృత - పవన + ఉద్వేల్లిత-పల్లవ - నికరః= వీచుచున్న వాయువుచేత చలింపజేయబడిన చిగుళ్ల సమూహముగల; కల్పతరుః = కల్పవృక్షము; సులలిత - వివిధ - ప్రకారైః = సుకుమారములైన యనేక ప్రకారములచేత; నృత్యతి=నర్తించుచున్నది.

నేపథ్యమున ఈ చర్చరీగీతి గానము చేయబడుచుండగా రాజు లలితమైన నానా ప్రకారమైన నృత్యముచేయును. పుష్పపల్లవాలంకృతుడైన రాజే కల్పతరువని భావింపవలెను. మధుకర ఝుంకృతులు, కోకిల కూజితములు, పుష్పపల్లవనికరము, మందమారుతము — ఇవి యన్నియు విరహమును ఉద్దీపింపజేయు సామగ్రి. విరహోద్దీపితుడైన రాజు ఉన్మాదవశమున లాస్యము చేయును.

"అథవా నప్రత్యాదిశామి"— లేదా నిషేధించను - పిచ్చిలో మరల తెలివి. తాను వలదన్నను మేఘము విజృంభింపమానలేదు. కనుక మనస్సును సరిపెట్టుకొనుట. ఈ వర్షర్తు చిహ్నములచేతనే నాకు ప్రస్తుతము రాజోపచారము జరుగుచున్నది గదా.

శ్లో॥ 13 : అన్వయము : మమ విద్యుల్లేఖాకనకరుచిరం అభ్రం శ్రీవితానం; నిచులతరుభిః మంజరీచామరాణి వ్యాధూయంతే; ఘర్మచ్ఛేదాత్ పటుతరగిరః నీలకంఠాః వందినః; ధారాసారోపనయన పరాః సాను మంతః నైగమాః.

అర్థము : మమ = నాకు; విద్యుత్ + లేఖా-కనక-రుచిరం = మెఱపుతీగెచే బంగరు కాంతిగల: అభ్రం = మేఘమే; శ్రీవితానం = సుందరమైన మేల్కట్లు; నిచుల - తరుభిః = నిచుల వృక్షములచేత; మంజరీ-చామరాణి = గుత్తులనెడు వింజామరములు; వ్యాధూయంతే = వీవబడుచున్నవి; ఘర్మ-ఛేదాత్ = గ్రీష్మము ముగియుటచే; పటుతర - గిరః = స్పష్టములయిన వాక్కులుగల; నీలకంఠాః = నెమిళ్ళే; వందినః = కైవారము చేయువారు; ధారా + ఆసార + ఉపనయన-పరాః = ధారాపాతమైన వర్షమును తెచ్చుటయందు ఆసక్తములయిన; సాను మంతః = పర్వతములే; నైగమాః = వణిజులు.

మరల తెరలో 'గంధోన్మాదిత' ఇత్యాది చర్చరీగీతి.

"పరిచ్ఛదశ్లాఘయా"—ఉపకరణములను గూర్చిన ప్రశంసతో నేమి పని ? ఉర్వశి లేని ఈ రాజభోగములు నాకేల ? ఇంక నీ యరణ్యమున ప్రియురాలిని అన్వేషింతును. "పారస్య అంతే ఖిన్నకః" — గద్యరూపమైన వాచకము ముగిసిన పిమ్మట నేపథ్యమున ఖిన్నకరాగమున క్రింది ద్విపదికాగీతి పాడబడును.

పుట 91 : శ్లో॥ 14 : అన్వయము ; దయితారహితః అధికం దుఃఖితః విరహోనుగతః పరిమంథరః తథా క్షీణగతిః గజయూథపతిః కుసుమోజ్జ్వలే గిరికాననే (భ్రమతి).

అర్థము: దయితా-రహితః = ప్రియురాలితో వియుక్తుడై; అధికం=మిక్కిలి; దుఃఖితః=బాధింపబడినది; విరహ + అనుగతః = ప్రియావిరహముచే తిరిగి పొందబడినది; పరిమంథరః=మిగుల అలస మైనది; తథా=అట్లే; క్షీణ-గతిః=నీరసమైన గమనముగలది అయిన; గజ-యూథ-పతిః=ఏనుగుల రాజు; కుసుమ + ఉజ్వలే = పూవులచే ప్రకాశించుచున్న; గిరి-కాననే = పర్వతారణ్యమునందు; (భ్రమతి = తిరుగుచున్నది).

ఈ ద్విపదికాగీతి నేపథ్యమున వినబడుచుండగా రాజు అలస ముగా అటునిటు తిరుగుచు దిక్కులు చూచి హర్షముతో-"సందీపనం ఇవ"- విరహమును ఉద్దీపింపజేయునదివలె, లేదా, అన్వేషణ కార్య మునకు ప్రోత్సాహము కలిగించునదివలె.

శ్లో॥ 15: అన్వయము: ఆ రక్త రాజిభిః సలిలగర్భైః కుసుమైః ఇయం నవ కందలీ కోపాత్ అంతర్బాష్పే తస్యాః లోచనే మాం స్మారయిష్యతి.

అర్థము: ఆ రక్త - రాజిభిః = ఇంచుక ఎఱ్ఱని జీరలుగలవి; సలిల-గర్భైః=జలము గర్భమునందు గలవియునైన; కుసుమైః = పువ్వులచేత: ఇయం=ఈ; నవ-కందలీ = క్రొత్తదైన నేల యరటి; కోపాత్=కోపమువలన; అంతః + బాష్పే=లోపల కన్నీరుగల, కన్నీ టితో నిండిన; తస్యాః=ఆ యుర్వశియొక్క; లోచనే=రెండు కన్ను లను; మాం=నన్ను; స్మారయతి=స్మరింపజేయుచున్నది.

ఆవచినుకులతో నిండిన కందళీ పుష్పములు కోపమువల్ల గలిగిన కన్నీటితో నిండిన ఉర్వశి కన్నులను తలపించుచు రాజు విరహ మును ఉద్దీపింపజేయుచున్నవి, అన్వేషణకు పురికొల్పుచున్నవి. కాని యామె యీ దిక్కున వెళ్ళినది అని యెట్లు గుర్తింపనగును?

శ్లో॥ 16: అన్వయము: సా సుగాత్రీ వసుమతీం పద్భ్యాం స్పృశేత్ యది, తతః మేఘాభివృష్ట సికతాసు వనస్థలీషు గురు నితంబతయా పశ్చాత్ నతా అలక్తకాంకా అస్యాః చారుపదపంక్తిః దృశ్యేత.

అర్థము: సా-సుగాత్రీ = ఆ సుందరి; వసుమతీం=భూమిని; పద్భ్యాం=రెండు పాదములతో; స్పృశేత్-యది = స్పృశించినట్ల

యితే; తతః=అప్పుడు; మేఘ + అభివృష్ట-సికతాను = మేఘముచే అంతట వర్షింపబడిన యిసుక ప్రదేశములుగల; వన-స్థలీషు = అరణ్య ప్రదేశములందు; గురు-నితంబతయా = పెద్ద పిరుదులు కలిగియుండుట చేత; పశ్చాత్ = వెనుక భాగమున; నతా = లోతయిన; అలక్తక + అంకాః=లత్తుక చిహ్నముగల; అస్యాః=ఈమె యొక్క; చారు-పద-పంక్తిః=అందమైన యడుగుల వరుస; దృశ్యేత=కనబడియుండెడిది.

పుట 92 : "ఉపలబ్ధం ఉపలక్షణం"—గుర్తు లభించినది, జాడ దొరికినది.

శ్లో॥ 17 : అన్వయము : నిమగ్ననాభేః రుషా భిన్నగతేః హృతోష్ఠరాగైః నిపతద్భిః నయనోదబిందుభిః అంకితం శుకోదరశ్యామం ఇదం అసంశయం చ్యుతం స్తనాంశుకం.

అర్థము : నిమగ్న-నాభేః = లోతైన బొడ్డుగలది; రుషా = రోషముచేత; భిన్న-గతేః=తొట్రుపడుచున్న నడకగలదియైన ఉర్వశి యొక్క; హృత + ఓష్ఠ-రాగైః = హరింపబడిన పెదవుల రక్తిమ గలిగి; నిపతద్భిః=రాలిపడుచున్న; నయన-ఉద-బిందుభిః = కంటినీటి బొట్టులచేత; అంకితం=గుర్తులువేయబడిన; శుక + ఉదర-శ్యామం = చిలుకపొట్టవలె ముదురు పచ్చరంగుగల; ఇదం=ఇది; అసంశయం = నిశ్చయముగా; చ్యుతం = జారిపోయిన; స్తన + అంశుకం = స్తనములపై కప్పుకొను వస్త్రమే, ఉత్తరీయమే.

"సేంద్రగోపం నవశాద్వల మిదం"- ఇది అరుద్ర పురుగులతో గూడిన క్రొత్త పచ్చికబయలా? పురూరవునకు వనమందలి సర్వవస్తువులందును ఉర్వశి జాడలన్న భ్రాంతియే కలుగుచుండెను. భ్రాంతి యున్నంతసేపు సంతోషము, అది విడిపోయినంతనే విచారము ఆయనకు గలుగుచుండెను.

శ్లో॥ 18 : అన్వయము : ప్రబలపురోవాతతాడిత శిఖండః శిఖీ దూరోన్నమితేన కేకాగర్భేణ కంఠేన పయోదాన్ ఆలోకయతి.

అర్థము : ప్రబల - పురః-వాత-తాడిత-శిఖండః = వేగముగల యెదురు గాలిచేత కొట్టబడుచున్న పింఛముగల; శిఖీ = నెమిలి; దూర + ఉన్నమితేన=పొడవుగా ఎత్తబడిన; కేకాగర్భేణ = క్రేంకా

రము గర్భనుండుగల; కంఠేన=కంఠముతో; పయోదాన్ = మేఘము లను; ఆలోకయతి=చూచుచున్నది.

పుట 98 : ఈ మయూర చిత్రము అద్భుతమైనది. చిత్రకారుడు సుఖముగా చిత్రింపదగినది. కాళిదాసిట్టి ప్రకృతి సుందరభంగిమలను వర్ణించుట యందు నిపుణుడు. ఆ నెమిలి నిల్చియున్నతీరు పురూరవుని ఆకర్షించి నది. ఉర్వశి జాడనుగూర్చి ఆ నెమిలిని అడుగుచున్నాడు.

శ్లో॥ 19 : అన్వయము : సంప్రాప్తఖేదః త్వరితం పరవారణః ప్రియతమా దర్శన లాలసః విస్మితమానసః గజవరః (భ్రమతి).

అర్థము : సంప్రాప్త - ఖేదః = ప్రాప్తించిన దుఃఖముగలది; త్వరితం=శీఘ్రముముగా; పర-వారణః = శత్రువులను నివారించునది; ప్రియతమా-దర్శన-లాలసః=ప్రియురాలి యొక్క దర్శనమునందు ఆసక్తిగలది; విస్మిత-మానసః = విభ్రాంతమైన మనస్సుగలది అయిన; గజవరః=శ్రేష్ఠమైన గజము; (భ్రమతి=తిరుగుచున్నది).

ఈ తేనా ఖండకము నేపథ్యమునుండి పాడబడిన తరువాత చర్చరీగీతి. విరహావస్థను వ్యక్తముచేయుచు నటి ప్రాకృత భాషలో పాడెడు గీతము ఖండకము. 'తేనా' యన్న పదము మంగళసూచకము. 'తే' యనగా శంకరుడు, 'న' యనగా ఉమ. 'తేనా' శబ్దము ఉమాశంకరులను దెలియజేయు మంగళవాచకము. ఖండకమే తేనా ఖండకము.

శ్లో॥ 20 : అన్వయము : బర్హిణ! అత్ర అరణ్యే భ్రమతా త్వయా సా మమ కాంతా దృష్టా యది మమ తాం ఆచక్ష్వ ఇతి పరం అభ్యర్థయే; నిశామయ (సా) మృగాంక సదృశేన వదనేన హంసగతిః; అనేన చిహ్నేన జ్ఞాస్యసి; మయా తవ ఆఖ్యాతం.

అర్థము. బర్హిణ = ఓ మయూరమా; అత్ర అరణ్యేన = ఈ యరణ్యమందు; భ్రమతా=సంచరించుచున్న; త్వయా = నీ చేత; సా-మమ-కాంతా=ఆ నా యొక్క ప్రియురాలు; దృష్టా - యది=

చూడబడినట్లయితే; మమ=నాకు; తాం=ఆమెనుగూర్చి; అచక్ష్వ = చెప్పుము; ఇతి=అని. పరం=మిక్కిలిగా; అభ్యర్థయే=వేడుచున్నాను: నిశామయ=వినుము; (సా=ఆమె); మృగాంక-సదృశేన = చంద్రుని పోలిన; వదనేన = ముఖముతో; హంస-గతిః = హంసగమనముగలది; అనేన-చిహ్నేన=ఈ గుర్తుచేత; జ్ఞాస్యసి = తెలిసికొనగలవు; (కనుక); మయా=నా చేత; తవ=నీకు; ఆఖ్యాతం=చెప్పబడినది.

ఈ శ్లోకమునందలి వాక్యములు చక్కని పొందికలేక పురూరవుని చిత్తమందలి ఆందోళనకు తగినట్లున్నవి. ఈ చర్చరికా గీతిని పాడుచు కొండరాతిపై నిలిచియున్న మయూరమును చేరబోయి కూర్చుండి దోసిలి యొగ్గి ప్రార్థించు చున్నాడు.

పుట 94 : శ్లో. 21 : అన్వయము : సితాపాంగ ! నీలకంఠ ! అస్మిన్ వనే దీర్ఘాపాంగా ఉత్కంఠా మమ వనితా త్వయా దృష్టా (కిం) ; (సా) దృష్టిక్షమా భవేత్.

అర్థము : సిత + అపాంగ=తెల్లని కడకన్నులుగల; నీలకంఠ= మయూరమా; అస్మిన్-వనే=ఈ వనమునందు; దీర్ఘ - అపాంగా= కోసలైన కడ కన్నులు గలది; ఉత్-కంఠా=ఎత్తయిన కంఠముగలది అయిన; మమ=నా యొక్క; వనితా=ప్రియురాలు; త్వయా=నీచేత: దృష్టా (కిం)=చూడబడినదా; (సా=ఆమె); దృష్టిక్షమా=చూడదగినది. చూపును ఆకర్షించునది; భవేత్=కాగలదు.

నెమిలి నీలకంఠము, ఉర్వశి ఉత్కంఠ; నెమలి సితాపాంగము, ఉర్వశి దీర్ఘాపాంగ. ఈ పోలికలవల్ల నెమిలి ఉర్వశిని చూచి యున్నచో తప్పక గుర్తుపెట్టు కొనగలదు. తిరిగి 20 వ శ్లోకము పాడుచు సమాధానము కొఱకు మయూరము వంక చూచును.

శ్లో. 22 : అన్వయము : అస్య మృదుపవనవిభిన్నః ఘనరుచిరకలాపః మత్ప్రియాయాః వినాశాత్ నిస్సపత్నః జాతః, సుకేశ్యాః రతి విగలితబంధే కుసుమసనాథే కేశహస్తే సతి ఏషః బర్హీ కం హరేత్.

అర్థము : అస్య=ఈ నెమిలియొక్క; మృదు-పవన-విభిన్నః= మందమారుతముచే వికసింపచేయబడిన; ఘన-రుచిర-కలాపః = చిక్క

నైన మెఱయుచున్న పింఛము; మత్-ప్రియాయాః=నా ప్రియురాలి యొక్క; వినాశాత్=అంతర్ధానమువలన; నిస్సపత్నః = సాటిలేనిది; జాతః=అయినది; ౖ కేశ్యాః=అందమైన కేశముగల ఉర్వశియొక్క; రతి-విగళిత - బంధే=రతివలన విడిపోయిన ముడిగల; కుసుమ-సనాథే= పూవులుగల; కేశ-హస్తే=కేశపాశము; సతి=ఉండగా; ఏషః - బర్హీ= ఈ నెమిలి; కం=ఎవనిని హరేత్=ఆకర్షింపగలదు.

"పరవ్యసన నిర్వృతం..." ఇతరుల దుఃఖముచే సంతోషించు దీనిని ప్రశ్నింపను.

"విహంగమేషు పండితా జాతిః ఏషా"—ఇది పక్షులలో తెలివి గల జాతి. పక్షులలో కోకిల గడుసైనది. తన గ్రుడ్లను కాకిగూటిలో నుంచి దానిచేత పొదిగించి తాను హాయిగా పాటలు పాడుకొను చుండును.

పుట 95 : శ్లో 23 : అన్వయము : విద్యాధర కానన లీనః దుఃఖవినిర్గత బాష్పోత్పీడః దూరోత్సారిత హృదయానందః అంబరమానేన గజేంద్రః భ్రమతి.

అర్థము : విద్యాధర - కానన - లీనః = విద్యాధర వనమున మఱుగుపడినది; దుఃఖ-వినిర్గత-బాష్ప + ఉత్పీడః=దుఃఖమువలన వెలు వడిన కన్నీటిచే పీడింపఁబడుచున్నది; దూర + ఉత్సారిత - హృదయ + ఆనందః = దూరముగా తొలగింపబడిన హృదయా నందముగలది, అయి; అంబర-మానేన=ఆకాశమంత ఎత్తున; గజ + ఇంద్రః=గజరాజము; భ్రమతి=తిరుగుచున్నది.

"విద్యాధరకానన లీనః"—గంధమాదన పర్వతమందలి విద్యా ధరులు విహరించు వనము. ఇది ఖురకము అను గీతిభేదము. ఇది నేపథ్యమున పాడబడుచుండగా రాజు మెల్లగా కోకిలను చేరవచ్చును. చర్చరి గీతితో కోకిలను ప్రశ్నించును.

"హేలే హేలే"— ఓసి ఓసి అని సంబోధన. అదరార్థమున ద్విరుక్తి.

శ్లో॥ 24 : అన్వయము : పరభృతే ! మధురప్రలాపిని ! కాంతే నందనవనే స్వచ్ఛందం భ్రమంతి ! పరపుష్టే ! మమ పరం ప్రియతమా సా దృష్టా యది తర్హి ఆచక్ష్వ.

అర్థము : పరభృతే=కోకిలా; మధుర-ప్రలాపిని = తీయగా పలుకుదానా; కాంతే=అందమైన; నందన-వనే=నందన వనమునందు; స్వ-ఛందం=స్వేచ్ఛగా; భ్రమంతి = సంచరించుదానా; పరపుష్టే = కోకిలా; మమ=నాకు; పరం=అత్యంతము; ప్రియతమా=ప్రేమాస్పదురాలయిన; సా=ఆ యుర్వశి; దృష్టా-యది=కనబడినట్లయితే; తర్హి = కనుక; ఆచక్ష్వ = చెప్పుము.

"పరభృతే"— అప్సరసలను కోకిలతో పోల్చుట కాళిదాసునకు ఇష్టమని తోచును. శాకుంతలమునందును దుష్యంతుడు శకుంతల తల్లియైన మేనకను పరభృతితో పోల్చును. ఇచ్చట రాజు పరభృతియందు చిత్రలేఖను చూచుచున్నట్లు తోచుచున్నది. "నను ప్రథమం మేఘరాజిః" అన్న సందర్భమున చిత్రలేఖ నల్లనిదై యుండునన్న సూచన కలదు. ఇచ్చటకూడ పరభృతి నల్లనిదే. విశేషించి నందనవనమున స్వచ్ఛందముగా సంచరించుదానా'యనుటవల్ల రాజు చిత్రలేఖనే ఉద్దేశించుచున్నాడనుట స్పష్టము. 'మధుర ప్రలాపిని' అనుటయు చిత్రలేఖ మధుర వచనములకు సరిపడియున్నది. కోకిలయందు చిత్రలేఖా భ్రాంతి కలిగినంతట రాజునకు కొంత యానందము కలిగి ఆయన నర్తన పూర్వకముగా శృంగార రసానుకూలమగు వలంతికా రాగమును పాడుచు మోకరిల్లి 'పూజ్యురాలా !' యని పరభృతిని సంబోధించును.

శ్లో॥ 25 : అన్వయము : కలభాషిణి ! కామినః త్వాం మదనదూతీం ఉదాహరంతి; త్వం మానావభంగనిపుణం అమోఘం అస్త్రం; తాం ప్రియతమాం వా మమ సమీపం ఆనయ; మాం వా యత్ర కాంతా (తత్ర) ఆశు నయ.

అర్థము : కలభాషిణి=అవ్యక్తమధురముగా భాషించుదానా; కామినః=కాముకులు; త్వాం=నిన్ను; మదన-దూతీం=ప్రణయదూతి

కనుగా; ఉదాహరంతి = పేర్కొందురు; త్వం = నీవు: మాన + అవభంగ-నిపుణం=ప్రణయ కోపమును పోగొట్టుటయందు నేర్పుగల; అమోఘం=మొక్కవోని; అస్త్రం=ఆయుధము, సాధనము; తాం - ప్రియతమాం - వా=ఆ ప్రియురాలివైన నను; మమ = నా యొక్క; సమీపం = చేరువకు; అనయ = తెమ్ము; మాం - వా=నన్నయినను; యత్ర=ఎచ్చట; కాంతా=ప్రియురాలు ఉన్నదో; (తత్ర=అచ్చటికి); ఆశు=శీఘ్రముగా; నయ=కొనిపొమ్ము.

"మదన దూతిం"- ప్రియులనడుమ సంధానము చేయునది. ఉర్వశీ పురూరవుల మధ్య చిత్రలేఖయే దూతికగా పనిచేసి వారికి సంగమము కూర్చినది. ఇప్పుడు వారిరువురి నడుమ ప్రణయ కలహము వచ్చి వియోగమేర్పడినది. కనుక మరల చిత్రలేఖయే కల్పించుకొని ప్రణయ కలహమును తొలగించి ఉర్వశీ పురూరవులను కలుపవలెను. ఈ ప్రణయకలహ వృత్తాంతము చిత్రలేఖ యోగదృష్టిచే గ్రహించియే యున్నది. సంగమ నీయమణిని పేర్కొని సంయోగ సాధనమును గూడ సూచించి యున్నది.

పుట 96: "వామకేన"— వామకము అను భంగిమచే కొంచెము ప్రక్కకు తిరిగి ఆకాశము దిక్కుచూచి వినుట నభినయించి ఆకాశము నుండి ఎవరో పలికినట్లు భావించి ఆ పలుకులను ఉచ్చరించుచున్నాడు. ఇది ఆకాశభాషితము. ఈ వాక్యములు గూడ చిత్రలేఖ పలుకదగినవే. ఇంత యనురక్తుడవైన నిన్ను విడిచి యెట్లు వెడలిపోయినది? అని చిత్రలేఖ రాజుపట్ల సానుభూతి ప్రకటించుచున్నది.

శ్లో. 28: అన్వయము: కుపితా; అహం తు సకృత్ అపి ఆత్మగతం కోప కారణం న స్మరామి; రమణేషు యోషితాం ప్రభుతా భావస్థలితాని న హి అపేక్షతే.

అర్థము: కుపితా = ఆమెకోపించినది; అహం తు = నేను మాత్రము; సకృత్-అపి=ఒక్కటి కూడ; ఆత్మగతం = నా యందలి; కోప-కారణం=కోపహేతువును, అపరాధమును: న-స్మరామి=స్మరింపకాలకున్నాను; రమణేషు = ప్రియులయందు; యోషితాం = స్త్రీల

యొక్క; ప్రభుతాం=అధికారము; భావ - స్ఖలితాని = ప్రణయదోష ములను; న - హి -అపేక్షతే=అపేక్షింపదుగదా.

నేను ఏ దోషమును చేసిన గుర్తులేదు. అయినను ప్రణయ దాసుడనైన నాపై ఆమెకు గల అధికారమునుబట్టి ఆమె నిష్కారణముగా నాపై కోపించి యిట్లు దుఃఖపెట్టుచున్నది. రాజుపట్ల దోషములేదని చిత్రలేఖకు కూడ తెలియును.

"కథం కథాచ్ఛేద కారిణీ స్వకార్యే ఏవ సక్తా"— ఏమి కథా గతిని భంగముచేసి (నేను చెప్పుచున్న మాటలను త్రుంచి వేయుచు) తన పనియందే నిమగ్నురాలయినదా ?— ఉర్వశీ పురూరవుల వియోగమువల్ల కథ ఆగిపోయినది. వారిని కలిపి కథను అతుకుపెట్ట వలసిన చిత్రలేఖ ఆపనిని విడిచి సూర్యోపస్థాన రూపమైన తన కర్తవ్య మునందే ఆసక్తురాలయినది.

శ్లో. 27 : అన్వయము : యత్ ఆపద్గతస్య మమ ప్రణయం అగణయిత్వా ఏషా మదాంధా రాజజంబూద్రుమస్య అభిముఖపాకం ఫలం అధరం ఇవ పాతుం ప్రవృత్తా, (తత్) పరదుఃఖం మహత్ అపి శీతలం (ఇతి) సమ్యక్ ఆహుః.

అర్థము : యత్ = ఎందువల్ల; ఆపద్గతస్య = కష్టముపాలైన; మమ = నా యొక్క; ప్రణయం=ప్రార్థనను; అగణయిత్వా=లెక్క చేయక; ఏషా=ఇది; మద + అంధా=మదముచే కన్నుకాననిదై; రాజ-జంబూ-ద్రుమస్య=శ్రేష్ఠమైన జంబూ వృక్షము యొక్క; అభిముఖ - పాకం=పండుటకు సిద్ధముగా నున్న; ఫలం=పండును; అధరం-ఇవ= పెదవినివలె; పాతుం=పానముచేయుటకు; ప్రవృత్తా=పూనుకొన్నదో; (తత్=అందువల్ల); పర-దుఃఖం=ఇతరుల దుఃఖము; మహత్-అపి= గొప్పదైనను; శీతలం=చల్లగానే యుండును; (ఇతి=అని); సమ్యక్ = సమంజసముగానే; ఆహుః = చెప్పిరి.

"అభిముఖ పాకం ఫలం" — పండుటకు సిద్ధముగా నున్న ఫలము - నేరేడుపండు పూర్తిగా పండినప్పుడు నీలముగా నుండును. పండుటకు సిద్ధముగా నున్నప్పుడు ఎఱ్ఱగా నుండును. ఈ జంబూ

ఫలము చిత్రలేఖ సేవింపబోయిన ఉదయ సూర్యబింబమే యని భావింపవలెను.

పుట 97 : "ప్రియా ఇవ మే"— నా ప్రియురాలివలె - ప్రియురాలైన ఉర్వశికి చెలికత్తె గనుక చిత్రలేఖయందు రాజునకు కోపము లేదు. కోకిలయు ఉర్వశివలె మధురస్వర గనుక అది తనకు సమాధానము చెప్పకున్నను ఆయనకు దానియందు కోపమురాలేదు.

"సుఖ మాస్తాం భవతీ"— నీవు సుఖముగా నుందువుగాక! అని రాజు కోకిలకు శుభము కోరినాడు "రాజ జంబూద్రుమస్య" అన్న సమాసమున రూపకమును భావించినచో రాజు అనెడు జంబూద్రుమము ఏర్పడును. పాకాభిముఖమైన ఫలము అధరమువలె నున్నదనుటచేత కోకిల ఎఱ్ఱని జంబూఫలమును పానముచేయుట ఉర్వశి రాజు అధరమును పానముచేయుటవలె ఉన్నది. ఇట్టి యనుభవస్మరణమువల్ల రాజు కోకిలయందు కోపము పొందలేదు. తన దుఃఖమును గణింపక కోకిల సుఖమున ప్రవర్తించుచున్నదని తాను దానిని నిందించెను గదా. దాని సుఖమును తాను సానుభూతితో గ్రహింపనిచో తానును నిందాపాత్రుడే యగును. కనుక ఉదార స్వభావుడైన రాజు ప్రియుని యధరపాన సుఖము కోకిలకు నిర్విఘ్నముగా నుండవలెనని ఆశీర్వదించెను.

నేపథ్యమున 14వ శ్లోకము మరల గానము చేయబడుచుండగా రాజు ముందుకు నడచుచు దిక్కులు చూచును.

"దక్షిణేన వనధారాం"— వనపంక్తి దక్షిణ దిక్కున ప్రియురాలి చరణన్యాసమును సూచించు నూపురశబ్దము వినవచ్చుచున్నది. కాలియందె సవ్వడి హంస కంఠధ్వనివలె నుండునని కవి సమయము.

శ్లో॥ 28 : అన్వయము : ప్రియతమా విరహక్లాంతవదనః అవిరలబాష్పజలాకులనయనః దుఃసహ దుఃఖవిసంష్ఠులగమనః ప్రసృతగురు తాప దీప్తాంగః అధికం దూనమానసః దరీంగతః గజేంద్రః కాననే పరిభ్రమతి.

అర్థము : ప్రియతమా-విరహ - క్లాంత - వదనః = ప్రియురాలితో డి యెడబాటు చేత వాడిపోయిన ముఖముగలది; అవిరల - బాష్ప-జల + ఆకుల-నయనః=ఎడతెగని కన్నీటిచే కలతపడిన కన్నులుగలది; దుఃసహ - దుఃఖ - విసంష్ఠుల - గమనః=భరింపరాని దుఃఖముచేత తొట్రుపడుచున్ననడకగలది; ప్రసృత-గురు-తాప-దీప్త + అంగః= వ్యాపించుచున్న గొప్ప తాపముచే మండుచున్న శరీరము గలది; అధికం=మిక్కిలి; దూన-మానసః=సంతప్తమైన మనస్సుగలది; దరీం గతః=గుహాయందుండునదియైన; గజేంద్రః = గజరాజము; కాననే = అడవియందు; పరిభ్రమతి=తిరుగుచున్నది.

నేపథ్యమునుండి కకుభ భాగమున అలు విభాగములతో ఈ గీతము పాడబడుచుండగా రాజు దాని యర్థము ననుసరించి యభినయము చేయుచు నడచుచుండును. అనంతరము క్రింది ద్విపదికాగీతి వినుచు దిక్కులు చూచును.

పుట 98 : నేపథ్యమునుండి ద్విపదికాగీతము వినబడును.

శ్లో॥ 29 : అన్వయము : ప్రియకరిణీవియుక్తః గురుశోకానలదీప్తః బాష్పజలాకుల లోచనః కరివరః సమాకులః (సన్) భ్రమతి.

అర్థము : ప్రియ-కరిణీ - వియుక్తః= ప్రియురాలయిన ఆడుయేనుగుతో ఎడబాటు పొందినదై; గురు-శోక + అనల - దీప్తః = గొప్పదైన శోకమనెడు అగ్నిచే దహింపబడుచున్నది; బాష్పజల + ఆకుల-లోచనః=కన్నీటిచే కలతపడిన కన్నులుగలది అయిన; కరివరః= కరీంద్రము; సమాకులః (సన్) = వికలచిత్తయై; భ్రమతి = తిరుగుచున్నది.

"సకరుణం"- దీనముగా, విచారముతో - అయ్యో. ఛీ, ఎంత కష్టము - అని రాజు నిరాశపడును. నూపుర శబ్దమని వెదకిచూడగా రాజ హంసములు కనబడినవి. వాని కేకలను తాను నూపురధ్వని యని భ్రమించెను.

శ్లో॥ 30 : అన్వయము : మేఘశ్యామాః దిశః దృష్ట్వా మానసోత్సుక చేతసాం రాజహంసానాం కూజితం ఇదం, న నూపురశింజితం.

అర్థము : మేఘ - శ్యామాః=మబ్బులచే నల్లనైన; దిశః = దిక్కులను; దృష్ట్వా=చూచి; మానస + ఉత్సుక - చేతసాం=మానస సరోవరమును గూర్చి యుత్కంఠితములగు మనస్సులుగల; రాజ హంసానాం=రాజ హంసములయొక్క; కూజితం=కేక; ఇదం = ఇది; న - నూపుర - శింజితం = అందెల రవళికాదు.

కవి సమయ సిద్ధమైన హంస కూజిత, నూపురశింజితముల ఔపమ్యమును కాళిదాసు ఈ సందర్భమున భ్రాంతి కారణముగా దిద్దుకొనెను.

"భో భో జలవిహంగమరాజ !" — 'భో భో' యనుట గౌరవార్థము. 'జలపక్షిరాజ' యనుట స్తుతించి మెప్పించుటకు.

శ్లో॥ 81 : అన్వయము : తత్ మానసం సరః ప్రతి పశ్చాత్ గమిష్యసి; పాథేయం బిసం భూయః గ్రహణాయ ఉత్సృజ; దయితా ప్రవృత్త్యా మాం తావత్ శుచః ఉద్ధర: సతాం స్వార్థాత్ ప్రణయి క్రియా ఏవ గురుతరా.

అర్థము : తత్=ఆ (ప్రసిద్ధమైన); మానసం=మానస మనెడు; సరః ప్రతి=సరస్సునుగూర్చి; పశ్చాత్=తరువాత; గమిష్యసి=వెళ్లగలవు; పాథేయం = దారి బత్తెమైన; బిసం=తామర తూడును; భూయః=మరల; గ్రహణాయ=తీసికొనుట కొఱకు; ఉత్సృజ = విడువుము; దయితా ప్రవృత్త్యా=ప్రియురాలి వార్తచేత; మాం=నన్ను; తావత్=ఇంతలో; శుచః = శోకమునుండి; ఉద్ధర = ఉద్ధరింపుము; సతాం=మంచివారికి; స్వార్థాత్= స్వప్రయోజనముకంటె; ప్రణయి-క్రియా + ఏవ=అర్థించువారి పనియే; గురుతరా=ఎక్కువ గొప్పది గదా.

ఘట్ 19. "యథా ఉన్ముఖః విలోకయతి" — మొగము పైకెత్తి చూచుచున్నది గనుక మానస సరోవరమును గూర్చినయుత్కంఠతో నేను నీ ప్రియురాలిని చూడలేను అనుచున్నది. అని రాజు సమాధానము చెప్పిగాని తృప్తి పడజాలని మోకాళ్ళపై కూర్చుండి చర్చరీ గీతితో

హంస నడక నభినయించుచుండును. అంతలో తలచుకొని ఓసి హంసమా కప్పిపుచ్చు చుంటివా? యని నర్తించుచు లేచును.

శ్లో॥ 82: అన్వయము; హంస! నతభ్రూః మే ప్రియా సరసః రోధసి తే దృక్పథం నగతా యది, చోర! తస్యాః మదఖేలపదం గతం సకలం త్వయా కథం ను గృహీతం.

అర్థము: హంస = హంసమా; నత - భ్రూః = వంగిన కను బొమలుగల; మే = నా యొక్క; ప్రియా = ప్రియురాలు; సరసః = సరస్సుయొక్క; రోధసి = తీరమునందు; తే = నీ యొక్క; దృక్ - పథం = దృష్టిమార్గమును; న-గతా-యది = పొందనిదైనచో; చోర = దొంగా; తస్యాః = ఆమెయొక్క; మద - ఖేల - పదం = మదముచే సవిలాసమైన పదన్యాసముగల; గతం = నడక; సర్వం = సర్వమును; త్వయా = నీ చేత; కథం - ను = ఎట్లోగదా; గృహీతం = గ్రహింప బడినది, అపహరింప బడినది.

"అతశ్చ"—అందువల్ల నీ గమనమునుబట్టి నేను గుర్తించితిని-ఇట్లనుచు రాజు చర్చరీ గీతానుసారముగా హంసగమనము ననుకరించుచు సమీపించి అంజలిపట్టి ప్రార్థించును.

శ్లో॥ 83: అన్వయము: హంస! మే కాంతాం ప్రయచ్ఛ; అస్యాః గతిః త్వయా హృతా; విభావితైకదేశేన యత్ అభియుజ్యతే (తత్) దేయం.

అర్థము: హంస = హంసమా; మే = నా యొక్క; కాంతాం = ప్రియురాలిని; ప్రయచ్ఛ = ఇమ్ము; అస్యాః = ఈమెయొక్క; గతిః = నడక; త్వయా = నీ చేత; హృతా - దొంగిలింపబడినది; విభావిత + ఏకదేశేన = కనిపెట్టబడిన భాగముగలవానిచేత; యత్ = ఏది; అభియుజ్యతే = అభియోగముచేయబడునో (దొంగిలింప బడినదిగా ఆరోపింపబడునో); (తత్ = అది); దేయం = ఈయబడదగినది.

దొంగిలింపబడిన సొమ్ములో కొంతభాగము ఎవ్వనివద్ద పట్టుబడునో వాడే ఆ సొమ్మంతయు ఈయవలసి యుండును అని ధర్మ

శాస్త్రము. ఈ శాస్త్రము ననుసరించియే పురూరవుడు చౌర్యాభి యోగములందు తీర్పు చెప్పుచుండును. హంసవద్ద ఉర్వశీ గమనము కనబడినదిగనుక హంసయే ఉర్వశిని అపహరించినది. అదియే ఆమెను రాజునకు అప్పచెప్పవలసి యున్నది.

పుట 100 : "పునః చర్చరీ"– మరల చర్చరీ గీతిచే హంసగమనాభినయము.

శ్లో. 84 : అన్వయము : గతిలాలస ! ఏతత్ త్వయా కస్మాత్ శిక్షితం ? జఘనభారాలసా సా (త్వయా) పరం దృష్టా.

అర్థము : గతి - లాలస = గమనమునందాసక్తిగలహంసమా; ఏతత్=ఇది (ఈ గమనము); త్వయా=నీ చేత; కస్మాత్=దేనినుండి; శిక్షితం = నేర్వబడినది; జఘన - భార + అలసా = పిరుదుల బరువుచే మెల్లగానడచు; సా=ఆమె (ఉర్వశి); పరం=నిశ్చయముగా; దృష్టా= చూడబడినది.

"హంసప్రయచ్ఛ" ఇత్యాది ద్విపదికా గీతి పాడుచు హంస గతి అభినయించుచు బిగ్గరగా నవ్వును.

"చోరానుశాసీ రాజా"— రాజు చోరులను దండించువాడని భయపడి ఇది యెగిరిపోయినది. రాజు పాడుచు ఆడుచు దగ్గరకు రాగా హంస యెగిరి పోయినది

"ప్రియా సహాయః"— ప్రియురాలితో గూడి యున్నది. ఇంత వరకు రాజునకు ఒంటరిగా నున్న పక్షులే కనబడినవి. ఇక ముందు పక్షులు, మృగములు జంటలుగా కనబడుచుండును. ఉర్వశీ పురూరవుల పునస్సమాగమమున కివి క్రమసూచనలు. రాజు ప్రియా సహితమైయున్న చక్రవాకమును సమీపింపబోవుచు కుటిలిక, మల్ల పటియను నాట్య భేదముల నభినయించును. ఆ సమయమున తెరలో నుండి గీతిక వినిపించు చుండును

పుట 101 : శ్లో. 85 : అన్వయము : మర్మరరణితమనోహరే కుసుమిత తరువరపల్లవితే కాననే దయితా విరహోన్మాదితః గజేంద్రః భ్రమతి

అర్థము : మర్మర - రణిత-మనోహరే=మర్మర యను ఎండు. టాకుల ధ్వనిచే మనస్సును హరించునది; కుసుమిత - తరు - వర -

వల్లవితే=పుష్పించిన మంచి చెట్లచేత ఆవరింపబడినదియైన; కాననే= అడవియందు; దయితా - విరహ - ఉన్మాదితః=ప్రియురాలి యెడ బాటుచేత పిచ్చియెత్తిన; గజేంద్రః=గజేంద్రము; భ్రమతి = తిరుగు చున్నది.

పండుటాకులు రాలి యెండిపోవుట, చెట్లు పుష్పించుట రాజు నకు ప్రియాసమాగమము త్వరలో కలుగనున్నదని సూచించును.

"ద్విలయాంతే"— ద్రుతము, మధ్యము, విలంబితము అని లయలు మూడు. నేపథ్యమందలి గీతము, రంగస్థలమందలి రాజు గమనము రెండు లయలను ఆశ్రయించి జరిగినవని భావింపదగును. తదనంతరము రాజు చక్రవాకముతో మాటాడును.

శ్లో. 36: అన్వయము: గోరోచనా కుంకుమవర్ణ! చక్ర! మాం భణ; మధువాసరే క్రీడంతీ ధన్యా త్వయా న దృష్టా?

అర్థము: గోరోచనా - కుంకుమ - వర్ణ = గోరోచనమువలె పసుపు, కుంకుమమువలె ఎఱుపు కలిసిన రంగుగలదానా; చక్ర=చక్ర వాకమా; మాం=నన్ను (నాకు); భణ=చెప్పుము; మధు - వాసరే= వసంత సమయమున; క్రీడంతీ=క్రీడించుచుండిన; ధన్యా=ధన్యురాలు; త్వయా=నీ చేత; న-దృష్టా=చూడబడలేదా?

'మధువాసరే' — వసంత సమయమున - అట్లనుటవల్ల రాజు, ఉర్వశి గంధ మాదనమున క్రీడించుటకు వసంతర్తువునందే వచ్చిరని భావింప వలెను. ఇప్పుడు గ్రీష్మర్తువు ముగియ వచ్చుచున్నది. ఎప్పుడో చూచిన ఉర్వశి యిప్పటివఱకు చక్రవాకమునకు గుర్తుం డునా? కనుకనే రాజు 'చెప్పుము, నీవు చూడలేదా?' అని వ్యతిరేక ప్రశ్న రూపమున అడుగుచున్నాడు. లేదా రాజు విరహోన్మా దము చేత ఋతుస్థితి గుర్తింపక వసంతుర్తువను చున్నాడని తలంప వలెను.

పై చర్చరీ గీతముతో చక్రవాకమును సమీపించి మోకరిల్లి-

శ్లో॥ 37 : అన్వయము : రథాంగనామన్ ! రథాంగ శ్రోణిబింబయా వియుతః మనోరథశతైః వృతః అయం రథీ త్వాం పృచ్ఛతి.

అర్థము : రథాంగనామన్ = రథాంగ నామముగల చక్రవాకమా; రథాంగ - శ్రోణి - బింబయా = చక్రమువంటి కటి మండలము గల దానితో; వియుతః = వియుక్తుడును; మనోరథ-శతైః = పెక్కు కోరికలచేత; వృతః = ఆవరింపబడినవాడును; అయిన; అయం = ఈ; రథీ = రథికుడు; త్వాం = నిన్ను; పృచ్ఛతి = ప్రశ్నించుచున్నాడు.

"రథాంగనామన్" - చక్రవాకము రథాంగము, ఉర్వశి రథాంగ శ్రోణిబింబ, తాను మనోరథ శతవృతుడైన రథి - ఇట్లు శబ్దాలంకారముచేత రాజు మనమందరము బంధువులమే అన్న భావము వ్యక్తము చేయుచున్నాడు.

"కః కః" - ఎవడు ? ఎవడు ? చక్రవాకము కః కః అని కూసెను ఆ కూత 'ఎవడు ఎవడు' అని యడుగుటగా రాజు భావించుచున్నాడు. 'అయం రథీ' అని రాజు అనగా 'నీ వెవ్వడవు' అని చక్రవాకము ప్రశ్నించుచున్నదని తలంచి "నఖలు విదితో అహం అస్య" నేను దీనికి ఎఱుకపడలేదు. పాపము నే నెవ్వడనో ఈ పక్షి యెఱుగదు. కనుక చెప్పెదను.

శ్లో॥ 38 : అన్వయము : యస్య మాతామహ పితామహౌ సూర్యాచంద్రమసౌ, యః ద్వాభ్యాం ఉర్వశ్యా చ భువా చ స్వయం పతిః వృతః.

అర్థము : యస్య = ఎవనియొక్క; మాతామహ-పితామహౌ = తల్లి తాత, తండ్రితండ్రి; సూర్యా - చంద్రమసౌ = సూర్య చంద్రులో; యః = ఎవ్వడు; ద్వాభ్యాం = ఇరువురి చేత; ఉర్వశ్యా-చ = ఉర్వశి చేతను; భువా-చ = భూమి చేతను; స్వయం = స్వయముగా; పతిః = భర్తగా; వృతః = వరింపబడినాడో.

పురూరవుడు తన తాత ముత్తాతల నామములను, తన్ను స్వయముగా వరించిన స్త్రీల పేరులను చెప్పెనుగాని తన పేరు చెప్పలేదు. మతి స్థిమితము లేక కావచ్చును. లేదా స్వ నామగ్రహణము

చేయుట ఉత్తమ పురుష లక్షణము కాదని కావచ్చును. ఈ శ్లోకము వల్ల దెలియవచ్చు పురూరవుని గొప్ప దనమును భావించినప్పుడు ఆయన దీనముగా చెట్లులను పిట్టలను వేడుకొనుచు దుఃఖితుడై యడవుల వెంట దిరుగుచుండుట అత్యంత శోచనీయముగా, హృదయ విదారకముగా తోచును.

పుట. 102 : "ఉపాలప్స్యే" – ప్రార్థింపగా మౌనము వహించినది కనుక నిందించి చూచెదను.

శ్లో. 39 : అన్వయము : సరసి నలినీ పత్రేణ అపి అవృత విగ్రహాం సహచరీం దూరే మత్వా సముత్సుకః త్వం నను విరౌషి ఇతి చ జాయా స్నేహాత్ భవతః పృథక్ స్థితి భీరుతా; విధురే మయి చ కాంతా ప్రవృత్తి పరాఙ్ముఖః భావః.

అర్థము : సరసి=సరస్సునందు; నలినీ - పత్రేణ + అపి=తామరాకుచేతనైనను; అవృత-విగ్రహాం=కప్పబడిన ఆకారముగల; సహచరీం=భార్యను; దూరే=దూరమునందు (ఉన్న దానినిగా); మత్వా=తలంచి; సముత్సుకః = ఆవేగముపొందినదానవై; త్వం=నీవు; నను-విరౌషి = రోదింతువు గదా; ఇతి-చ=ఈవిధమైనది; జాయా-స్నేహాత్=భార్యా ప్రేమవల్ల; భవతః=నీయొక్క; పృథక్-స్థితి-భీరుతా=విడిచి యుండుటయందలి పిరికి తనము; విధురే=విరహితుడవైన; మయి-చ=నాయందన్నచో; కాంతా-ప్రవృత్తి-పరాఙ్ముఖః=ప్రియురాలి వృత్తాంతము తెలిసింగింప నిష్టములేని; భావః=అభిప్రాయము.

ఇట్లు నిదించినను చక్రవాకము సమాధాన మీయలేదు. రాజు నిరాశతో ఇదియంతయు నా భాగ్యముల ప్రతికూల ప్రభావము, ఎవరిని నిందించి యేమి లాభము - అని వేరొక చోటికి పోవోవుచు ఆగి పద్మమునందున్న తుమ్మెదను పలుకరించును.

శ్లో. 40 : అన్వయము: మయా దష్టాధరం ససీత్కారం తస్యాః ఆననం ఇవ అంతః కూజితషట్పదం ఇదం పద్మం మాం రుణద్ధి.

అర్థము : మయా = నా చేత; దష్ట + అధరం = కొఱుకబడిన పెదవిగలది; ససీత్కారం=సీత్కారముతో గూడినదియైన: తస్యాః = ఆమెయొక్క; ఆననం + ఇవ = ముఖమువలె; అంతః - కూజిత - షట్పదం=లోపల మ్రోయుచున్న తుమ్మెదగల; ఇదం-ఈ; పద్మం= తామరపూవు; మాం=నన్ను: రుణద్ధి = అడ్డగించుచున్నది.

పురూరవుడు కొన్ని వస్తువులందు ఆత్మ సాదృశ్యమును, కొన్నింట ప్రియాసాదృశ్యమును మరికొన్నింట అన్యథావమును అనుభవించుచు చిత్తభ్రమణము ననుసరించి తానును వనమున భ్రమించుచుండెను.

పుట 108 : "ప్రణయిత్వం కరిష్యే"- అర్థిత్వము చేయుదును-ప్రార్థింతును- ఈ తుమ్మెదకు నా ప్రియురాలి జాడ తెలిసి యుండవచ్చును. దీనిని అడుగకుండ వెడలిపోయినచో తరువాత పశ్చాత్తాపము పొంద వలసి వచ్చునేమో. కనుక అడిగి చూచెదను.

"అర్ధద్విచతురస్రకః"- ద్విచతురస్రకముతో సగము-అనగా చతురస్రకము అను సంస్థాన విశేషము. రాజు ఇట్టి సంస్థానమున ఉండగా నేపథ్యమునుండి క్రింది గీతిక వినిపించును.

శ్లో: 41 : అన్వయము : ఏకక్రమ వర్ధిత గురుతర ప్రేమరసే సరసి హంస యువా కామరసేన క్రీడతి.

అర్థము : ఏక - క్రమ - వర్థిత - గురుతర- ప్రేమ-రసే = ఒకే క్రమమున వృద్ధిపొందిన గొప్ప ప్రేమరసముగల; సరసి = సరస్సునందు; హంస - యువా=యువహంసము; కామ-రసేన = కామావేశముతో; క్రీడతి=క్రీడించుచున్నది, సంచరించుచున్నది.

"సరసి"— ఈ సరస్సు గంధమాదనవనమే. ఉర్వశీ పురూరవులు దినదిన ప్రవృద్ధమైన శృంగారముతో ఆ వనమునందు క్రీడించిరి. ఇప్పుడు పురూరవుడు ఏకాకియై కామోన్మత్తుడై అందే తిరుగుచున్నాడు - చతురస్రకసంస్థానముతో గీతము ననుసరించి నడచి మధుకరమును చేరబోయి అంజలిపట్టి రాజు వేడుచున్నాడు.

శ్లో 42 : అన్వయము : మధుకర ! తస్యాః మదిరాక్ష్యాః ప్రవృత్తిం శంస; అథవా మే అసౌ వరతనుః త్వయా న ఏవ దృష్టా ?

అర్థము : మధుకర = మధుపమా; తస్యాః = మదిరాక్ష్యాః = ఆ మదిరాక్షి యొక్క; ప్రవృత్తిం=వృత్తాంతమును; కంప = చెప్పుము; అథవా=లేదా; మే = నా యొక్క; అసౌ-వరతనుః=ఆ సుందరాంగి: త్వయా=నీ చేత; న-ఏవ-దృష్టా=చూడబడనే లేదా ?

"విభావ్య" — పరిశీలించి, నిరూపించి.

శ్లో॥ 42 : అన్వయము : సురభిం తన్ముఖోచ్ఛ్వాసగంధం అవాప్స్యః యది, అస్మిన్ పుండరీకే తవ రతిః అభవిష్యత్ కిం ?

అర్థము : సురభిం = మనోహరమైన, తత్ + ముఖ + ఉచ్ఛ్వాస - గంధః=ఆమె యొక్క ముఖము నుండి వెడలిన యూర్పు గాలి వాసనను; అవాప్స్యః-యది=నీవు పొందియుంటివేని; అస్మిన్ - పుండరీకే=ఈ కమలమునందు; తవ=నీకు; రతిః=ఆసక్తి, ప్రీతి; అభవిష్యత్ కిం=కలిగియుండెడిదా యేమి ?

ఉర్వశీ ముఖమారుత గంధము తెలియంగదుగనుకనే మధుకరము తనప్రియురాలయిన కమలము యొక్క గంధమునందాసక్తమై యున్నది. దీని నడిగి లాభము లేదని రాజు అటనుండి బయలుదేరును.

సూ॥ 104 : "కరిణీ సహాయః" — ఆ డేమునుతో గూడియున్నది. కరిణీ వియోగము పొందిన కరి యిప్పుడు కరిణితో గూడుకొన్నది. తిరిగి తిరిగి అలసి ఆకలిగొనియున్నది. సల్లకీశాఖపై తుండము సాచి యున్నది.

"న త్వరా కార్యా" — తొందర పడకూడదు. ప్రియాసహితమై యున్న ఏనుగుపట్ల రాజు సానుభూతి చూపుచున్నాడు. ప్రియురాలు అందించుచున్న సల్లకీ పల్లవములు భుజింపబోవు చున్న యీ గజేంద్రమును నా ప్రియురాలిని గూర్చి ప్రశ్నించి ఇప్పుడు విసిగించరాదు అని నిశ్చయించు కొని అది భోజనము ముగించు వరకు రాజు కుటిలికా, ముదవటీ నాట్య భేదము లభినయించుచు గీతము పాడును.

శ్లో॥ 43 : అర్థము : కరిణీ-విరహ-సంతాపితః = ఆడేనుగువలనివియోగముచే తాపము పొందినది; కాననే=అరణ్యమున; గంధ + ఉద్ధత-మధుకరః=మదవాసనచే దర్పించిన మధుపములు గలది.

శ్లో॥ 44 : అన్వయము : అయం ప్రియకరేణుహస్తేన ఉపనీతం అచిరోద్గత పల్లవం ఆసవసురభిరసం సల్లకీ భంగం తావత్ అభిలషతు.

అర్థము : అయం=ఈ గజేంద్రము; ప్రియ-కరేణు-హస్తేన=ప్రియురాలైన ఆడేనుగు తుండముచే; ఉపనీతం = అందివబడిన; అచిర - ఉద్గత - పల్లవం = క్రొత్తగా వెలువడిన చివుళ్లుగల; ఆసవ-సురభి - రసం = మద్యమువలె మనోహరమైన రుచిగలదియైన; సల్లకీ-భంగం=సల్లకీ వృక్ష శాఖను; తావత్=ఇంతలో; అభిలషతు = ఇష్టపడునుగాక, ఆస్వాదించునుగాక.

"కృత + ఆహ్నికః" - పగటి భోజనము చేసినది. కనుక ఇప్పుడు అడిగి చూచెదను.

పుట 105. శ్లో॥ 45 : అన్వయము. లలిత ప్రహారేణ నాశిత తరువర ! గజవర ! అహం త్వాం పృచ్ఛామి; ఆచక్ష్వ; దూరవినిర్జిత శశధర కాంతిః సంముఖం యాంతీ ప్రియా త్వయా దృష్టా ?

అర్థము : లలిత - ప్రహారేణ = సుకుమారమైన దెబ్బచేత; నాశిత-తరు-వర=ఖండింపబడిన మంచి వృక్షములుగల; గజవర=గజేంద్రమా; అహం=నేను; త్వాం=నిన్ను; పృచ్ఛామి=అడుగుచున్నాను; ఆచక్ష్వ=చెప్పుము; దూర - వినిర్జిత - శశధర-కాంతిః=అత్యంతము తిరస్కరింపబడిన చంద్రకాంతి గలది; సంముఖం=ఎదురుగా; యాంతీ = వెళ్ళుచున్నదై; ప్రియా=నా ప్రియురాలు; త్వయా=నీచేత; దృష్టా=చూడబడినదా ?

శ్లో॥ 46 : అన్వయము : మదకల ! గజయూథప ! యువతి శశికలా యూథికా శబలకేశీ స్థిరయౌవనా సుభాలోకా తే దూరాలోకే స్థితా ?

అర్థము : మద-కల=మదముచే అవ్యక్త మధుర ధ్వని చేయువాడా; గజ-యూథప=గజ సమూహ రాజమా; యువతి-శశికలా=

యువతులలో చంద్రరేఖ వంటిది; యూథికా-శబల-కేశీ=యూథికా పుష్పములచే చిత్రవర్ణమైన కేశపాశములు గలది; స్థిర-యౌవనా= నిత్యమైన యౌవనము గలది; సుఖ + ఆలోకా=కంటికింపైనది (అయిన ఉర్వశి); తే=నీయొక్క: దూర-ఆలోకే=దూరపు చూపు నందు; స్థితా=ఉండినదా ? (దూరముగా నీకు కనబడినదా ?)

"ప్రియోపలంభ శంసినా" - ప్రియురాలి ప్రాప్తిని సూచించునట్టి - మృదుమధురమైన ధ్వనిచేత.

"సాధర్మ్యాత్" - సమానధర్మము కలిగయుండుట వల్ల విరహానంతరము గజేంద్రము ప్రియురాలిని కలిసికొన్నది. రాజింకను విరహమందే యున్నాడు. అయినను రాజునకు, గజమునకు సాధర్మ్యము అన్యథా కలదు. ఆ కారణమువల్ల రాజునకు గజమునందు మిక్కిలి ప్రీతి.

శ్లో॥ 47 : అన్వయము : మాం పృథివీభృతాం అధిపతిం ఆహుః; భవాన్ నాగాధి రాజః; భవతః అర్థిషు మమ చ దానం అవ్యుచ్ఛిన్న పృథు ప్రవృత్తి. స్త్రీ రత్నేషు ఉర్వశీ మమ యూథే ఇయం వశా తవ ప్రియతమా; సర్వం తే మాం అను; ప్రియావిరహజాం వ్యథాంతు త్వం మా అనుభూః

అర్థము : మాం=నన్ను; పృథివీభృతాం=రాజులకు; అధిపతిం= అధిపతినిగా; ఆహుః = చెప్పుదురు; భవాన్=నీవు; నాగ + అధి రాజః=ఏనుగులకు అధిపతివి; భవతః=నీకును, అర్థిషు = యాచకు లందు; మమ-చ=నాకును; దానం=దాన జలము; అవ్యుచ్ఛిన్న- పృథు-ప్రవృత్తి=ఎడతెగని గొప్ప ప్రసారము గలది; స్త్రీ-రత్నేషు= స్త్రీ రత్నములందు; ఉర్వశీ=ఉర్వశి; మమ=నాకును; యూథే=మంద యందు; ఇయం-వశా=ఈ కరిణి; తవ=నీకును; ప్రియతమా = ప్రియ తమురాలు; సర్వం = అంతయు; తే=నీకు; మాం-అను = నావలెనే; ప్రియా-విరహజాం=ప్రియురాలి యెడబాటువల్ల కలిగిన; వ్యథాం- తు=వ్యథను మాత్రము; త్వం=నీవు; మా - అనుభూః = అనుభవింప కుండుము గాక

"ప్రియా విరహజాం... మానుభూః" - ప్రియా వియోగ మును మాత్రము నీవు అనుభవింపకుందువు గాక. ప్రియావియోగ దుఃఖ స్వరూపమును అనుభవపూర్వకముగా దెలిసికొన్న రాజు సర్వ విధముల తన్ను బోలియున్న గజేంద్రమునకు అట్టి దుఃఖము ముందెన్నడును కలుగకుండుగాక యని ఆశాసించుచున్నాడు. ఇది అయన సహజమైన యౌదార్యమునకు గుర్తు. అచిరభావి యగు ఉర్వశీ సమాగమచిహ్నముగా అయిన హృదయమున రూపొందు చున్న ప్రసాదమునకు ఇది ఉపలక్షకము.

"సుఖమాస్తాం భవాన్" — నీవు సుఖముగా నుందువుగాక. మేము వెళ్ళుదుము ఇట్లని రాజు ఒక ప్రక్కకు దృష్టిబరపును. అనగా అయన యన్వేషణమార్గము ఒక మలుపు తిరుగుచున్నది. సరియైన దిక్కునకు మరలినాడు రాజు.

"ప్రియశ్చ అయం అప్సరసాం"— ఇది యప్సరసలకు ప్రియ మైనది. తిరుగుచు తిరుగుచు రాజు 'సురభికందరము' అను పర్వత మును సమీపించెను. గంధమాదనగిరి పంక్తియందు ఇదియొక ఉపగిరి యని గ్రహింపవలెను. సురభికందరము అప్సరసలకు ప్రియమైనది గనుక ఉర్వశి దానిపై ఉన్నదేమో యని రాజు చిత్తము ప్రత్యాశా కలితమగుచున్నది.

"అపినామ... ఉపలభ్యేత"— ఆ సుందరి యీ పర్వతము ఉపత్యకయందు లభించినచో నెంత బాగుగా నుండును అని రాజు అభిలాష.

"హంత!... శతహ్రదాశూన్యః"— అయ్యో! నా పాప ములు పండి యీ మేఘముకూడ ఇప్పుడు శంపాలతా శూన్యమైనది. ఇంతవఱకు మేఘమునందు మెఱపుతీగెలు కనవచ్చుచుండెను ఇప్పుడు శంపావిహీనమైన కాఱుమబ్బు కనవచ్చుచున్నది. కుంభవృష్టి కురియ వచ్చును. ఏమయినను సరే ఈ పర్వతమునందు వెదుకక మానను. విఘ్నమును లక్ష్యపెట్టక ప్రియాలాభపర్యంతము అన్వేషణమును

సాగించుకొనుటకే నిశ్చయించుకొని రాజు ఉత్తమపురుష లక్షణమైన ధీరతను ప్రకటించినాడు. అంతట నేపథ్యమున ఖండికాగీతి గానము చేయబడును

శ్లో. 48 : అన్వయము : అవిచలః నిజకార్యోద్యుక్తః ప్రసృతఖర ఖుర దారిత మేదినిః కోలః వనగహనే లీనః పరిసర్పతి.

అర్థము : అవిచలః = నిశ్చలము, ధీరము; నిజ - కార్య - ఉద్యుక్తః=తన పనియందు నిమగ్నమైనది; ప్రసృత-ఖర-ఖుర-దారిత మేదినిః=విస్తరింపబడిన పదునైన గిట్టలచే చీల్చబడిన భూమిగలది అయిన; కోలః = అడవిపంది;. వన-గహనే = అడవి పొదయందు; లీనః=దాగినదై ; పరిసర్పతి=సంచరించుచున్నది.

పుట 107 : నేపథ్యమునుండి శ్రీరాగమున, కుంభతాలమున ఈ గీతము విన వచ్చుచుండగా రాజు సురభికందరము కనవచ్చుచున్న దిక్కున నడచు చుండును. ఆహారాన్వేషణ తత్పరమైన యీ అడవిపంది వర్తనము రాజు వర్తనమునకు ప్రతీక కాదు. ప్రియా ప్రవృత్తిని గూర్చి రాజు దీనిని ప్రశ్నింపడు. వనవర్ణనాంగముగా మాత్రమే ఈ కోల ప్రసంగము నేపథ్యగీతమున నిబంధింపబడినది.

శ్లో. 49 : అన్వయము : పృథునితంబ ! పర్వత ! అల్పకుచాంతరా పర్వసు సన్నతా నితంబవతీ అంగనా తవ అనంగ పరిగ్రహం ఇదం వనాంతరం అపి శ్రయతి ?

అర్థము : పృథు-నితంబ=గొప్ప చరియలుగల; పర్వత=పర్వతమా: అల్పకుచ + అంతరా=స్వల్పమైన స్తనముల నడిమి యెడము గలది; పర్వసు=సంధిబంధములందు; సన్నతా = చక్కగా వంగినది; నితంబవతీ=గొప్ప పిరుదులుగలది; అయిన; అంగనా = స్త్రీ, ఉర్వశి; తవ=నీ యొక్క; అనంగ-పరిగ్రహం = మన్మథ నివాస యోగ్యమైన; ఇదం = ఈ; వన + అంతరం = వనమధ్యమును; అపి-శ్రయతి=ఆశ్రయించియున్నదా ? ("అపి" ఇచ్చట ప్రశ్నార్థకము )

"శంకే, విప్రకృష్టః న శృణోతి ఇతి"— దూరమందున్నదై వినలేదు అనుకొందును. ఇది కేవలము రాజు ఊహ. ఉన్మాదలక్షణ

మైన భ్రాంతినుండి పుట్టిన యూహలు ఈ యంకమునందెల్లెడల నిండియున్నవి. రాజు పర్వతమును చేరబోవుచు చర్చరీగీతముచే దానిని పొగడును.

శ్లో. ౫౦: అన్వయము : స్ఫటికశిలాతల నిర్ఝరనిర్మల! బహువిధ కుసుమ విరచిత శేఖర! కిన్నర మధురోద్గీత మనోహర! మహీధర! మమ ప్రియతమాం దర్శయ.

అర్థము : స్ఫటిక-శిలా-తల-నిర్ఝర-నిర్మల=పటికరాల ప్రదేశముల చే మిక్కిలి స్వచ్ఛమైన వాడా; బహు-విధ-కుసుమ-విరచిత-శేఖర=పెక్కు విధములైన పుష్పములచే కూర్పబడిన శిరోభూషణము గలవాడా; కిన్నర-మధుర-ఉద్గీత-మనోహర=కిన్నరుల యొక్క మధురములైన ఉచ్చైర్గీతములచేత మనస్సును హరించువాడా; మహీధర= పర్వతరాజా; మమ = నాయొక్క; ప్రియతమాం = ప్రేయసిని; దర్శయ = చూపుము,

ఇంతవఱకు రాజునకు పక్షులు, జంతువులు మాత్రమే కనబడినవి. ఇప్పుడు సురభికందర వర్ణనమున కిన్నరుల యునికి సూచింపబడినది. ఈ వర్ణనము సంభోగ శృంగారమునకు యోగ్యమైయున్నది. రాజు చిత్తమున బలమైన ఆశను, తజ్జనితమైన మనోవికాసమును ఈ వర్ణన వ్యంజించుచున్నది.

స్ఫటిక శిలాతల-శేఖర - మధురోద్గీత శబ్దములు శిలాభేదాంతరమునందు కనబడిన సంగమనీయ శిరోమణిని గ్రహింపుమని బోధించిన దివ్యవాణిని సూచించుచున్నవి.

శ్లో. ౫౧ : ఈ శ్లోకమును రాజు పర్వతమును సమీపించి బిగ్గరగా పఠించెను దూరమునుండి పఠించిన శ్లోకము, సమీపించుచు పఠించిన శ్లోకము పర్వతమునకు వినిపించలేదు. ఈ శ్లోకము వినిపించినది, పర్వతగుహాలోనుండి ప్రతిధ్వనించి రాజునకు తిరిగి వినిపించినది. ప్రతిశబ్దించిన శ్లోకమును పర్వతమొసంగిన సమాధానముగా రాజు గ్రహించెను. కనుక ఈ శ్లోకమునకు రాజు ప్రశ్నరూపమున ఒక యర్థము, పర్వతము ప్రత్యుత్తరము రూపమున వేఱొక అర్థము కలవు.

ప్రశ్నమైన శ్లోకమునకు :—

అన్వయము : సర్వక్షితి భృతాం నాథ! సర్వాంగసుందరీ రామా రమ్యే అస్మిన్ వనోద్దేశే మయా విరహితా త్వయా దృష్టా!

అర్థము : సర్వ-క్షితిభృతాం-నాథ=సర్వపర్వతముల రాజా; సర్వ-అంగ-సుందరీ=సకలావయవముల సుందరమైన; రామా = స్త్రీ; రమ్యే=అందమైన; అస్మిన్-వన + ఉద్దేశే = ఈ వనప్రదేశమునందు; మయా=నాచే; విరహితా=వియుక్తయై; త్వయా=నీచే; దృష్టా = చూడబడినదా?

ప్రత్యుత్తరమైన శ్లోకమునకు :—

అన్వయము : సర్వక్షితి భృతాం నాథ! సర్వాంగసుందరీ రామా రమ్యే అస్మిన్ వనోద్దేశే త్వయా విరహితా మయాదృష్టా!

అర్థము : సర్వ-క్షితిభృతాం-నాథ=సర్వభూపతులకు రాజైన వాడా; సర్వ - అంగ - సుందరీ = సకలావయవముల సుందరమైనది; రామా = స్త్రీ; రమ్యే=రమణీయమైన; అస్మిన్-వనోద్దేశే = ఈ వన ప్రదేశమునందు; త్వయా=నీచే; విరహితా=వియుక్తయై; మయా= నాచే; దృష్టా=చూడబడినది.

పట 108 : రాజు ఇప్పటి కెన్నింటినో ప్రశ్నించెను కాని చూచితిని అని చెప్పిన దొక్కటియులేదు. ఇప్పటికి సురభికందర పర్వతము 'నేను చూచితిని' అని చెప్పినది. రాజు సంతోషమునకు మేరలేకపోయెను

"యథాక్రమం దృష్టా ఇత్యాహ"- ఏ విధముగా అడిగితినో ఆదేవిధముగా 'చూడబడినది' అని చెప్పినది- అని సంతోషించి 'నీవు కూడ ఇంతకంటె ప్రియతరమైన వార్తను వినుదువుగాక! అని ఆశించెను.

"క్వ తర్హి మమ ప్రియతమా"- అయినచో నా ప్రియురాలు ఎచ్చట నున్నది. రాజు పల్కిన ఈ వాక్యము మరల ప్రతిధ్వనిరూప మున రాజునకు వినబడెను. ఇందలి 'క్వ' అన్న ప్రశ్నార్థక పదమును

ప్రశ్నార్థకముగా తప్పు గ్రహింప వీలులేదు. రాజున కిప్పుడు తెలిసినది. ఇంతకుముందు తాను సమాధానమని భ్రమించినది తన ప్రశ్న వాక్యము యొక్క ప్రతిశబ్దమే అని. అయన 'హాథిక్' అని విచారపడెను;

"శ్రాంతః అస్మి"- అలసిపోయితిని. తిరిగి తిరిగి శరీరము అలసినది. అడిగి యడిగి నోరు అలసినది. ఆశాభంగము పొందిపొంది మనస్సు అలసిపోయినది. రాజు క్షణకాలము విశ్రమింపదలచెను. అంతేకాని అన్వేషణము విరమింపదలపలేదు.

"తరంగ వాతం ఆసేవిష్యే"- అలల మీదినుండి వీచు చల్లని గాలిని అనుభవింతును. పర్వతమునుండి వెడలుచున్న నదియొద్దున చేరి రాజు ఇట్లనుకొనెను. ఆ పర్వతము ఉర్వశిని చూచితినని చెప్పెను గదా. అది భ్రాంతి యని తెలినను, ఆ భ్రాంతి జ్ఞానసంస్కారము ఇంకను రాజు చిత్తమందున్నది. ఆ వచ్చుచున్న నదియందు అయనకు ఉర్వశి భ్రాంతి యంకురించుచున్నది. అలసిన తాను తరంగవాయువును అనుభవింపగోరుటయందే రాజు ఉర్వశి విసనకఱ్ఱతో విసరి తన్ను సేద దీర్చుటను స్మరించుచున్నాడు. నదివంక అభిలాషతో చూచుచున్నాడు. క్రమముగా దానియందు ఉర్వశిని దర్శించుచున్నాడు.

"నవాంబు కలుషాం అపి"— క్రొత్త నీటిచే మురికిదైయున్నదైనను ఈ నదిని చూచుచున్న నా మనస్సు రతి పొందుచున్నది. ఆ నది తనపై కోపించి చరచర సాగిపోయిన ఉర్వశియే.

శ్లో. 52 : అన్వయము : యథా తరంగ భ్రూభంగా క్షుభితవిహగ శ్రేణి రశనా సంరంభశిథిలం వసనం ఇవ ఫేనం వికర్షంతీ బహుశః స్ఖలితం అభిసంధాయ అవిద్ధం యాతి (తథా) ఇయం ధ్రువం నదీభావేన పరిణతా అసహనా సా.

అర్థము : యథా=ఏ విధముగా, ఏ కారణమున; తరంగ-భ్రూ-భంగా=అలలనెడు కనుబొమ విఱుపులుగలది; క్షుభిత-విహగ-శ్రేణి-రశనా=కలతపడుచున్న పక్షుల వరుస యనెడు మొలనూలు గలది; సంరంభ-శిథిలం=కోప వేగముచే చెదిరిపోవుచున్న; వసనం-ఇవ=

వస్త్రము నువలె; ఫేనం = నురుగను; వికర్షంతీ = కూర్చి పట్టుకొను చున్నది; అసూయా=మాటి మాటికి; స్ఖలితం = తొట్రుపాటును; అభిసంధాయ = సరిచేసికొని; (ఆవిద్ధం = కుటిలముగా, దుడుకుగా; యాతి = వెళ్లుచున్నదో (తథా = ఆ విధముగా, ఆ కారణమున); ఇయం=ఇది. (ఈ నది); ధ్రువం=నిశ్చయముగా; నదీభావేన=నదీభావమున; పరిణతా=మారినటువంటి; అసహనా = కోపనయైన; సా = ఆమెయే.

పాపయుతమైన శాపముచే నదియందు ఊర్వశి యారోపింపబడినది. ఆరోపింపబడిన ఊర్వశి కుపితయై అనాదరముతో తన్ను విడిచి పోవుచున్న ఊర్వశి. ఇన్ని దినముల యనంతరము రాజు చిత్తము మరల వియోగము అరంభించిన మహారాజునకు మరలినది. అయినయు కొండలు, అడవులు తిరిగి తిరిగి వియోగము సంభవించిన ప్రాంతమునకు మరలివచ్చినాడు. కాలచక్రముతోపాటు కథాచక్రము తిరిగివచ్చుచున్నది. తుదిసినచోటికే తిరిగి వచ్చి ముడివడబోవుచున్నది.

పుట 100 : "లభ్యా చిరేణ భావదేవాం"- ఇప్పుడు దీనిని వేడుకొందును. నదీరూపపరిణతయైన ఊర్వశిని రాజు ప్రార్థించును. అంజలిపట్టి కుటిలకాపాట్యముచే నతి చేయుచున్నాడు.

శ్లో. 58 : అన్వయము : తుభితాకరుణ విహంగమకే తీరసముత్సుక్తైణకే అలికుల ఝంకారితే ప్రియతమే సుందరి సురసరిత్ వది పవయా వత్యా ప్రసీద.

అర్థము : తుభిత + అకరుణ - విహంగమకే = కలతపడుచు నిష్కరుణముగా గోలచేయుచున్న పక్షులు గలదానా; తీర - సముత్సుక + ఏణకే=ఒడ్డున ఉత్కంఠపడుచున్న హరిణములు గలదానా; అలి-కుల- ఝంకారితే=తుమ్మెదలగుంపుల మ్రోతగలదానా; ప్రియతమే= ప్రియురాలా; సుందరి=అందమైనదానా; సురసరిత్ = దివ్య

వాహినీ; నదీ=నదీ; ఏనయా-నత్యా=ఈ నతిచేత; ప్రసీద = ప్రసన్ను రాలవు కమ్ము.

ఈ శ్లోకమును చదువుచు రాజు నదిదిక్కు నడచుచుండును. ఈ శ్లోకము తరువాత నేపథ్యమున సముద్రవర్ణనాత్మకమైన చర్చరి గీతి పాడబడును. ఉర్వశి నదిగా మారినదని భావించిన పురూరవుడు తాను సముద్రుడుగా మారుచున్నట్లు భావించి నేపథ్యమునుండి విన వచ్చు చర్చరి ననుసరించి కుటిలికా నాట్యముచే సాగరుని అనుక రించుచు నదిని సమీపించి మోకరిల్లును.

శ్లో. 54 : అన్వయము : పూర్వదిక్పవనా హత కల్లోలోద్గత బాహుః హంస రథాంగ శంఖ కుంకుమ కృతాభరణః కరిమకరాకుల కృష్ణకమల కృతావరణః వేలాసలిలోద్వేల్లిత దత్తహస్తతాలః నవమేఘకాలః జలనిధినాథః మేఘాంగైః సలలితం నృత్యతి; దశదిశః రుద్ధ్వా అవస్తృణాతి.

అర్థము : పూర్వ - దిక్-పవన + ఆహత - కల్లోల + ఉద్గత-బాహుః=తూర్పు దిక్కునుండి వీచిన గాలిచేత ఎగురగొట్టబడిన తరంగములనెడు ఎత్తబడిన చేతులుగలవాడు; హంస - రథాంగ-శంఖ - కుంకుమ - కృత + ఆభరణః=హంసములు, చక్రవాకములు, శంఖములు, కుంకుమములచే చేయబడిన అలంకారము గలవాడు, కరి - మకర - ఆకుల - కృష్ణ-కమల - కృత + ఆవరణః=ఏనుగులచేత మొసళ్ళచేత చెదరగొట్టబడిన నల్ల కలువలచేత కల్పింపబడిన వస్త్రములు గలవాడు; వేలా - సలిల + ఉద్వేల్లిత - దత్త - హస్త-తాలః = తీరమునందలి నీటియొక్క పొర్లుచేత చేయబడిన చేతి తాలము చరచుట గలవాడు; నవ - మేఘ - కాలః=క్రొత్త మేఘమువలె నీలమైనవాడు; జలనిధినాథః=సాగర ప్రభువు; మేఘ + అంగైః = మేఘములనెడు (మేఘములవంటి) అవయవములతో; సలలితం=సుకుమారముగా; నృత్యతి=నర్తించుచున్నాడు; దశ-దిశః= పది దిక్కులను; రుద్ధ్వా=అడ్డగించి, ఒరసికొని; అవస్తృణాతి= వ్యాపించుచున్నాడు;

సముద్రుడు ఉద్ధత తాండవము చేయవలయును. కాని యిచ్చట సుకుమార లాస్యము చేయుచున్నట్లు వర్ణింపబడినది. కారణము సముద్రారోపణమునకు విషయమైన పురూరవుడు ప్రియురాలిని ప్రసన్నను గావించుకొను సుకుమార మధుర చిత్తవృత్తికలవాడగుట యని తలంపవలెను. (ఈ శ్లోకమందలి చివరి చరణమును వేఱుచేసి - నవ మేఘ సమయము దశదిశలను నిరోధించి వ్యాపించుచున్నది అనియు అర్థము చెప్పుకోవచ్చును.)

పుట. 110. శ్లో॥ 55 : అన్వయము : మానిని ! త్వయి నిబద్ధరతేః ప్రియవాదినః ప్రణయభంగ పరాఙ్ముఖచేతసః మమ కం అపరాధలవం పశ్యసి ? యతః దాసజనం త్యజసి ?

అర్థము : మానిని=కోపశీల; త్వయి=నీయందు: నిబద్ధ-రతేః=దృఢమైన ప్రీతిగలవాడను; ప్రియవాదినః=మధురముగా బలుకువాడను; ప్రణయ-భంగ-పరాఙ్ముఖ-చేతసః=ప్రేమను భంగముచేయ నిష్టపడని చిత్తముగలవాడను; అయిన; మమ=నాయొక్క; కం-అపరాధలవం=ఏదోషలేశమును; పశ్యసి=కనిపెట్టుదువు; యతః = దేనివల్ల; దాస-జనం=దాసజనుడనైన నన్ను; త్యజసి = విడిచిపెట్టుదువో.

"నఖలు ఉర్వశీ... సముద్రాభిసారిణీ భవిష్యతి"— ఉర్వశి పురూరవుని విడిచి సముద్రుని అభిసరించునది కాదుగదా. కనుక ఇది నిజమైననదియే. ఉర్వశి పురూరవుని అభిసరించెను. అతనిని విడిచి యింకొకరిని అభిసరింపదు. రాజునకు మరల ఒడలు తెలిసెను. ఆశాభంగమువల్ల నిర్వేదము జనించెను. కాని ఆయన మనస్సును మరల గట్టిపరచుకొనెను.

"అనిర్వేదప్రాప్యాణి శ్రేయాంసి"— శ్రేయములు అనిర్వేదముచేత పొందదగినవి. నిర్వేదమనగా విరక్తి, నిరాశ. ఉత్సాహమునకు నిర్వేదము విరోధి. ఉత్సాహికి శ్రేయములు లభించును. కనుక రాజు మరల ఉత్సాహము పూని మొట్టమొదట ఏ ప్రదేశమున ఉర్వశి తన కన్ను మఱుగిపోయెనో అచ్చటికే వెళ్ళుటకు నిశ్చయించి ఆ ప్రదేశమును తెలుపు గుర్తులకొఱకు వెదకెను. గుర్తు దొరికెను.

శ్లో॥ 56 : అన్వయము : ఘర్మాంతశంసి అసమగ్రకేసర విషమం అపి యస్య ఏకం పుష్పం ప్రియయా శిఖాభరణం కృతం సః రక్తకదంబః అయం.

అర్థము : ఘర్మ + అంత-శంసి = గ్రీష్మఋతువు ముగింపును సూచించున్నది, అసమగ్ర- కేసర-విషమం-అపి=అసమగ్రములైన కేసరములచే ఎగుడు దిగుడుగానున్నదియైనను; యస్య = దేనియొక్క: ఏకం-పుష్పం = ఒంటరియైన పుష్పము; ప్రియయా=ప్రియురాలిచేత; శిఖా + అభరణం = శిరోభూషణము ; కృతం=చేయబడినదో; సః-రక్త-కదంబః=ఆ రక్తకదంబవృక్షము; అయం=ఇదియే.

తాను ఉర్వశి కలిసి వెళ్ళిన త్రోవ దొరికినది. ఆ ప్రాంతమున ఎచ్చటనైన ఉర్వశి లభింపవచ్చును. రక్తకదంబవృక్షము నీడలో ఒక హరిణము కూర్చుండియున్నది. రాజు దానిని ప్రశ్నించెను.

పుట 111 : శ్లో॥ 57 : అన్వయము : యః కృష్ణశారచ్ఛవిః అసౌ (సారంగః) వనశోభావలోకాయ కాననశ్రియా పాతితః కటాక్షః ఇవ దృశ్యతే.

అర్థము : యః = ఏది; కృష్ణ-శార-చ్ఛవిః = నలుపు తెలుపు కలిసిన రంగు గలదో; అసౌ (సారంగః=ఆ యీ లేడి; వన-శోభా + అవలోకాయ=అరణ్యసౌందర్య దర్శనముకొఱకు; కానన-శ్రియా= వనలక్ష్మిచేత; పాతితః=ప్రసరింపబడిన; కటాక్షః-ఇవ=కడకంటి చూపు వలె; దృశ్యతే=కనబడుచున్నది

తనతో కలిసి విహరించు సమయమున వనశోభావలోకనము నకై ఉర్వశి ప్రసరించిన వాలుజూపులను రాజు స్మరించుచున్నాడు.

శ్లో॥ 58 : అన్వయము : జఘనభారాలసా పీనోత్తుంగ ఘనస్తనీ స్థిరయౌవనా తనుశరీరా హంసగతిః మృగలోచనా సురసుందరీ గగనోజ్వలకాననే భ్రమంతీ త్వయా దృష్టా ? తద్విరహ సముద్రాంతరాత్ మాం ఉత్తారయ.

అర్థము : జఘన-భార + అలసా=పిఱుదుల బరువుచే మెల్లగా నడచునది; పీన_ఉత్తుంగ-ఘన-స్తనీ = బలిసిన ఎత్తయిన బిగువైన స్తన

ములు గలది; స్థిర-యౌవనా=నిత్యయౌవనముగలది; తను-శరీరా = సన్నని దేహముగలది; హంస-గతిః=హంసగతివంటి గతిగలది; మృగ-లోచనా=లేడి కన్నులవంటి కన్నులుగలది; అయిన; సురసుందరీ = అప్సరఃకాంత; గగన + ఉజ్వల-కాననే = ఆకాశమువలె నీలముగా ప్రకాశించు వనమునందు; భ్రమంతీ = తిరుగుచున్నదై: త్వయా = నీచేత; దృష్టా=చూడబడినదా; తత్-విరహ-సముద్ర + అంతరాత్ = ఆమెతోడి యెడబాటు అనెడు సముద్రములోపలనుండి; మాం=నన్ను; ఉత్తారయ=ఒడ్డెక్కించుము.

"మాం అవధీరయన్నివ" — నన్ను నిర్లక్ష్యము చేయుచున్నదా యన్నట్లు ముఖము వేఱుదిక్కునకు త్రిప్పుకొన్నది.

శ్లో॥ 59 : అన్వయము : అస్య అంతికం ఆయాంతీ మృగీ స్తనపాయినా శిశునా రుద్ధా; భుగ్నగ్రీవః అనన్యదృష్టిః అయం తాం విలోకయతి.

అర్థము : అస్య = దీనియొక్క; అంతికం = సమీపమునకు: ఆయాంతీ = వచ్చుచున్నదైన; మృగీ=ఆడులేడి; స్తన - పాయినా = చన్ను కుడుచుచున్న; శిశునా = బిడ్డచేత; రుద్ధా = అడ్డగింపబడినది; భుగ్న-గ్రీవః=మలగిన మెడగలది; అనన్య-దృష్టిః = ఇతరమునందు దృష్టిలేనిది అయి; అయం = ఇది; తాం=దానిని; విలోకయతి = చూచుచున్నది.

"హం హో ! యూథపతే"- ఓహో ! మృగసమూహపతీ !- ఇది నన్ను నిర్లక్ష్యము చేయలేదు. తన వద్దకు వచ్చుచున్న ప్రియురాలిని పాలు త్రాగుచు పసిపిల్ల అడ్డగింపగా ఇది మెడను అటు మలచి తన ప్రియసతిని, ప్రియసంతానమును అనురక్తితో చూచుకొనుచున్నది. నా మాట దీనికి వినబడలేదు కాబోలు. ఈ విధముగా భావించి రాజు 'హం హో' అని సంబోధించి పలుకుచున్నాడు.

పుట 112 : స్తనపాయియైన శిశువుతో గూడిన మృగీ మృగములు రాజు దృష్టి నాకర్షించినవి. ఈ మృగసంసారము రాజునకు గలుగబోవు పుత్ర సంతతిని సూచించును. రాజునకు ప్రియురాలైన యుర్వశి

లభించుటయే కాక ఆమెయందు గలిగిన పుత్రసంతతియు ఆయన కన్నులబడును.

శ్లో: 60: అన్వయము : మమ ప్రియాం వనే అపిదృష్టవాన్ అసి; తదుప లక్షణం తే కథయామి శ్రుణు; యథా ఏవ తే పృథులోచనా సహ చరీ సుభగం వీక్షతే తథా ఏవ ఖలు సా అపి సుభగం వీక్షతే.

అర్థము : మమ = నా యొక్క; ప్రియాం = ప్రియురాలిని; వనే=వనమందు; అపి-దృష్టవాన్-అసి=చూచినవాడవైతివా; తత్ + ఉపలక్షణం=ఆమె యొక్క గుర్తు; తే=నీకు; కథయామి=చెప్పుదును; శ్రుణు=వినుము; యథా + ఏవ=ఏ విధముగానైతే; పృథు-లోచనా= పెద్ద కన్నులుగల; తే=నీ యొక్క; సహచరీ=భార్య; సుభగం = మనోహరముగా; వీక్షతే=చూచునో; తథా + ఏవ - ఖలు = అదేవిధ ముగా; సా + అపి=ఆమె కూడ; సుభగం=సుందరముగా; వీక్షతే= చూచును.

"కలత్రాభిముఖం స్థితః"— నా మాటను ఆదరింపక ప్రియు రాలి వంకకే చూచు చున్నది. మృదులోచనయైన నీ సహచరి సుభ గముగా చూచును' అని రాజు పలికెను గదా. లేడి తన ప్రియురాలి పృథులోచనములను, సుభగ వీక్షణములను జూచుకొను చున్నది. అంతేకాదు తన్ను జేరవచ్చుచున్న ప్రియురాలిని అడ్డగించుచు ఆమె హృదయమును చూరగొనుచున్న తన ప్రతిబింబమైన శిశువును జూచు కొనుచున్నది రాజునకింకను ఈ యనుభవము లేదు.

"పరిభవాస్పదం దశా విపర్యయః"— అదృష్టము తారు మారగుట అవమానమునకు కారణమగును. నిజమునకు లేడి రాజును అనాదరింపలేదు. ప్రియా సమాగమమునకు కేవల సంభోగమే ఫలము కాదు. సత్సంతానము పరమ ఫలము అని తన తూష్ణీంభావముచేత మృగము రాజునకు సూచించినదని భావించుట యుక్తము.

"నితాంతరక్తం ఇదం"— అత్యంతము రక్తవర్ణమైన ఇది యేదో రాతి పగులునందు కనబడుచున్నది.

శ్లో॥ 61 : అన్వయము : ప్రభాలేపీ అయం హరిహత మృగస్య ఆమిషలవః న; అగ్నేః స్ఫులింగః స్యాత్; ఇదం పునః గగనం అభివృష్టం; అయే! అయం రక్తాశోక స్తబకసమరాగః మణిః; యం ఉద్ధర్తుం పూషా ఆలంబితకరః వ్యవసితః ఇవ.

అర్థము : ప్రభా-లేపీ=కాంతుల వెదజల్లు; అయం=ఇది; హరి-హత - మృగస్య=సింహముచే చంపబడిన లేడియొక్క; ఆమిష-లవః= మాంసపు ముక్క; న=కాదు; అగ్నేః=అగ్ని యొక్క; స్ఫులింగః= రవ్వ; స్యాత్ = కావచ్చును; ఇదం-పునః = కాని యిది; గగనం = ఆకాశమునుండి; అభివృష్టః=వర్షింపబడినది; రాలినది; అయే=ఓహో; అయం=ఇది; రక్త + అశోక- స్తబక-సమ-రాగః=రక్తాశోకపుగుత్తితో సమానమైన రక్తవర్ణముగల; మణిః=మణి; యం=దేనిని; ఉద్ధర్తుం= తీసికొనుటకు; పూషా = సూర్యుడు; ఆలంబిత - కరః = చాపబడిన కరములు (కిరణములు) గలవాడై; వ్యవసితః - ఇవ=ప్రయత్నించు చున్నాడా యన్నట్లు (ఉన్నాడు.)

భ్రాంతి, తన్నిమేధము అపహ్నవాలంకారమును నిరూపించు చున్నది. మణిపై సూర్యకిరణ ప్రసారము తనచేతి నుండి జారిపడిన మణిని పైకెత్తి గ్రహించుటకు సూర్యుడు కరములను చాపుటగా ఉత్ప్రేక్షింపబడినది.

పుట 133 : "హరతి మే మనః"— ఇది నా మనస్సును హరించుచున్నది. కనుక దీనిని తీసికొందును. అని మణిని గ్రహించుట అభినయించును. రాజు మణిగ్రహణ మభినయించుచుండ నేపథ్యమున ద్విపదికా గీతి గానము చేయబడును.

శ్లో॥ 62 : అన్వయము : ప్రణయినీబద్ధా స్వాదః బాష్పాకుల నిజనయనః క్షామితవదనః దుఃఖితః గజపతిః గహనే పరిభ్రమతి.

అర్థము : ప్రణయినీ-బద్ధ-ఆస్వాదః=ప్రియురాలియందు దృఢమైన ప్రీతిగలది; బాష్ప + ఆకుల-నిజ-నయనః=కన్నీటిచేకలగిన తన కన్నులు గలది; క్షామిత - వదనః = వాడిపోయిన ముఖము గలది;

దుఃఖితః = పీడింపబడు చున్నది; అయిన, గజ-పతిః = గజరాజము; గహనే=అరణ్యమునందు; పరిభ్రమతి=తిరుగుచున్నది.

ప్రియురాలియందు నిశ్చలమైన ప్రేమగల గజేంద్రము ప్రియాన్వేషణ దుఃఖము ఉచ్చస్థితినందిన దశ వర్ణింపబడినది.

శ్లో॥ 63 : అన్వయము : యస్యాః మందారపుష్పైః అధివాసితాయాం శిఖాయాం అయం అర్పణీయః సా ప్రియా ఏవ మే సంప్రతి దుర్లభా; అస్రోపహతం ఏనం కిం కరోమి ?

అర్థము : యస్యాః = ఎవ్వతెయొక్క; మందార-పుష్పైః= మందార కుసుమములచేత; అధివాసితాయాం = సుగంధయుక్తమైన, అధివసింపబడిన; శిఖాయాం = శిఖాబంధమునందు; అయం = ఇది; అర్పణీయః = ఉంచదగినదో; సా-ప్రియా + ఏవ = ఆ ప్రియురాలే; మే=నాకు; సంప్రతి = ఇప్పుడు; దుర్లభా = దుర్లభయై యున్నది; అస్ర + ఉపహతం = కన్నీటిచే మలినమైన; ఏనం=ఈ మణిని; కిం - కరోమి=ఏమిచేయుదును.

మణిని తిలకించినంతనే రాజునకు-ఈ మణిని శిరస్సు నందలంకరించు కొనదగిన ఉర్వశి లేకపోయెగదా - యని ఒక్కసారి దుఃఖము పెల్లుబికి కన్నీరు పొంగివచ్చినది. ఆ కన్నీరు మణిని తడుపుచుండగా రాజు తనలో నిట్లు చింతించి ఆ మణిని విసర్జింపదలచెను. రాజు చిత్తవృత్తి నెఱింగిన ఆ శరీరవాణి నేపథ్యమునుండి ప్రబోధించు చున్నది.

"వత్స! గృహ్యతాం గృహ్యతాం"— నాయనా! తీసికో తీసికో. వాత్సల్యపూరితమైన సంభోధన, దిరుక్తమైన ప్రబోధము.

శ్లో॥ 64 : అన్వయము : శైల సుతా చరణ రాగయోనిః సంగమనీయః ఇతి అయం మణిః ధార్యమాణః అచిరాత్ ప్రియజనేన సంగమం ఆవహతి.

అర్థము : శైల-సుతా-చరణ-రాగ - యోనిః = పర్వతరాజపుత్రియైన గౌరియొక్క పాదముల రక్తిమనుండి పుట్టిన; సంగమనీయః-ఇతి-సంగమనీయము అనెదు; అయం-మణిః-ఈ మణి; ధార్య

మాణః=ధరింపబడుచున్నదై; అచిరాత్=శ్వరలో; ప్రియ - జనేన = ఇష్టజనముతో; సంగమం=సంయోగమును; అవహతి=కలిగించును.

మంగళదేవతయైన గౌరియొక్క చరణరాగమునుండి పుట్టినది గనుక ఈ మణి మంగళప్రదము. అవిచ్ఛిన్నసుఖదాంపత్యమే స్త్రీ పురుషులకు పరమ మంగళము. ఈ మణిని ధరించుట గౌరీచరణముల నర్చించుట.

పుట 114: "కోను ఖలు"— ఎవరో కదా నన్నిట్లు ప్రబోధించుచున్నది! రాజునకు శబ్దము వినిపించినది. వ్యక్తి కనిపించలేదు.

"కశ్చిత్ మృగచారీ మునిః"— ఎవరో మృగరూపధారియైన ముని. ఇందాక సకుటుంబముగ నగపడిన మృగము రాజు చిత్తమున తగిలినది. అదియే ఆయనకు చిట్టచివర కనబడినప్రాణి. అది అప్పుడు తన్ను అవధీరణ చేసినట్లు కనబడినది కాని యిప్పుడనుగ్రహించినది.

"హంహో! సంగమనీయ!" ఓహో సంగమనీయమా! యని రాజు హర్షాశ్చర్యములతో సంబోధించుచున్నాడు.

శ్లో॥ 65: అన్వయము: త్వం వియుక్తస్య మే విలగ్నమధ్యయా తయా సంగమాయ భవిష్యసి యది, తతః బాలం ఇందుం ఈశ్వరః ఇవ భవంతం ఆత్మనః శిఖామణిం కరిష్యామి.

అర్థము: త్వం=నీవు; వియుక్తస్య=వియుక్తుడనైన; మే = నాకు; విలగ్న-మధ్యయా=సన్నని నడుముగల; తయా = ఆమెతోడి; సంగమాయ=సంయోగముకొఱకు; భవిష్యసి-యది = కాగలిగినచో, తతః=అప్పుడు; బాలం-ఇందుం=బాలచంద్రుని; ఈశ్వరః-ఇవ=శివుడువలె; భవంతం=నిన్ను; ఆత్మనః=నాయొక్క; శిఖా-మణిం = శిరోమణిని; కరిష్యామి=చేసికోగలను.

ఉర్వశియు, తానును గౌరీశంకరులవలె అవినాభావముగ సంగతులు కావలెను, సంగనీయమణి చంద్రరేఖ కావలెను. కుమారుడు జన్మింపవలెను. ఆ మణిని చేతధరించి రాజు ముందుకు నడచుచు ఒక లతను చూచును.

"ఇమాం పశ్యతో మే రతి రుపలబ్ధా"- దీనిని చూచుచున్న నాకు రతి పుట్టుచున్నది. నదిని చూచి 'రమతే మే మనః' అనుకొనెను. మణిని చూచి 'హరతి మే మనః' అనుకొనెను. లతను చూచి 'మే రతిః ఉపలబ్ధా' అనుకొనెను. రాజు మనస్సునందలి క్రమపరిణామము గుర్తింపవలెను. విచ్ఛిన్నమైన రతి మరల ఉపలబ్ధమైనది. కుసుమ రహితమైన ఆ తీగ వియోగ దుఃఖముచే ఆభరణములు విసర్జించి యున్న ఉర్వశి.

"స్థానే మనోరమా మమ ఇయం"- ఇది నాకు మనోరమ యగుట యుక్తముగానే యున్నది. ఈ లత నా మనస్సున రతి నుద్బోధించుట యుచితమే- అని కారణము నిరూపించుచున్నాడు.

పుట 115 : శ్లో. 66 : అన్వయము : తన్వీ మేఘ జలార్ద్ర పల్లవతయా అశ్రుభిః ధౌతాధరా ఇవ; స్వకాల విరహాత్ విశ్రాంత పుష్పోద్గమా అభరణైః శూన్యా ఇవ; మధులిహాం శబ్దైః వినా చింతామౌనం ఇవ ఆస్థితా పాదపతితం మాం అవధూయ జాతానుతాపా సా చండీ ఇవ లక్ష్యతే.

అర్థము : తన్వీ=సుకుమారి; కృశించినది; మేఘ-జల + ఆర్ద్ర-పల్లవతయా=మేఘజలముచేత తడిసిన పల్లవములు కలిగియుండుటచేత; అశ్రుభిః=కన్నీళ్ళచేత; ధౌత + అధరా + ఇవ = కడుగబడిన క్రింది పెదవిగలదా యన్నట్లు; స్వ-కాల-విరహాత్ = తన ఋతువు వీడి పోయినందువలన; విశ్రాంత-పుష్ప + ఉద్గమా=అగిపోయిన పూవుల యుత్పత్తిగలదై; అభరణైః=ఆభరణములచేత; శూన్యా + ఇవ=విరహితయా యన్నట్లు; మధులిహాం=మధుకరముల యొక్క; శబ్దైః = ధ్వనులచేత; వినా=విరహితమై; చింతా-మౌనం + ఇవ=విచారముచే మౌనము దాల్చినదాయన్నట్లు; ఆస్థితా=ఉన్నదై; పాద-పతితం = పాదములపై బడిన; మాం=నన్ను; అవధూయ=నిరాకరించి; జాత + అనుతాపా=పుట్టిన పశ్చాత్తాపముగల; సా-చండీ-ఇవ=ఆ కోపనవలె; లక్ష్యతే=కనబడుచున్నది.

"ప్రియానుకారిణ్యాః పరిష్వంగ ప్రణయీ భవామి"-ప్రియురాలి ననుకరించుచున్న ఈ లతను కౌగిలించుకోవలెనని యభిలాష పడుచున్నాను. పశ్చాత్తప్తయైన యుర్వశి లక్షణములను ఉత్ప్రేక్షించుకొని తల్లక్షణ సదృశలక్షణములను లతయందు పరికించి ప్రియాసదృశయైన లతను కౌగిలించుకోవలెనని రాజు అభిలషించుచున్నాడు. ఉపలబ్ధ రతి జన్యమైన ఈ యభిలాషవల్ల లత ఉర్వశియే యన్న రాజు యొక్క దృఢవిశ్వాసము వ్యక్తమగుచున్నది. విరహముచే చిక్కిపోయి,అశ్రుధారాధౌతాధరయై, నిరస్తభూషణయై, పశ్చాత్తాపజనితమైన చింతచే మౌనముగానుండు ఉర్వశి రాజు భావనాచిత్రము. ఇంతవఱకును రాజు ఏ వస్తువునందును కౌగిలించుకో బుద్ధిపుట్టునంత గాఢముగా ఉర్వశి భావన పొందియుండలేదు.

శ్లో॥ 67 : అన్వయము : లతే ! ప్రేక్షస్వ; హృదయేన వినా భ్రమామి; విధి నియోగేన తాం పునః ప్రాప్స్యామి యది, తత్ నిర్భ్రాంతి తాం అరణ్యేన వినా కరోమి; కృతాం తాం పునః (అరణ్యే) న ప్రవేశయామి.

అర్థము : లతే=లతా; ప్రేక్షస్వ=చూడుము; హృదయేన-వినా=హృదయ శూన్యుడనై (ఏమియుతోచక) భ్రమామి = తిరుగుచున్నాను; విధి-నియోగేన = దైవయోగముచేత; తాం=ఆమెను; పునః=తిరిగి; ప్రాప్స్యే-యది=పొందగలవాడనైనచో; తత్=అంతట; నిర్భ్రాంతి = నిస్సందేహముగా; తాం = ఆమెను; అరణ్యేన=అరణ్యముతో; వినా-కరోమి=ఎడబాటుచేయుదును (అరణ్యమునుండి తీసికొనిపోదుము); కృతాం=అట్లువినాకృతయైన; తాం=ఆమెను; పునః=మరల; (అరణ్యే=అరణ్యమున); న-ప్రవేశయామి=ప్రవేశపెట్టను.

రాజు చిత్తమున లతకు ఉర్వశికి భేదము, అభేదము పెనవైచుకొని యున్నవి. పైకి లతగా కనబడుచున్నదేకాని నిజముగా ఇది ఉర్వశియే - రాజు చిత్తవృత్తి యిట్టిదని భావింపవలెను. 'లతా ! చూడు' అని ఏమో శపథములు పల్కుచున్నాడు. అది వట్టిలతయే యైనచో ఈ శపథము వ్యర్థము - అది యుర్వశియైనచో సార్థకము.

కనుక 'లతా' యన్న రాజుమాటలో 'లతారూపపరిణత' ఉర్వశి అన్న రాజు మనస్సు ఉన్నది.

"తదీయ స్థానం ఆక్రంస్య ఏవ"— ఆ లత యొక్క స్థానమును ఆక్రమించియే ఉర్వశి ప్రవేశించినది. ప్రవేశించిన ఉర్వశి స్వరూప లక్షణములు రాజు భావనా చిత్రము అచ్చొత్తినట్లున్నవని కవి యాశయము.

పుట 116 : "ని మీలితాక్షః ఏవ స్పర్శం రూపయిత్వా"— కన్నులు మూసి కొనియే స్పర్శను నిరూపించుచున్నాడు ఉర్వశీ స్పర్శము ఆయనకు చిర పరిచితము గదా.

"ఉర్వశీ గాత్రసంపర్కాదివ"— ఉర్వశీ శరీరము యొక్క సంపర్కమువల్లనా యన్నట్లు రాజు శరీరము సుఖమనుభవించు చున్నది. ఇది రాజు ఉత్ప్రేక్ష. ఇందు భ్రాంతి లేదు. సంశయ లేశ మున్నది. ఉర్వశీగాత్ర స్పర్శయే మో అన్నట్లున్నది గాని అదియే అని విశ్వాసము కలుగుటలేదు. కారణము చెప్పుచున్నాడు.

శ్లో॥ 68. అన్వయము : యత్ ప్రథమం ప్రియాం ప్రతి సమర్థయే తత్ క్షణేన మే అన్యథా పరివర్తతే; అతః స్పర్శవిభావిత ప్రియః అహం) సహసా విలోచనే వినిద్రే న కరోమి.

అర్థము : యత్=దేనిని; ప్రథమం=మొదట; ప్రియాం-ప్రతి= ప్రియురాలికి సంబంధించిన దానినిగా; సమర్థయే = భావింతునో; తత్=అది; క్షణేన=అప్పపాటులో; మే=నాకు; అన్యథా=వేఱువిధ ముగా; పరివర్తతే=మాఱిపోవును; అతః=ఇందువల్ల; స్పర్శ-విభా విత-ప్రియః=స్పర్శముచే భావింపబడిన ప్రియురాలుగల; (అహం= నేను); సహసా=వెంటనే; విలోచనే=రెండు కన్నులను; వినిద్రే=తెఱువ బడినవానినిగా; న - కరోమి=చేయను.

"శనైః చక్షుషీ ఉన్మీల్య"— మెల్లగా రెండు కన్నులు తెఱచి - తాను కౌగిలించుకొన్నది ఉర్వశినే అన్న త్వగింద్రియ ప్రత్యక్షము అన్యథాకృతకానంతవఱకు రాజు కన్నులు మూసి కొనియే యుండెను. ఆయా యవయవములను స్పృశించి ఉర్వశియే

యని నిశ్చయించుకొని అప్పుడు మెల్లగా కన్నులు తెఱచినాడు. వెనుక ఆయన నేత్రములను నమ్మి పొందిన యా శాఖంగానుభవము యొక్క సంస్కారము అంత బలిష్ఠముగా ఆయన చిత్తమునంటి యున్నది.

"కథం ! సత్యమేవ ప్రియతమా !" ఏమి ? నిజముగానే ప్రియతమయా !– మెల్లమెల్లగా కన్నులు విప్పుచు ఆపాదమస్తకము ఆమె యంగములు శిలకించి త్వాచ ప్రత్యక్షము చాక్షుషప్రత్యక్షముతో సంవదించుటచే ఆయన ఆనందాశ్చర్యములు పొందెను. నేను కౌగిలించుకొన్నది ఉర్వశిని పోలిన లతను కాదా, ఉర్వశినేనా !

"జయతు జయతు మహారాజః"– రాజు లతను కౌగిలించుకొనవచ్చుట మొదలుకొని అంతయు ఉర్వశికి తెలియును. స్వస్వరూపమును పొందియు ఆమె రాజు భ్రాంతచిత్తతను గుర్తించి కన్నుల వెంట బాష్పములు విడుచుచుండెనే కాని ఆయన సంపూర్ణముగా ప్రకృతిస్థుడగువఱకు కదలలేదు పలుకలేదు. ఉర్వశి కావించిన జయ శబ్దము విన్న పిదప రాజునకు సంపూర్ణచైతన్యము కలిగెను.

శ్లో. ౬౯ : అన్వయము : తన్వి ! త్వద్వియోగోద్భవే తమసి మజ్జతా మయా, గతాసునా చేతనా ఇవ (త్వం) దిష్ట్యా ప్రత్యుపలబ్ధా అసి;

అర్థము : తన్వి = కృశాంగీ; త్వత్ - వియోగ - ఉద్భవే = నీయొక్క యెడబాటువలన బుట్టిన; తమసి=శోకమున, అజ్ఞానమున; మజ్జతా=మునుగుచుండిన; మయా=నాచేత; గత-అసునా=పోయిన ప్రాణములుగలవానిచేత; చేతనా-ఇవ=చైతన్యమువలె, (త్వం=నీవు); దిష్ట్యా=అదృష్టవశమున; ప్రత్యుపలబ్ధా + అసి=తిరిగి పొందబడినదానవైతివి.

ఉపమాన బలమువల్ల రాజునకు ఉర్వశీ సంయోగము జీవితము, తద్వియోగము మరణము–అని వ్యక్తము. ఉర్వశికిని అట్లే యైనది. ఆయన వియోగమున ఆమె జడమైన లతయైనది. ఆయన సంయోగమువల్ల తిరిగి సచేతనయైన స్త్రీయైనది.

పుట 117 : శ్లో॥ 70 : అన్వయము : తవ కారణేన అరణ్యే రుదతా భ్రమతా మయా మయూరః పరభృత్ హంసః రథాంగః అలిః గజః పర్వతః సరిత్ కురంగః కః న ఖలు పృష్టః ?

అర్థము : తవ=నీయొక్క; కారణేన=హేతువుచేత; అరణ్యే= అడవియందు, రుదతా = రోదించుచు; భ్రమతా = తిరుగుచుండిన; మయా=నా చేత; మయూరః=నెమిలి; పరభృత్=కోకిల; హంసః = హంసము; రథాంగః=చక్రవాకము: అలిః=తుమ్మెద; గజః=ఏనుగు; పర్వతః=పర్వతము; సరిత్=నది; కురంగః = లేడి; కః=ఏది; న-ఖలు-పృష్టః=ప్రశ్నింపబడలేదో కదా.

ఉర్వశి యిప్పటికే పశ్చాత్తాపపడుచున్నదని తెలిసియు రాజు తాను పడిన దైన్యమంతయు ఆమెకు చెప్పక ఉండజాలకపోయి నాడు. ఆమె విరహమున తాను మునిగిన తమస్సుయొక్క స్వరూప మును తన జడచేతన వివేకశూన్యమైన ప్రవర్తన కథనమువల్ల వ్యక్తము చేయుచున్నాడు.

"అభ్యంతర కరణయా మయా ప్రత్యక్షీకృత వృత్తాంతః"- లోలోపల అణగియున్న యింద్రియ శక్తిగల నేను మహారాజు వృత్తాంతము సర్వము ప్రత్యక్షముగా దెలిసికొనియే యుంటిని. నా యింద్రియశక్తి యణగిపోయినది. కనుకనే లోలోన కుములు చుంటినే కాని నీ వద్దకు రాలేకపోతిని. నీ పిలుపులకు పలుకలేక పోతిని.

"ప్రసన్న బాహ్యాంతఃకరణః అంతరాత్మా"— నా యంత రాత్మ ప్రసన్నములయిన బాహ్యకరణములు, అంతఃకరణములు కలదియైనది. చైతన్యము తమస్సున మునుగుటచే బాహ్యకరణ ములు, అంతఃకరణములు సమ్మూఢములైనవి. ఇప్పుడు నీ దర్శనము వల్ల చైతన్యము, ఇంద్రియములు తేరుకొన్నవి.

చైతన్యము యొక్క ఉపకరణములు కరణములు. త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము-ఇవి బాహ్యకరణములు.

మనస్సు, చిత్తము, బుద్ధి, అహంకారము - ఇవి అంతఃకరణములు. అజ్ఞానరూపమైన తమస్సు అతిశయించినప్పుడు ఇవి మలినములై దుఃఖ హేతువులగును. జ్ఞానరూపమైన సత్త్వము అతిశయించినప్పుడు ఇవి ప్రసన్నములై సుఖహేతువులగును.

రాజు ఉర్వశిని విడిచి తానెట్లుండెనో చెప్పి నన్ను విడిచి నీవెట్లుంటివో చెప్పుమని యామె నడిగెను.

పుట 118 : "గురుశాప సంమూఢ హృదయా"- భరతముని శాపమువల్ల విస్మృతి యావరించిన హృదయము కలదాననై; "అగృహీ నతా నుయా" - నీ యనునయమును గ్రహింపని దాననై - ఈ రెండు కారణములవల్ల కుమారవనము ప్రవేశించితిని.

"వాసంతీ లతా సంవృత్తా"— వసంతమునందే పుష్పించు అడవిమొల్ల తీగెను అయితిని. కనుకనే గ్రీష్మాంతమున పూలు లేక యున్నది.

"ప్రియే! సర్వం ఉపపన్నం"— ప్రియురాలా! అంతయు సమంజసముగనే యున్నది. నన్ను విడిచి వెళ్లిన నాటినుండి నేటివఱకు నీవు లతా రూపముగనే ఉండి యుందువు. లేకున్నచో నన్ను విడిచి నీవు క్షణము ఉండగలవా?

శ్లో. 71 : అన్వయము : ప్రియే! యా (త్వం) శయనే రతిఖేదసుప్తం అపి మాం ప్రవాసగతం మన్యసే సా త్వం మదీయం చిరవియోగం కథం సహేథాః?

అర్థము : ప్రియే = ప్రియురాలా; యా (త్వం) = ఏ నీవు; శయనే = శయ్యయందు; రతి-ఖేద-సుప్తం-అపి = రతివలని యలసటచే నిద్రించియున్నప్పటికిని; మాం = నన్ను; ప్రవాస-గతం = దూరదేశమందున్న వానినిగా; మన్యసే = తలంతువో; సా-త్వం = ఆ నీవు; మదీయం = నా సంబంధమైన; చిర-వియోగం = దీర్ఘమైన విరహమును; కథం = ఎట్లు; సహేథాః = సహించియుందువు?

పుట 119 : "అహో? సంగమనీయః?"- ఓహో! సంగమనీయ మణియా?- చిత్రలేఖవలెనే ఉర్వశియు సంగమనీయమణి ప్రకాశము తెలియును.

"క్షణమాత్రం స్థీయతాం"- ఒక క్షణము అట్లే యుండుము. సంగమనీయమణిని భక్తితో ఉర్వశి శిరమున ధరింపగా ఆమె ముఖము నకు అపూర్వశోభ కలిగినది. ఆ శోభను గాంచి ముగ్ధుడైన రాజు మరి కొంతసేపు చూచి యానందింపవలెనని ఆమెను క్షణమాత్ర మట్లే యుండుమని చెప్పి ఆ సౌందర్యమును వర్ణించు చున్నాడు.

శ్లో॥ 72 : అన్వయము : లలాటనిహితస్య మణేః స్ఫురతా రాగేణ విచ్ఛురితం ఇదం తే ముఖం బాలాతపరక్త కమలస్య శ్రియం ఉద్వహతి.

అర్థము : లలాట-నిహితస్య=నుదుట నుంచబడిన; మణేః=మణి యొక్క; స్ఫురతా = మెఱయుచున్న; రాగేణ = ఎఱ్ఱని కాంతి చేత; విచ్ఛురితం = వ్యాప్తమైన; ఇదం = ఈ; తే=నీ యొక్క; ముఖం= ముఖము; బాల + ఆతప-రక్త - కమలస్య = లేత యెండచే నెఱ్ఱవడిన కమలము యొక్క; శ్రియం=శోభను; ఉద్వహతి=వహించుచున్నది.

చిరవియోగ దుఃఖవశమున ఉర్వశి ముఖము పాలిపోయి తెల్ల తామరపూవువలె నున్నది. సంగమనీయమణి యొక్క ఎఱ్ఱని కాంతులు ప్రసరించి యిప్పుడు అరుణకమలమువలె నున్నది.

"ప్రియంవద !"— మధురముగా మాట్లాడువాడా !— తన యందమును గూర్చి రాజు పలికిన మాట ఉర్వశికి ప్రియముగా నున్నది. ప్రియంవదత్వము ఉత్తమనాయకలక్షణము.

"అసూయంతి మహ్యం ప్రకృతయః"— ప్రజలు నన్ను గూర్చి యసూయ పడుదురు. నాపై కోపము పూనుదురు. ప్రతిష్ఠానమును నీవు విడిచివచ్చి చాల కాలమైనది. నేను నిన్ను తమనుండి చిర కాలము వేఱు పరచితినని నీ యందనురక్తులయి, నీ వియోగము సహింప జాలని ప్రజలు నన్ను నిందింతురు. నీ యనురాగమంతయు నేనే యనుభవించు చుంటినని యసూయ వహింతురు. కనుక మరలి పోదము రమ్ము.

"యదాజ్ఞాపయతి భవతి"— నీవు ఆజ్ఞాపించినట్లే. రాజు ప్రియాభిధేయతకు ఈ మాట గుర్తు.

పుట 120 : "కథం మహారాజో గంతు మిచ్ఛతి"— మహారాజు ఎట్లు వెళ్ల గోరుచున్నాడు. నిద్రాహారములు లేకుండ తిరిగి తిరిగి అలసియున్న రాజును త్రుటిలో ప్రతిష్ఠానమున చేర్చుట ఉర్వశి యాశయము. జరిగిన యాలస్యమున కిది విరుగుడు.

శ్లో॥ 73 : అన్వయము : ఖేల గమనే ! అచిర ప్రభావిలసితైః పతాకినా సురకార్ముకాభినవ చిత్రశోభినా విమానతాం గమితేన నవేన పయోముచా మాం వసతిం నయ.

అర్థము : ఖేల - గమనే = స విలాసగమనా; అచిరప్రభా - విలసితైః= మెఱుపుతీగె కాంతులచేత; పతాకినా=ధ్వజముగలదియు; సుర-కార్ముక-అభినవ-చిత్ర-శోభినా = ఇంద్ర ధనుస్సు అనెడు సరిక్రొత్త చిత్రములతో శోభిల్లునదియు; విమానతాం=విమానత్వమును; గమితేన=పొందింపబడినదియు; అయిన; నవేన=క్రొత్తదైన; పయోముచా=మేఘముచేత; మాం=నన్ను; వసతిం=ఇంటికి; నయ=తీసికొని పొమ్ము.

మెఱపులకాంతి పతాకముగా, ఇంద్రధనుస్సు అభినవచిత్రములుగా పరిణమించుటతో నవమేఘము విమానముగా పరిణమించినది. ఆకాశమం దగపడుచున్న మేఘదృశ్యమే రాజునకు ఇట్టి కోరిక కలిగించినది. ఉర్వశి లేనంతసేపు మేఘము తనపై అధికారము చేసినది. ఇప్పుడు తాను దానిపై అధికారము చేయును. మేఘ విమానమునెక్కి ఉర్వశీసహితుడై రాజు ప్రయాణము చేయుచుండగా నేపథ్యమునుండి చర్చరీగీతము వినబడును.

శ్లో॥ 74 : అన్వయము : ప్రాప్త సహచరీసంగమః పులక ప్రసాధితాంగః స్వేచ్ఛా ప్రాప్త విమానః హంసయువా విహరతి.

అర్థము : ప్రాప్త-సహచరీ-సంగమః = పొందబడిన ప్రియా సంగమము గలది; పులక-ప్రసాధిత-అంగః = హర్ష రోమాంచముచే అలంకరింపబడిన శరీరము గలది; స్వేచ్ఛా - ప్రాప్త-విమానః = స్వేచ్ఛగా పొందబడిన ఆకాశయానముగలది (తన కోరికచే పొందబడిన

విమానముకలవాడు రాజు); హంస-యువా=యువహంసము; విహ
రతి = విహరించుచున్నది.

మేఘోదయమైన పిమ్మట హంసలు ఆ ప్రాంతమును విడిచి పోవును. మిగిలిన హంసలు పోయినను ప్రియురాలికొఱకై యన్వేషించుచుండిన ఒక యువహంసముమాత్ర మచ్చటనే యున్నది. ప్రియురాలిని విడిచిపోవుటకు దానికి బుద్ధిపుట్టలేదు. ఎట్టకేలకు ప్రియురాలు లభించినది. దానితో కలిసి సంతోషముతో ఆ యువహంసము స్వేచ్ఛగా ఆకాశయానమున విహరించుచున్నది. నేపథ్యమున ఈ గీతము పాడబడుచుండగా యవనిక వ్రాలును.

---

# పంచమాంకము

"పరితుష్టః"- చాలకాలము రాజు నగరమున లేనందున విదూషకునకు కాలము నీరసముగా గడచెను. ఆయన తిరిగివచ్చిన పిదప వానికి సంతుష్టి కలిగెను.

"ప్రకృతిభిః అనురజ్యమానః"- ప్రజలచే రంజింపచేయబడుచున్నవాడు. పురూరవుడు ప్రజారంజకుడు, ప్రజలాయనపట్ల అనురక్తులు.

"అసంతానత్వం వినా"- సంతానహీనత్వము తప్ప రాజునకు ఏ లోటునులేదు. సంతానాపేక్షచేతనే ఆయన రాణులతో కలిసి గంగాయమునా సంగమమున స్నానమాడబోయెను. ఆయనకు పలువురు భార్యలుండినను ఎవ్వరియందును సంతానము కలుగలేదు. నాయకుని యసంతానత్వప్రసంగము ఆయన సంతానప్రాప్తికి సూచన. కనుక సమగ్ర ఫలప్రాప్తి రూపమయిన నిర్వహణసంధి యిట ప్రారంభించుచున్నది. ఉర్వశీ పురూరవుల యనురాగబీజము పుత్ర లాభరూపమున ఫలింపబోవుచున్నది.

"ఉపకార్యాం"- రాజభవనమును. రాజభవనము గంగాయమునా సంగమమందే యున్నది. కాని స్నానానంతరము రాజు ప్రవేశించినది ప్రత్యేకము నిర్మింపబడిన పటభవనమే యని భావింపవలెను. ఆ పటభవనమునం దాయన యలంకరణము గావించుకొనుచుండెను.

పుట 122: "గృధ్రేణ ఆక్షిప్తః"- ఒక దాసి సంగమనీయమణిని నెత్తిపై నుంచుకొని తీసికొనిపోవుచుండగా ఒక గ్రద్ద మాంసఖండమని భ్రమపడి దానిని ఎగదన్నుకొనిపోయెను. సంగమనీయమణిని తొలుత చూచినప్పుడు రాజు కూడ అది 'ఆమిషలవ' మని భ్రమపడెను గదా.

నేపథ్యమందలి యీ హాహాకారమును విని రాజు అలంకరణము ముగియకుండగనే బయటికివచ్చెను. అట్లు వచ్చుటకు ఆ మణియందు ఆయనకు గల అత్యాదరమే కారణము.

శ్లో॥ 1 : అన్వయము : యేన తత్ప్రథమం స్తేయం గోప్తుః ఏవ గృహే కృతం ఆత్మనః వధం అహర్తా అసౌ విహగతస్కరః క్వ ?

అర్థము : యేన=ఎవ్వనిచేత; తత్-ప్రథమం=అదియే మొదటిదైన; స్తేయం = చౌర్యము; గోప్తుః + ఏవ = రాజుయొక్కయే; గృహే=మందిరమందు; కృతం=చేయబడినదో; ఆత్మనః=తనయొక్క: వధం=చావున; అహర్తా=తెచ్చుకొనుచున్న; అసౌ = ఈ; విహగ - తస్కరః = దొంగపక్షి; క్వ=ఎక్కడ.

"తత్ప్రథమం స్తేయం"- అదియే మొదటి దొంగతనము. అనుభవముగల దొంగ రాజగృహమున చౌర్యమునకు పూనడు. అది తన ప్రాణము మీదికి వచ్చునని వానికి తెలియును. అదే మొదటిసారి దొంగతనముచేయుట అయిన వానికి పట్టుబడినచో ఫలితమెట్లుండునో తెలియదు.

పుట 123 : "లిఖన్ ఇవ ఆకాశం"- ఆకాశమును ఒరసికొనుచున్నట్లు. ఇది కిరాతి ఉత్ప్రేక్ష. ఎఱ్ఱని మణితో ఆకాశమున గీతలు గీయుచున్నదా యన్నట్లు పక్షి మిక్కిలి ఎత్తున ఎగురుచున్నది.

శ్లో॥ 2 : అన్వయము : ముఖలంబిత హేమసూత్రం మణిం బిభ్రత్ మండలచారశీఘ్రః అసౌ విహంగః అలాతచక్రప్రతిమం తద్రాగ రేఖా వలయం తనోతి.

అర్థము : ముఖ-లంబిత - హేమ - సూత్రం = ముక్కునుండి వ్రేలాడుచున్న బంగరు సూత్రముగల; మణిం = మణిని; బిభ్రత్ = తాల్చినదై; మండల-చార=శీఘ్రః=గుండ్రముగా దిరుగుటయందు వేగముగల; అసౌ-విహగః=ఈ పక్షి; అలాత-చక్ర-ప్రతిమం=కొఱవి త్రిప్పటను పోలిన; తత్-రాగ - రేఖా-వలయం = ఆ మణియొక్క ఎఱ్ఱని గీతచేతనైన మండలమును; తనోతి=వ్యాపింపజేయుచున్నది.

"అపరాధీ శాసనీయః"- అపరాధి శిక్షార్హుడు. రాజు పక్షిని జూచుచు 'ఏమి చేయవలెనో' తోచని స్థితిలోనుండగా విదూషకుడు దీని యందు దయజూడవద్దు- అనుచున్నాడు. రత్నాపహారియైన పక్షిపట్ల రాజు మొదట కోపించియు దాని ఆకాశమండల సంచారముగాంచి సంహరించు తలంపుమానినాడు. మాంసఖండమని భ్రమించినది పాపము అని జాలిపడెనుగాబోలు. ఆయన దయార్ద్రహృదయుడని సూచన. ఉర్వశిని హరించిన కేశినే ఆయన వాయవ్యాస్త్రముచేత సముద్రమున త్రోయించెను గాని సంహరించలేదు. అపరాధులందును ఆయన ఎక్కువ కఠినుడుకాడు.

"ధనుర్ధను స్తావత్"- అపరాధిని నిర్దయగా దండించవలెనని విదూషకుడన్నమీదట, మణిని దక్కించుకొనుటకు మార్గాంతరము కానక రాజు విల్లు తెమ్మనెను.

"యవనీ"- యవనస్త్రీ. రాజు యొక్క ఆయుధములను భద్ర పఱచుటకు పాశ్చాత్య స్త్రీలను వినియోగించెడివారని తలంపవలెను. అట్లే రత్నాద్యాభరణ రక్షణమున కిరాతస్త్రీలు నియుక్తలు.

"కుణపభోజనః"- శవములను భుజించునది. చూచుచుండగనే గృధ్రము దక్షిణ దిగంతమునకు బోయినది. రాజునకు ప్రియమైన మణిని హరించినదని విదూషకునకు దానిపై కోపము. కనుకనే దానిని శవభోక్త యని నిర్దేశించుట.

శ్లో॥ 8 : అన్వయము : అసౌ ఖగః ప్రభాపల్లవితేన మణినా అశోక స్తబకేన ఇవ దిఙ్ముఖస్య అవతంసకం కరోతి.

అర్థము : అసౌ-ఖగః= ఈ పక్షి; ప్రభా-పల్లవితేన = కాంతివిర జిమ్ముచున్న; మణినా=మణిచేత; అశోక - స్తబకేన + ఇవ = అశోక పుష్ప గుచ్ఛముచేతవలె; దిక్ + ముఖస్య = దిక్కుయొక్క ముఖము నకు; అవతంసకం = కర్ణభూషణమును; కరోతి= చేయుచున్నది.

కాంతులు విస్తరించుచున్న మణి అశోకగుచ్ఛమువలె నున్నది. "రక్తాశోక స్తబక సమరాగః మణిః అయం" అని మొదట మణిని

చూచి నప్పుడు రాజు తలంచెను. 'దిక్' స్త్రీలింగముగుటచేత-దిక్కునెడి స్త్రీయొక్క ముఖమునకు మణియనెడు అశోకగుచ్ఛ భూషణమును కలిగించుచున్నట్లు పక్షి తోచుచున్నది. ఇది రాజుయొక్క శృంగారైకదృష్టి. దొంగయైన పక్షియందు రాజు శృంగారపురుషుని ఉత్ప్రేక్షించుచున్నాడు.

పుట 124 : "బాణపథమతీతః క్రవ్యభోజనః"- ఆమాంసభోక్త బాణమార్గమును దాటిపోయినది. అస్త్రమెంత దూరమైన పోగలదు కాని బాణము పోగల దూరమునకు పరిమితియున్నది. రాజు హృదయ మార్దవమును స్థాపించుటకు, ఉత్తర కథకు అవకాశము కల్పించుటకు కవి పక్షిని తప్పించుకొని పోనిచ్చెను.

శ్లో. 4; అన్వయము : ఇదానీం పతత్రిణా దూరం నీతః మణి విశేషః నక్తం పరుషఘనచ్ఛేదసంయుక్తః లోహితాంగః ఇవ ఆభాతి.

అర్థము : ఇదానీం = ఇప్పుడు; పతత్రిణా = పక్షిచేత; దూరం=దూరముగా; నీతః=తీసికొని పోబడిన; మణి-విశేషః=ప్రశస్తమైనమణి; నక్తం=రాత్రియందు; పరుష-ఘన-చ్ఛేద-సంయుక్తః=దట్టమైన మేఘ శకలముతో గూడిన; లోహితాంగః-ఇవ=అంగారక గ్రహమువలె; ఆభాతి=మెఱయుచున్నది.

మబ్బు మఱుగున నున్న ఎఱ్ఱని యంగారక గ్రహము ఎట్లు మినుకు మినుకు మనునో అట్లే మణికూడ దూరమునందుండి మినుకు మినుకు మనుచున్నది. పక్షి యసలే కనబడుటలేదు.

పుట. 125 : సాయంకాలము గూండ్లకు జేరు పక్షులలో ఈ రత్నము నపహరించిన పక్షిని వెదకవలసినదిగా నగర రక్షకునకు జెప్పుమని కంచుకిని బంపి రాజు కూర్చుండి ఆ మణిని గూర్చియే ఆలోచించు చున్నాడు.

శ్లో. 5 : అన్వయము : విహంగ మాక్షిప్తే తస్మిన్ మణౌ మమ రత్నం ఇతి ప్రియత్వం న; సఖే! తేన సంగమనీయేన ప్రియయా సంగమితః అస్మి.

అర్థము : విహంగమ + అహృతే=పక్షిచే ఎగవెత్తికొనిపోబడిన; తస్మిన్-మణౌ = ఆ మణియందు; మమ=నాకు; రత్నం-ఇతి=రత్నము అని; ప్రియత్వం-న=ఆదరము కాదు; సఖే=సఖుడా; తేన-సంగమనీయేన=ఆ సంగమనీయ మణిచేతనే; ప్రియయా=ప్రియురాలితో; సంగమితః=కలుపబడినవాడను; అస్మి=అయినాను.

"నను పరిగతార్థః అస్మి కృతః భవతా" - నీచేత ఈ యంశము ఇదివఱకే తెలియచెప్పబడితినిగదా. రాజు ఉర్వశీ విరహితుడై గంధమాదనమున బడిన పాట్లన్నియు రహస్యముగనే యుంచెను. ఒక్క విదూషకునకు మాత్రమే చెప్పెను. కనుకనే 'కిరాతి' మణిని గ్రద్ద ఎత్తుకొని పోయెనని కేకలు పెట్టెనేకాని మణి పేరు చెప్పలేదు. దానికి ఆమణి సంగమనీయము అని తెలియదు.

శ్లో॥ 6 : అన్వయము. మార్గణతాం గతేన అనేన తే బలేన నిర్భిన్న తనుః అపరాధోచితం ప్రాప్య వధ్య సః పతత్రీ సమౌళి రత్నః అంతరిక్షాత్ పతితః.

అర్థము ; మార్గణతాం-గతేన = బాణత్వమును పొందింపబడిన; అనేన-తే-బలేన=ఈ నీయొక్క బలముచేత; నిర్భిన్న-తనుః = చీల్పబడిన శరీరముగలదై; అపరాధ + ఉచితం=నేరమునకు దగిన దానిని; ప్రాప్య=పొంది; వధ్యః=వధింపదగిన; సః-పతత్రీ=ఆ పక్షి; స-మౌళి రత్నం=శిరోరత్నముతో గూడినదై; అంతరిక్షాత్=ఆకాశమునుండి; పతితః=పడినది.

రాజుయొక్క బలము బాణత్వముపొంది పక్షిని సంహరించి పడి. దానిని ప్రయోగించినవాని బలమునకు బాణము గుర్తు. ప్రయోగించినవాడు రాజు వీర్యమునకు గుర్తు. కంచుకి ఈ మాటలను రాజు తృప్తి కొఱకు స్తుతిగా పలికెను. నీవు బాణము ప్రయోగింపకున్నను నీ బలమే బాణమై ఈ పక్షిని పడగొట్టినది - కంచుకి పలికిన యీ వాక్యమున భావ్యర్థ మిమిడియున్నది.

"అగ్నిశుద్ధం ఏనం కృత్వా" - దీనిని అగ్ని శుద్ధముచేసి పేటికలో నుంచుము. పక్షి రక్తమంటిన మణిని కంచుకి నీటితో

కడిగెను. అంతమాత్రము శుద్ధి చాలదు. శవభోక్త యంటుకొన్నది గనుక అది పవిత్రమైన మణి గనుకను అగ్నిశుద్ధి యవసరమని రాజు పలికెను. మణి ప్రభావము కంచుకి యెఱుగడుగదా.

పుట 126 ; "న తు మే వర్ణవిచారక్షమా దృష్టిః" - బాణమునందు నామాక్షరము లున్నట్లున్నది కాని నా చూపు అక్షరములను గుర్తించు శక్తి లేనిది అని వృద్ధ కంచుకి యనుట స్వాభావికము. "తేనహి ఉపనయ శరం" - కనుక నే బాణమును దగ్గరకు తెమ్ము-అది ఎవ్వని బాణమో ! రాజు దానిని స్పృశింపకు. "సావత్యతాం రూపయతి"- నామాక్షరములను జదువుకొని రాజు తాను సంతానవంతుడనైతిని అన్న భావమును అభినయించును. అతని ఆలోచనను చూచి విదూషకుడు 'ఏమిటి ఆలోచించు చుంటివి ?' అని ప్రశ్నించును.

శ్లో॥ 7 : అన్వయము : అయం ఉర్వశీ సంభవస్య ఐలసూనోః ధనుర్భృతః ద్విషదాయుషాం ప్రహర్తుః కుమారస్య ఆయుషః బాణః.

అర్థము : అయం=ఇది; ఉర్వశీ-సంభవస్య = ఉర్వశియందు జన్మించిన; ఐల-సూనోః = పురూరవుని పుత్రుడైన; ధనుః + భృతః= ధనుర్ధారుడైన; ద్విషత్ + ఆయుషాం = శత్రువుల ప్రాణములను; ప్రహర్తుః=హరించునట్టి; కుమారస్య=చిరంజీవియైన; ఆయుషః= ఆయువుయొక్క; బాణః=బాణము.

పుట. 127 : "దిష్ట్యా సంతానేన వర్ధతే భవాన్" - అదృష్టవశమున నీవు సంతానముచే వర్ధిల్లుచున్నావు. విదూషకునకు ఇప్పుడు సంపూర్ణమైన తృప్తి కలిగినది.

దక్షిణ దిగంతమున దిరుగుచున్న పక్షిని ఆయువు తన బాణముతో కొట్టెను. ఆ బాణ వేగముచేత బాణసహితమైన పక్షి వచ్చి ప్రతిష్ఠాన నగరమున బడినది. దానిని కంచుకి అప్పటి కప్పుడే తెచ్చెను. బాణము ప్రయోగించిన ఆయువుయొక్క బలము దీనిచే వ్యక్తమగును. పురూరవుని వీర్యమువల్ల జన్మించిన ఆయువుయొక్క బలము పురూరవుని బలమే. 'మార్గణానాం గతేన తే బలేన' అని కంచుకి యనిన మాట కిదియే అర్థము.

"అన్యత్ర నైమిషేయ సత్రాత్"- నైమిశారణ్యమున గావించిన యాగమునదప్ప ఎచ్చటను ఎప్పుడును రాజు ఉర్వశిని విడిచియుండలేదు. మఱి యీ కుమారుడెప్పుడు పుట్టెను. అప్పుడే పుట్టెనన్నమాట. యాగకాలమున రాజు దీక్షవహించియుండవలెను గనుక ఆయన ఉర్వశిని విడిచియుండెను. ఉర్వశి యందెంత యాసక్తుడైనను ధర్మకార్య నిర్వహణమునకు దానివల్ల ప్రతిబంధము కలుగనీయడు రాజు. ఉర్వశియందు గర్భలక్షణము లాయన కెన్నడు కనబడలేదు. కాని ఇప్పుడాలోచింపగా అల్పమైన సూచనలు గుర్తువచ్చినవి.

శ్లో. 8 : అన్వయము : కతిచిత్ అహాని కేవలం తస్యాః వపుః అవిలపయోధ రాగ్రం లవలీదల పాండురాననచ్ఛాయం అలసేక్షణం అభూత్.

అర్థము : కతిచిత్-అహాని=కొద్దిరోజులు; కేవలం = కేవలము; తస్యాః=ఆమెయొక్క; వపుః=శరీరము; అవిల-పయోధర + అగ్రం= నల్లనైన కుచముల మొనలుగలది; లవలీ-దల-పాండుర + ఆనన - ఛాయం=వెన్నెలతీగె ఆకులవలె తెల్లనైన ముఖవర్ణము గలది; అలస-ఈక్షణం=మందమైన కన్నులు గలది; అభూత్=ఆయెను.

ఏనాడో తాను గుర్తించియు విస్మరించిన గర్భలక్షణములను రాజు స్మరించుచున్నాడు. ఆ లక్షణములలో ముఖ్యమైన ఉదరవృద్ధి లేదు. "మానుషీ ధర్మం"- మానవస్త్రీల గర్భలక్షణము లన్నియు దివ్యస్త్రీలయందు ఉండకపోవచ్చునని విదూషకుడు. దేవతాస్త్రీల ప్రవర్తనలు రహస్యములుగా నుండునుగదా.

"పుత్ర సంవరణే కిమివ కారణం"— గర్భచిహ్నములను రహస్యముగా అణచిపెట్టినది సరియే. కాని కుమారుని రహస్యముగా దాచియుంచుటలో ఉర్వశి యభిప్రాయ మేమైయుండును? అని రాజు తర్కించుచున్నాడు. దేవరహస్యములను ఎవ్వడూహింపగలడు? సంతానము లేదని చింతించుచున్న నీకు ఆమెయందు సమర్థుడైన పుత్రుడు జన్మించినాడు. దానిని గూర్చిన వివరములను ఊహించుట అనవసరము అని విదూషకుడు. ఇది శుభవార్త కదా. ఉర్వశి దీనిని ఏల దాచియుంచినది? అని రాజు జిజ్ఞాస.

పుట 123 : "చాపహస్తేన కుమారేణ"- చాపముహస్తమున గల కుమారునితో తాపసి ప్రవేశించెను. ఈ ప్రవేశము సాభిప్రాయము. ధనుర్విద్యయందలి అత్యంతాభినివేశము సూచించును. "గృధ్రలక్ష్యవేధి అర్ధనారాచః"- గ్రద్దను గురిచూచి కొట్టిన అర్ధచంద్రబాణము ఎంత మూఢుడైనను విదూషకుడు కొన్ని సందర్భములందు చురుకైన బుద్ధిగలవాడే. గ్రద్దను కొట్టి పడవైచిన అర్ధనారాచము ఈ క్షత్రియ మాకురునిదే కాబోలు. ఈతడు నిన్ను మిక్కిలిగా పోలియున్నాడు అనుచున్నాడు. రాజునకును అట్లే తోచినది.

పుట. 129 : శ్లో. 9. అన్వయము. అస్మిన్ నిపతితా మమ దృష్టిః బాష్పాయతే; హృదయం వాత్సల్యబంధి; మనసః ప్రసాదః; ఉజ్ఝితధైర్యవృత్తిః సంజాతవేపథుభిః అంగైః ఏనం అదయం పరిరబ్ధుం ఇచ్ఛామి.

అర్థము : అస్మిన్=వీనియందు; నిపతితా = ప్రసరించినట్టి; మమ=నా యొక్క; దృష్టిః=చూపు; బాష్పాయతే=బాష్పమయమగుచున్నది; హృదయం=హృదయము; వాత్సల్యబంధి = వాత్సల్యబద్ధము (అగుచున్నది); మనసః=మనస్సునకు; ప్రసాదః=ప్రసన్నత (కలుగుచున్నది); ఉజ్ఝిత-ధైర్య-వృత్తిః=విడువబడిన ధైర్య వ్యాపారముగలవాడనై; సంజాత-వేపథుభిః = పుట్టిన కంపముగల; అంగైః=అంగములతో; ఏనం=వీనిని; అదయం=నిర్దయముగా, గాఢముగా; పరిరబ్ధుం=కౌగలించుకొనుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

అల్లంత దూరమునుండియే రాజు ఆతనిని తన పుత్రుడని గుర్తించి కౌగిలించుకొన నువ్విళ్ళూరెను. లేకలేక కలిగిన పుత్ర సంతానము - విశేషించి యింత కాలము అజ్ఞాతముగానుండి నేడు ఆకస్మికముగా కనబడినాడు - ప్రాణపదమైన సంగమనీయ మణిని రక్షించి పెట్టినాడు. అట్టి పుత్రుని గాంచి రాజు వాత్సల్య పరవశుడైనాడు, బాష్పము రోమాంచము అను సాత్త్విక భావములు ఆ పారవశ్య లక్షణములు.

"జాత ! ప్రణమ తే గురుం" - బిడ్డా ! నీ తండ్రికి నమస్క రింపుము. బోలికను బట్టియే తాపసి పురూరవుడే ఆయువు తండ్రి యని గ్రహించెను.

"చాపగర్భ మంజలిం కరోతి" - చాపముతో కలిపియే అంజలి బంధించెను. ఇది క్షత్రియ సంప్రదాయము.

పుట. 180 : శ్లో॥ 10 : అన్వయము : అయం మమ పితా, అహం అస్య సుతః ఇతి శ్రుత్వా ఇదం హార్దం యది, ఉత్సంగవర్ధితానాం (సుతానాం) గురుషు కీదృశః స్నేహః భవేత్.

అర్థము : అయం=ఈతడు; మమ=నా యొక్క; పితా=తండ్రి; అహం=నేను; అస్య=ఈతని యొక్క; సుతః=పుత్రుడను; ఇతి=అని; శ్రుత్వా = విని; ఇదం = ఈ, ఇట్టి, హార్దం-యది = ప్రేమయైనచో; ఉత్సంగ - వర్ధితానాం = ఒడిలో పెంపబడినవారికి; (సుతులకు); కీదృశః = ఎటువంటి; స్నేహః = ప్రేమ; భవేత్ = కలుగునో కదా.

"కిమపి నిమిత్తం అవేక్ష్య" - ఏదో తాత్కాలిక కారణమును తలచి- పుట్టిన వెంటనే ఉర్వశి తన పుత్రుని రహస్యముగా తన చేతు లందేల ఉంచినదో తాపసికిని దెలియదు. వారిరువురకు గల స్నేహ బలమునుబట్టి తాపసి యడుగలేదు. ఉర్వశి చెప్పలేదు. తనకు పురూ రవునివల్ల కలిగిన పుత్రుడని మాత్రము చెప్పెను.

"ధనుర్వేదే అభివినీతః"- అన్ని విద్యలు నేర్చినాడు. ధనుర్విద్య యందు మాత్రము ఆరితేరినాడు. ఆశ్రమమందున్నను క్షత్రియ కుమారోచిత సంస్కారములకు, విద్యాభ్యాసములకు లోపము కలుగలేదు.

పుట 181 : గృహీతామిషః కిల గృధ్రః"- మాంసమును తెచ్చికొన్న గ్రద్ద. ఆశ్రమవాసులు కూడ గ్రద్ద ముక్కున వ్రేలాడుచుండినది మాంస ఖండమే యని భ్రమపడిరి. ఆయువు బాణము తగిలి గ్రద్ద చచ్చి యచ్చటనే పడలేదు. ఆ బాణముయొక్క వేగమువల్ల అచ్చటినుండి ముక్కున వ్రేలాడు మణితోసహా ప్రతిష్ఠానమున వచ్చిపడినది.

"రాజాన మవలోకయతి"-విదూషకుడు రాజువంక చూచును. నేను ఊహించినమాట నిజమేయైనది చూచితివా యని ఆ చూపునకు అర్థము. "నిర్యాతయ హస్తన్యాసం"- నీ చేతియందలి న్యాసమును (దాచనిచ్చిన వస్తువును) అప్పగించివేయుము. ఆశ్రమ విరుద్ధచర్యలు అరంభించిన అయువును చ్యవనమహర్షి తతుణమే పంపివేయగోరెను. పిల్లవాని పేరు చెప్పలేదు- హస్తన్యాసం' అని యూరకుండెను. 'నిర్యాతయ'- అన్న కర్తరి ప్రయోగమున సత్యవతికి గూఢముగా మందలింపుకూడ కలదు. కనుక తతుణమే ఆమె బయలుదేరి వచ్చినది. చ్యవనాశ్రమము ప్రతిష్ఠాననగరమునకు మిక్కిలి చేరువనే యున్నదని తోచును. రాజు, విదూషకాదులు సంభాషించుచుండగనే కుమారుడు గ్రద్దను కొట్టుట, అది చ్యవనునకు తెలియుట, ఆయన యాజ్ఞాపించుట, తాపసి కుమారుని వెంటబెట్టుకొని రాజు దగ్గరకు వచ్చుట జరిగినవి. గ్రద్దను కొట్టుటకు తీసిన విల్లు చేతనుండగనే పిల్లవానిని తాపసి యట్లే తీసికొనివచ్చినది. కనుక రాజనగరమునకు ఆశ్రమము చాల చేరువనే ఉండవలెను.

"దేవీం ఉర్వశీం"- మహారాణియైన ఉర్వశిని- ఇతరు లెవ్వరును ఉర్వశిని 'దేవి' యనలేదు. "ఆహూయతాం ఉర్వశీ"- ఉర్వశిని పిలువుము - రాజు 'ఉర్వశీ' అనెనే కాని 'దేవీ ఉర్వశీ' అనలేదు. ఔశీనరి విషయమున మాత్రము దేవీ శబ్దము తప్పక ప్రయుక్తమగును.

పుట 182: శ్లో॥ 11 : అన్వయము : సుతస్య స్పర్శః సర్వాంగీణః కిల; ఉపగతేన తేన తావత్ మాం చంద్రకరః చంద్రకాంతం ఇవ అహ్లాదయస్వ.

అర్థము : సుతస్య = పుత్రునియొక్క; స్పర్శః = స్పర్శము; సర్వాంగీణః-కిల=సర్వాంగములకు సుఖము గలిగించునది కదా; ఉపగతేన=పొందబడిన; తేన=దానిచే (ఆ స్పర్శచే); తావత్ = ఇప్పుడు, వెంటనే; మాం=నన్ను; చంద్రకరః=చంద్రకిరణము; చంద్రకాంతం-ఇవ=చంద్రకాంత శిలనువలె; అహ్లాదయస్వ=సంతోషపెట్టుము.

చంద్రుని సంతతివారైన యిరువురకు చంద్రకిరణ చంద్రకాంతములతోడి సామ్యము ఉచితముగా నున్నది. "ఆనందయ పితరం"- తండ్రిని ఆనందింపజేయుము_ తాపసి యనుమతి లేనిదే ఆయువు తండ్రికోరికను దీర్చుటకు సిద్ధపడలేదు. తానింకను తాపసి హస్తములందే యుంటినని అతనికి దెలియును. అతని వినయశిక్షణ మట్టిది.

రాజు జీవితమున సంగమనీయమణి ఎంతో ప్రాధాన్యము వహించినది. ఎడబాసిపోయిన ఉర్వశిని ఆయనతో కూర్చినది. ఎచ్చటనో అజ్ఞాతముగామండిన కుమారుని గూడ ఆయనతో కూర్చినది. ప్రియాసంగమమునకు, పుత్రసంగమమునకు గారణమైనది. నిర్వహణ సంధియందు గూడ వ్యాపించి సహకరించిన సంగమనీయమణి వృత్తాంతము ప్రకరీస్థానీయ మనదగును.

"అశంకితః వందస్వ"- నీ తండ్రి ప్రియసఖుడైన బ్రాహ్మణునకు నిశ్శంకముగా వందనము చేయుము. అని రాజు ఆయువునకు చెప్పగా విదూషకుడు - శంక ఏల? ఆశ్రమమున వానరములను చూచినవాడేకదా! యనును. విదూషకుడు కురూపి యగుటేకాక తన కురూపమును గూర్చి బాహాటముగ చెప్పుకొను స్వభావము గలవాడు కూడను

పుట. 158: "ఇత ఇతో దేవీ" - సంతానములేని రాజునకు ఉర్వశియందు సత్సంతానము కలుగుటచే కంచుకి ఆమెను "దేవీ" యని సబహుమానముగా నిర్దేశించుచున్నాడు

"సంయమ్యమాన శిఖండకః" - ముడివేయబడుచున్న పిలకగలవాడు - తన పాద పీఠమున గూర్చుండిన కుమారుని పిలకను రాజు వాత్సల్యముతో ముడివేయుచున్నాడు. ఆ దృశ్యమును ఉర్వశి చూచినది. ఈ పిల్లవాడెవ్వడా యనుకొన్నది. పుట్టినప్పుడే తాపసి చేతిలో పెట్టినది. మరల చూడలేదు. గుర్తు పట్టరానంత పెద్దవాడైనాడు. సత్యవతిని జూడగా అతడు తన కుమారుడేయని స్మరణకు వచ్చినది. "మహాన్ ఖలు సంవృత్తః" - ఎంత పెద్దవాడైనాడు అనుకొన్నది.

శ్లో. 12 ; అన్వయము : త్వదాలోకనతత్పరా స్నేహప్రస్నవ నిర్భిన్నం స్తనాంశుకం ఉద్వహంతీ ఇయం తే జననీ ప్రాప్తా.

అర్థము : త్వత్ - ఆలోకన - తత్పరా=నిన్ను చూచుటయందాసక్తి గలది; స్నేహ - ప్రస్నవ - నిర్భిన్నం=పుత్ర స్నేహముచే స్రవించిన పాలచే ఆర్ద్రమైన; స్తన + అంశుకం= స్తన వస్త్రమును; ఉద్వహంతీ=ధరించినది అయిన; ఇయం=ఈ; తే=నీయొక్క; జననీ= తల్లి; ప్రాప్తా=వచ్చినది.

"ప్రత్యుద్గచ్ఛ మాతరం"- తల్లికి ఎదురేగుము - తల్లి దగ్గరకు పొమ్ము అని తాపసి చెప్పినదే ఆయువు అపని చేయును.

"భర్తుః బహుమతా భవ" - భర్తకు ప్రేమపాత్రురాలవు కమ్ము. శాకుంతలమున కణ్వుడును శకుంతల నిట్లే యాశీర్వదించును.

పుట. 184 : "పితరం ఆరాధయితా భవ" - తండ్రిని ఆరాధించువాడవు కమ్ము - పుత్రునకు ప్రధానమైన ధర్మము నాచరింపుము అని దీవించును.

"స్వాగతం పుత్రవత్యై" - పుత్రవంతురాలికి స్వాగతము. ఇదివరకు "ప్రియా" యనువాడు ఇప్పుడు "పుత్రవతి" యనుట తనకు దెలియకుండ విషయమును దాచినదని సుకుమారమైన యధిక్షేపము. తనకు ఎట్టకేలకు సంతతిని కూర్చి పెట్టినదని అభినందన.

"కవచ హారః" - కవచధారణ యోగ్యుడు. శరీర గౌరవము, దార్ఢ్యము చేకూరినవి. తండ్రికి సంగ్రామములందు తోడ్పడ గలడు. కుమారుని తెచ్చుటకు రాజునకు జెప్పిన కారణము వేఱు. ఉర్వశికి జెప్పుచున్న కారణము వేఱు. "భర్తుః నమతం" - ఉర్వశి రహస్యముగా దాచిన పిల్లవానిని ఇప్పుడు అందరియెదుట అప్పగించి వేయుచున్నది. ఉర్వశి రహస్యముగా ఏల దాచినదో కారణము తాపసికి తెలియదుగదా.

పుట. 185 : "యది సత్యమేవ..." - పుట్టినవాటినుండియు సత్యవతి వద్దనే పెరిగిన అలవాటు బలమువల్ల నన్నుగూడ నీవెంట దీసికొని పొమ్ము అనుచున్నాడు. "ద్వితీయం అధ్యాసితుం తవ సమయః"

రెండవ ఆశ్రమమును ప్రవేశించుటకు నీకిది తరుణము - రెండవ ఆశ్రమము గార్హస్థ్యము. ఆయువు వివాహయోగ్య వయస్సు వచ్చినవాడని యర్థమగును. కాని ద్వితీయాశ్రమమునగా రాజ్యాశ్రమము అని భావించుట యుక్తమని తోచును. పూర్వాశ్రమము మున్యాశ్రమము. ఋషికుమారులతో మెలగితివి. రాజకుమారులతో మెలగవలసిన తరుణమిది. క్రమముగా రాజర్షివి కాగలవు అని పురూరవుని భావము కావచ్చును.

"జాత ! గురోర్వచన మనుతిష్ఠ" - బిడ్డా ! తండ్రిగారి మాట ప్రకారము నడచుకొనుము. ఈమాటకూడ అతనికి సత్యవతియే చెప్పవలెను

శ్లో॥ 13 : అన్వయము ; యః శిఖండకండూయనోపలబ్ధ సుఖః మదంకే సుప్తవాన్ తం జాతకలాపం మణికంఠకం శిఖనం మే ప్రేషయ.

అర్థము . యః=ఏది; శిఖండ-కండూయన - ఉపలబ్ధ-సుఖః= తోకను గోకుటవల్ల పొందబడిన సుఖము గలదై; మత్ + అంకే= నా యొడియందు; సుప్తవాన్=నిద్రించినదో; తం=ఆ; జాత-కలాపం= పుట్టిన పింఛముగల; మణికంఠకం=మణికంఠకమను పేరుగల; శిఖనం= నెమిలిని: మే=నాకు; ప్రేషయ=పంపుము.

సత్యవతి తన్ను తల్లిదండ్రులవద్ద విడిచిపోవుటకై తీసికొని వచ్చినదని ఆయువు ఎఱుగడు. ఎఱిగియున్నచో ఆ నెమిలి పిల్లను తనవెంట తెచ్చికొని యుండెడివాడే. ఆశ్రమ జీవితమున సర్వ ప్రాణికోటియు నెట్లు పరస్పర ప్రేమతో జీవించునో తెలుపు నిట్టి సంఘటనలు కాళిదాసు శాకుంతలమున రమ్యముగా చిత్రించెను.

పుట 168 : శ్లో॥ 14 : అన్వయము : అమునా తవ పుత్రేణ పౌలోమీసంభవేన జయంతేన పురందరః ఇవ అహం అద్య పుత్రిణాం అగ్ర్యః.

అర్థము : అమునా= ఈ; తవ=నీయొక్క; పుత్రేణ = పుత్రుని చేత; పౌలోమీ-సంభవేన=శచీదేవి కుమారుడైన; జయంతేన =జయంతునిచేత; పురందరః-ఇవ = పురందరుడువలె; అహం = నేను; అద్య=

ఇప్పుడు; పుత్రిణాం = పుత్రవంతులలో; అగ్ర్యా = అగ్రగణ్యుడను (అయితిని).

"స్మృత్వా రోదితి"- తలంచుకొని యేడ్చును. పురంధర శబ్దము విన్నంతనే ఉర్వశికి తన శాపవృత్తాంతము, ఇంద్రుడు తన్నను గ్రహించిన వృత్తాంతము గుర్తువచ్చెను ఆకస్మికముగా ఉర్వశి రోదించుట చూచి రాజు ఆవేశముపొందెను.

శ్లో॥ 15 : అన్వయము : సుందరి ! వంశస్థితేః అధిగమాత్ మమ మహతి ప్రమోదే ఉపపన్నే (సతి) పీనోన్నత స్తన విసర్పిభిః అస్రైః ముక్తావళీ విరచనా పునరుక్తిం ఆనయంతీ కిం ప్రరుదితా అసి.

అర్థము : సుందరి=సుందరీ; వంశ-స్థితేః=వంశప్రతిష్ఠయొక్క; అధిగమాత్ = ప్రాప్తివల్ల; మమ = నాకు; మహతి = గొప్పదైన; ప్రమోదే=ఆనందము; ఉపపన్నే-(సతి)=కలిగినదగుచుండగా; పీన+ఉన్నత-స్తన-విసర్పిభిః=బలిసిన ఎత్తయిన స్తనములందు వ్యాపించుచున్న; అస్రైః=కన్నీటిబొట్లచేత; ముక్తావలీ-విరచనా-పునరుక్తిం= ముత్యాల దండయొక్క కూర్పుయొక్క ద్విరుక్తిని; ఆనయంతీ = కల్పించుచున్నదానవై; కిం = ఏల; ప్రరుదితా = మిక్కిలి రోదించుదానవు; అసి=అగుచున్నావు.

"పుత్రదర్శనేన విస్మృతాస్మి"- పుత్రుని జూచిన యానందమున ముందు మరచితిని కాని మహేంద్ర సంకీర్తనముచే గుర్తువచ్చి నా హృదయము దుఃఖపడుచున్నది.

పుట 187 : "వంశకరస్య ముఖం ప్రేక్షిష్యతే..." నీ యందు జన్మించిన వంశకరుడైన పుత్రుని యొక్క ముఖమును పురూరవుడు ఎప్పుడు చూచునో అప్పుడు నీవు నా సమీపమునకు తిరిగి రావలెను. ఇది యింద్రుని యాదేశమని యుర్వశి తెలుపుచున్నది. "త్వయి దృష్టసంతానో భవేత్" అని మాత్రమే యింద్రుడనెను. ఆ మాటకు సంతానము పొందినవాడని మాత్రమే అర్థము. కాని వంశకరుడైన కొడుకు పుట్టుటయేకాక వాని ముఖమును రాజు చూడవలెను అన్న యభిప్రాయము ఉర్వశిచేసిన వ్యాఖ్యానము. తనుతనే పుత్రుడు పుట్టి

నమ వానిని దాచిపెట్టి తాను ఇంద్రుని దగ్గఱకు పోకుండ ఉర్వశి రాజుతో భోగించుచున్నది. ఇంద్రుడీ సంగతి తెలిసియు ఉర్వశీ పురూరవుల పరస్పర గాఢానురక్తిని మన్నించువాడై యూరకుండెను కాబోలు.

పుట 188 : "ఏతావత్ మే మహారాజేన సంవాసః"- నాకు మహారాజుతోడి సంవాసము ఇంతవఱకే ఉర్వశీ పురూరవుల సంబంధము 'సంవాసము' మాత్రమే. అదియు ఇంద్రుని ఇచ్ఛాధీనము.

"సర్వే విషాదం సూచయంతి"- అందఱును విషాదము నభినయింతురు. ఉర్వశి సంయోగమున రాజు సుఖముగా నున్నాడు. ఆమెవల్ల రాజువంశము నిలిచినది. భావి మహారాజు ఏర్పడినాడు. ఆమె వెడలిపోవుననగా అందఱకు విచారము కలిగినది.

"సుఖప్రత్యర్థితా దైవస్య"- దైవము యొక్క సుఖ విరోధిత్వ మెట్టిదో !

శ్లో॥ 16 : అన్వయము : కృశోదరి ! సుతోపలబ్ధ్యా ఆశ్వాసితస్యనామ మమ సద్యః త్వయా సహ అయం వియోగః; ప్రథమాభ్రవృష్ట్యా వ్యావర్తితాతపరుజః వృక్షస్య వైద్యుతః అగ్నిః ఇవ ఉపస్థితః.

అర్థము : కృశోదరి=నాతోదరి; సుత + ఉపలబ్ధ్యా = పుత్రప్రాప్తిచేత; ఆశ్వాసితస్య - నామ = సంతోషించుచున్నంతలోనే; మమ=నాకు; సద్యః=వెంటనే; త్వయా-సహ = నీతో; అయం = ఈ; వియోగః=ఎడబాటు; ప్రథమ + అభ్ర-వృష్ట్యా=తొలి మేఘపు వర్షము చేత; వ్యావర్తిత + ఆతప - రుజః = తొలగింపబడిన ఎండబాధగల; వృక్షస్య=చెట్టునకు; వైద్యుతః=విద్యుత్సంబంధమైన; అగ్నిః-ఇవ = అగ్నివలె (పిడుగుపాటువలె); ఉపస్థితః=సంభవించినది.

నీ యెడబాటు పిడుగుపాటువంటిది. నిన్ను విడిచి నేను బ్రదుకజాలను అని రాజు వాపోవుచున్నాడు.

"అనర్థానుబంధి"- ఈ సంఘటనము ఇంకను దుస్సంఘటనలతో అనుబద్ధమై యుండును. నీవింక వల్కలము ధరించి తపోవనమునకు పోవలసియుండును. ఇది విదూషకునకు అనర్థమే.

"అవసిత కార్యాం" - కర్తవ్యము ముగించుకొన్నది. నీయందు పుట్టిన పుత్రుని ముఖమును పురూరవుడు దర్శించునంత వఱకు ఉండి తరువాత స్వర్గమునకు దిరిగి రమ్మని ఇంద్రుడు చెప్పెనుగదా. ఉర్వశి అపని ముగించుకొని వెడలిపోవుచున్నదని రాజు భావించునేమో యని యుర్వశి భయము. శాపవశమున వచ్చి తనతో ఉండి శాపము తీరగనే పోవుచున్నది. నిజముగా నన్ను ప్రేమించినది కాదు అని రాజు భావించునని యుర్వశి యనుమానము.

పుట. 139; శ్లో॥ 17: అన్వయము: సులభవియోగా పరవత్తా అత్మ ప్రియాణి కర్తుం న ప్రభవతి హి; భర్తుః శాసనే తిష్ఠ; తవ సూనౌ ఆయుషి న్యస్తరాజ్యః అహం అపి విచరిత మృగయూథాని వనాని ఆశ్రయిష్యే.

అర్థము: సులభ - వియోగా=సులభముగా వియోగము గలిగించు; పరవత్తా=పరాధీనత; అత్మ-ప్రియాణి=తనకు ప్రియము లైన వానిని; కర్తుం=చేయుటకు; న-ప్రభవతి-హి=సమర్థము కాదు గదా; భర్తుః=ప్రభువుయొక్క; శాసనే=అజ్ఞయందు; తిష్ఠ=ఉండుము; తవ=నీయొక్క; సూనౌ=పుత్రుడైన; ఆయుషి = ఆయువునందు; న్యస్త-రాజ్యః=ఉంచబడిన రాజ్యము గలవాడనై; అహం-అపి= నేనుగూడ; విచరిత-మృగ-యూథాని=విశేషముగా చరించు మృగ సమూహములుగల; వనాని=వనములను; ఆశ్రయే=ఆశ్రయింతును.

పురూరవుడు ఉర్వశిని చక్కగానే అర్థము చేసికొనెను. ఆమె తన్ను హృదయ పూర్వకముగా ప్రేమించుచున్నదని ఆయన యెఱుంగును. అయినను ఇంద్రునిమాట ఎల్లరకును శిరోధార్యము. ఉర్వశి ప్రభుశాసనము నతిక్రమించకుండ చేయుట ఆయన కిష్టము కాదు. రెండవ యంకమునందుకూడ "నాస్మి భవత్యో రీశ్వర వియోగప్రత్యర్థీ" - అనెను. పురూరవున కింతవఱకు ఉర్వశీశాప వృత్తాంతము తెలియదు. ఇప్పుడు తెలిసినను ఆయన యభిప్రాయమున మార్పేమియు లేదు. ఆయువునందు రాజ్య మర్పించి తపోవనముల కేగ నిశ్చయించుటవల్ల ఆయన ఎంత రాగియో అంత విరాగి

యుడనియు, ఎంత భోగియో అంత త్యాగియనియు వ్యక్తమగుచున్నది.

"పుంగవ ధారితాయాం ధురి దమ్యం నియోజితుం" - సమర్థమైన వృషభము ధరించిన భారమునందు కోడెదూడను నియోగించుట - దమ్యం=శిక్షింపదగ్గది, ఇంకను నేర్చుకొను దశయందున్నది. రాజ్యభారమంతయు తనపైనుంచి తండ్రి యిప్పుడే వనములకు బోవుట యుక్తము కాదనుచున్నాడు ఆయువు.

శ్లో॥ 18 : అన్వయము : కలభః అపి సన్ గంధద్విపః అన్యాన్ గజాన్ శమయతి; భుజంగశిశోః విషం సుతరాం వేగోదగ్రం భవతి; బాలావస్థః అపి అధిపతిః భువం పరిరక్షితుం అలం; స్వకార్యసహః అయం భరః జాత్యా ఏవ వయసా న ఖలు.

అర్థము ; కలభః - అపి-సన్=గున్నయై యుండియు; గంధ-ద్విపః=మదగజము (భద్రజాతి గజము); అన్యాన్-గజాన్=ఇతర గజములను; శమయతి=జయించును; భుజంగ-శిశోః=పాము పిల్లయొక్క; విషం=విషము; సుతరాం=మిక్కిలి; వేగ + ఉదగ్రం = తీవ్రతచే దారుణమైనది; భవతి=అగును; బాల + అవస్థః + అపి=పసితనమందున్నవాడు అయినను; అధిపతిః=క్షత్రియుడు; భువం=భూమిని; పరిరక్షితుం=పాలించుటకు; అలం=సమర్థుడు; స్వకార్యసహః = తన కర్తవ్యమున సమర్థమైన; అయం-భరః=ఈ శక్తి; జాత్యా-ఏవ=పుట్టుక చేతనే (కలుగునుగాని); వయసా=వయస్సుచేత; న ఖలు=కాదుగదా.

పుట. 140 : "ఆయుషః రాజ్యాభిషేకః" - ఆయువుయొక్క పట్టాభిషేకమునకు ప్రయత్నములు చేయుడని అమాత్యులకు జెప్పుము. పురూరవుడు క్షణమాత్రమును రాజ్యమునం దుండగోరుటలేదు. రాజాజ్ఞను ఎల్లప్పుడు సంతోషముతో నిర్వర్తించు లాతవ్యుడు ఇప్పుడు దుఃఖితుడైనాడు. పురూరవునిపట్ల అందఱును అంత అనురక్తులు. ఆయన అంత ప్రజారంజకుడు.

"నిరభ్రే విద్యుత్ సంపాతః" - మబ్బులేని యాకాశమున మెఱపు తీగెల సముదాయము. ఇది ఆకస్మిక సంఘటన. మేఘము లేని మెఱపులు గనుక శుభసూచన. పిడుగులైనచో ప్రమాదము. స్వర్గమునుండి ఏదో శుభము వచ్చుచున్న సూచన యిది.

శ్లో॥ 19 : అన్వయము : గోరోచనానికషపింగజటాకలాపః శశికలామల పీతసూత్రః ముక్తా గుణాతిశయ సంభృత మండనశ్రీః (నారదః) హేమప్రరోహః జంగమ కల్పవృక్షః ఇవ లక్ష్యతే.

అర్థము : గోరోచనా - నికష-పింగ-జటా-కలాపః=గోరోచనముయొక్క ఒరపిడి గీతలవలె పింగలవర్ణమైన జటలగుంపు గలవాడు; శశి-కలా-అమల-పీత - సూత్రః=చంద్రరేఖవలె స్వచ్ఛమైన జందెపు త్రాడుగలవాడు; ముక్తా-గుణ + అతిశయ-సంభృత-మండన శ్రీః=ముత్యాలదండలచే ఎక్కువగా సమకూర్చబడిన అలంకార సంపద గలవాడు; (ఈ నారదుడు); హేమ-ప్రరోహః=బంగారు శాఖోపశాఖలుగల; జంగమ-కల్పవృక్షః-ఇవ=నడయాడుచున్న కల్ప వృక్షమా యన్నట్లు; లక్ష్యతే=కనబడుచున్నాడు.

"జంగమ కల్పవృక్షః" - నడయాడుచున్న కల్పవృక్షము' నారదుడు రాజునకు కదలి వచ్చుచున్న కల్పవృక్షమో యన్నట్లు కనబడినాడు. కల్పవృక్షము కోర్కెలనిచ్చు వృక్షము. అది రాజు కోర్కెలను తీర్చుటకు తనంత తాను నడచి వచ్చుచున్నది. ఆకస్మిక నారదాగమనము తప్పక శుభమును చేకూర్చును అన్న రాజు ఆకాంక్ష ఈ యుత్ప్రేక్షయందు వ్యక్తమగుచున్నది.

"అర్ఘ్యం అస్మై" - ఈయనకు అర్ఘ్యము - రాజు మానసికత్వరను ఈ ఖండవాక్యము పట్టిచూపుచున్నది. దేవర్షికి అర్ఘ్యము దివ్యాంగనయైన యుర్వశి, రాజపత్ని స్వయముగా తెచ్చినది.

పుట. 141 : "విజయతాం" - వర్ధిల్లుగాక అని ఆశీర్వచనము. మధ్యమ లోకపాలుడైన పురూరవునకు దేవర్షియైన నారదుడు ఆశీర్వచనము చేసెనేకాని "జయము జయము" అని జయశబ్దము చేయలేదు.

"అవిరహితౌ దంపతీ భూయాస్తాం" - ఎడబాటులేని దంపతులు అగుదురుగాక ! ఇదియు ఆశీర్వచనమే. దేవర్షి వచనము గనుక అమోఘము. లాంఛనప్రాయమని చెప్పరాదు.

"అపి నామ ఏవం స్యాత్ !"- ఇట్లే యైనచో ఎంత బాగుగా నుండును ? క్షణము క్రిందటనే రాజునకు ఉర్వశితోడి శాశ్వత వియోగము వెంటనే అవశ్యము జరుగ వలసియున్నదని తెలినది. ఉత్తర క్షణమున దేవర్షి యాశీర్వచనము ఆ వియోగము జరుగదని సూచించుచున్నది. నిజముగ నట్లైనచో ఎంత బాగుగా నుండును అని రాజు ఆశాపూరితుడైనాడు.

"ఔర్వశేయః ఆయుః ప్రణమతి"— రాజు ఆదేశింపగా ఆయువు 'ఉర్వశీ పుత్రుడు నమస్కరించుచున్నాడు' అనెను. పురూరవుని పుత్రుడను అనలేదు. ఉర్వశీ పుత్రుడను అనుటవల్ల ఇంద్రుని యాదేశము ప్రకారము ఉర్వశి స్వర్గమునకు పోవలసిన సమయము అని నారదునకు అవగతమగును.

"అయం విష్టరః"— ఈ యాసనము - విష్టరశబ్దము ఆసనమునకు ఆర్షసంప్రదాయమున రూఢమైనది. నారదుడు విష్టరమున గూర్చుండి మహేంద్రుని సందేశమును తెలిపెను.

పుట 142 : "ప్రభావదర్శీ"— దివ్యశక్తిచే చూడగలవాడు - ప్రతిష్ఠానమున ఆ క్షణమున జరుగుచుండిన సన్నివేశమును ఇంద్రుడు దివ్యదృష్టితో చూచెను. పురూరవుని వనగమనము అప నిశ్చయించుకొని నారదుని పంపెను.

"సురాసుర సంగరో భావీ"— త్రికాలద్రష్టలైన మహర్షులు నిర్దేశించిన దేవాసుర సమరము జరుగబోవుచున్నది. యుద్ధములందు దేవతలకు చేదోడుగానుండు నీవు జీవించినంత కాలము ఉర్వశి నీకు సహధర్మచారిణియై యుండును. అని ఇంద్రుని సందేశము.

పురూరవుడు శస్త్రము ధరించి రాజ్యమం దుండవలెనన్నచో ఉర్వశి కూడ ఆయన వద్ద ఉండవలయును. ఉర్వశి కూడ ఆయనతో

ఉండవలెనని కాంక్షించుటయు ప్రభావ దర్శియైన యింద్రుడు గుర్తించెను. భరతముని యిచ్చిన నిరవధిక శాపము ఉండనే యున్నది. కనుక ఉర్వశీ పురూరవుల యావజ్జీవ దాంపత్యమును ఇంద్రుడు నిర్ణయించెను. యుద్ధములం దిదివరకు తోడ్పడెనని ఉర్వశిని పురూరవున కిచ్చెను. ఇకముందు తోడ్పడునని యిప్పు డాయన వద్దనే ఉంచెను.

"త్వయి దృష్టసంతానో భవేత్"- అని యింద్రుడు అనాడు ఉర్వశిని ఆదేశించిన వాక్యమునందే పురూరవునకు ఉర్వశి యందు వంశకరుడైన పుత్రుడు జన్మించునన్న యాశీర్వచనము ఇమిడి యున్నది. అది జరిగినది. ఇప్పుడు పంపిన సందేశమువల్ల ఉర్వశి యాయనకు యావజ్జీవ సహధర్మచారిణియైనది. దీనితో నాయకుడైన పురూరవునకు సమగ్రఫలము లభించినది. ఉర్వశిని పొందుదును, సంతానము పొందుదును అని రాజు సంకల్పించిన కార్యము నిర్వహింపబడినది. కనుక ఇది నిర్వహణ సంధి. ఆయువు అభిషేకము దాని సమాప్తి.

రాజునకు ఉర్వశి లభించుటకు, ఆమెయందు వంశకరుడైన పుత్రుడు జన్మించుటకు ప్రధాన కారణము మహేంద్రుడు. ఆయన యీయనిచో రాజునకు ఉర్వశి లభింపదు. ఆయన యిచ్చుటకు కారణము రాజు దేవదానవుల యుద్ధములందు ఇంద్రునకు సహాయుడుగా నుండుట. తాత్కాలికమైన కారణము రాజు ఉర్వశిని కేశినుండి రక్షించుట. ఈ రెండవ కారణము ఉర్వశీ పురూరవుల పరస్పరానురాగమునకును హేతువైనది.

ఈ విధముగా జూచినప్పుడు విక్రమోర్వశీయము అను నామము ఈ నాటకమునకు సమంజసమని తేలును. పురూరవునకు 'విక్రమ' శబ్దము పరాక్రమార్జితమైన బిరుదముగా నేర్పడును. విక్రమోర్వశుల నధికరించిన నాటకము గనుక విక్రమోర్వశీయము అగును. విక్రమముచేత లబ్ధయైన యుర్వశి విక్రమోర్వశి యగును. విక్రమోర్వశిని అధికరించి వ్రాయబడిన నాటకము విక్రమోర్వశీయ మగును. పురూరవుడు తన పరాక్రమముచేతనే మహేంద్రుని

యొక్కయు, ఉర్వశి యొక్కయు హృదయములను ఆకర్షించి తత్పర్యవసానము గా ఉర్వశిని సహధర్మచారిణిగా పొందెను.

"పరవాన్ అస్మి దేవేశ్వరేణ"- దేవేంద్రునిచేత అస్వతంత్రుడను గావింపబడితిని. పురుషాంతరవేత్తయైన దేవేంద్రుడు ఇచ్చిన యనుశాసనము నెవ్వరు కాదందురు. తాను వనగమనమునుండి విరమించుకొని, శస్త్రధారియై, యుర్వశీసహితుడై రాజ్యము చేయుట ఇంద్రుని యనుశాసనమువల్లనే అని రాజు గంభీరముగా,వినయముగా, మధురముగా పలికినాడు.

శ్లో. 20: అన్వయము: వాసవః త్వత్కార్యం కుర్యాత్; త్వం చ తస్య ఇష్టం ఆచరేః; సూర్యః అగ్నిం అగ్నిః చ సూర్యం తేజసా సమేధయతి.

అర్థము : వాసవః=ఇంద్రుడు; త్వత్-కార్యం=నీయొక్క కార్యమును; కుర్యాత్=చేయవలెను; త్వం-చ = నీవును; తస్య = ఆయన యొక్క; ఇష్టం=ప్రియమును; ఆచరేః = చేయవలెను; సూర్యః = సూర్యుడు; అగ్నిం = అగ్నిని; అగ్నిః-చ = అగ్నియు; సూర్యం = సూర్యుని; తేజసా=తేజముచేత; సమేధయతి=వృద్ధిపొందించును.

నీవు ఇంద్ర పరతంత్రుడవగుటయే కాదు ఇంద్రుడు త్వత్పరతంత్రుడు కూడను. 'త్వత్కార్యం'- నీ కార్యమును-అనగా ఈ నాటకేతివృత్తమున నీవు బీజరూపమున గావించిన యారంభమును ఫలింపచేయు కార్యమును- ఇంద్రుడు చేయవలెను. 'తస్య ఇష్టం'-ఆయనకు ప్రియమును- ఉర్వశీ సహితుడవై రాజ్యము చేయుచు దేవదానవ సంగ్రామములందు దేవతలకు తోడ్పడుచు ఉండవలెనన్న కోరికను - నీవు ఆచరించవలెను.

ఇంద్ర పురూరవుల సంబంధము సూర్యాగ్ని సంబంధమువంటి దని ఉపమానము వ్యక్తము చేయుచున్నది. సూర్యునివల్లనే అగ్ని తేజస్సు పొందును. ఆ తేజస్సును మరల సూర్యునకే అర్పించును. త్రిలోకపాలకుడైన ఇంద్రుని యంశమే మధ్యమ లోకపాలకుడైన పురూరవుడు.

పుట. 143 : "యౌవరాజ్యాభిషేకః" - ఆయువుయొక్క యౌవరాజ్యాభిషేక సంభారములను ఇంద్రుడు స్వయముగా పంపెను. వానిని నారదుని వెంట రంభాదులు కొనివచ్చిరి. ఇంద్రాను శాసనమున రాజు వనగమనము విరమించినచో ఆయువునకు యౌవరాజ్యాభిషేకము జరుగును. రాజు నిశ్చయము తేలునంత వఱకు రంభాదులు అదృశ్యముగా నుండిరి. అప్సర స్సంభూతుడైన ఆయువునకు యౌవరాజ్యాభిషేక సంభారములు స్వర్గమునుండి వచ్చుటయు, వానిని రంభాద్యప్సరసలు కొనివచ్చుటయు, స్వర్గమునుండి తేబడిన యభిషేక జలమును నారదమహర్షి స్వహస్తములతో యువరాజు శిరస్సున అభిషేకించుటయు పరమౌచితముగా, వైభవోపేతముగా నున్నది. కాని ఈ సందర్భమున కవి చిత్రలేఖను ప్రవేశపెట్టకుండుట అన్యాయము. ఉర్వశి యానందమున పాలుపంచుకొనుటకు ఆమెకంటె యోగ్యులెవ్వరు ?

ఆయువునకు రాజ్యాభిషేకము పురూరవుడు సంకల్పించెను. అది భంగము కాలేదు. ఇంద్రుని యిష్టము ననుసరించి కొంచెము మారి యౌవరాజ్యాభిషేకమైనది. పురూరవుడు సర్వదా సంకల్ప సిద్ధుడు.

పుట. 144 : "కులధురంధరో భవ" - వంశోద్ధారకుడవు కమ్ము. ఇది తండ్రి యాశీర్వచనము. "పితుః ఆరాధయితా భవ" - తండ్రిని ఆరాధించువాడవు కమ్ము. ఇది తల్లి యాశీర్వచనము. "ఆయుష్మాన్ ఏధి"- ఆయుష్మంతుడవై వర్ధిల్లుము; "స్వస్తి భవతే" నీకు మేలగుగాక. ఇవి నారదమహర్షి యాశీర్వచనములు. యువరాజున కింతకంటె కావలసిన దేమున్నది.

నేపథ్యమునుండి యిరువురు వైతాళికులు యువరాజునకు జయము పలుకుచున్నారు.

శ్లో॥ 21 : అన్వయము : బ్రహ్మణః అమరమునిః అత్రిః ఇవ, అత్రేః ఇందుః ఇవ, శిశిరాంశోః బుధః ఇవ, బోధనస్య దేవః ఇవ త్వం లోక

కాంతైః గుణైః పితుః అనురూపః భవ; అతిశయిని తే వంశే ఆశిషః సమాప్తా ఏవ.

అర్థము : బ్రహ్మాణః=బ్రహ్మకు; అమరమునిః=దేవర్షియైన; అత్రిః-ఇవ = అత్రివలె; అత్రేః=అత్రికి; ఇందుః-ఇవ=చంద్రుడువలె; శీతాంశోః=చంద్రునకు; బుధః-ఇవ=బుధుడువలె; బోధనస్య=బుధునకు; దేవః-ఇవ=మహారాజువలె; త్వం=నీవు; లోక-కాంతైః=లోకమునకు ఆహ్లాదకరములైన; గుణైః=గుణములచేత; పితుః=తండ్రికి; అనురూపః=సదృశుడవు; భవ = కమ్ము; అతిశయిని=ఉత్కృష్టమైన; తే=నీయొక్క; వంశే=వంశమునందు; ఆశిషః=ఆశీస్సులు; సమాప్తాః-ఏవ=సంపూర్ణము లయినవికదా.

"కుల దురంధరో భవ" - అన్న పురూరవుని ఆశీర్వచనము విస్తరించి ప్రథమ వైతాలికుడు కైవారము చేసినాడు. నీ వంశ మందలివారందరు పూర్ణకాములు. నీవును అట్లే యగుదువుగాక.

శ్లో: 22: అన్వయము : ఉన్నతానాం పురస్తాత్ స్థితే అస్మిన్ తవ పితరి, స్థితిమతి అనాకంప్యధైర్యే త్వయి చ విభక్తా రాజ్యలక్ష్మీః హిమవతి జలధౌ చ వ్యస్తతోయా గంగా ఇవ ఇదానీం అధికతరం రాజతే.

అర్థము : ఉన్నతానాం=ఉన్నతులయొక్క; పురస్తాత్=అగ్రమున; స్థితే=ఉన్న; అస్మిన్=ఈ: తవ = నీయొక్క: పితరి = తండ్రియందును; స్థితిమతి=మర్యాదాపాలకుడవు; అనాకంప్య - ధైర్యే = నిశ్చలమైన ధీరతగలవాడవునైన; త్వయి-చ=నీ యందును; విభక్తా=విభజింపబడినదై; రాజ్యలక్ష్మీః=రాజ్యలక్ష్మి; హిమవతి=హిమవంతుని యందు; జలధౌ-చ=సముద్రమునందును; వ్యస్త-తోయా=విభక్తమైన జలముగల; గంగా + ఇవ=గంగానదివలె; ఇదానీం = ఇప్పుడు; అధికతరం=మరింత ఎక్కువగా; రాజతే=శోభిల్లుచున్నది.

"పితు రారాధయితా భవ" అన్న ఉర్వశి యాశీర్వచనమును విస్తరించి ద్వితీయ వైతాలికుడు కైవారము చేసినాడు. "పుంగవ ధారితాయాం" అన్న ఆయువు మాటను స్మరింపవలెను. రాజు వన గమనమునకు సిద్ధముగానున్నాడు. కుమారుడు అప్పుడే గురుకులము

నుండి వచ్చినాడు. రాజ్యభారమును సంపూర్ణముగ నెవ్వరును మోయు స్థితిలో లేరు. ఇర్వురు పంచుకొన్నచో ఇర్వురకు సుఖము.

'ఉన్నతానాం' అన్న విశేషణము రాజునకు, హిమవంతునకు సమానము. 'స్థితిమతి' 'అనాకంప్యధైర్యే' అన్నవి ఆయువునకు, సముద్రునకు సమానములు.

పుట 145 : "జ్యేష్ఠమాతరం అభివందస్వ"— పెదతల్లిగారికి అభివాద మొనర్తువు రమ్మని ఉర్వశి కుమారుని చేయిపట్టుకొని బయలు దేరును. ఇది యుర్వశి యుచితజ్ఞత. పట్టపురాణి యన్నట్లే ఆమెయు యుర్వశియు ప్రీతిబంధముతోనుండిరి. "శిష్ఠ" అగుము. సమయము వచ్చినప్పుడు ఆమెవద్దకు పోవచ్చును అని నారదుడు వారించినాడు. తృతీయాంకము నడుమ నిష్క్రమించిన రాణి భూమికను మరల ప్రవేశపెట్టుటగాని, ఉర్వశి పుత్రునితో కలిసి నేపథ్యములోనికి పోయి తిరిగి ప్రవేశించుటగాని ప్రయోగ దృష్ట్యా అనవసరమని పరిహరించుటకు నారదుని వాక్యము. పెదతల్లిమాట ఉర్వశి ఎత్తుటయే చాలును.

శ్లో. 23 : అన్వయము : తే ఆత్మజస్య ఆయుషః యౌవరాజ్య శ్రీః మరుత్వతా సైనాపత్యే అభిషిక్తం మహాసేనం స్మారయతి.

అర్థము : తే=నీయొక్క; ఆత్మజస్య=పుత్రుడైన; ఆయుషః= ఆయువు యొక్క; యౌవరాజ్య - శ్రీః = యువరాజత్వ వైభవము; మరుత్వతా=ఇంద్రునిచేత; సైనాపత్యే = సేనాధిపత్యమునందు; అభిషిక్తం=అభిషేకింపబడిన; మహాసేనం=కుమారస్వామిని; స్మారయతి= తలపించుచున్నది.

కుమారస్వామివలె నీ పుత్రుడు గూడ దేవసేనలను రక్షించుగాక. నీవు ఇంద్రుని విజయసేనాముఖమున నిల్చినట్లే నీ పుత్రుడును నిల్చుగాక అని స్మరణాలంకారముచే ఆశీర్వచన ధ్వని.

"కింతే భూయః పాకశాసనః ప్రియం కరోతు"- పాకశాసనుడు నీకు ఇంకను ఏమి ప్రియము చేయవలయును. ఇంతవరకు రాజునకు జరిగిన ప్రియములన్నియు ఇంద్రుడు చేసినవే.

పుట 146 : "యది మే మఘ వా ప్రసన్నః"- ఇంద్రుడు నాకు ప్రసన్ను డైనచో ఇంతకంటె ఇంకేమి కోరుదును. ఆయన ప్రసన్నుడై యుండుటే చాలును. కోరనవసరము లేకుండగనే సర్వాభీష్టములు ఆయనయే నెరవేర్చును. అయినను ఇట్లగుగాక.

"భరతవాక్యమ్"- భరతుని వాక్యము. భరతులనగా నటులు. నటులందరు భరతుని సంతతివారే. ఇచ్చట భరతుడు అనగా ప్రధాన నటుడు. నాటకారంభమున మంగళాచరణరూపమైన నాంది, తరు వాత ప్రస్తావన నటులచే నిర్వహింపబడును. అనంతరము పాత్రములు ప్రవేశించి నాటకము నిర్వహించును. నాటకాంతమున మరల ప్రధాన నటుడు ఆశీర్వచనరూపమైన మంగళాచరణము చేయును. భరత వాక్యమును పురూరవ పాత్రధారియే పఠించునుగాని పురూరవు డుగా కాక నాయక పాత్రధారియైన ప్రధాన నటుడుగా పఠించును. ఇందలి యాశీర్వచనము లోకమునుద్దేశించి చేయబడును.

శ్లో॥ 24 : అన్వయము : పరస్పర విరోధినోః శ్రీ సరస్వత్యోః ఏకసంశ్రయ దుర్లభం సంగతం సతాం భూతయే సదా అస్తు.

అర్థము : పరస్పర-విరోధినోః = పరస్పరము విరోధించునట్టి; శ్రీ-సరస్వత్యోః=లక్ష్మీ సరస్వతుల యొక్క; ఏక-సంశ్రయ-దుర్లభం= ఏకాశ్రయమున దుర్లభమైన; సంగతం=సాంగత్యము; సతాం=సజ్జనుల యొక్క; భూతయే=కల్యాణముకొఱకు; సదా=ఎల్లప్పుడును; అస్తు= అగుగాక !

విద్యావంతులకు ధనలాభము, ధనవంతులకు విద్యాలాభము కలిగి సజ్జను లెల్లరు సర్వదా ధనవంతులు, విద్యావంతులునై సుఖింతురు గాక యని మహాకవి కాళిదాసుని మంగళా శాసనము.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము

ఇతి శివమ్.

---

# ప్రకరణోచిత వ్యాఖ్యకు ముఖ్యములైన వాక్యములు

*ప్రథమాంకము :*

సదృశం ఖలు సోమాదేకాంతరస్య.
ఉపకృతం ఖలు దానవైః
అభిజాతం ఖల్వస్య వచనం
అథవా చంద్రాదమృతమితి కిమత్రాశ్చర్యం
దత్తఫలో మే విషమావతారః
అనుత్సేకః ఖలు విక్రమాలంకారః
అవాఙ్మను ఖలు దుర్లభాభినివేశీ మదనః
వసుధాధరకందరాద్విసర్పీ ప్రతిశబ్దోఽపి హరేర్భినత్తి నాగాన్

*ద్వితీయాంకము :*

భవతా దివ్యరసాభిలాషిణా చాతకవ్రతం గృహీతం
ఈదృశఏవ తవాభినివేశో భవతు
అతిస్నేహః ఖలు కార్యదర్శీ
కిం పున ర్మానుష్యం విడంబ్యతే
న పునః పర్యాప్తం హృదయస్య
నాస్త్యగతి ర్మనోరథానాం
నను ప్రథమం మేఘరాజిర్దృశ్యతే, పశ్చాద్విద్యుల్లతా.
వైయర్థ్యమివ చక్షుషః సంప్రతి
సర్వత్ర ప్రమాదీ వైధేయః
దురాగత మిదానీం సంవృత్తం
శ్రోత్రేణ గృహీతస్య కుంభీరకస్యాస్తి వా ప్రతివచనం
ఆశ్వాసితః పిశాచోఽపి భోజనేన
న ఖల్వతిదుఃఖితో అభిముఖే దీపశిఖాం సహతే
తప్తేన తప్త మయసా ఘటనాయ యోగ్యం
వివిక్తా దృతే నాన్య దుత్సుకస్య శరణమస్తి

తృతీయాంకము :

భవితవ్యతానువిధాయీ నీంద్రియాణి
సర్వత్రౌదరికస్య అభ్యవహారమేవ విషయః
అదక్షిణం సందిగ్ధే మే హృదయం
సాధు, అనూయాపరాఙ్ముఖం మంత్రితం
నోచ్ఛ్వసితి తపనకిరణై శ్చంద్రస్యైవాంశుభిః కుముదం
అనుగ్రహః ఖలు, నోపరోధః
అన్య సంక్రాంతప్రేమాణో నాగరికా అధికం దక్షిణా భవంతి
న యుక్తం సుభాషితం ప్రత్యాచరితుం
ఛిన్నహస్తో మత్స్యే పలాయితే నిర్విణ్ణో ధీవరోభణతి
ధర్మో మే భవిష్యతీతి
కథ మిహైవ యువయో రస్తమితః సూర్యః
అనిర్దేశ్య సుఖం స్వర్గః కస్తం విస్మారయిష్యతి
అహో విరుద్ధార్థ సంపాయితా ఈప్సిత లాభోనామ
యదేవోపనతం దుఃఖాత్ సుఖం తద్రసవత్తరం
విఘ్నిత సమాగమ సుఖో మనసిజః శతగుణీభవతి
సర్వః కల్యే వయసి యతతే లబ్దు మర్థాన్ కుటుంబీ

చతుర్థాంకము :

దూరారూఢః ఖలు ప్రణయోఽసహనః
నాస్తి విధే రలంఘనీయం నామ
న తాదృశా ఆకృతివిశేషాః చిరం దుఃఖభాగినో భవంతి
పథావృత్త భాగధేయానాం దుఃఖం దుఃఖానుబంధి
రాజా కాలస్య కారణం
విహంగమేషు పండితా జాతి రేషా
అనిర్వేదప్రాప్యాణి శ్రేయాంసి
పరిభవాస్పదం దశావిపర్యయః
ప్రభుతా రమణేషు యోషితాం నహి భావస్ఖలితా న్యపేక్షతే

మహదపి పరదుఃఖం శీతలం సమ్యగాహుః
స్వార్థాత్సతాం గురుతరా ప్రణయిక్రియైవ

పంచమాంకము :

అపరాధీ శాసనీయః
యావన్నియోగ మశూన్యం కరోమి
కో దేవరహస్యాని తర్కయిష్యంతి
ప్రభావనిగూఢాని తాసాం చరితాని
ఉత్సంగవర్థితానాం గురుషు భవేత్ కీదృశః స్నేహః
అహో సుఖ ప్రత్యర్థితా దైవస్య
నార్హతి తాతః పుంగవధారితాయాం ధురి దమ్యం నియోజయితుం
న ఖలు వయసా జాత్యైవాయం స్వకార్యసహో భరః
కిం ను ఖలు నిరభ్రే విద్యుత్సంపాతః
అహో శల్యం మే హృదయా దపనీతమివ
అతిశయిని సమాప్తాః పంశ ఏవాశిష స్తే
న హి సులభ వియోగా కర్తు మాత్మప్రియాణి ప్రభవతి పరవత్తా
సాధారణ ఏషోఽభ్యుదయః
సంగతం శ్రీసరస్వత్యోః భూతయేఽస్తు సదా సతాం

సూచన : ప్రకరణోచితవ్యాఖ్య రచింపవలసిన విధము :

వాక్యము ఏకవిరచించిన ఏ గ్రంథము నుండి గ్రహింపబడినది, ఏ సందర్భమున, ఎవరు, ఎవరితో, ఏ యభిప్రాయముతో పలికినది వ్రాయవలెను. పద్యభాగమైనచో ఛందస్సు వివరింపవలెను. అలంకార మున్నచో పేర్కొనవలెను. వాక్యమువల్ల వ్యక్తమగు శీలమును తెలుపవలెను.

## ముఖ్యములైన ప్రశ్నలు

1. కాళిదాసుని ప్రకృతివర్ణనలు
2. కాళిదాసుని కవితా లక్షణములు
3. కాళిదాసుని శైలి- సంభాషణ చమత్కృతి
4. విక్రమోర్వశీయ నాటక నామసార్థక్యము
5. నాల్గవ యంకము యొక్క విలక్షణత
6. మూడవ యంకము యొక్క ప్రాధాన్యము
7. సంగమనీయమణి ప్రాముఖ్యము
8. పురూరవుని శీలము
9. ఉర్వశి శీలము
10. విదూషకుని లక్షణములు, శీలము
11. అర్థోపక్షేపకముల లక్షణములు - సమన్వయము
12. నాంది, ప్రస్తావన, సూత్రధారుడు, భరతవాక్యము
13. విక్రమోర్వశీయమున ప్రధానరసము
14. విక్రమోర్వశీయము - ఇతివృత్త నిర్వహణము
15. విక్రమోర్వశీయమున పరోక్షముగా నుండి ఇంద్రుడు నిర్వహించిన కార్యము.



# మా సోల్ డిస్ట్రిబ్యూషన్ గ్రంథములు

| | |
|---|---|
| 1. ప్రాఙ్నన్నయ యుగము | 7-50 |
| డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | |
| 2. నన్నయ భారతము ,, | 10-00 |
| 3. ఆంధ్రనాటక పితామహుడు ,, | 3-50 |
| 4. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము ,, | 3-50 |
| 5. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము | 15-00 |
| శిరోమణి చలమచర్ల రంగాచార్యులు | |
| 6. అహోబల పండితీయము | 16-00 |
| శ్రీ చలమచర్ల రంగాచార్యులు, అమరేశం రాజేశ్వరశర్మ | |
| 7. తెలుగు జానపదగేయ సాహిత్యము | 15-00 |
| డాక్టర్ బి. రామరాజు | |
| 8. నాట్యశాస్త్రము | 25-00 |
| డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావు | |
| 9. తెలుగునాటక వికాసము ,, | 20-00 |
| 10. సారస్వత నవనీతము | 5-00 |
| శ్రీ దేవులపల్లి రామానుజరావు | |
| 11. భారతోపన్యాసములు | 5-00 |
| 12. వాఙ్మయ వ్యాసమంజరి | 8.00 |
| శ్రీ నేలటూరి వెంకటరమణయ్య | |
| | 1-50 |
| శ్రీ కొమరవోలు వెంకటసుబ్బారావు | |
| గీర్వాణ[illegible]కము | 2-00 |
| కృత్తివాసతీర్థులు | |

## మా ఇతర ప్రచురణములు

| | |
|---|---|
| ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము<br>మల్లంపల్లి సోమశేఖరశర్మ | 3-00 |
| అమరశ్రీ<br>కొమరవోలు వెంకట సుబ్బారావు, బి. ఏ. | 2-00 |
| హర్ష చరిత్రము 1-3 ఉచ్ఛ్వాసములు (ఆంధ్ర టీక)<br>శలాక రఘునాథశర్మ, ఎమ్. ఏ. | 5-00 |

### ( అచ్చులో నున్నవి )

| | |
|---|---|
| కిరాతార్జునీయము 3-4 సర్గములు (ఆంధ్ర టీక) | 2-50 |
| పంచతంత్రము - మిత్రలాభము (ఆంధ్ర టీక)<br>డాక్టర్ పాటిబండ మాధవశర్మ | 2-50 |



ఉస్మానియా యూనివర్శిటీ పరీక్షలకు నిర్ణయింపబడిన
పాఠ్య గ్రంథములన్నియు
మా వద్ద లభించును.

శ్రీ పరమేశ్వర పబ్లికేషన్సు
చిక్కడపల్లి - హైదరాబాదు-20